ఓం విఘ్నేశ్వరాయ నమః





ఈ శతాబ్దపు మేటి గ్రంథం

# "పురాణాల్లో సైన్స్"

- పోలిశెట్టి బ్రదర్స్



ఏ జాతి తన పూర్వులను స్మరించదో, ఏ జాతి తన ఉజ్జ్వల గత చరిత్రను విస్మరిస్తుందో - ఆ జాతికి భవిష్యత్తు ఉండదు. ఏ జాతి తన ధర్మసంస్కృతీ పరంపరలను విడనాడుతుందో, ఆ జాతికి మనుగడే లేదు. కనుక ఈ పవిత్ర భారతావనిలో జన్మించిన మహనీయుల సుగుణములను స్మరించుకుంటూ, గత వైభవాన్ని నెమరువేసుకుని స్ఫూర్తిని పొంది ఉత్తేజితులై, నవ భారత నిర్మాణానికి కంకణధారులం కావాలి మనం.

- దేశబంధు చిత్తరంజన్‌దాస్.



## ❋ రచయితల పరిచయం ❋

## పోలిశెట్టి బ్రదర్స్





పేరు : **వీరరాఘవరావు.**

జననం : 6-7-1953.

వృత్తి : వైద్యవృత్తి.

ప్రవృత్తి : సృష్టినీ, ప్రకృతినీ, చరిత్రనూ పరిశీలించి, పరిశోధించడం.

పేరు : **వేణుగోపాలరావు.**

జననం : 19-12-1955.

వృత్తి : అధ్యాపకవృత్తి.

ప్రవృత్తి : హిందూ దేశ కీర్తి ప్రతిష్ఠలను ప్రపంచ దేశాలకు చాటేందుకై భారతజాతిని మేలుకొలపడం.

---

వీరు గత 25 సం॥లుగా చాలా కథలు, నవలలు, వ్యాసాలు వ్రాస్తూ అనేక బహుమతులను, సత్కారాలను అందుకుంటున్నారు. మన హిందూ విజ్ఞాన ప్రతిభను ఎలుగెత్తి చాటుతూ, శ్రీ వివేకానందుల వారి అడుగుజాడల్లో హిందూ జాతిని జాగృత పరచే మహత్తర కార్యం చేపట్టారు.

పండితులకే కాదు, పామరులకు కూడా అతి తేలికగా అర్థమయ్యే శైలిలో అద్భుతమైన హిందూ విజ్ఞానాన్ని వెదజల్లుతున్న వీరి రచనలన్నీ కూడా అసంఖ్యాక పాఠకులకు మార్గదర్శకాలౌతున్నాయి.

నాలుగు వేదాల్లోని విజ్ఞానాన్ని కూడా సులభశైలిలో జనావళికి అందించాలనే కృషిలో ఉన్నారు ప్రస్తుతం!



## ❁ ఒక విదేశీ మేధావి ప్రశంస (మచ్చుకోసం)

From :

**Krzysztof Hippe,**

Chief System Analyst,

POLAND.



*Mr. Krzysztof with Mr. P.V.B. Rama Rao.*

Dear Readers,

I am very much impressed with the theories given in the Book **"Science in the Puranaas"**, which were introduced to me through Mr. P.V.B.Rama Rao, my assistant in Computer Technology. The Scientific thoughts of the Puranic Sages of India, are really great. The preliminary theories of the modern science, can clearly be seen in the Ethics, Vedas of ancient India. This is really a prestigeous heritage of Indians. I congratulate Sri Polisetty Brothers' commandable work in sharing this ancient knowledge with the modern world. They have gone into the depths of Indian mythological knowledge to unearth the mined golden principles of the universe and nature.

Thanking you.

Yours,

*(Krzysztof Hippe)*

*Poland.*

# ★ విషయసూచిక ★



# అవగాహన కోసం ఆగండి ఒకసారి!!

విజ్ఞానులను అజ్ఞానులు హేళనచేసే కాలం ఇది! విజ్ఞానమూ, యదార్థమూ తెలుసుకునే ఓపిక లేకపోయినా - విమర్శలు చేసే కుయుక్తిమాత్రం ఈ రోజుల్లో హెచ్చుగా వుంది. పురాణాలంటే తెలియని వ్యక్తులు కూడా వాటి గురించి తమకు నచ్చిన రీతిలో వ్యాఖ్యానాలు చేసేస్తూ ఉంటారు.

'పురాణాలు జరిగాయా?' అని ప్రశ్నించుకుందాం ఒకసారి. మన చరిత్ర మాత్రం పురాణకాలపు ఆధారాలను అందుకోలేకపోతోంది. ఎందువల్లనంటే, పురాణకాలం కొన్ని లక్షల సంవత్సరాల వెనక్కి ఉంది. అయితే కనీసం పురాణాల్లో చెప్పిన విషయాలు యదార్థాలా? కాదా? అనే విషయాన్ని చూద్దాం. నేటి ఆధునిక సైన్సు చెప్తున్న ఎన్నో అంశాలు మనకు పురాణాల్లో కన్పిస్తున్నాయి. పురాణాల్లో ఉన్న వివిధ శాస్త్ర విషయాలు, నేడు ఒక్కొక్కటీ నిరూపణలోకి వస్తున్నాయి. దీన్నిబట్టి పురాణాల ఘనత అర్థమౌతోంది. పురాణకాలాన్ని లెక్కించలేకపోయాం సరే! కనీసం దానిలోని 'విజ్ఞానం' నిరూపణలోకి వస్తున్నప్పుడయినా మనం వాటి గొప్పతనాన్ని అర్థం చేసుకోగలగాలి. పురాణకాలపు సైన్సు పరిజ్ఞానాన్ని, మన ఆధునిక సైన్సు ఇప్పటికీ (చాలా విషయాల్లో) అందుకోలేకపోతుంది. అయితే ఇక్కడే చాలామందికి ఓ ధర్మసందేహం వస్తూంటుంది. "ఇంతటి పురాణవిజ్ఞానం కలిగిన భారతదేశం, సైన్సు విషయంలో ఇతర దేశాలకంటే వెనుకబడిందేమిటని?" ఈ ప్రశ్నకు జవాబు ప్రతి భారతీయుడూ కూడా తెలుసుకుని తీరాలి. అందుకనే ఆ విషయాన్ని చర్చిద్దాం.

## సైన్సులో భారతీయులు వెనుకబడి ఉన్నారా?

సైన్సు రంగంలో భారతీయులు వెనుకబడి ఉన్నారనే తప్పుడు అభిప్రాయం మనలో చాలామందికి ఉంది. భారతీయుల మేధాశక్తి ఏ రంగంలోనూ తక్కువ కాదు. (ఆధునిక కంప్యూటర్ రంగంలో భారతీయులు ప్రపంచంలో అగ్రగణ్యులుగా వెలుగొందుతున్నారు. మనదేశాన మన శాస్త్రవేత్తలు ఈ మధ్య తయారుచేసిన 'పరమ్' అనే సూపర్ కంప్యూటర్, ప్రపంచాన గల అతిగొప్ప కంప్యూటర్స్‌లో ఒకటి.) ఆధునిక

గణాంక వివరాల ప్రకారం ప్రపంచ మేధావుల శాతంలో భారతీయ మేధావులు ఒక ఉన్నతమైన ప్రత్యేకస్థానాన్ని కలిగి ఉన్నారు. ప్రపంచంలోని అనేక దేశాల్లో లక్షల కొలదీ భారతీయ మేధావులు స్థిరనివాసాలు ఏర్పరచుకుని, ఆయా దేశాలకు తమ సేవల్ని అందిస్తూ ఉన్నారు. అమెరికా దేశంలో అయితే భారతీయ మేధావులు మరీ భారీ సంఖ్యలో ఉన్నారు. ఈనాడు 'అమెరికా' అగ్రదేశంగా రూపొందిందంటే, అది అమెరికన్ల స్వయంప్రతిభ ఏమాత్రం కాదు. అమెరికాలో అక్షరాస్యత 50 శాతం మాత్రమేనని తాజా అమెరికన్ సర్వేలో తేలిందట. వారి మేధావి శాతం కూడా చాలా తక్కువ. అక్కడి వైజ్ఞానిక మేధావుల్లో భారతీయులూ, చైనీయులూ, జపాన్‌వారూ హెచ్చుగా ఉన్నారనే విషయం ప్రపంచమంతటా తెలుసు. అలా వివిధ దేశాల మేధావుల కృషి, అమెరికా దేశాభివృద్ధికి ఎంతగానో తోడ్పడుతోంది. ఇతర దేశాల మేధావులను చేరదీసి వాడుకోవడంలో ఉంది 'అమెరికా వారి తెలివి'. ఈ విషయం మనలో చాలా మందికి తెలీదు.

ఆధునిక సైన్సు విషయంలో అగ్రదేశాలకంటే మన దేశం కాస్త వెనుకబడి ఉండడానికి ఒక ప్రముఖ కారణం "మన మేధావుల విదేశీవలస". వలసపోయే మేధావుల శాతం భారతదేశంలో ఎక్కువని ఇటీవలి సర్వేలో తేలింది. మేధావులకు విలువనిచ్చి ఆదరించే పరిస్థితులు మనదేశంలో అంతకంతకూ తగ్గిపోతున్నాయి. ఇందుకు కారణాలు అనేకం. ఇప్పుడవి అప్రస్తుతం.

## మన ప్రాచీన విజ్ఞాన పరిస్థితి

మేధావులు వలస పోతేనేం? మనకు ప్రాచీన విజ్ఞానం ఉందికదా! దానితో అభివృద్ధి సాధించలేమా? అని అడగవచ్చు. నిజమే! ఆ విజ్ఞానమంతా మనకు లభించి ఉంటే అలాగే అభివృద్ధి చెందేవాళ్ళం. కానీ మన ప్రాచీన విజ్ఞానంలో చాలాభాగం కాలగతిలో నశించింది. ఆ తర్వాత తరతరాల అజ్ఞానులచే మరింత విజ్ఞానం ధ్వంసం చేయబడింది. దుర్మార్గులచే, దోపిడీదారులచే దోచుకోబడింది. ఇన్ని కష్టాలు గట్టెక్కగా అపగింజలో అరపాతిక విజ్ఞానం మాత్రమే ప్రస్తుతం మనకు లభిస్తోంది. చిత్రమేమంటే, లభిస్తున్న ఆ కొద్దిపాటి విజ్ఞానంలోనే అనంతమైన విజ్ఞానవిషయాలు దొరుకుతున్నాయి మనకి. అవి ఆధునిక సైన్సుతో నిరూపించబడుతున్నాయి కూడా! భారతీయులుగా మనం ఎంతో గర్వించదగ్గ విషయం ఇది!

నేటి ఆధునిక విజ్ఞానంలో ప్రముఖంగా వెలుగొందుతున్నది 'ఖగోళ పరిజ్ఞానం'. అటువంటి ఖగోళ పరిజ్ఞానంలో కూడా మన ప్రాచీన హైందవులే ప్రథములు. "సూర్యసిద్ధాంతం" అనే ప్రాచీన గ్రంథం ద్వారా కూడా ఈ విషయం నిరూపితమౌతోంది. ప్రాచీన భారతీయుల ఖగోళశాస్త్ర మూలగ్రంథాల్లో ఈ "సూర్యసిద్ధాంతం" ఒకటి.

ఇది నేడు పూర్తిగా దొరకడం లేదు. శిథిలావస్థలో ఉన్న కొన్ని లిఖితప్రతులు మాత్రం లభించాయి. దీని కర్త ఎవరో, రచనాకాలం ఏదో మనకు సరిగా తెలియడం లేదు. ఈ సూర్యసిద్ధాంతాన్ని సూర్యుడు, మయుడికి ఉపదేశించాడని అందులో చెప్పబడింది. ఈ సూర్యసిద్ధాంత గ్రంథంలో తెలుపబడిన ఖగోళసూత్రాలు, ఆధునికుల లెక్కలకు అనుకూలంగానే ఉన్నాయట. (నండూరివారి 'విశ్వరూపం' అనే ఖగోళ గ్రంథంలో చూడండి.) అంతటి ప్రాచీన కాలంలోనే ఏ పరికరాలతో, ఏ పద్ధతుల ద్వారా ఆ సూత్రాలను వారు తెలుసుకోగలిగారో మనం ఊహించలేక పోతున్నాం. మన ప్రాచీనుల విజ్ఞానానికి ఇదో మచ్చుతునక.

## పురాణ విజ్ఞానాన్ని తెలుసుకోలేకపోతున్నాం

ప్రస్తుతం లభిస్తున్న పురాణ విజ్ఞానాన్ని సరిగా అర్థం చేసుకోగలవారు కూడా తగ్గిపోతున్నారు. మన పురాణ విజ్ఞానం హెచ్చుగా సంస్కృత భాషలో ఉంది. నేడు సంస్కృత భాషా పరిజ్ఞానం ఎంతమందికి ఉంది? ఒకవేళ ఆ పరిజ్ఞానం ఉన్నాకూడా, వాళ్ళలో చాలామంది 'ఛాందసవాదులు' గా ఉంటున్నారు. పురాణవిజ్ఞానంలోని అంతరార్థాలు (సైన్స్ విషయాలు) వారికి తెలియవు, తోచవు. సంస్కృతం నుండి అనువదించబడిన పురాణవిజ్ఞానం కూడా నేడు ఎంతో వుంది. ఆ విజ్ఞానాన్ని అర్థం చేసుకుని, విడమరచి చెప్పే విజ్ఞులు కరువయ్యారు. ఇటువంటి పరిస్థితుల్లో సామాన్య ప్రజల సంగతి చెప్పేదేముంది? ఎవరి స్వార్థం వారిది. తమకు తక్షణం కలసివచ్చే పనైతే చేస్తారు. లేకుంటే లేదు. ఇక విజ్ఞానం సంగతీ, దేశం సంగతీ ఎవరికి కావాలి? (నేటి ప్రజానాయకుల సంగతి వేరే చెప్పనక్కర్లేదు.) మేధావులూ, పండితులూ, సామాన్యులూ, పరిపాలకులూ ఈ విధంగా చెరోదారీ పడుతుంటే - మనకు లభిస్తున్న ఆ కొద్దిపాటి పురాణ విజ్ఞానాన్నీ వెలికితీసి, సమాజానికి అందించేది ఎవరు? మన భారతీయ ప్రతిభను ప్రపంచానికి చాటిచెప్పేది ఎవరు? ఒకసారి ఆలోచించండి.

## పురాణ సైన్సు కేవలం మంత్రాలేనా?

పురాణకాలపు విజ్ఞానం మొత్తం అంతా మంత్రయుక్తమే కాదు. నేటికాలంలో వలె యంత్ర విజ్ఞానం కూడా ఆనాటి వారికి చాలా ఉంది. మంత్రపరమైన సైన్సు ఈనాటి కాలానికి ఆచరణ సాధ్యం కాదు. ఎందుకంటే మంత్రం అనేదానికి త్రికరణ శుద్ధి కావాలి. అది నేడు ఏ మాత్రమూ ఎవరిలోనూ లేదు. ఇక ప్రాచీనకాలం నాటి యంత్రపరమైన సైన్సు నేటికీ ఉపయుక్తమే! అయితే అది పూర్తిగా మనకు లభించకపోవడం నిజంగా మన దురదృష్టం! లభించిన కొద్దిపాటి విజ్ఞానాన్నీ మనం తెలుసుకునే స్థితిలో లేము. కేవలం స్వార్థపూరిత వాతావరణంలో మునిగిఉన్నాం.

## పురాణ విజ్ఞానం వల్ల ఇప్పుడేమి లాభం?

మన పూర్వీకుల విజ్ఞానం మనలో చైతన్యాన్ని కల్గిస్తుంది. తద్వారా మనకు ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. బద్ధకం, నిరాశాభావం నశిస్తాయి. ప్రగతికి మార్గం ఇంతకంటే మరేమిటి?

## పురాణ విజ్ఞానాన్ని అందుకోండి :

వేద పురాణేతిహాసాలలోని విజ్ఞానాంశాలను ఎందరో మహానుభావులు తమ శక్తి మేరకు వివరిస్తూనే ఉన్నారు. కొన్నికొన్ని విషయాలు అక్కడక్కడా ప్రచురిత మౌతున్నాయి కూడా! అయినా సామాన్యుడి స్థాయికి ఆ విజ్ఞానం తగినంతగా అందడం లేదు. ప్రత్యేకించి పురాణాల్లో సైన్సు విషయాల్ని వివరించే పుస్తకాలేవీ ఇంతవరకూ వెలువడలేదు. అందువల్లనే ఈ పుస్తకముద్రణ చేపట్టడం జరిగింది. పురాణ విజ్ఞానాన్ని పరిశీలించి, పరిశోధించి ఆ విజ్ఞాన అమృతాన్ని (సామాన్యుని స్థాయికి దించి) వ్యవహారిక భాషలో అందిస్తున్నాం, అందుకోండి.

అయితే ఒకమాట! ఇదొక అపూర్వ విజ్ఞాన గ్రంథం. ఇంద్రియాల్ని వశంలో ఉంచుకుని శ్రద్ధగా చదవండి. చదివిన విషయాల గురించి ఆలోచించండి. తద్వారా మీ మేధస్సుకు పదును కలుగుతుంది. పదునైన ఆ మేథస్సును సమాజ విజ్ఞత పెంపొందించడానికి వినియోగించండి.

పండితులకూ, పామరులకూ, విజ్ఞానులకూ, అజ్ఞానులకూ కూడా ఉపయుక్తంగా ఉండే రీతిలో విజ్ఞాన విషయాల్ని అందించే ప్రయత్నం చేశాం. ఈ ప్రయత్నంలో ఎక్కడైనా పొరబాట్లు దొర్లివుంటే, విజ్ఞులు క్షమించాలి.విజ్ఞుల సూచనలు, అభిప్రాయాలూ మాకు ఎప్పుడూ శిరోధార్యమే! (హైందవ ప్రాచీన విజ్ఞానాన్ని మీకు అందించాలనే తపన తప్పించి - ఎవరినీ, దేనినీ విమర్శించాలనే ఉద్దేశ్యం మాకు ఎంతమాత్రమూ లేదని ఇందుమూలంగా స్పష్టం చేస్తున్నాం)

మా చిరునామా :

**పోలిశెట్టి బ్రదర్స్,**
**17-3-6, గౌరీ కోనేరు వద్ద,**
**పెద్దాపురం - 533 437.**
**తూ॥గో॥జిల్లా, ఆంధ్రప్రదేశ్.**

# ఋషీశ్వరుల దేశం మనది

ఋషులంటే ముక్కుమూసుకుని తపస్సు చేసుకునే ఆధ్యాత్మిక వేత్తలే అనుకోకండి. ప్రాచీన కాలంనాటి శాస్త్రవేత్తలూ, డాక్టర్లూ, ఇంజనీర్లూ కూడా వారే! వారి పరిజ్ఞానం, నేటి ఆధునిక విజ్ఞానం కంటే పైస్థాయిలోనిది. పరమాణువు నుండి బ్రహ్మాండం వరకూ వారు పరిశోధించి తెలుసుకోని విషయమంటూ లేదు. తాము తెలుసుకున్న విజ్ఞాన విషయాలన్నింటినీ, ధార్మిక అంశాలతో జోడించి వేదపురాణేతిహాసాల్లో గ్రంథస్తం చేశారు. మన హైందవ సంస్కృతీ ఘనతకు మూలకారకులు వీరే! అయితే ఆ విజ్ఞాన విషయాల్ని పురాణ పరిభాషలో అంతరార్థాల మధ్య ఇరికించి వ్రాయడం వల్ల, నేటి సామాన్య జనావళికి అవి తెలిసి రావడం లేదు. పైగా మనలో హెచ్చుమందికి సంస్కృత భాషా పరిజ్ఞానం ఇసుమంత కూడా లేదు.

అలనాడు యజ్ఞయాగాదులతో వాతావరణ సమతౌల్యాన్ని రక్షించినా, నదులను అనుకూలంగా దారులు మళ్ళించినా, జపతపాదులతో ఆరోగ్య నియమాల్ని రూపొందించినా అంతా మన ఋషుల చలువే! హైందవ సంస్కృతి, హైందవ ధర్మాల ద్వారా ఋషులు అందించిన విజ్ఞానం "మీగడపెరుగు వంటిది". దాన్ని మధిస్తే వెన్నవంటి విజ్ఞానం బయటపడుతుంది. అలా మధించగలిగినవారు మహాజ్ఞానులు అవుతారు.

## మన అపోహ

ఋషీశ్వరులు అందించిన విజ్ఞానాన్ని అర్థం చేసుకోలేక, మనం ఎప్పటినుండో సైన్సులో వెనుకబడి ఉన్నామనుకుంటూ అపోహ పడుతున్నాం. మన ప్రాచీన విజ్ఞానం చాలావరకూ దొరకకపోవడం వల్లా, దొరికిన విజ్ఞానంలోని అంతరార్థాలను గ్రహించలేక పోవడం వల్లా, ప్రస్తుత విజ్ఞానరంగంలో పాశ్చాత్యులకు ప్రాధాన్యత పెరిగింది. సైన్సు అనేది పాశ్చాత్యుల సొత్తు అనే భ్రమలో ఉన్నాం మనం.

## ఆసక్తికరమైన ప్రశ్న!!

"పురాణాల్లో సైన్స్ ఉందా?" అంటూ నోరు వెళ్ళబెట్టారు మా మిత్రులు కొంతమంది. "పుక్కిటి పురాణాలు అనే పదం విన్నాంగానీ, పురాణాల్లో సైన్సు విషయాలున్నాయా?" అంటూ విస్తుపోయారు మరికొంతమంది. అయితే అక్కడక్కడా కొందరు మాత్రం "అవును, మన వేదాల్లో, పురాణాల్లో చాలా సైన్సు ఉందట" అని అంటూ ఉంటారు. 'ఇంతకూ వాటిలో ఉన్న సైన్సు ఏమిటి? అది మన గ్రంథాల్లో ఏ రూపంలో ఉంది?' ఈ విషయాలు తెలిసినవాళ్ళు మాత్రం అతికొద్దిమందే ఉన్నారు. వీళ్ళు మాత్రమే మన ప్రాచీన ప్రతిభను గుర్తించి కీర్తించగలరు. మిగిలిన జనాభా అంతా మన సంస్కృతీ, చరిత్రలను దాదాపుగా మరచిపోయే స్థితికి వచ్చేసింది. సర్వసాధారణమై నేడు పెరిగిపోతున్న స్వార్థమూ, ఉపేక్షాభావమూ దీనికి కారణాలు.

## హైందవ సంస్కృతి పరిస్థితి :

ఈనాటికీ, ఏనాటికీ కూడా హైందవ సంస్కృతీ సిద్ధాంతాలు ప్రపంచానికి మార్గదర్శకాలే! అయితే చిత్రమేమంటే స్వదేశంలోనే హైందవ సిద్ధాంతాలు అన్యాయంగా అణగద్రొక్కబడుతున్నాయి. అందుకే అంతటా ఆధ్యాత్మికత నశించి, అరాచకం తాండవమాడుతోంది. విజ్ఞానం అనేది 'విదేశీయులనుండి మనకు అందిన భిక్ష' అని భావించే నీచస్థితికి మనవాళ్ళు దిగజారిపోతున్నారు.

ప్రపంచంలోని ఇతర దేశాలు, జాతులు కళ్ళు తెరవకముందే, విజ్ఞాన వీధుల్లో షికార్లు చేసింది మన దేశం. ప్రపంచంలో ఏ సంస్కృతికీ లేని విశిష్ట గుణాలు మన సంస్కృతికి ఉన్నాయి. ప్రపంచంలో ఈనాటికీ భారతదేశానికి ఒక గౌరవప్రదమైన ప్రత్యేక స్థానం ఉన్నదీ అంటే, దానికి కారణం హైందవ సంస్కృతే! ఇది జగమెరిగిన సత్యం!!

## పూర్వ హైందవ చరిత్ర :

మనజాతి పూర్వీకులను "వేద మార్గీయులు" అనేవారు. వేదం అంటే 'విజ్ఞానం' అని అర్థం - వేదాల్ని అనుసరించే జాతి కనుక మనవాళ్ళకు 'వేదమార్గీయులు' అనే పేరొచ్చింది.

సింధునదికి ఈవల ఉన్న మన పూర్వీకులను "సింధువులు" అని కూడా పాశ్చాత్యులు పిలిచేవారు. మనవారు అనుసరించే వేద మార్గానికి 'మతం' అనే

పేరు పెట్టింది కూడా వారే! సింధువులు అనుసరించే వేదమార్గాన్ని "సింధుమతం" గా పాశ్చాత్యులు చెప్పుకునేవారు. ఆ "సింధుమతం" అనే పదమే క్రమంగా "హిందూమతం"గా మారింది. నిజానికి "హిందూ ధర్మం" అనే పదాన్నే మనం వాడవలసి ఉంటుంది. ఎందువల్లనంటే అది ధార్మికమైన హిందూ జీవన విధానాన్ని నిర్దేశిస్తుంది కనుక!

## మన ప్రాచీన సైన్సు

మన వేద పురాణేతిహాసాలు సైన్సు భాండాగారాలు. మన పండుగలూ, పూజలూ, ఆచార వ్యవహారాలూ అన్నీకూడా ఆరోగ్యపరమైన, నీతిదాయకమైన, ధార్మికపరమైన, ఖగోళపరమైన అంతరార్థాలు కలిగి ఉన్నవే! హైందవుని దినచర్య మొత్తం సైన్సుమయమే! కట్టు, బొట్టు, అలంకారం, తిండి, విశ్రాంతి, నిద్ర, వ్యాయామం, ఆరోగ్యనియమాలు, పరిశుభ్రత, గృహాలంకరణ, గృహవాస్తు..... ఇలా ఒకటేమిటి? అడుగు తీసి అడుగు వేస్తే, అన్నింటా సైన్సు ఆధారంగా గల సూత్రాలే నిర్దేశించ బడ్డాయి మనకు.

మన పూర్వీకుల విజ్ఞానాన్ని పాశ్చాత్యులు దుర్బుద్ధితో తమ స్వంతం చేసుకోవాలనే ప్రయత్నాలు చేశారు. "నిప్పు"ను ముందుగా కనుగొన్నది పాశ్చాత్యులని, మన పాఠ్యాంశాల్లో ఉంటుంది. అయితే అగ్నిదేవుని జననం గురించి మన వేదాల్లో స్పష్టంగా వివరించబడి ఉంది. (ముందు పేజీల్లో చూద్దాం.) వర్షం ఎలా కురుస్తుందనే విషయం గురించి కూడా ఋగ్వేదంలో చక్కగా చెప్పబడింది. గ్రహాలు, గ్రహశకలాలు, నక్షత్రాలు, విషువత్‌రేఖ, ధృవతారా మార్పులు, రాశిచక్రం ...... ఇటువంటి విషయాలకు సంబంధించిన (ఖగోళ) పరిజ్ఞానంలో కూడా మన హైందవులదే పైచేయి. వేల సంవత్సరాల తర్వాతగాని, ఇవన్నీ పాశ్చాత్యులకు తెలిసిరాలేదు.

అలాగే..... వానరజాతి నుండి మానవజాతి వచ్చిందనే 'డార్విన్ సిద్ధాంతం' మనకు పాతదే! రామాయణంలో వాల్మీకి ఇచ్చిన విషయాల్ని బట్టి ఈ సంగతి నిరూపణ అవుతోంది. ("రామాయణంలో వివిధ శాస్త్రీయ అంశాలు" అనే మా తర్వాత ప్రచురణలో దీని వివరాలు చూడగలరు.)

తిథి, వార, నక్షత్ర, కరణ, యోగ మరియు మాస, సంవత్సర, పుష్కర అంశాలతో పాటూ ఋతువులు, భూచలనం, రాత్రింబవళ్ళు, భూమి ఆకారం..... ఇవన్నీకూడా ప్రపంచంలో మొట్టమొదటగా కనుగొన్న జాతి మన హైందవజాతి. (వివరాలు మా తర్వాత ప్రచురణల్లో చూడండి.)

## మన సంస్కృతిపై పడిన మచ్చలు-మన బాధ్యత :

మన హైందవ సంస్కృతి విజ్ఞానమయమని చెప్పుకున్నాం కదా! ఈసారి దాన్నే మరో కోణంనుంచి కూడా చూద్దాం.

కాలగమనంలో కొన్ని స్వార్థపర శక్తులవల్ల అస్పృశ్యత, బలవంతపు సతీసహగమనం వంటి కొన్ని మచ్చలు మన సంస్కృతిపై పడ్డాయి. ఆ మచ్చల్ని గురించి తిట్టుకోవడం కాకుండా, వాటిని అంతమొందించే సత్తాకావాలి మనకు. పంటకు ఓ మూల చీడ పడితే, మందుచల్లి రక్షించుకుంటాం. అంతేగాని ఏ ప్రయత్నం చేయకుండా మొత్తం పంటను తిట్టుకుంటూ కూర్చుంటే, చివరకు నోటికి ఒక్క మెతుకు కూడా దక్కదు. మన సంస్కృతి విషయం కూడా ఇటువంటిదే! నేటి తరంలో చాలా మందికి 'సంస్కృతిని విమర్శించే కుయుక్తే గాని, రక్షించే ధీయుక్తి లేదు.' పుట్టుకొచ్చే దురాచారాల్ని ఎప్పటికప్పుడు అంతమొందిస్తూ, సంస్కృతిని రక్షించుకోవలసిన బాధ్యత మనందరికీ ఉంది. కాలక్రమేణా కొన్ని మార్పులూ, చేర్పులూ, సవరణలూ ప్రతీదానికీ తప్పని సరి. సవరణలు అవసరమైనంత మాత్రాన, అది వ్యర్థమైనదేమీ కాదు. నిన్న మొన్న వ్రాసుకున్న మన దేశ రాజ్యాంగానికి ఇంతవరకూ దాదాపు 80 సవరణలు (సరాసరిగా సంవత్సరానికి 2 సవరణలు) చేసుకున్నాం. అంతమాత్రాన రాజ్యాంగ రచనను దూషించగలమా? పైగా మన సంస్కృతి లక్షల సంవత్సరాల క్రితం నాటిది. ఆనాటి నుండీ పెద్దగా సవరణలు లేకుండానే 'జీవనదిలా' ప్రవహిస్తోందది. మన సంస్కృతీ ఘనతకు నిదర్శనం ఇంతకంటే ఏం కావాలి?

## మన దేశ చరిత్రకు జరిగిన ద్రోహం

ప్రస్తుతం చెలామణీ అవుతున్న మన దేశ చరిత్ర, మనం వ్రాసుకున్నది కాదు. దాన్ని పాశ్చాత్యులు వ్రాశారు. హైందవ ప్రాచీనతనూ, పరిజ్ఞానాన్నీ సహించలేని పాశ్చాత్యులు, మన ప్రాచీనతను వీలయినంత వరకూ కుదించి, ఆధునిక కాలానికి లాక్కొచ్చారు. మన ప్రాచీనులు కనుగొన్న ఎన్నో గొప్ప విషయాల ఘనతను, ఇతరితర దేశాలకు కట్టబెట్టారు. భారతజాతికి చెందిన మహాపురుషులు, రాజులు, వీరులు, జాతీయ పురుషులు అయినవారిని గురించి వీలయినంతవరకూ తగ్గించి వ్రాశారు. వేదకాలాన్ని వీలయినంతవరకూ ఆధునికం చేసే ప్రయత్నాలు చేశారు. ఏ చారిత్రిక ఆధారం లేని "ఆర్యుల దండయాత్ర" అనే అబద్ధంతో మన చరిత్రకు నాంది పలికారు. తిథి, వార, నక్షత్రాలతో సహా ఖగోళపరమైన ఆధారాల్ని కలిగి ఉన్న

మహాభారతాన్ని "చరిత్రలోకి" తీసుకోకుండా, పురాణాల్లోకి (ఊహాగాథగా) గెంటేశారు. భారతజాతి అనుసరిస్తున్న యుధిష్ఠర, కలి, విక్రమార్క, శాలివాహన, విజయాభినందన, నాగార్జున, కల్కి శకాలను తప్పించేసి "క్రీస్తు పూర్వం, క్రీస్తు శకాలను" (క్రీ.పూ., క్రీ.శ.లను) మనకు అంటగట్టారు.

విదేశీయులు వ్రాసి పెట్టిన కల్లబొల్లి పాఠాల్నే "మన చరిత్రగా" నమ్మి, బట్టీ పట్టేస్తున్నాం, Ph.Dలు కూడా పొందేస్తున్నాం. ఈ పరిస్థితి మారాలి. మనం కళ్ళు తెరచి, మనకున్న ఆధారాలతో ఇప్పటికైనా మన యదార్థ చరిత్రను వ్రాసుకోవాలి.

## నేటి మన జాతి పరిస్థితి

మన సంస్కృతిలోని, చరిత్రలోని విజ్ఞానాంశాల్నీ, ధార్మికతనూ, ఆధ్యాత్మికతనూ తెలుసుకునే ఓపిక నేడు చాలా మందికి లేదు. నేటి మన హైందవ జాతి - బద్ధకస్తులతోనూ, ఛాందసులతోనూ, అయోమయావస్థలో పడిపోతున్న నాస్తికులతోనూ, నిర్లక్ష్య స్వార్థపూరిత వ్యక్తులతోనూ నిండుతూ నిర్వీర్యమౌతోంది. ఇటువంటి పరిస్థితి వర్తమానాన్ని పాడుచేసి, భవిష్యత్తుకు కీడు తెస్తుంది. ఈ అస్తవ్యస్థ పరిస్థితులనుండి బయటపడేందుకు నేటి విద్యావ్యవస్థ మనకు ఏ మాత్రం సహకారంగా లేదు. సమాజ శ్రేయస్సు పట్ల బాధ్యత వహించవలసిన 'పత్రికారంగం' అంతకంతకూ మలినమౌతోంది. నేటి పేపర్లు, పత్రికలు నైతిక విలువల్ని వదిలేసి, కేవలం ఆర్థిక లాభాల కోసం తంటాలు పడుతున్నాయి. మంచికోసం, నిజాయితీ కోసం మేల్కొలిపే వారు లేక, మన జాతి నిద్రావస్థలోకి జారుకుంటోంది.

## మన దురవస్థకు మూలకారణం ఏమిటి?

ప్రపంచాన మొట్టమొదట నుండీ మనది మేధావుల దేశం. అయితే విదేశీ దురాక్రమణల, దౌర్జన్యాల పరంపరలో మన ప్రాచీనుల జవజీవాలు చాలావరకూ నశించి పోయాయి. పరపాలన నియంతృత్వాల్లో నిరాశ, నిస్పృహ, బానిసత్వ భావనలు పెరిగిపోయాయి. ఆ అవగుణాలకు స్వార్థబుద్ధి తోడయింది. ఈ పరిస్థితి నుండి మనం బయటపడాలి. మన జాతి ఔన్నత్యాన్ని ముందుగా మనం తెలుసుకుని, ప్రపంచ దేశాలకు మన కీర్తిని ఎలుగెత్తి చాటాలి.

## నేటి విద్యాస్థితి

ప్రాచీన కాలంలో ప్రపంచదేశాలకు గురుపీఠంగా విలసిల్లిన మన భారతదేశం,

నేడు విదేశాలనుండి విద్యావిధానాన్ని దిగుమతి చేసుకొంటోంది. స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళు గడిచినా తనకంటూ ఒక విద్యావిధానాన్ని ఇప్పటికీ రూపొందించుకోలేక పోయింది మన దేశం. పూర్వకాలంలో ఉన్నత విద్యల కోసం విదేశీయులంతా మన దేశానికి వచ్చి తక్షశిల, నలంద, కాశీ మొదలగు చోట్ల గల విశ్వవిద్యాలయాల్లో విద్యను అభ్యసించి వెళ్ళేవారు. ఇప్పుడు పరిస్థితి తారుమారయింది. ఉన్నత విద్యల కోసం విదేశాలకు ఎగబడే దుస్థితి ఏర్పడింది మనకు. ఏది ఏమయినా కూడా ఇప్పటికీ మేధావుల శాతంలో ప్రపంచం మొత్తంమీద మనది గొప్ప స్థానమే! అయితే మన దేశ మేధావుల విదేశీ వలసలవల్ల, వారి సేవలు మాతృదేశానికి అందడం లేదు. అదీ సంగతి!

## మన విశిష్టతను మనం తెలుసుకోవాలి

మన స్వంతమైన సంస్కృత భాష, వేదపురాణేతిహాసాలు, యోగాభ్యాసాలు... ఇటువంటి వాటి ఉత్కృష్టతను మనం సరిగా గుర్తించ లేకపోతున్నాం. అయితే వాటి ఔన్నత్యాన్ని ఇతరితర దేశాలన్నీ అతి త్వరితంగా గుర్తిస్తున్నాయిప్పుడు. ఇది మనకు సిగ్గుకరమూ, గర్వకారణమూ కూడా! ప్రపంచ భాషలన్నింటిలోనూ మన సంస్కృత భాష మహోత్కృష్టమైనది. సంస్కృత భాషయొక్క ఉచ్ఛారణ, అక్షర ప్రయోగం 'ఆధునిక కంప్యూటర్ ప్రోగామ్స్' (Natural Language Processing) కు మిగిలిన భాషలకంటే చాలా అనుకూలంగా ఉందట. ఎంతయినా దేవభాష కదా మరి!

ఒక విశేషం మీకు తెలుసో, తెలియదో...! ఈమధ్య ఇతరితర వాళ్ళంతా తమతమ గ్రంథాల సిద్ధాంతాల్ని మన వేదాల, ఉపనిషత్తుల ఆధారంగా నిరూపించుకోవాలని తంటాలు పడుతున్నారు. ఎందుకంటే వాళ్ళ సిద్ధాంతాలకు మరో విధంగా పునాదులేవీ లేవు మరి!

మన సంస్కృతిలోని విజ్ఞాన విషయాల్ని పాశ్చాత్యులు ఎవరైనా వెలికి తీసి చూపితే, "ఓహో! మన సంస్కృతికూడా గొప్పదే!" అనేసి, మళ్ళీ దుప్పటి ముసుగేసి నిద్రపోవడం మనకు అలవాటైపోయింది. మన దేశంలోని మేధావుల్లోనూ, సామాన్యుల్లోనూ కూడా చైతన్యం అంతకంతకూ తగ్గుతోంది. ఈ పరిస్థితి మారాలి.

## ప్రాచీన విజ్ఞానం అనవసరమా?

'ప్రాచీన విజ్ఞానం, సాంప్రదాయాలూ' అంటూ పాత చింతకాయ పచ్చడి ధోరణిలో ప్రగతికి అడ్డుగోడ కట్టుకుంటున్నామని కొందరి వాదన. ఇది చాలా పొరపాటు.

ప్రాచీన విషయాలు మనకెప్పుడూ అవసరమే! మనం విద్యాలయాల్లో "చరిత్ర" ను పాఠ్యాంశంగా చదువుకుంటున్నాం. ఏనాడో జరిగిపోయిన చరిత్ర విషయాలు ఇప్పుడెందుకని మనం అనుకోవడం లేదు. ఎందువల్లనంటే చరిత్ర ఎరుగని జాతికి భవిష్యత్తు లేదు కనుక!

ప్రాచీన సంస్కృతికీ, విజ్ఞానానికీ నిజమైన వారసులుగా ప్రవర్తించాలి మనం. అంతేగాని "మా తాతల కాలంలో నేతులు త్రాగారు. ఇప్పుడు మా మూతులు వాసన చూడండి" అన్నట్లుగా వ్యవహరించకూడదు. నాటి నేతుల రుచి మనమూ చూడాలి - అది మన బాధ్యత.

## మన కర్తవ్యం

తమ ప్రాచీన ఘనతను మరచి నిద్రిస్తున్న భారతజాతిని మేల్కొలిపేందుకు ఇప్పుడు "శంకరాచార్యులూ, వివేకానందులూ, తిలక్‌లూ" లేరు, రారు. మనంతట మనమే చైతన్యవంతులం కావాలి. అలముకుంటున్న అంధకారాన్ని తిట్టుకుంటూ కూర్చునే కంటే, చిన్నదైనా సరే ఒక దివ్వెను వెలిగించమన్నారు మన పెద్దలు.

మేము మా వంతు కృషిగా "పురాణాల్లో సైన్సు" అనే ఈ పుస్తకం ద్వారా 'భారతీయ శంఖారావాన్ని' పూరిస్తున్నాం. భారతజాతికిదే మా మేలుకొలుపు.

సర్వేజనా సుఖినోభవన్తు.

ఇట్లు

మీ భారతీయ సోదరులు

**పోలిశెట్టి బ్రదర్స్**

*గమనికలు : 1. ఈ పుస్తకంలో కేవలం పురాణాల్లోని సైన్సే కాకుండా మన వేదాల్లోని, ఇతిహాసాల్లోని, ప్రాచీన చరిత్రలోని సైన్సు విషయాల్ని కూడా చర్చించడం జరిగింది.*

*2. ముద్రణ కానున్న మా ఇతరపుస్తకాలన్నీ కూడా "భారతీయ శంఖారావం" సీరీస్ క్రింద వెలువడతాయి.*

★ ★ ★

# హైందవుల "సృష్టి పరిజ్ఞానం"

## సృష్టిలో మేధావులు హైందవులు

విశ్వసృష్టిని అవగాహన చేసుకున్న మేధావులు "మన ప్రాచీన హైందవులు." జీవుల మనుగడకు ఆధారభూతాలైన ప్రకృతిలోని శక్తులన్నింటినీ గుర్తించగలిగారు. ప్రపంచంలో మరే ఇతర జాతికీ ఇది సాధ్యం కాలేదు.

## హైందవులకు ఎక్కువమంది దేవుళ్ళు ఎందుకున్నారు?

తమకెన్నో వరాలను ప్రసాదిస్తున్న ప్రకృతి శక్తులకు కృతజ్ఞులై, భక్తులై నడచుకోవడం హైందవుల ఆచారమైంది. అందుకే ప్రకృతి స్వరూపాలనూ, శక్తులనూ తమ "దేవుళ్ళుగా", "దేవతలుగా" నిలుపుకున్నారు. హైందవులకు హెచ్చుసంఖ్యలో దేవుళ్ళు, దేవతలు ఉండడానికి కారణం ఇదే. ('దేవుడు-ఉనికి' అనే మా తర్వాత ప్రచురణలో ఇతర వివరాలు చూడవచ్చు.) అన్నింటికీ మూలమైన పరమాత్మ శక్తి మాత్రం ఒక్కటేనని హైందవులకు తెలుసు.

## ప్రతి అణువులోనూ శక్తి

పరమాణువు నుండి బ్రహ్మాండం వరకూ అన్నింటా పరమాత్మ శక్తి దాగి ఉన్నదని గ్రహించగలిగిన మేధాసంపన్నులు "హైందవులు". ఇదే విషయాన్ని సైన్సు పరమైన దృష్టితో విదేశీయులు ఆధునిక కాలంలో తెలుసుకోగలిగారు. సృష్టిలో అణువూ, పరమాణువూ కూడా శక్తిమయమై ఉన్నవని పాశ్చాత్యులు చాలా ఆలస్యంగా తెలుసుకున్నారు.

## శక్తిమయమంతా పూజనీయమే!

సృష్టిలో ప్రతీ అణువులోనూ ఉన్న శక్తి స్వరూపాన్ని హైందవులు గమనించారు.

కనుకనే, చెట్లూ పుట్టల్లోనూ చివరకు రాళ్ళూ, రప్పల్లోనూ కూడా దైవత్వాన్ని చూడగలుగుతున్నారు. ఇది వారి విస్తృత పరిజ్ఞానానికి మచ్చుతునక! ఎలుక నుండి ఏనుగు వరకూ జంతువులనూ, చిలుక నుండి నెమలి వరకూ పక్షులనూ ...... చివరకు పాములనూ ..... ఇలా ఎన్నింటినో తమ దైవాలకు వాహనాలుగానూ, ఆభరణాలుగానూ నిలిపి ఆరాధిస్తున్నారు. ఈ అంతరార్థమంతా తెలియని అమాయకులు "రాళ్ళూ రప్పలకూ, జంతువులకూ, పక్షులకూ పూజలేమిటని" వాపోతుంటారు పాపం! వాళ్ళను చూసి జాలిపడాలి మనం!!

## మన విశ్వ విజ్ఞాన ఘనత

పురాణకాలం నుండీ మనవాళ్ళకు మొత్తం విశ్వసృష్టిని గురించి స్పష్టమైన అవగాహన ఉంది. నేటి విదేశీ శాస్త్రవేత్తలింకా "విశ్వం" (UNIVERSE) గురించి పరిశోధనలు చేస్తూ తికమకలు పడుతున్నారు. నేటి శాస్త్రవేత్తల ఖగోళ పరిజ్ఞానం కంటే హెచ్చు పరిజ్ఞానం మన ప్రాచీన ఋషీశ్వరుల కుండేది. మనిషి చంద్ర మండలానికి వెళ్ళిరావడమే, మన ఆధునిక కాలంలో అతి గొప్ప విషయం. పురాణకాలంలో ఇంతకంటే ఘనమైన అంతరిక్ష విహారాలు కన్పిస్తాయి మనకు.

ఆకాశం, గాలి, అగ్ని, నీరు, నేల - ఈ పంచభూతాల సమ్మేళనంతో జీవుల శరీరాలు ఏర్పడ్డాయని మన హైందవ విజ్ఞానులు ఏనాడో చెప్పగలిగారు. సూటిగా ఈ విషయాన్ని పాశ్చాత్యులు ఇప్పటికీ గ్రహించలేకపోతున్నారు. విశ్వసృష్టిని గురించీ, వాతావరణాన్ని గురించీ మన ప్రాచీన హైందవులకున్న పరిజ్ఞానాన్ని ఇప్పటికీ పాశ్చాత్యులు అందుకోలేకపోతున్నారు. అందుకే గర్వంగా చెప్తున్నాం - ఏనాటికైనా ప్రపంచ సమాజానికి వైజ్ఞానిక, ఆధ్యాత్మిక గురువు "హైందవుడే!"

## ఋషీశ్వరుల రీతి

మన ఋషీశ్వరులు తాము కనుగొన్న సైన్సు విషయాల్ని సూటిగా చెప్పేవారు కాదు. ఆ విషయాలను ఒక నీతిబోధగానో, ఆచారాలుగానో, ఆధ్యాత్మిక (పురాణ) కథలుగానో చెప్పేవారు. ఎప్పుడూ కూడా మేధావి శాతంకంటే, సాధారణ జనశాతం హెచ్చు కనుక, ఋషీశ్వరులు పై పద్ధతినే అనుసరిస్తూ వచ్చారు. సైన్సును సైన్సుగానే వివరిస్తే, సామాన్యులకు సరిగా అర్థం కాదు. దాన్ని పురాణ పరిభాషలోకి మార్చి చెప్తే - ఆసక్తిగానూ ఉంటుంది, కలకాలం నిలుస్తుంది. ఆరోగ్యాన్నిచ్చే ఔషధాన్ని చిరుచేదుతో త్రాగించేకంటే, తియ్యనైన సిరప్‌రూపంలో త్రాగిస్తే ఇష్టపడతారు ఎవరైనా!

అందువల్లనే యదార్థ సైన్సు విషయాల్ని "ఆచారాల, కథల రూపంలో" తియ్యతియ్యగా అందించారు ఋషీశ్వరులు.

## ప్రస్తుత మేధావుల ప్రత్యేక బాధ్యత

ఋషీశ్వరులు అందించిన విజ్ఞానాంశాలను సామాన్య జనావళికి వివరించి చెప్పవలసిన బాధ్యత మేధావి వర్గానిది. మేధావులు తమ బాధ్యతను విస్మరిస్తే, సామాన్య ప్రజానీకంలో మూర్ఖుల శాతం పెరిగిపోతుంది. ఈ శాతం పెరిగే కొలదీ విజ్ఞానమయమైన పురాణగాథలన్నీ 'పుక్కిట పురాణాలు'గా అనిపిస్తాయి. ప్రస్తుతం ఇదే పరిస్థితి కొనసాగుతోంది. మేధావులంతా తమ మత్తునూ, స్వార్థాన్నీ వీడి - మన ప్రాచీన విజ్ఞానంలోని "అంతరార్థాలను" జన సామాన్యానికి వివరించి చెప్పవలసిన తరుణం ఇదే! పారాహుషార్!!



## పురాణాల్లో సైన్స్

# I. విశ్వసృష్టి మీద పురాణాల అవగాహన

"దృష్టిని బట్టి సృష్టి" అన్నారు పెద్దలు. ప్రపంచంలో ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా సృష్టిని అర్థం చేసుకున్నారు. అయితే 'శాస్త్రీయపరమైన సృష్టి అవగాహన' మాత్రం ఒక్క హైందవులకే ఉంది. వారు ఆ అవగాహనను, తమ పురాణాల్లో పొందుపరచుకున్నారు. ఆ విషయాన్ని క్లుప్తంగా తెలుసుకుందాం.

ఒక అద్భుతమైన శక్తి (Super Power), ఈ బ్రహ్మాండ విశ్వసృష్టికి మూలమని ఋషీశ్వరులు కనుగొన్నారు. దాన్నే "ఆదిశక్తి" అని పిలిచారు.

విశ్వం (Universe) నడవడి మొత్తం "సృష్టి, స్థితి, లయ" అనే మూడు దశలలో కొనసాగుతున్నట్లుగా గమనించారు. ఆ మూడు దశలనూ "త్రిమూర్తులుగా" గుర్తించారు. సృష్టికారకుడుగా "బ్రహ్మనూ", స్థితి కారకునిగా "మహా విష్ణువునూ", లయ కారకునిగా "మహేశ్వరుణ్ణీ" నిలుపుకున్నారు.

బ్రహ్మదేవుడు : జీవరాశికి మూలమై నాలుగు దిశలా వ్యాపించివున్న ప్రకృతిని, నాలుగు ముఖాలు గల బ్రహ్మదేవునిగా గుర్తించారు. విశ్వం మొత్తంలో ఎక్కడెక్కడ ప్రకృతి ఉన్నా, అది బ్రహ్మదేవుని స్వరూపమే.

మహావిష్ణువు : విశ్వం (Universe) యావత్తూ శ్రీ మహావిష్ణువే! అన్నీ ఆయనలోనే ఇమిడి ఉన్నాయి. అనంత విశ్వరూపుడాయన. జీవుల స్థితికారకుడుగా చెప్పబడుతున్నాడు. అంటే మనుగడకు మూలమైనవాడు, పోషణకర్త అని భావం. భూమిపై జీవరాశి మనుగడకు కారకుడు "సూర్యుడు". సూర్యుణ్ణి మహావిష్ణువు యొక్క 'ప్రథమ అంశ' గా చెప్తున్నాయి పురాణాలు. (సూర్యుడు మొదలయిన నక్షత్రాల శక్తి అంతా ఆయనలోనిదే కదా మరి!) సూర్యభగవానుని రూపంలో ఆ

మహావిష్ణువే మనకు మనుగడ కల్పిస్తూ, ఆహారాన్ని అందిస్తున్నాడు. (జీవులూ, పంటలూ కూడా మొత్తం సూర్యునిపై ఆధారపడినవే కదా!) ఈ కారణంగానే విష్ణువును 'జీవుల పోషణ కర్తగా' చెప్పారు.

మహేశ్వరుడు : విశ్వంలో జీవరాశిగల గ్రహాలన్నీ "మహేశ్వర స్వరూపాలే!". మన భూగోళంకూడా మహేశ్వర స్వరూపమే! (మహి అంటే 'భూమి' అని అర్థం. మహి+ఈశ్వరుడు = మహేశ్వరుడు) మహేశ్వరుణ్ణి 'శివుడనీ, శంకరుడనీ......' ఇంకా అనేక పేర్లతో పిలుస్తారు. భూగోళానికి అధిదేవత ఆయన. మన భూగ్రహాన్ని 'శివునిగా' చెప్పడానికి అనేక నిదర్శనాలున్నాయి. వాటిలో కొన్నింటిని ఇప్పుడు తెలుసుకుందాం. శివుడు 'నిరంతర సంచారి' అని చెపుతారు. మరి భూమి ఎప్పుడూ తిరుగుతూనే ఉంటుంది కదా! శివుని తలనుండి గంగమ్మ (గంగానది) జాలువారినట్లుగా పురాణాలు చెప్తున్నాయి. శరీరంలో ఎత్తైనది 'తల'. ఆవిధంగా భూగ్రహానికి ఎత్తైనవి 'హిమాలయాలు'. అనగా హిమాలయాలను 'శివుని తలగా' పోల్చడం జరిగిందన్నమాట. మరి హిమాలయాలనుండే కదా గంగానది ప్రవహిస్తోంది. దేవదానవుల సాగర మధన సమయంలో పుట్టిన హాలాహలాన్ని మ్రింగి, ప్రాణికోటిని శివుడు రక్షించాడంటారు. దీని అంతరార్థం చూడండి. భూమి (అనగా శివుడు) సర్వకాలుష్యాలనూ (అనగా హాలాహలాన్ని) తనలో లీనం చేసుకోవడం వల్లనే, ప్రాణికోటి మనుగడ సాగించగలుగుతుంది. (ఈ సందర్భంలో కాలుష్యమే హాలాహలం (విషం) గా పోల్చబడింది). శివునిలో సగభాగంగా కలిసిపోయి పార్వతీదేవి (శక్తి) ఉందంటారు. అందుకే ఆయన్ని అర్థనారీశ్వరుడంటారు. పార్వతీదేవి అంటే "భూమ్యాకర్షణ శక్తే!". ఈ భూమ్యాకర్షణ శక్తి భూమిలో విలీనమయ్యే ఉంటుంది కదా మరి! ఆ ప్రకారంగా శివపార్వతుల సంగమమే "ఈ భూగ్రహం" అని చెప్పవచ్చు. శివుని శరీరానికి అలంకారాలుగా పాములను చూస్తూంటాం. శివుని శరీరం భూమే కదా మరి! అందువల్లనే భూమిని అంటిపెట్టుకుని తిరిగే పాములను ఆయనకు అలంకారాలుగా చిత్రీకరించారు. శివుడు 'లయ కారకుడని' చెప్పుకున్నాం కదా! మరణించిన జీవులను శివుడు తనలో 'లయం' (లీనం) చేసుకుంటాడు. చనిపోయిన జీవులన్నీ చివరకు మట్టిలోనే కదా కలిసిపోతాయి. ప్రతీజీవీ ఆఖరికి ఈ భూమిలో లయం కావలసిందే! ఈ కారణంగానే శివుణ్ణి 'లయకారకుడుగా' చెప్పారు. మన భూగ్రహం 'పరమశివుడే' అని చెప్పేందుకు ఇవన్నీ నిదర్శనాలే! ఇంకా అనేక నిదర్శనాలున్నాయి. అయితే ప్రస్తుతానికి ఇవి చాలు.

("దేవుడు-ఉనికి" అనే మా రాబోయే గ్రంథం ద్వారా - ఏ దేవుడు ఏ రూపంలో ఎక్కడ ఎలా ఉన్నాడో, ఏ శక్తిని బట్టి ఏ దేవతారూపం ఎలా ఎందుకు రూపొందించ బడిందో అన్నీ వివరంగా తెలుసుకోవచ్చు.)

విశ్వంలోని శక్తులే దేవుళ్ళయితే - వారికి విచక్షణాశక్తి, మహిమలూ ఉంటాయా? అని కొందరు అనుమానించవచ్చు. విశ్వసృష్టిలోని అంతర్భాగమైన ప్రకృతినుండి ఉద్భవించిన "మనకే" ఇన్ని తెలివితేటలుంటే, ఇక దైవశక్తుల విషయం వేరే చెప్పాలా?

★ ★ ★

# 2. విశ్వం (Universe) ఆవిర్భావం

విశ్వం (Universe) ఏర్పడిన విధానాన్ని గురించి మన హైందవ పురాణ గ్రంథాలు స్పష్టమైన విజ్ఞానాన్ని అందిస్తున్నాయి. అదంతా తెలుసుకునే ముందుగా, విశ్వం ఆవిర్భావం గురించి మన ఆధునిక సైన్సు ఏం చెప్తుందో చూద్దాం.

బిగ్‌బ్యాంగ్ సూత్ర ప్రకారం, విశ్వం ఉద్భవించిందని ఆధునిక సైన్సు చెప్తోంది.

## బిగ్‌బ్యాంగ్ సూత్రం :

మొదట్లో ఈ నక్షత్రాలూ, గ్రహాలూ ఏవీ ఉండేవి కావట. అవన్నీ కలసి ఒకే ముద్దగా, అగ్నిగోళంగా ఉండేవట. దాన్నే మన ఋషులు "బ్రహ్మాండం" అని వ్యవహరించారు. ఏదోఒక అద్భుతమైన శక్తి (Super Power) వల్ల ఆ అగ్నిగోళం (అనగా బ్రహ్మాండం) ప్రేలిపోయిందట. దీన్నే ఆధునిక శాస్త్రవేత్తలు 'బిగ్‌బ్యాంగ్' అంటారు. ఆ ప్రేలుడుతో బ్రహ్మాండమనే అగ్నిగోళం - నక్షత్రాలు, గ్రహాలుగా దూరదూరాలకు చెదరిపోయింది. ఆ ప్రేలుడుతో కలిగిన విసురుడు శక్తివల్ల ఇప్పటికీ విశ్వంలోని నక్షత్రాలన్నీ కూడా గ్రహాలతో సహా దూరంగా అలా సాగిపోతూనే ఉన్నాయి. ఆధునిక సైన్సు ప్రకారం విశ్వం ఏర్పడిన మరియు నడుస్తున్న వైనం ఇదే! ఇదే బిగ్‌బ్యాంగ్ సూత్రం.

## విశ్వముకుళిత సూత్రం :

మరిన్ని కోట్ల సంవత్సరాలకు బ్రహ్మాండం ప్రేలుడుకు సంబంధించిన విసురుడు శక్తి తగ్గిపోతుంది. అప్పుడు బ్రహ్మాండం యొక్క కేంద్రస్థానం, పైన తెలిపిన అద్భుతమైన శక్తి (SUPER POWER) సహాయంతో మొత్తం నక్షత్రగ్రహాదులను వెనక్కి ఆకర్షించుకుని మళ్ళీ "బ్రహ్మాండం"గా, అంటే ఒక "అగ్నిగోళం" గా రూపుదాలుస్తుంది. విశ్వముకుళిత సూత్రంగా చెప్పబడిన ఈ సిద్ధాంతాన్ని కూడా ఆధునిక శాస్త్రజ్ఞులే చెప్తున్నారు. మళ్ళీ చాలాకాలం తర్వాత బ్రహ్మాండం ప్రేలుతుంది. మళ్ళీ

ముకుళితమౌతుంది. ఇది ఇలా కొనసాగుతూనే ఉంటుందట. విశ్వం ఆవిర్భావం గురించి ఆధునిక విజ్ఞానం చెప్తున్న విషయాలివి.

అయితే పై విషయాలన్నీ కూడా పురాణ పరిభాషలో మనకు "దేవీ భాగవతం" లో కన్పిస్తున్నాయి. ఆ వివరాలు చూద్దాం. ఆధునికులు చెప్పిన బ్రహ్మాండమనే అగ్నిగోళాన్ని "వటపత్రశాయి" (అంటే శ్రీమహావిష్ణువు) గా వర్ణించారు మహాఋషులు. ఆదిలో ఒంటరిగా ఒక మర్రిఆకుపై బాలుని రూపంలో వటపత్రశాయి (అనగా విష్ణువు) ఉన్నట్లుగా చెప్పారు వారు. అప్పుడు జగన్మాత అయిన ఆదిశక్తి (SUPER POWER) ఆజ్ఞపై విష్ణువు తన శరీరం నుండి ఈ సకల విశ్వాన్నీ సృష్టించాడట. అది అనంత విశ్వంగా వ్యాప్తి చెందుతోంది. ఆధునికుల బిగ్‌బ్యాంగ్ సూత్రం ఇదే! బ్రహ్మాండం ప్రేలుడుకు కారణంగా నేటి శాస్త్రవేత్తలు చెప్తున్న ఆ అద్భుతశక్తి (SUPER POWER) నే మన పురాణాల్లో "ఆదిశక్తి" అని వ్రాశారు. (విద్యుదయస్కాంత శక్తి, గురుత్వాకర్షణ శక్తి, ఉష్ణశక్తి, అణుబంధన శక్తి మొదలైన శక్తుల కలయికే పురాణాలు చెప్తున్న "ఆదిశక్తి"! సకల విశ్వానికీ మూలమైన దైవశక్తి ఇదే!!) కొన్ని కల్పకాల అనంతరం (అంటే అనేక కోట్ల సంవత్సరాల తర్వాత) ఆదిశక్తి ఆజ్ఞతో తిరిగి సమస్త విశ్వాన్నీ మహావిష్ణువు తనలో లీనం చేసుకుంటాడని కూడా దేవీ భాగవతం చెప్తోంది. ఈవిధంగా ఆధునికులు చెప్పిన 'విశ్వ ముకుళిత సూత్రం' కూడా మనకు అతి ప్రాచీనమైనదే! తిరిగి సృష్టి జరగడం .... మళ్ళీ లయం కావడం...... ఇలా ఇది ఎదురులేని నిరంతర కార్యక్రమం అని మన పురాణాలు కూడా చెప్తున్నాయి.

విశ్వ (UNIVERSE) ఆవిర్భావం గురించి ఆధునిక శాస్త్రవేత్తలు చెప్పినదీ, మన దేవీ భాగవతం చెప్తున్నదీ ఒక్కటే! కాకపోతే మన ప్రాచీన విజ్ఞానులు, ప్రతి సైన్సు విషయాన్నీ ఆధ్యాత్మిక పరంగా మార్చి వివరిస్తారంతే!

## బ్రహ్మాండం బ్రద్దలైందా?

అసాధారణ విశేషం ఏదైనా జరిగినప్పుడు ఉపమానంగా మనవాళ్ళు 'బ్రహ్మాండం బ్రద్దలైంది' అనేమాట ఉపయోగిస్తూ ఉంటారు. బిగ్‌బ్యాంగ్ సూత్రంలోని బ్రహ్మాండం బ్రద్దలు కావడం గురించే ఆ మాట వాడుకలోకి వచ్చింది. సృష్టి ఏర్పడిన వైనం గురించి మన జనసామాన్యంలో ఈ విధమైన మాట వాడుకలోకి వచ్చేసింది. చూశారా! మనకు తెలియకుండానే ఒక సృష్టి రహస్యాన్ని తరచూ ఉచ్ఛరిస్తూ ఉంటాం. ఇదో విశేషమే మరి!

★ ★ ★

# 3. భూమి మరియు సూర్యుడు, పాలపుంతల గురించి అవగాహన

ఋషీశ్వరులు మన భూమిని గురించీ, సూర్యుణ్ణి గురించీ అనేక విషయాలు తెలుసుకున్నారు.

అయితే మన ప్రాచీనులకు కనీసం 'భూమి ఆకారం' గురించి కూడా తెలియదని విదేశీయుల భ్రమ. ఆ భ్రమనే మనకు పాఠ్యాంశంగా వ్రాసిపెట్టి వెళ్ళారు వాళ్ళు. అదే నిజమని నమ్మిన మనవాళ్ళు ఆ పాఠాలకు తలలూపుతున్నారు.

బిగ్‌బ్యాంగ్ సూత్ర ప్రకారం విశ్వంలో అనేక నక్షత్ర సమూహాలు ఏర్పడ్డాయి. ఆ నక్షత్ర సమూహాలకు "గెలాక్సీలు" అని పేరు. గెలాక్సీలను మన పూర్వీకులు "నీహారికలు" అని పిలిచేవారని ఋగ్వేదం వల్ల తెలుస్తోంది. ఒక్కొక్క గెలాక్సీలో కోట్లకొలదీ నక్షత్రాలుంటాయి. వాటిలో ప్రతి నక్షత్రం చుట్టూ కొన్ని గ్రహాలు తిరుగుతూ ఉంటాయి. అంటే ఒక్కొక్క నక్షత్రానికీ ఒక్కొక్క గ్రహకుటుంబం ఉంటుందన్నమాట. మన సూర్యుడు కూడా ఒక నక్షత్రమే కదా! తన గ్రహకుటుంబంతో పాటూ సూర్యుడు ఒకానొక గెలాక్సీలో ఉన్నాడు. (సూర్యకుటుంబం లోనిదే మన భూమి అని మనకు తెలుసు) సూర్యకుటుంబం ఉన్న (మన) గెలాక్సీని "పాలపుంత" అనే పేరుతో పిలుచుకుంటున్నాం. ఈ పాలపుంత ఉత్తరదక్షిణ దిశలుగా పొడవునా వ్యాపించి ఉండి, ఆకాశంలో ముగ్గు చల్లినట్లుగా (రాత్రివేళల) కన్పిస్తూ ఉంటుంది. మన భూమి, పాలపుంతలోనే ఉన్నది కనుక భూమిపై ఎక్కడనుండి చూసినా పాలపుంత కన్పించగలదు. ఈ వివరణ వల్ల స్థూలంగా తెలుస్తున్నదేమంటే - పాలపుంతలో ఉన్న అనేక కోట్ల నక్షత్రాలలో సూర్యుడు కూడా ఒకడనీ, భూమితో సహా సూర్యుని చుట్టూ తిరుగుతున్న నవగ్రహాలూ కూడా ఆ పాలపుంత లోనివేననీ అర్థమౌతోంది. ఇదంతా మన ఆధునిక విజ్ఞానం.

పై విజ్ఞానాన్ని పురాణకాలంలోనే మనవాళ్ళు గ్రహించారు. అది అంతాలు కన్పించని 'పాలపుంత' ను వాళ్ళు గమనించడం జరిగింది.

## పాలపుంతనే ఆదిశేషుడని అన్నారు

ఆకాశంలో రెండు దిశలను కలుపుతూ పొడవుగా పామువలె ఉన్న ఆ పాలపుంతను "ఆదిశేషుడు" అనే వేలతలలు గల సర్పంగా పురాణాల్లో వర్ణించారు.

పాలపుంత నిండా ఉన్న నక్షత్రాలే "వేలతలలుగా" అభివర్ణించబడ్డాయి. సూర్యుడు పాలపుంతతో కలిసి ఉదయించినట్లుగా మనకు కన్పించే మొదటిరోజును ఉత్తర భారతీయులు "ఆదిశేషుని జయంతి" గా నేటికీ పండుగ జరుపుకుంటున్నారు. (సూర్యుడు నిజానికి పాలపుంతలోని వాడే అయినా కూడా ఆ యదార్థం మనకు అన్నివేళలా కన్పించదు.)

శ్రీ మహావిష్ణువు ప్రత్యక్ష స్వరూపం "సూర్యుడని" మన పురాణాలు చెప్తున్నాయి. సూర్యుడు పాలపుంతలో ఉన్నాడని గమనించిన ఋషులు ఈ కారణంగానే - "శ్రీ మహావిష్ణువు ఆదిశేషునిపై పవళించి ఉంటాడని" పురాణాల్లో వ్రాశారు. అలాగే మన భూమి కూడా పాలపుంత లోనిదేనని కనుగొని, భూగోళాన్ని ఎల్లవేళలా ఆదిశేషుడు తన వేయిపడగలపై మోస్తూ ఉంటాడని చమత్కరించారు.

చూశారా! మన ప్రాచీన ఋషీశ్వరులు - భూమి మరియు సూర్యుడు, పాలపుంతలను గురించి ఎంతటి అవగాహనను కలిగి ఉన్నారో!

★ ★ ★

## 4. విశ్వం అంటే విష్ణువే!

శ్రీమహావిష్ణువు లోనే ఈ విశ్వం అంతా ఇమిడి ఉంది. ఆయనే విశ్వం (UNIVERSE). విశ్వమే ఆయన! అందువల్లనే ఆయనను "విశ్వవ్యాపి" అన్నారు. విష్ణువు అసలు స్వరూపాన్ని "విశ్వరూపం" అన్నారందుకే! పరమాత్ముని స్వరూపాన్ని స్పష్టంగా 'ఇదీ' అనికూడా చెప్పలేం అంటారు. ఎందుకంటే విశ్వరూపం మొత్తాన్ని వర్ణించి చెప్పడం ఎవరి తరమూ కాదు. కురుక్షేత్రంలో గీతాబోధ సమయంలో శ్రీకృష్ణుడు చూపిన విశ్వరూపాన్ని చూసి అర్జునుడు భయంతో వణికిపోయాడు. లెక్కలేనన్ని గ్రహతారకాదులతో కూడి ఆది, మధ్య, అంతం లేకుండా ఉన్న ఆ ఆకారాన్ని చూసి అర్జునుడు భయపడిపోయాడు. అతనికి దిక్కులు తెలియలేదు. అర్జునుడు చేసిన విశ్వరూప వర్ణన, నేటి శాస్త్రజ్ఞులు ఇచ్చిన విశ్వరూప (UNIVERSE) వర్ణనకు అతి దగ్గరగా ఉంది. సైన్సు దృష్ట్యా చూసినా కూడా మొత్తం విశ్వం (UNIVERSE) అంతా మహావిష్ణువేనని తెలుస్తోంది. మరో రెండు నిదర్శనాలు కూడా ఇప్పుడు చూద్దాం.

విష్ణువును "నీలమేఘశ్యాముడు" అంటారు. పగటిపూట అనంత విశ్వం వైపు చూడండి. నీలిరంగు ఆకాశం కన్పిస్తుంది. (వాతావరణం ద్వారా మన భూమినుండి

ఆకాశాన్ని చూస్తే నీలిరంగులోనే కన్పిస్తుంది.) ఈ కారణంగానే విష్ణువును నీలమేఘశ్యాముడంటారు. మన భూవాతావరణాన్ని దాటివెళ్ళి అనంత విశ్వాన్ని (ఆకాశాన్ని) చూస్తే అంతా చీకటిగా ఉంటుంది. అంటే నలుపురంగులో కన్పిస్తుందన్నమాట. అందువల్లనే మహావిష్ణువు అసలు రంగు "నలుపు" అని మహాభారతంలో స్పష్టంగా చెప్పబడింది. ఎంత ఖచ్చితంగా నిరూపణ అవుతుందో చూడండి.

"బ్రహ్మదేవుని వయసు మహావిష్ణువుకు ఒక కనురెప్ప పాటుగా లెక్క అనీ, బ్రహ్మ వయసు ప్రభావం విష్ణువుపై రవ్వంత కూడా పడదు" అని చెప్తోంది భాగవతం. ఈ విషయంలో చాలా అంతరార్థం ఉంది. బ్రహ్మదేవుడు అనగా ప్రకృతి అని చెప్పుకున్నాం కదా! ప్రకృతి పుట్టినప్పటినుండీ అంతరించే వరకూ గల కాలం 'బ్రహ్మదేవుని వయసు' అవుతుంది. అనంతమైన ఈ బ్రహ్మాండ విశ్వంలో ఎక్కడెక్కడో ప్రకృతి పుట్టడం, అంతరించడం అంటే - అది పెద్దగా చెప్పుకోవలసిన విషయమేం కాదు. ఎందువల్లనంటే విశ్వంయొక్క కాలపరిమాణంలో, 'అక్కడక్కడా గ్రహాల్లో ప్రకృతి ఉండేకాలం' బహుతక్కువ. అందువల్లనే అనంతమైన విశ్వానికి (అనగా విష్ణువుకు) 'ప్రకృతికాలం అనబడే బ్రహ్మవయసు' కనురెప్పపాటుగా లెక్క అని చెప్పబడింది. విష్ణువు యొక్క అనంతమైన బ్రహ్మాండ తత్త్వం, ఇందులో గోచరమౌతుంది. ఇలా ఎన్నివిధాల చూసినా, విశ్వమే "శ్రీ మహావిష్ణువని" తెలియవస్తుంది.

★ ★ ★

## 5. ప్రకృతి, జీవరాశుల పుట్టుక గురించి

సూర్యకుటుంబంలో భూమిపై తప్పించి, మరో గ్రహంపై జీవరాశి, ప్రకృతీ లేవు. ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలు అనేక పరిశోధనలు చేసి, ఈ విషయాన్ని తేల్చి చెప్పారు.

జీవరాశి ఏర్పడ్డానికీ మూలకారణం 'ప్రకృతి' అని నేటి శాస్త్రవేత్తలు నిర్ధారణ చేశారు. ప్రకృతికి మూలం 'అనుకూల వాతావరణం గల గ్రహం' అని కూడా తెలుసుకున్నారు. ఒక గ్రహంపై తగిన వాతావరణం ఉన్నప్పుడే ప్రకృతి ఏర్పడుతుంది. గ్రహంపై అటువంటి వాతావరణం ఎలా వస్తుందని పరిశోధించగా, 'సౌరశక్తి' (సూర్యుని ఉష్ణం) వల్ల అది సాధ్యమౌతుందని తెలిసింది. సృష్టి మూలాన్ని ఆధునిక శాస్త్రవేత్తలు ఇలా చెప్పారు.

అయితే పైన తెలిపిన విషయమంతా మన హైందవ ఋషులు పురాణ కాలంలోనే కనుగొన్నారు. భూమిపై ప్రకృతి యొక్క పుట్టుకను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్న ఋషీశ్వరులు, తాము కనుగొన్న విజ్ఞానాంశాలను "బ్రహ్మదేవుని పుట్టుక" అనే సంఘటనగా గ్రంథస్థం చేశారు.

## బ్రహ్మదేవుని పుట్టుక

విష్ణువు నాభినుండి కమలం ఉద్భవించిందని, ఆ కమలం నుండి బ్రహ్మ పుట్టాడనీ భాగవతం చెప్తోంది. జీవరాశిని సృష్టించినవాడు బ్రహ్మ.

## బ్రహ్మ అంటే ప్రకృతే

ఆధునిక సైన్సు ప్రకారం జీవరాశికి మూలం "ప్రకృతి". ఆ ప్రకృతినే బ్రహ్మ దేవునిగా వ్యవహరించాయి పురాణాలు.

ప్రకృతి (బ్రహ్మ) పుట్టుకను గురించి వివరంగా తెలుసుకుందాం. భూమి ఏర్పడిన చాలాకాలం తర్వాత, ప్రకృతి పుట్టడానికి తగిన వాతావరణం ఏర్పడింది. మెల్లమెల్లగా అన్నివైపులకూ సమానంగా వికసిస్తూ వ్యాపించింది ఈ వాతావరణం. ఈ సందర్భంలో వాతావరణాన్ని, స్పష్టంగా అన్నివైపులా సమానంగా వికసించే "కమలంతో" పోల్చారు ఋషులు. పైగా భూగోళమంతా నీటితోనిండి ఉండగా వాతావరణం వ్యాపించడం జరిగింది. అందువల్లకూడా వాతావరణాన్ని, నీటినుండి ఉద్భవించే "కమలం"గా పోల్చడం జరిగింది.

భూమిపై ఏర్పడిన వాతావరణానికి కారణం సూర్యభగవానుడు. సూర్యుడు, విష్ణువు యొక్క ప్రత్యక్షరూపం. విష్ణువు నుండి కమలం ఉద్భవించడం అంటే - సూర్యునివల్ల భూమిపై వాతావరణం ఏర్పడడం అన్నమాట. అనుకూలమైన వాతావరణం నుండి ప్రకృతి ఉద్భవించింది. అనగా కమలం నుండి బ్రహ్మదేవుడు పుట్టాడని అర్థం. అనుకూల వాతావరణాన్ని "కమలం" గానూ, ప్రకృతిని "బ్రహ్మ" గానూ చెప్పాయి మన పురాణాలు.

బ్రహ్మదేవుడు పుట్టిన వెంటనే, నలుదిశలా చూశాడట. అంటే నలుదిశలా ప్రకృతి వ్యాపించిందన్నమాట. (ప్రకృతి నాలుగు వైపులా వ్యాపించి ఉంటుంది కనుక, బ్రహ్మదేవునికి నాలుగు ముఖాలని చెప్తారు.) బ్రహ్మ అన్నిదిశలా పరికించి చూడగా, అంతా శూన్యంగా, ప్రశాంతంగా ఉందట. ప్రకృతి పుట్టిందిగానీ, ఇంకా జీవరాశి ఏర్పడలేదని దానిభావం. నూటికి నూరుపాళ్ళు ఇదీ కరెక్టే! ప్రకృతి ఏర్పడిన చాలాకాలం వరకూ జీవరాశి ఏర్పడలేదని ఆధునిక సైన్సు కూడా చెప్తోంది కదా!

బ్రహ్మదేవుడు పుట్టిన తర్వాత "నేనెవర్ని? ఎలా పుట్టాను? నా కర్తవ్యం ఏమిటి?" అనుకుంటూ ఆలోచనలో పడ్డాడట. తన సందేహాలు తీరక, కమలం కాడ ద్వారా ప్రయాణిస్తూ ఆయన విష్ణుదేవుని నాభి స్థానానికి (బొడ్డు దగ్గరకు) చేరుకున్నాడట. అక్కడకు వెళ్ళి చూసినా కూడా ఆయనకు ఏమీ తెలిసిరాలేదు. విష్ణుమూర్తి ఆది అంతాలేవీ ఆయనకు కన్పించలేదు. ఈ సందర్భంలో విష్ణువు నాభిస్థానం అంటే ఏమిటో మీకు వివరించవలసి ఉంది. బిగ్‌బ్యాంగ్ సూత్రప్రకారం బ్రహ్మాండం ప్రేలగా ఎన్నో నక్షత్ర సమూహాలు ఏర్పడ్డాయి. ఈ నక్షత్ర సమూహాలను 'గెలాక్సీలు' అంటారని, మన సూర్యకుటుంబం ఉన్న గెలాక్సీని 'పాలపుంత' అని పిలుస్తారనీ ఇంతకుముందే తెలుసుకున్నాం. అనంతకోటి గెలాక్సీలు కలిసిన మొత్తం విశ్వమంతా "విష్ణుదేవుని విశ్వరూపం" అని చెప్పుకున్నాం. మన పాలపుంత (MILKY WAY) చుట్టూ ఇంకా అనేక గెలాక్సీలున్నాయి. విశ్వంలోని మొత్తం గెలాక్సీలకు దాదాపు మధ్యప్రాంతంలో మన గెలాక్సీ (అనగా పాలపుంత) ఉన్నట్లుగా మన మహర్షులు ఒక అవగాహనకొచ్చి ఉంటారు. మనిషికి మధ్యప్రాంతంగా 'నాభి' (బొడ్డు)ని చెప్తారు కదా! అదేవిధంగా అనంత విశ్వమైన "విష్ణువుకు" నాభిస్థానంగా "పాలపుంత ప్రాంతాన్ని" మహర్షులు భావించి ఉంటారు. అందువల్లనే పాలపుంతలోని భాగమైన భూగోళ స్థానాన్ని 'విశ్వానికి మధ్యప్రాంతంలో', అంటే 'విష్ణుదేవుని నాభిప్రాంతంగా' చెప్పారు వారు. (మొత్తం విశ్వానికి దాదాపు కేంద్రభాగంలో భూగోళం ఉన్నట్లుగా ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలు చెప్తున్నారనే వార్తను ఇటీవల పత్రికలు ప్రచురించాయి. 1995 జనవరి 9వ తేదీ, "ఈనాడు" అనే దినపత్రికలోని 'జ్ఞాన నేత్రం' శీర్షికలో కూడా ఈ వార్తను చూడవచ్చు. అమెరికాలోని స్టాన్‌ఫర్డ్ యూనివర్సిటీ నందలి ఖగోళ పరిశోధకులు (ఆంద్రీ లిండే, ఆర్థర్ మెజ్లుమియాన్ ప్రభృతులు) తమ 'గణాంక విశ్లేషణల ద్వారా' ఈ విషయాన్ని తెలుసుకున్నట్లు వార్త! ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలు ఇప్పుడిప్పుడు తెలుసుకుంటున్న ఈ విషయాన్ని, మన మహర్షులు పురాణకాలంలోనే గ్రహించగలిగారు. అదే మహర్షుల ఘనత.)

భూమిపై నిలబడి పరిశీలిస్తే, ఈ అనంతకోటి గెలాక్సీలతో ఉన్న 'విశ్వరూపం' యొక్క ఆది, అంతాలు మనకు తెలియవు. అంతా అగమ్యగోచరం గానే ఉంటుంది. విష్ణువు నాభిస్థానానికి చేరిన బ్రహ్మకు ఎదురైన పరిస్థితి ఇదే! అనంతమైన విశ్వరూపం ఆయనకు అర్థంకాలేదు. తిరిగి తన కమలంలోకి చేరుకున్నాడు. యోగనిష్ఠలోకి వెళ్ళిపోయి, వంద 'దివ్య' సంవత్సరాలు గడిపాడు. అప్పుడు ఆయనకు మహావిష్ణువు కనిపించి "తానే విశ్వానికి మూలమని, తనలోనే అంతా ఇమిడి ఉన్నదనీ చెప్పి, జీవసృష్టి చేయమంటూ" ఆదేశించాడు. విష్ణువు ఆదేశానుసారం జీవసృష్టి ప్రారంభించాడు బ్రహ్మ

సూర్యుని (అంటే విష్ణువు) నుండి 'వాతావరణం' (కమలం) ఏర్పడిందనీ, దానినుండి 'ప్రకృతి' (బ్రహ్మ) పుట్టడం జరిగిందనీ, ప్రకృతి (బ్రహ్మ) ద్వారా జీవరాశి ఉద్భవించిందనీ పై వివరణ యొక్క భావం.

బ్రహ్మదేవుడు తన మామూలు అన్వేషణలో విష్ణువును తెలుసుకోలేకపోయాడు. యోగనిష్ఠలో వంద దివ్యసంవత్సరాలు గడిపిన అనంతరం మాత్రమే విష్ణువు దర్శనం పొందగలిగాడు. ఇందులో చాలా అర్థం ఉంది, గమనించండి. అనంత విశ్వరూపుడైన విష్ణువును మామూలుగా కళ్ళతో చేసే అన్వేషణ వల్ల తెలుసుకోలేమనీ, యోగనిష్ఠ పొందిన నిశ్చలమనసుతో ఆయనను దర్శించుకోగలమనీ అర్థమౌతోంది.

బ్రహ్మదేవుని పుట్టుకకు సంబంధించిన ఈ కథలో ఎంతో సైన్సుపరిజ్ఞానమే కాక, అద్భుతమైన ఆధ్యాత్మిక తత్త్వం కూడా ఇమిడిఉంది.

నేటి ఆధునిక శాస్త్రవేత్తల కంటే ముందుగానే విశ్వసృష్టిని గురించీ, వాతావరణం గురించీ, ప్రకృతి గురించీ, పంచభూతాలను గురించీ, జీవరాశి పుట్టుకను గురించీ తెలుసుకున్న మన ఋషులు - మొత్తం ఈ విజ్ఞానాన్ని ఒక చమత్కార పురాణకథగా ఎలా మలిచారో చూడండి. అదే హైందవ ఋషీశ్వరుల ప్రత్యేకత.

## భూమిపై ప్రకృతి (బ్రహ్మ) కళ్ళు తెరచి ఎంతకాలం గడిచింది?

సైన్సు చెప్పే ప్రకృతినే పురాణాలు బ్రహ్మ అంటున్నాయని తెలుసుకున్నాం. భూమిపై బ్రహ్మ కళ్ళు తెరచి ఎంతకాలం గడిచిందో ఈసారి తెలుసుకుందాం.

ఆధునికుల లెక్కల ప్రకారం భూగోళం ఏర్పడి ఇప్పటికి 4 వందల కోట్ల సంవత్సరాలకు పైగా అయింది. భూమిపై ప్రకృతి లేకుండా సుమారు 2 వందల కోట్ల సంవత్సరాలు గడిచాయట. ఆ తర్వాత ప్రకృతి పుట్టడం జరిగింది. ప్రకృతి పుట్టడం అంటే, భూమిపై బ్రహ్మదేవుడు కళ్ళు తెరవడం అన్నమాట. అదే 'కల్పకం' ప్రారంభంగా లెక్క.

భూమిపై ప్రకృతి ఉద్భవించి ఇప్పటికి సుమారు 2 వందలకోట్ల సంవత్సరాలు గడిచినట్లు ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. మన పురాణాల ప్రకారం లెక్కించి చూడగా, భూమిపై బ్రహ్మదేవుడు కళ్ళు తెరచి (అనగా ప్రకృతి పుట్టి) సుమారు 2 వందల కోట్ల సంవత్సరాలే అయింది. ఈ సమన్వయం చాలా అద్భుతం. ఇంతవరకూ హైందవులు తప్ప, మరెవ్వరూ కూడా ఇంత ఖచ్చితమైన, స్పష్టమైన లెక్క చెప్పియుండలేదు.

భూమిపై బ్రహ్మదేవుడు కళ్ళుతెరచి (అనగా ప్రకృతి పుట్టడంతో కల్పకం మొదలై)

ఇప్పటికి ఎన్ని మానవ సంవత్సరాలు గడిచాయో, ఆ లెక్కను ఈక్రింద ఇస్తున్నాం చూడండి.

ప్రకృతి ఉద్భవించిన నాటినుండి యుగాల లెక్క మొదలవుతుంది. కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిపి "ఒక మహాయుగం" గా లెక్క. అటువంటి వెయ్యి మహాయుగాలు కలిపితే "ఒక కల్పకం" అవుతుంది. ప్రస్తుతం నడుస్తున్నది "శ్వేత వరాహ కల్పకం". కల్పక కాలాన్ని 14 మంది మనువుల పరిపాలనా కాలంగా చెప్తారు. (స్వయంభువ, స్వారోచిష, ఉత్తమ, తామసి, రైవత, చక్షుస, వైవస్వత, సూర్య, అగ్ని, బ్రహ్మ, రుద్ర, దక్ష, రౌచ, భౌచ్యులే ఆ 14 మంది మనువులూనూ! వీరు వ్యక్తులు కాదు, శక్తులు.) ఒక్కొక్క మనువు పరిపాలనాకాలం సుమారుగా 71 మహాయుగాలు. ఒక మనువు పరిపాలనా కాలాన్ని "మన్వంతరం" అంటారు. ఇప్పటికి 6 మన్వంతరాలు గడిచి, 7వ మన్వంతరమైన "వైవస్వత మన్వంతరం" జరుగుతోంది. ఈ మన్వంతరం లోని 71 మహాయుగాల్లో ఇప్పటికి 27 మహాయుగాలు గడిచిపోయి, 28వ మహాయుగంలోని 'కలియుగం' నడుస్తోంది.

పై విషయాలను బట్టి చిన్న లెక్క వేసి చూద్దాం.

| | | | |
|---|---|---|---|
| కృతయుగం | = | 17,28,000 | మానవ సంవత్సరాలు |
| త్రేతాయుగం | = | 12,96,000 | మానవ సంవత్సరాలు |
| ద్వాపరయుగం | = | 8,64,000 | మానవ సంవత్సరాలు |
| కలియుగం | = | 4,32,000 | మానవ సంవత్సరాలు |
| 1 మహాయుగం | = | 43,20,000 | మానవ సంవత్సరాలు |

ఒక్కొక్క మనువు పరిపాలనా కాలం 71 మహాయుగాలు కావున

43,20,000 X 71 మహాయుగాలు

= 30,67,20,000 మానవ సంవత్సరాలు

1 మనువు పరిపాలనాకాలం
(అనగా 1 మన్వంతర కాలం) 30,67,20,000 మానవ సంవత్సరాలు

ఇప్పటికి 6 మన్వంతరాలు ముగిశాయి కావున,

30,67,20,000 X 6 మన్వంతరాలు

= 184,03,20,000 మానవ సంవత్సరాలు

ఒక మనువుకాలం ముగిసిన అనంతరం 17,28,000 సంవత్సరాలపాటు 'సంధికాలం' గడుస్తుంది. (ఇది ఒక కృతయుగ కాలానికి సమానం) ఇప్పటికి 6 మనువుల కాలం, 7 సంధికాలాలూ గడిచి, 7వ మనువు కాలం నడుస్తోంది. దీని ప్రకారం....

| | | |
|---|---|---|
| 6 మన్వంతరాల కాలం | = | 184,03,20,000 సం॥ |
| 7 సంధికాలాలు (17,28,000 X 7) | = | 1,20,96,000 సం॥ |
| ప్రస్తుతపు 7వ మన్వంతరంలో గడచిపోయిన 27 మహాయుగాల కాలం (43,20,000 X 27) | = | 11,66,40,000 సం॥ |
| ఇప్పుడు జరుగుతున్న 28వ మహాయుగంలో..... | | |
| కృతయుగకాలం | = | 17,28,000 సం॥ |
| త్రేతాయుగకాలం | = | 12,96,000 సం॥ |
| ద్వాపరయుగకాలం | = | 8,64,000 సం॥ |
| 2000 నాటికి గడచిన కలియుగ సంవత్సరాలు | = | 5,102 సం॥ |
| భూమిపై ప్రకృతి (బ్రహ్మ) వయస్సు (2000 నాటికి) | = | 197,29,49,102 సం॥ |

(గమనిక: ప్రస్తుత కలియుగంలో క్రీ॥శ॥ 2000 నాటికి 5,102 సంవత్సరాలు గడచినట్లుగా చెప్పబడింది. అదెలా అంటే - క్రీ.పూ. 3102లో శ్రీకృష్ణుని నిర్యాణ అనంతరం ద్వాపరం అంతమై, కలియుగం మొదలయింది. అప్పటినుండి, క్రీ.శ.2000 వరకూ గల కలియుగ కాలం -- 5,102 సంవత్సరాలే కదా మరి!)

మన పురాణాలు చెప్తున్న విధంగా, పై లెక్క ప్రకారం - భూమిపై బ్రహ్మ (ప్రకృతి) వయసు 197 కోట్ల సంవత్సరాలకు మించి ఉందని తెలుస్తోంది. ఆధునిక శాస్త్రవేత్తలు మన భూమిపై ప్రకృతి వయసును - సుమారు 200 కోట్ల సంవత్సరాలుగా చెప్తున్నారు. చూశారా! పురాణాలు ఇచ్చిన కాలమానం, ఆధునికుల కాలమానంతో ఎలా ఏకీభవిస్తుందో! పురాణాల్లో యథార్థ విజ్ఞాన విషయాలున్నాయని చెప్పడానికి ఇదొక మంచి ఉదాహరణ.

## బ్రహ్మ నిద్రించుట, లేచుట

ఏదైనా గ్రహంలో ప్రకృతి ఆరంభం కావడాన్ని బ్రహ్మ నిద్రలేచుటగానూ, ప్రకృతి

అంతరించడాన్ని బ్రహ్మ నిద్రించడం గానూ పురాణాల్లో చెప్పబడింది. బ్రహ్మదేవునికి 1 కల్పకకాలం 'పగలుగానూ', మరో కల్పకకాలం 'రాత్రిగానూ' లెక్క అట! ఒక కల్పకం అనగా 432 కోట్ల మానవ సంవత్సరాలు. ప్రకృతి ఉద్భవించడంతో ప్రారంభమైన కల్పకం, మళ్ళీ ప్రకృతి పూర్తిగా అంతరించడంతో ముగుస్తుంది. సూర్యుని ఉష్ణోగ్రత సరిపడిన గ్రహంపై ప్రకృతీ, జీవరాశులు ఉద్భవిస్తాయి. కాలక్రమేణా సూర్యుని ఉష్ణోగ్రత తగ్గుతున్న కారణంగా కోట్ల సంవత్సరాల అనంతరం 'ప్రకృతీ, జీవరాశులు' ఆ గ్రహంపై అంతరిస్తాయి. ఒక గ్రహంపై ప్రకృతీ, జీవరాశులు పుట్టి నశించాకా, తిరిగి అదే గ్రహంపై అవి మళ్ళీ ఉద్భవించవు. ఇది శాస్త్రీయ సత్యం. అంటే ఒక గ్రహంపై ఒక కల్పకం మాత్రమే జరుగుతుంది. దాని తర్వాత కల్పకం, సూర్యుని ఉష్ణోగ్రత సరిపడిన మరో గ్రహానికి తరలి పోవలసిందే! ప్రకృతి ఒక గ్రహంపై అంతరించి మళ్ళీ మరోగ్రహంపై పుట్టడానికి మధ్యనున్న కాలాన్ని 1 కల్పకంగానూ, దాన్నే 'బ్రహ్మ యొక్క రాత్రిగానూ' చెప్పవచ్చు.

పురాణాలు చెప్తున్న కల్పకాల సిద్ధాంతం ఆధునిక శాస్త్ర విషయాలకు అనుకూలంగానే ఉంది.

## భూమి వయసు

ప్రస్తుతం మన భూమిపై 'శ్వేత వరాహ కల్పకం' నడుస్తోంది. దానికంటే ముందు కల్పకం 'కుజగ్రహంలో' జరిగి ఉండాలి. అమెరికా వారి అంతరిక్ష నౌకల పరిశోధనలు ఈ సిద్ధాంతాన్ని బలపరుస్తున్నాయి. భూమికంటే ముందుగా కుజునిలో ప్రకృతి, జీవరాశీ ఏర్పడీ క్రమంగా నశించి ఉండవచ్చునని ఆధునిక ఖగోళ పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. కుజునిపై 1 కల్పకకాలం పాటు ప్రకృతి విలసిల్లిన అనంతరం, బ్రహ్మగారు మెల్లగా నిద్రలోకి జారుకున్నారు. అంటే అక్కడ ప్రకృతి అంతరించిందన్నమాట. ఆ తర్వాత మరిన్ని కోట్ల సంవత్సరాలకు మన భూమిపై ప్రకృతి ఉద్భవించే వాతావరణం ఏర్పడింది. అంటే భూమిపై బ్రహ్మగారు, కళ్ళు తెరచి లేచారన్నమాట. కుజునిలో ప్రకృతి అంతరించినప్పటినుండీ, భూమిపై ప్రకృతి మొదలయ్యే వరకూగల కాలం "బ్రహ్మదేవుని (రాత్రి) నిద్రగా లెక్క". బ్రహ్మదేవుని రాత్రి కాలం 1 కల్పకం కదా! అంటే కుజుని మీదా, భూమిమీదా కలిపి 432 కోట్ల సంవత్సరాలపాటు బ్రహ్మదేవుడు నిద్రించాడన్నమాట. కుజునిపై సగకాలం, భూమిపై సగకాలం నిద్రించాడనుకుంటే ఇంచుమించుగా భూమిపై బ్రహ్మదేవుని నిద్ర 2 వందల కోట్ల సంవత్సరాలకు పైగా అని చెప్పవచ్చు. అంటే ప్రకృతి పుట్టని

క్రితం "భూమి వయసుగా" దాన్ని మనం తీసుకోవచ్చు. భూమిపై ప్రకృతి పుట్టి ఇప్పటికి సుమారు 2 వందల కోట్ల సంవత్సరాలు గడిచాయి. ఈ లెక్క ప్రకారం భూమి వయసు 4 వందల కోట్ల సంవత్సరాలకు పైగా ఉంటుందని తెలుస్తోంది. ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలు కూడా భూమి వయసును 4 వందల కోట్ల సంవత్సరాలకు పైగా అనే తేల్చారు. ఈ సమన్వయాన్ని గమనించండి.

## అనేకమంది బ్రహ్మలు

కోట్లకొలదీ నక్షత్రాలతో నిండి ఉంది విశ్వం. మన సూర్యకుటుంబం మాదిరిగానే ప్రతి నక్షత్రానికీ ఒక గ్రహకుటుంబం ఉండవచ్చు. వాటిలో ఏదొక గ్రహంపై ప్రకృతి, జీవరాశులుండవచ్చు. (ఆధునిక ఖగోళ పరిశోధకుల భావనలుకూడా ఈ విషయానికి అనుకూలంగానే ఉన్నాయి.) ప్రకృతిని 'బ్రహ్మ' అని చెప్పుకున్నాం కదా! అంటే విశ్వం మొత్తం మీద అనేకమంది బ్రహ్మలు ఉన్నట్లుగా మనం చెప్పుకోవచ్చు.

కూర్మపురాణంలో చెప్పబడిన ఒక కథ, పై విషయాన్ని నిరూపిస్తోంది. తానొక గొప్ప సృష్టికర్తనని, ఒకసారి బ్రహ్మదేవుడికి చాలా గర్వం కలిగిందట. ఆ సంగతి తెలిసిన శ్రీ మహావిష్ణువు బ్రహ్మను తనకూడా తీసుకువెళ్ళి, విశ్వంలో ఇంకా అనేకమంది బ్రహ్మలను చూపించాడట. దాంతో ఈ బ్రహ్మగారికి గర్వభంగం అయింది. చక్కటి సృష్టివిజ్ఞానాన్ని పొందుపరచుకున్న పురాణ కథ ఇది! విశ్వంలోని ఇతర నక్షత్ర కుటుంబాల్లో కూడా ప్రకృతీ, జీవరాశులు ఉన్నాయనే విషయాన్ని చెప్పేందుకు బ్రహ్మదేవుని గర్వభంగం కథను రచించారు మన ఋషీశ్వరులు.

★ ★ ★

# 6. పంచభూతాల పుట్టుక

"ఆకాశం, గాలి, అగ్ని, నీరు, భూమి" - ఈ ఐదింటినీ పంచభూతాలుగా మన పురాణాలు చెప్తున్నాయి. వీటి కలయికతోనే జీవుల్ని రూపొందిస్తోంది ప్రకృతి. మరణానంతరం తిరిగి జీవులు, ఆ పంచభూతాల్లోనే లీనమౌతూ ఉంటాయి. మళ్ళీ వాటినుండే పుడుతూ ఉంటాయి. జీవుల జనన మరణ చక్రం పంచభూతాల వల్లనే నడుస్తోంది.

ప్రకృతిని 'బ్రహ్మగా' ఆరాధించినట్లుగానే మనవాళ్ళు ప్రాచీనకాలంనుండీ పంచభూతాలనూ ఆరాధిస్తున్నారు. అనంతమైన ఆకాశాన్ని నీలమేఘశ్యాముడైన విష్ణువుగానూ, గాలిని వాయుదేవుని గానూ, అగ్నిని అగ్నిదేవుని గానూ, నీటిని

వరుణదేవునిగానూ, భూమిని భూదేవిగానూ పూజించే సాంప్రదాయాన్ని పాటిస్తూ వచ్చారు. (భూమిని శివునిగా భావించగల విజ్ఞానం, సాధారణ ప్రజానీకానికి లేదు. సామాన్యుల దృష్టిలో భూమి, భూదేవి గానే లెక్క.) మనకు జీవాన్నిచ్చే ప్రతి శక్తి యెడలా కృతజ్ఞత, భక్తి భావాలు హైందవులకున్నాయి.

"పంచభూతాల యొక్క ఆవిర్భావం గురించీ, గుణధర్మాలను గురించీ, విశిష్టత గురించీ, వాటి సమ్మేళనం గురించీ, వాటి అంశీభూతాలను గురించీ" - విదేశీ విజ్ఞానులకంటే మన ప్రాచీన ఋషీశ్వరులకు ఎక్కువగా తెలుసు.

ఈ పంచభూతాలు ఒకదాని నుండి ఒకటి వరుసగా ఎలా ఉద్భవించాయో, మన భాగవత గ్రంథం స్పష్టంగా చెప్తోంది. మొట్టమొదటగా "ఆకాశము" ఉన్నది. భగవంతుని దృష్టిపడగా ఆకాశము నుండి స్పర్శ గుణము గల "వాయువు" పుట్టింది. వాయువు ఆకాశముతో కలిసి రూపాంతరం పొంది, రూపము గల "తేజస్సు" (అగ్ని) పుట్టింది. అది లోకప్రకాశకమైనది. తేజస్సు, వాయువుతో కలిసి రూపాంతరం పొంది, రసగుణం కలిగిన "జలం" (నీరు) పుట్టింది. తేజస్సు, నీరు కలిసి "భూమి" పుట్టింది. పంచభూతాల పుట్టుక ఈ విధంగా కొనసాగినట్లుగా భాగవతం చెప్తోంది. ఆధునిక సైన్సు ఈ విషయాన్ని నూటికి నూరుపాళ్ళు సమర్థిస్తోంది. అదెలా అంటే చూడండి.

ముందుగా అనంతమైన ఆకాశం ఉంది. ఆ ఆకాశంలో భూమి ఒక వాయుగోళంగా (సూర్యుడు అనబడే పెద్ద వాయుగోళం నుండి) అవతరించింది. ఆకాశం నుండి "వాయువు" రావడం అంటే అదే! వాయుగోళమైన భూమి, తనలోని వాయువుల కారణంగా మంటలతో ప్రజ్వరిల్లింది. వాయువు నుండి "తేజస్సు" (అగ్ని) ఉద్భవించడం అంటే అదే! అగ్నితో ప్రజ్వరిల్లే భూమి మెల్లగా చల్లబడుతూ "నీటిగోళం" గా మారింది. ఆ విధంగా అగ్నినుండి నీరు ఏర్పడిందన్నమాట. నీటినుండి మెల్లగా భూమి ఏర్పడి, ఆ భూభాగం అక్కడక్కడా పైకి తేలి, ప్రస్తుతపు భూగోళస్థితిని పొందింది.

చూశారా! మన భాగవతం చెప్పినట్లుగా పంచభూతాలు ఒకదానినుండి మరొకటి పుట్టిన విధానం, సైన్సు ప్రకారం కూడా నిరూపితమైంది. ఈ విషయం మన భారతీయులకెంతో గర్వకారణం.

## నేల ప్రాంతం కంటే నీటి ప్రాంతం ఎక్కువ

పంచభూతాల్లో ఏది ఎన్నోవంతు ప్రకృతిలో ఆవరించి ఉన్నదో మన "భాగవతం" స్పష్టంగా చెప్తోంది. "కోటి యోజనముల 'భూమి', పదికోట్ల యోజనముల 'నీరు',

ఇరవైకోట్ల యోజనముల 'తేజస్సు' (అగ్ని), ముప్పై కోట్ల యోజనముల 'గాలి', నలభై కోట్ల యోజనముల 'ఆకాశము' కలదట". కాలగమనమున భూగోళంపై సముద్ర ప్రాంతాలు, నేలప్రాంతాలూ వివిధ రకాలుగా మారుతూ వస్తున్నాయి. ఖండాల ఆకారాలు కాలక్రమేణా రకరకాలుగా మారుతూండడం ఆధునిక శాస్త్రవేత్తలకు తెలుసు. ఏవి ఎలా మారినా "భూగోళం మొత్తం మీద నేలప్రాంతం కంటే నీటిప్రాంతం ఎక్కువ" అని నేటి శాస్త్రజ్ఞులు చెప్పారు. భాగవత గ్రంథం ఇచ్చిన పై లెక్క ప్రకారం ఆ విషయం కూడా నిరూపణ అవుతోంది చూడండి.

## పంచభూతాల గుణగణాలు

పంచభూతాల గుణాలు కూడా భాగవతంలో ఇవ్వబడ్డాయి.

| పంచభూతాలు | వాటి గుణాలు |
|---|---|
| భూమి | 1. శబ్దం; 2. స్పర్శ; 3. రూపం; 4. రసం; 5. గంధం |
| జలం | 1. శబ్దం; 2. స్పర్శ; 3. రూపం; 4. రసం. |
| అగ్ని | 1. శబ్దం; 2. స్పర్శ; 3. రూపం |
| వాయువు | 1. శబ్దం; 2. స్పర్శ |
| ఆకాశం | 1. శబ్దగుణం |

మన ప్రాచీన ఋషీశ్వరులకు పంచభూతాల గుణాలేకాదు, ఆయా గుణాల వల్ల వాటికి ఏర్పడిన శక్తులు కూడా తెలుసు. ఆ వివరాలను చర్చించుకుందాం. పైన తెలిపిన 5 గుణాలూ ఉండడంవల్ల భూమి 'భారంగా' ఉందట. ప్రవహించి వ్యాపించే శక్తి దానికిలేదు. భూమికి గల 'గంధము' (వాసన) అనే గుణం 'జలానికి' లేదు. అందువల్ల 5 గుణాల్లో ఒక గుణం తగ్గిపోవడంతో 'జలానికి' పైనుండి క్రిందకు ప్రవహించే శక్తి వచ్చింది. మూడవది "అగ్ని". దీనికి శబ్ద, స్పర్శ, రూప గుణాలే ఉన్నాయి. జలానికి గల 'రసము' (రుచి) అనే గుణం అగ్నికి లేదు. ఇలా ఒక గుణం తగ్గడంవల్ల పైకీ, క్రిందకూ పోగల శక్తి 'అగ్నికి' వచ్చింది. (ఒక్కొక్క గుణం తగ్గుతూంటే, ఒక్కొక్క రకం శక్తి కలుగుతూండడం గమనించండి.) నాలుగవది "వాయువు". దీనికి శబ్ద, స్పర్శ గుణాలే ఉన్నాయి. అగ్నికి గల 'రూపం' (ఆకారం) అనేగుణం, వాయువుకు లేదు. ఇలా ఒక గుణం తగ్గడంవల్ల వాయువు బాగా తేలికయింది. పైకీ, క్రిందకూ, ప్రక్కలకూ, ఇలా అన్నివైపులా అతి సులభంగా సంచరించగల శక్తి దానికి వచ్చింది. ఐదవది "ఆకాశం". దీనికి ఉన్నది 'శబ్దగుణం'

ఒక్కటే! వాయువుకు ఉన్న స్పర్శ గుణం దీనికి లేదు. ఇలా ఒక గుణం తగ్గడం వల్ల, వాయువు లేనిచోట కూడా అంతటా వ్యాపించి ఉండగల శక్తి "ఆకాశానికి" వచ్చింది. ఇలా పంచభూతాలకు ఒక్కొక్కదానికి ఒక్కొక్కగుణం తగ్గేకొలదీ, ఒక్కొక్క రకం శక్తి పెరుగుతూ వచ్చింది. ఈ సందర్భంలో మరో విచిత్రం చూడండి. భగవంతునకు, ఆకాశానికి ఉన్న 'శబ్దగుణం' కూడా లేదు. గుణాతీతుడు ఆయన. ఆ కారణంగానే ఆయన ఆకాశం లేనిచోట కూడా మొత్తం విశ్వమంతా ప్రతి అణువులోనూ వ్యాపించి 'సర్వాంతర్యామి' అయ్యాడు. పంచభూతాల యొక్క, భగవంతుని యొక్క శక్తులను గురించి మన పురాతన గ్రంథాల్లో ఇంత చక్కని పరిశీలనాత్మక వివరణ ఇవ్వబడింది. మన ఆధునిక సైన్సు ఈ విషయంలో చాలా వెనుకబడి ఉంది.

★ ★ ★

# 7. వేదాల్లో విజ్ఞానాంశాలు

'వేదము' అనగా "విజ్ఞానము" అని అర్థం. మహాఋషులు తాము కనుగొన్న విజ్ఞానాంశాలను కాలక్రమేణా గ్రంథస్థం చేస్తూ "వేదాలను" రూపొందించారు. వేదాలన్నీ ఏకకాలంలో వ్రాసినవి కావు. వేల సంవత్సరాల బృహత్తరమైన కృషితో తయారయ్యాయి. ప్రాచీనకాలంనుండి ఎందరో ఋషులు తాము కనుగొంటున్న విజ్ఞాన విషయాల్ని ఒకచోట ఏకీకృతం చేస్తూ రావడంతో వేదాలు రూపొందడం జరిగింది. వేదాలు, బ్రహ్మదేవుని ముఖాలనుండి ఉద్భవించినట్లుగా పురాణవచనం. ప్రకృతిని హిందువులు 'బ్రహ్మదేవుని'గా వ్యవహరిస్తారని ఇంతకుముందు తెలుసుకున్నాంకదా! ప్రకృతి యొక్క పరిశీలనద్వారానే వేదాలు ఉద్భవించాయి. కాబట్టి బ్రహ్మదేవుని ముఖాలనుండి వేదాలు ఉద్భవించినట్లుగా చెప్పబడింది.

వేదాలు నాలుగు.

1. ఋగ్వేదం, 2. యజుర్వేదం, 3. సామవేదం, 4. అధర్వణ వేదం.

వేదాలు నిర్దేశించిన మార్గాన్ని అనుసరించేవారిని "వేదమార్గీయులు" అనేవారని తెలుసుకున్నాం. వారే నేడు "హైందవులు" గా పిలవబడుతున్నారని కూడా మనకు తెలుసు.

వేదాల్లోని విజ్ఞాన విషయాల్ని చూసి పాశ్చాత్య పండితులు కూడా ఎంతో

ఆశ్చర్యపోయారు. ప్రపంచ పుస్తక భాండాగారంలో మొట్టమొదటి విజ్ఞానగ్రంథం 'ఋగ్వేదం' అని జర్మనీ పండితుడు 'మాక్స్‌ముల్లర్' కీర్తించాడు. అయితే మన దురదృష్టం కొలదీ కాలగమనంలో చాలా వేదభాగాలు మనకు దొరక్కుండా అంతరించిపోయాయి. కొంతభాగం విదేశాలకు తరలిపోయింది. ఇక అతికొద్ది భాగం మాత్రం ప్రస్తుతం మన దేశంలో ఉంది. జర్మనీ, రష్యా దేశాల్లో ఏనాటినుండో (ఇప్పటికీ) వేదవిజ్ఞానంపై పరిశోధనలు జరుగుతూనే ఉన్నాయి. (జర్మనీ దేశంలో సంస్కృత విశ్వవిద్యాలయం ఉంది. మీకు ఆ విషయం తెలుసా?)

ఇక మన సంగతి ఎలా ఉందంటే, వేదాల్ని కట్టలుగా కట్టి పూజిస్తున్నాం తప్ప, వాటిపై పరిశోధనకు పూనుకోవడం లేదు. ఇదీ నేటి మన దౌర్భాగ్యం! అయితే ఒక్కొక్కసారి మనమూ కళ్ళుతెరచి మీటింగులూ అవీ పెడుతూంటాం. వేదాల్లో విజ్ఞానం ఉందట. దాన్ని పరిశోధించి వెలికితీసి, సమాజ సౌభాగ్యానికి ఉపయోగించా లంటూ లెక్చర్లు ఇచ్చేస్తుంటాం. మీటింగ్ అయిపోగానే ఎవరి దారి వారిదే!

వేదవిజ్ఞానాన్ని చూసి ఆశ్చర్యపోయిన కొంతమంది విదేశీ చరిత్రకారులు అసూయకు లోనయ్యారు. హైందవులకు అంతటి ప్రాచీన విజ్ఞానం ఉండటం ఓర్వలేక, వేదకాలాన్ని వీలైనంత వరకూ ఆధునిక కాలంలోకి లాక్కొచ్చే ప్రయత్నాలు చేశారు. అయితే ఖగోళపరమైన సాక్ష్యాలతో తమ ప్రాచీనతను చాటుకుంటున్నాయి వేదాలు. మొత్తంమీద ఇప్పటివరకూ ఖచ్చితమైన 'వేదకాల నిర్ణయం' జరుగలేదు. వేదకాలాన్ని ఒక్కొక్క చరిత్రకారుడూ ఒక్కొక్కవిధంగా చెప్పారు. కొన్ని ఖగోళ ఆధారాల్ని బట్టి వేదకాలం క్రీ.పూ. 8 వేల సంవత్సరాలని శ్రీ బాలగంగాధర తిలక్ చెప్పారు.

వేదాలు విజ్ఞాన మయమని ఒకప్రక్క చెప్పబడుతూ ఉండగా, మరోప్రక్క వేదాల్లో ఏ విజ్ఞానమూ లేదని వాదించే మూర్ఖులూ ఉన్నారు. ఏ వేదంలో, ఏ విజ్ఞానం, ఎలా దాగిఉందో తెలియకపోవడం వల్ల ఇలాంటి పరిస్థితి ఏర్పడింది.

మానవుడు చంద్రమండలంపై అడుగుపెట్టడాన్ని నేటి సైన్సు ప్రగతికి పరాకాష్ఠగా చెప్పుకుంటూ ఉంటాం. అంటే ఖగోళ పరిజ్ఞానాన్ని "మిన్నయైన సైన్సు" గా గుర్తిస్తున్నామన్నమాట. మరి ఇంచుమించుగా ఋగ్వేదంలో ఉన్నది ఖగోళ విజ్ఞానమే!

## ఋగ్వేదంలో విజ్ఞానం

ఋగ్వేదంలో మూడువంతులు ఖగోళ విజ్ఞానమే ఉంది. ఈ విషయం మనలో చాలామందికి తెలీదు. మనకు తెలిసినవి కేవలం విదేశీయులు వ్రాసిపెట్టిన కల్లబొల్లి పాఠ్యాంశాలే!

నక్షత్ర సమూహాలైన గెలాక్సీల గురించీ, రాశిచక్రాన్ని గురించీ, విషువత్తుల గురించీ, ధ్రువతారా మార్పులను గురించీ, సౌరశక్తిని గురించీ, గ్రహాల గురించీ, భూమి వర్ణన - దాని చలనాలను గురించీ, ఉత్తరధ్రువం గురించీ, ఋతువుల గురించీ ...... ఇలా ఎన్నో అంతరిక్ష, భూగోళ విజ్ఞానాంశాలు నిండిన గ్రంథమే "ఋగ్వేదం".

విదేశీయులకంటే ముందే మన ప్రాచీనులకు గ్రహణాల సంగతి తెలుసు. "తురీయ బ్రహ్మ" అనే దూరదర్శినితో మొట్టమొదటగా సంపూర్ణ సూర్యగ్రహణాన్ని చూసిన ప్రాచీన హైందవ ఋషి "అత్రి". అత్రి మహర్షి వ్రాసిన గ్రహణ రహస్యాలెన్నో ఋగ్వేదంలోని 10వ మండలంలో కన్పిస్తున్నాయి. (అయితే గ్రహణాల గురించి మనకు మూఢనమ్మకాలు, ఆచారాలు ఉన్నాయి కదా! వాటి సంగతేమిటని మీరు అడగవచ్చు. వాటికి సమాధానం "హైందవ ఆచారాలు - అంతరార్థాలు" అనే మా రాబోయే ప్రచురణలో చూడవచ్చు.)

నక్షత్ర సమూహాలకు (అనగా గెలాక్సీలకు) "నీహారికలు" అని నామకరణం చేశారు ఋగ్వేద ఋషులు. 'నీహారిక' అనే పేరు (NAME), ఈ ఆధునిక కాలంలో, 'ఫ్యాషనబుల్ నేమ్' గా చలామణీ అవుతోంది. ఋగ్వేద కాలం నాటి ఆ 'పేరు'ను, ఈనాటి నవలా రచయిత(త్రు)లు తమ నవలా హీరోయిన్లకు పెట్టుకుంటున్నారు. 'క్రొత్తక్రొత్త ఫ్యాషన్లన్నీ, పాతవేనండీ' అంటారు అందుకే మరి!

ఋగ్వేదానికి ఉపవేదం "ఆయుర్వేదం". ఈ ఆయుర్వేద సంహితలో రోగాలు, ఔషధ విజ్ఞానం, రసాయన శాస్త్రం, శరీర విజ్ఞానం, వైద్యం (శరీర వైద్యం, శల్య వైద్యం) మొదలైన అంశాలున్నాయి.

## యజుర్వేదంలోని విజ్ఞానం

రెండవ వేదమైన యజుర్వేదంలో యజ్ఞవిధులు, ప్రయోగాలు, వాణిజ్య-వ్యవసాయ వివరాలు, జ్యోతిష, వాస్తు శాస్త్రాలు, దైవారాధనలు మొదలైన విషయాలున్నాయి. (జ్యోతిష శాస్త్రం అనేది ఖగోళ, గణిత శాస్త్రాలతో ముడివేసుకున్న విజ్ఞానం.)

యజుర్వేదానికి ఉపవేదం "ధనుర్వేదం". పురాణాల్లో వివరించబడిన అస్త్ర, శస్త్రాల విషయాలు ఇందులో ఉంటాయి. అయితే ఈ ధనుర్వేదం మనకు లభ్యం కావడంలేదు. నిజంగా ఇది మన దురదృష్టమే!

## సామవేదం లోని విజ్ఞానం

ఇందులో గానవిధులు, వాయిద్యాల వివరం, నృత్య సంగీత శాస్త్రాలు ఉన్నాయి. ఈ వేదంలో 'కళలకు' ప్రముఖస్థానం ఇవ్వబడింది. దీనికి ఉపవేదం 'గాంధర్వ వేదం'. ఋగ్వేద ఋక్కుల్ని రాగయుక్తంగా పాడడం ఇందులో చెప్పబడింది.

## అధర్వణ వేద విజ్ఞానం

దీనిలో వైద్య శాస్త్రం (వివిధ రోగాల లక్షణాలు, వాటి నివారణలు, సూక్ష్మజీవుల వివరం, శస్త్ర, శల్య చికిత్సలు), సామాజిక శాస్త్రం (సామాజిక జీవనం, పరస్పర ప్రేమలు, గృహాలు, భూములు, గోసంపద, దేశ శాంతి, రక్షణ, దేశభక్తి, స్త్రీలహక్కులు - విధులు), మంత్రశాస్త్రం (మంత్రతంత్రాలు, వశీకరణ, ఇంద్రజాలం, యంత్రాలు, అస్త్రాలు, వైజ్ఞానిక పరికరాలు, మారణాయుధాలు, మారణహోమాలు) మొదలగునవి ఉన్నాయి.

## వేదాల్లో ఇంకేమి ఉన్నాయి?

వేదాల్లో పైన తెలిపిన శాస్త్రాలే కాక వృక్ష శాస్త్రం, జంతుశాస్త్రం, గణిత శాస్త్రం, రేఖాగణిత శాస్త్రం, తత్త్వశాస్త్రం, తర్క శాస్త్రం మొదలయినవి ఉన్నాయి. వేదాల్లో అంతరిక్షయానం గురించీ, విమానయానం గురించీ కూడా ఉంది. వృక్షజాతుల, జంతువుల, పక్షుల, కీటకాల, సూక్ష్మజీవుల వివరాలన్నీ కూడా వేదఋషులకు తెలుసు. వృక్షాలకు ప్రాణం ఉంటుందనీ, వాటికీ అనుభూతులుంటాయనీ, వన్య సంరక్షణ మన కర్తవ్యమనీ ఋగ్వేద ఋషులకు బాగా తెలుసు.

వేదాల్లో ఇంకా ..... కాలమానం గురించీ, వర్షాలు కురిసే విధానం గురించీ, కృత్రిమ వర్షాలను గురించీ, అగ్ని గురించీ, కరెంటు గురించీ, సూర్యరశ్మితో వైద్యం గురించీ, ఋతువులను గురించీ, గ్రహచారాన్ని గురించీ, కృత్రిమ అవయవ నిర్మాణాల గురించీ .... ఇంకా అనేక విషయాలున్నాయి. సామవేదంలోని విశ్వరూప వర్ణన, యజుర్వేదం లోని విరాట్పురుష వర్ణన - మన సృష్టి అవగాహనకు నిదర్శనాలు. వేదకాలంలోని మేధావులు ఎవరికి నచ్చిన శాస్త్రాల్లో వారు పరిశోధనలు చేసేవారట. వినోదం కోసం ఆ రోజుల్లో గుర్రాల, రథాల పందాలు కూడా ఉండేవట.

## వేదాల్లో ఉన్నది సైన్స్ ఒక్కటే కాదు

వేదాల్లో కేవలం విజ్ఞాన శాస్త్రాలే కాదు. సత్యం, ధర్మం, నీతి, న్యాయం,

సమానత్వం, దయ, కరుణ, మానవత్వం, ఆధ్యాత్మికత .... ఇటువంటి ఉత్తమ ధర్మాలన్నీ కనిపిస్తాయి. వేదకాలంలో మతం అనేది లేదు. (సృష్టితో ఏర్పడిన హైందవ ధర్మం తప్ప, ఆ కాలానికి ఇంకా ఏ మతమూ పుట్టుకురాలేదు)

వేదాల్ని అందరూ అభ్యసించకూడదనే చెడు సాంప్రదాయం మధ్యంతరంగా వచ్చింది. వేదాల అధ్యయనానికి అందరూ అర్హులే! ఈ విషయం స్వయంగా వేదమే చెప్తోంది - "జ్ఞానాన్ని సంపాదించడానికి ప్రతీవారికీ అర్హత ఉంది. కళ్యాణప్రదమైన వాక్కులను అందరికీ చెప్తున్నానని" వేదమే అంటోంది. (శు.సం.26:2); కాబట్టి వీరూ వారూ అనే తేడాలు లేకుండా వేదవిజ్ఞానాన్ని సంపాదించడానికి ప్రతీవారికీ అర్హత ఉంది. వేదకాలంలో అంటరానితనం, వెట్టి చాకిరీలు లేవు. కులవ్యవస్థ లేదు. గుణ, కర్మలను బట్టి ఆరోగ్యవంతమైన రీతిలో 'వర్ణ వ్యవస్థ' ఉండేది. మనిషిలోని స్వార్థం మితిమీరేవరకూ ఆ వ్యవస్థ బాగానే పనిచేసింది. వేదకాలపు యజ్ఞయాగాదుల్లో శూద్రులు కూడా పాల్గొన్న సన్నివేశాలున్నాయి.

సమస్త సాహిత్యానికీ, ధర్మానికీ, సంస్కృతికీ వేదాలు మూలాధారం. అరబ్బులు, జర్మనులు, ఆంగ్లేయులు మొదలగు అనేక విదేశీ జాతీయులు మన వేదాల్ని తమతమ భాషల్లోకి అనువదించుకున్నారు. ఇతర దేశాల్లో సాంస్కృతిక చైతన్యం మొగ్గ తొడగడానికంటే ఎంతో కాలం పూర్వమే మన హైందవులు సాంస్కృతికంగా మహోన్నత ప్రమాణాలను అందుకున్నారు. ప్రాచీన హైందవులకు ఈ ఘనమైన స్థితి, కేవలం సైన్సు వల్లనే రాలేదు. వారి జీవన విధానం "లక్ష్యశుద్ధి" కలిగింది కావడంవల్ల, ధర్మానికి విరుద్ధం కాని అర్థ, కామాలను సేవించడం వల్ల, వేదాల్ని ప్రమాణాలుగా తీసుకుని నడుచుకోవడం వల్లా - వారికి ఆ స్థితి లభ్యమయింది. (వేద విజ్ఞానం గురించి ఇంకా వివరాలు, మా తర్వాత ప్రచురణ "వేదాలు - విజ్ఞానం" అనే పుస్తకంలో చూడవచ్చు.)

★ ★ ★

# 8. భగవంతునిగా, సైంటిస్ట్‌గా, వేదాంతిగా, డాక్టర్‌గా "శ్రీకృష్ణుడు"

## శ్రీకృష్ణుడు చెప్పిన సైన్స్ విషయాల్లో కొన్ని:

దేవుడు లేడని సైన్సు చెప్తున్నట్లుగా భావిస్తారు కొంతమంది. అది చాలా

పొరబాటు. విశ్వం (UNIVERSE) "శక్తిమయమని" విజ్ఞానశాస్త్రం చెప్తోంది. విశ్వం "దైవశక్తిమయమని" పురాణం అంటోంది. రెండూ ఒకటే! కాకపోతే విజ్ఞాన శాస్త్రం చెప్పున్న శక్తి (POWER) ని, "దైవశక్తి" (POWER OF GOD) అని వ్యవహరిస్తోంది పురాణం. విశ్వం అనే భగవంతుణ్ణి అధ్యయనం చేసేదే సైన్సు. మరోవిధంగా చెప్పాలంటే సైన్సు అనేది భగవంతునిలో ఒక అంశం మాత్రమే! విశ్వంలోని అనంతమైన శక్తిని, సైన్సు అధ్యయనం చేస్తుంది. ఆ అనంతశక్తి 'భగవంతుడే' కదా! అటువంటప్పుడు భగవంతునికి తెలియని సైన్సు ఏముంది? అనంత విశ్వరూపుడైన మహావిష్ణువు అవతారమే 'శ్రీకృష్ణుడు'. సకల విశ్వమూ ఆయనలోనే ఉంది. ఆ కృష్ణ పరమాత్ముని ద్వారా వెలువడిన కొన్ని విజ్ఞాన (సైన్స్) సత్యాల్ని తెలుసుకుందాం.

శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీత కేవలం ఆధ్యాత్మికపరమైనదే కాదు. అది సకల విశ్వానికీ, ప్రకృతికీ, సృష్టికీ, జీవరాశికీ, జీవితాలకూ సంబంధించిన విజ్ఞాన సంపుటి. విశ్వం (UNIVERSE) మొత్తం అంతా 'విష్ణువు' అనే సైన్సు పాయింటు మనకు భగవద్గీత వల్ల స్పష్టమౌతోంది. భగవద్గీతలో ఎన్నో సైన్సు విషయాలు నిక్షిప్తమై ఉన్నాయి. పరిశోధించి తెలుసుకోగల ఓపిక మనకుండాలి.

విశ్వంలోని సమస్త శక్తులకూ తానే మూలమని కృష్ణపరమాత్మ భగవద్గీతలో చెప్పడం జరిగింది.

## I. సకల విశ్వమూ తానే

శ్రీకృష్ణపరమాత్మ తన నిజ (విశ్వ) రూపాన్ని కురుక్షేత్ర యుద్ధానికి ముందు అర్జునుడికి చూపించారు. ప్రకృతితో సహా సకల విశ్వం తనలోనే ఉందని నిరూపించుకున్నారు. అర్జునుడు చేసిన 'విశ్వరూప వర్ణన', నేటి మన 'విశ్వం' (UNIVERSE) ఉన్న స్థితిని పోలి ఉంది. "సకల దేవతలు, సకల ప్రాణులూ, సకల లోకాలూ, మొత్తం బ్రహ్మాండ స్వరూపమంతా విశ్వరూపమందు కన్పిస్తున్నదనీ, ఆ విశ్వరూపానికి ఆది మధ్యాంతాలు లేవని, చూడశక్యం కానటువంటి శక్తిమయమైన కాంతితో ఉన్న విశ్వరూపాన్ని చూస్తూవుంటే తనకు దిక్కులు తెలిసిరావడం లేదనీ, అంతటా ఆ స్వరూపమే వ్యాపించి ఉన్నదనీ" అర్జునుడు వర్ణించాడు. భయంకర ప్రళయాగ్నిని విరజిమ్ముతున్న నక్షత్రాలను, విశ్వరూపానికి అనేక ముఖాలుగా వర్ణించాడు అర్జునుడు. గెలాక్సీలతో నిండిన మన అనంత విశ్వానికి, అర్జునుని వర్ణన చక్కగా సరిపోతుంది. ఇదీకాకుండా స్వయంగా శ్రీకృష్ణపరమాత్మ ఇలా చెప్పారు. "నాకంటే మించినది మరేమియూ లేదు. సూత్రమున మణులు గ్రుచ్చబడినట్లు ఈ

జగమంతా నాయందు నిక్షిప్తమై యున్నది." ఈ మాటల ద్వారా అనంత విశ్వమంతా ఆయనలోనే ఇమిడియున్నదని, ఆయనది విశ్వరూపమని ఖచ్చితంగా తెలుస్తోంది.

## 2. బిగ్‌బ్యాంగ్ మరియు విశ్వముకుళిత సూత్రాలు

కల్పకం అంతమందు ప్రళయకాలంలో సకలప్రాణులూ తనయందు లీన మౌతాయనీ, మళ్ళీ కల్పక ఆరంభంలో అన్నీ తననుండి పుట్టుకొస్తాయనీ భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పారు. మనం మొదటి పేజీల్లో తెలుసుకున్న బిగ్‌బ్యాంగ్, విశ్వముకుళిత సూత్రాలకు ఈ మాటలు సరిగ్గా సరిపోతున్నాయి, చూడండి.

## 3. అణువుల్లో, పరమాణువుల్లో శక్తి

అణువులనూ, పరమాణువులనూ విచ్ఛిన్నం చేసి చూసిన ఆధునిక శాస్త్రవేత్తలు వాటిలో అనంతమైన శక్తి దాగిఉన్నదని తెలుసుకున్నారు.

అనంతమైన తన శక్తి, విశ్వంలోని ప్రతి అణువునా దాగి ఉన్నదని కృష్ణపరమాత్మ ఏనాడో (భగవద్గీతలో) చెప్పారు. అనూహ్యమైన రూపంగల తాను అణువుకన్నా అణువునని చెప్పడం జరిగింది. అణువులోనూ, పరమాణువులోనూ శక్తి దాగిఉన్న విషయాన్ని ఆధునిక శాస్త్రవేత్తలకంటే వేలసంవత్సరాల ముందుగా శ్రీకృష్ణుల వారు చెప్పారు. ఆయన్ని 'ప్రాచీన హైందవ సైంటిస్ట్' గా అభివర్ణించవచ్చు.

## 4. శక్తి నిత్యత్వ సిద్ధాంతం

శక్తి అనేది రూపాంతరం చెందవచ్చు. అంటే తన రూపాన్ని మరోవిధంగా మార్చుకోవచ్చు. అయితే సృష్టిలోని మొత్తం శక్తి మాత్రం ఎల్లప్పుడూ స్థిరమే! అది పెరగదు, తరగదు. దాన్నే 'శక్తి నిత్యత్వ సిద్ధాంతం' అంటారు. ఈ సిద్ధాంతం భగవద్గీతలో మనకు గోచరిస్తుంది. రూపాల్లోనూ, జన్మల్లోనూ ఎన్ని మార్పులు వచ్చినా సరే, విశ్వంలో అన్నింటా ఉన్న శక్తి మొత్తం "ఒకే పదార్థం". అది సుస్థిరమైనది. దీనికి ఉదాహరణగా జీవుల విషయమే తీసుకుందాం. ఒక జన్మ మరో జన్మగానూ, మరోజన్మ ఇంకో జన్మగానూ రూపాంతరం పొందవచ్చు. అయితే మొత్తంమీద జీవాత్మల శక్తి మాత్రం స్థిరం. విశ్వంలోని 'మొత్తం శక్తి' ఏవిధంగా ఎన్ని రూపాలు మారినా కూడా ఆ శక్తి తరగదు, పెరగదు. ఎల్లప్పుడూ సమతుల్యంగా ఉంటుంది.

## 5. అన్నింటికీ తానే మూలం

అన్నీ తననుండే పుట్టి, తిరిగి తనలోనే లీనమౌతున్నాయని శ్రీకృష్ణపరమాత్మ

చెప్పారు. "కశ్యపాది మహర్షి సప్తకం, సనక సనందనాదులు, స్వయంభూవాది మనువులు తనవల్లనే జన్మించినారని, పిమ్మట వారివల్ల భూమి యందలి సమస్త భూతాలూ జన్మించుట జరిగిందనీ; ఎల్లచరాచర సమూహాలకూ ప్రకృతి తల్లివంటిదనీ, తాను తండ్రివంటి వాడిననీ; తాను అతి బలిష్ఠమైన కాలస్వరూపుడననీ; జీవుల ఉత్పత్తి, పెంపు, నాశనములకు తానే కారకుడననీ" కృష్ణపరమాత్మ చెప్పారు. భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారం అని 8 విధములుగా తన మాయాశక్తి అంతటా వ్యాపించి ఉన్నదని ఆయన చెప్పడం జరిగింది. (పంచభూతాలకు మూలం ఆయనేనని ఇందుమూలంగా కూడా తెలుస్తోంది.) విశ్వం అంటే విష్ణువేనని ఇంతకు ముందే (4వ వ్యాసంలో) శాస్త్రీయపరంగా తెలుసుకున్నాం కదా! విశ్వమంతా ఆయనలోనే (లీనమై) ఉంది. విశ్వంలో ఏం జరిగినా, అది ఆయనకు చెందినదే! ఈ అవగాహన పై అంశాలకు ఆలంబనగా నిలుస్తుంది.

## 6. అన్ని జీవుల ప్రాణశక్తి ఒకటే!

సృష్టిలో అనంతంగా వ్యాపించియున్న శక్తి యొక్క అంశయే అన్ని జీవుల్లోనూ ఉంది. అదే ప్రాణశక్తి! అన్ని జీవుల్లోని ప్రాణశక్తి ఒకలాంటిదే! అందులో హెచ్చుతగ్గులు లేవు. "సకల భూతాల యందునూ సమదృష్టి కలిగినవాడు - అన్ని భూతాలనూ తనయందునూ, తనను అన్ని భూతాలయందునూ చూడగలుగుతాడని; జ్ఞానులైన వాళ్ళు పండితులనూ, శునకములనూ, శునకమాంసము తినువారినీ ఒకేవిధంగా సమదృష్టితో చూడగలుగుతారనీ; సమస్త భూతముల యందున్న పరమాత్మ స్వరూపం తానేననీ" భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పారు. అన్ని జీవుల్లోని ప్రాణశక్తి ఒకలాంటిదేనని గ్రహించిన జ్ఞాని, సర్వజీవులనూ సమానత్వ భావనతో చూస్తాడని దాని భావం.

పై మాటల ద్వారా సర్వజీవ సమానత్వాన్నీ, ఏకశక్తి భావననూ చూపిస్తున్నారు కృష్ణపరమాత్మ.

## 7. ఆత్మ సిద్ధాంతం

శ్రీకృష్ణపరమాత్మ తన భగవద్గీతలో ఆత్మకు సంబంధించిన సిద్ధాంతాన్ని చెప్పారు. ఆత్మ రెండు విధాలు. 1. జీవాత్మ. 2. పరమాత్మ. విశ్వవ్యాపకమైన తన శక్తిని 'పరమాత్మ' గానూ, జీవులలో ఉండే తన అంశను 'జీవాత్మ' గానూ ఆయన చెప్పారు. ఆధునిక సైన్స్ ప్రకారం విశ్వాన్ని ఆవరించి ఉన్న శక్తే, కృష్ణపరమాత్మ చెప్పిన "పరమాత్మ శక్తి". సైన్స్‌ప్రకారం జీవుల్లోని ప్రాణశక్తే, ఆయన చెప్పిన 'జీవాత్మ'. జీవులలో ప్రాణశక్తిగా

ఉండే జీవాత్మలు మళ్ళీ కొంతకాలానికి పరమాత్మలో లీనం కావలసిందే! మళ్ళీ పరమాత్మ నుండి దాని అంశలైన జీవాత్మల ద్వారా జీవులు ఉద్భవిస్తూ ఉంటాయి. జనన మరణ చక్రానికి ఇదే మూలసూత్రం. ఈ సూత్రాన్ని కృష్ణపరమాత్మ స్పష్టంగా చెప్పారు. (జనన మరణాల గురించి ఆధునిక సైన్సు ఇప్పటికీ ఏమీ తెలుసుకోలేక పోయింది.) జీవుల ఆత్మలను గురించి శ్రీకృష్ణులవారు ఇంకా చెప్పారు. "ఆత్మ నాశనం లేనిది; ఆత్మను శస్త్రం ఛేదించజాలదు; అగ్ని దహింపజాలదు; నీరు తడుపజాలదు; వాయువు ఆర్పివేయజాలదు. జీర్ణమైన శరీరాన్ని వదలిన ఆత్మ క్రొత్త శరీరాన్ని ధరిస్తూ ఉంటుంది. జీవులకు దేహమునందు బాల్యమూ, యవ్వనమూ, ముసలితనమూ ఎట్లో - ఆత్మ మరొక దేహమును పొందుట కూడా అట్లే! పుట్టిన జీవికి మరణం తప్పదు. మరణించిన జీవికి జన్మం తప్పదు."

ప్రతి జీవియొక్క ఆత్మాకూడా చివరకు పరమాత్మలో చేరవలసిందే! "సర్వజీవు లందలి ఆయువూ నేనే! జ్ఞానసంపన్నమైన జీవి అనేక జన్మములెత్తిన పిమ్మట, విజ్ఞానియై చివరకు నన్ను చేరుచున్నది" అని స్పష్టంగా చెప్పారాయన.

## 8. పునర్జన్మ సిద్ధాంతం

జీవాత్మ అనేది తిరిగి పరమాత్మలో కలిసే వరకూ వివిధ జన్మల్ని పొందడం జరుగుతుందని, జీవులకు గల శ్రద్ధ - పూర్వజన్మ వాసనాబలం వల్ల లభ్యమౌతుందనీ కృష్ణపరమాత్మ చెప్పారు. పైన తెలిపిన ఆత్మ సిద్ధాంతంలోని అంశాలు పునర్జన్మను స్పష్టంగా బలపరుస్తున్నాయి. నేడు ప్రపంచం మొత్తం మీద అన్ని దేశాలలోనూ పునర్జన్మలకు సంబంధించిన వివిధ కేసులు వెలుగులోకి వచ్చాయి, వస్తున్నాయి. ఆధునిక పరిశోధకులు వీటిపై పరిశోధనలు కూడా సాగించి, పునర్జన్మలు ఉన్నాయనే తేల్చి చెప్తున్నారు.

## 9. కర్మ సిద్ధాంతం

'కర్మ' అనగా "పని" లేదా "కార్యం" అని అర్థం. కార్యము అంటే "ధర్మబద్ధమైన కార్యము" అని భావం. (ధర్మబద్ధం కాని కార్యాన్ని 'అకార్యం' అంటారు.) 'ధర్మబద్ధమైన కర్మ చేయడం జీవికి తప్పనిసరి' అని భగవద్గీతలో చెప్పబడింది. కర్మచేయడం వరకే జీవికి అధికారం ఉంది గానీ, ఆ కర్మ ఫలితంపై దానికి ఎట్టి అధికారమూ లేదు. ఫలితం ఆశించని ధర్మబద్ధమైన కర్మల్ని ఆచరించడం వల్ల మనిషి 'మహాత్ముడౌతాడు'. సులభంగా 'పరమాత్మ'లో చేరిపోగల అంశగా మారగలుగుతాడు. కృష్ణపరమాత్మ చెప్పిన ఈ నిష్కామకర్మ మనిషికి విపరీతమైన మానసిక ఆనందాన్ని

కల్గిస్తుంది. ఫలాపేక్షలేని కర్మకు పాపం అంటదనీ, సన్యాసాన్ని స్వీకరించడం కంటే 'కర్మలను ఆచరించడమే' మంచిదనీ ఆయన చెప్పారు. "అన్నంవలన జీవులు ఉద్భవిస్తున్నాయి. వర్షం వలన అన్నం సమకూరుతుంది. యజ్ఞంవలన వర్షం కలుగుతుంది. ఆ యజ్ఞం, కర్మవలననే సంభవమౌతుంది. అందువల్ల కర్మ చేయడం తప్పనిసరి" అని వివరించారు. "పనిచేసే హక్కు మనిషికి ఉండాలంటూ" కొంతమంది నివాదాలు చేస్తుంటారు. ఈ విషయం గురించి కృష్ణపరమాత్మ ఏనాడో చెప్పారు. "పనిచేయడం మనిషికి హక్కేకాదు. అది అతని కర్తవ్యం కూడా!" అని నొక్కి చెప్పారు. పనిదొంగలంటే శ్రీకృష్ణులవారికి గిట్టదన్నమాట. కర్మ సిద్ధాంతం అనేది ఒక శాస్త్రీయ విషయం. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన సిద్ధాంతం ఇది.

కర్మ సిద్ధాంతాన్ని ఈసారి మరోకోణంనుంచి కూడా పరిశీలిద్దాం.

## కర్మ యొక్క మూలం

వాంఛ అనేది పుట్టడం, దాన్ని అవగాహన చేసుకోవడం, దాని సాధనకు ప్రయత్నించడం - ఇదీ మనిషి యొక్క సాధారణ జీవనం. వాంఛ అనేది కర్మను ప్రేరేపిస్తుంది. చేసిన కర్మకు ఫలం తప్పదు. కర్మ చేసుకున్నవాడికే, ఆ ఫలం దక్కుతుంది. "చేసుకున్నవాడికి చేసుకున్నంత" అంటారు దీన్నే!

## కర్మల్లో రకాలు

జీవుల బ్రతుకుల్ని 3 రకాల కర్మలు నియంత్రిస్తూ ఉంటాయి. 1. సంచిత కర్మలు; 2. ప్రారబ్ధ కర్మలు; 3. వర్తమాన కర్మలు.

1. సంచిత కర్మలు : ఇవి క్రితం జన్మల బుద్ధిని అనుసరించి అప్రయత్నంగా మనం ఆచరించే కర్మలు. ఈ రకం కర్మలు 'పూర్వజన్మ వాసనా బలానికి' చెందినవి.

2. ప్రారబ్ధ కర్మలు : గత జన్మలలో చేసిన కర్మలకు తగిన ఫలితాల్ని పొందేవిధంగా ఆచరించబడేవే ప్రారబ్ధ కర్మలు. ఈ ప్రారబ్ధ కర్మలు కూడా మన వశంలోనివి కావు. "అంతా నా ప్రారబ్ధం" అంటారు ఈ కర్మల గురించే! ప్రారబ్ధ కర్మల ఫలితాలను, జీవుడు తప్పక పొంది తీరుతాడు.

3. వర్తమాన కర్మలు : సంచిత కర్మల్ని తప్పించి, వర్తమానంలో మనం బుద్ధిపూర్వకంగా చేస్తున్న మిగిలిన కర్మలన్నీ ఈ తరగతికి చెందుతాయి. కేవలం ఇప్పటి మన ఆలోచనే ఈ కర్మలను ప్రేరేపిస్తుంది. అందువల్ల ఈ వర్తమాన కర్మల ఆచరణ పూర్తిగా మన చేతులలోనిదే! "అంతా చేసుకున్న కర్మ" అంటారు దీన్నే! ఈ కర్మలు సవ్యంగా

ఉంటే మనకు మంచి జరుగుతుంది. సవ్యంగా లేకపోతే చెడు కలుగుతుంది. వర్తమాన కర్మలన్నింటినీ సత్కర్మలుగా మలచుకోగలిగితే 'చెడును ప్రేరేపించే సంచితకర్మలు', తర్వాత జన్మలలోకి ప్రాగుపడకుండా ఉంటాయి. ఆవిధంగా సంచితకర్మలు తగ్గి, కేవలం వర్తమాన కర్మలే మిగులుతాయి. ఆ వర్తమాన కర్మలు మన చేతిలోనివే కనుక, వాటిని మంచిగా మలచుకుంటూ మోక్షానికి దగ్గర కాగలం. (తిరిగి జన్మలేకుండా అనంతమైన దైవశక్తిలో మన ప్రాణశక్తి విలీనం కావడమే "మోక్షం" అంటే! ప్రారబ్ధ కర్మలు ఎలాగూ తప్పనివి. వాటి ఫలితాల్ని పూర్తిగా అనుభవించిన తర్వాతనే మోక్షానికి అవకాశం కలుగుతుంది.)

## న్యూటన్ 3వ సూత్రాన్ని తలపిస్తున్న కర్మసిద్ధాంతం

"ప్రతి చర్యా దానికి వ్యతిరేకమైన సమాన ప్రతిచర్యను కలిగి ఉంటుంది" - న్యూటన్ అనే శాస్త్రజ్ఞుని 3వ సూత్రం ఇది. కర్మ సిద్ధాంతం కూడా ఒకవిధంగా ఇదే భావనను వ్యక్తం చేస్తుంది చూడండి. ప్రతి కర్మా కూడా దానికి తగ్గ సమాన ఫలితాన్ని తిరిగి ఇచ్చితీరుతుంది. పాపకర్మ పాపఫలాన్నీ, పుణ్యకర్మ పుణ్యఫలాన్నీ ఇస్తుంది. దాన్ని జీవి అనుభవించక తప్పదు. కర్మ ఫలం ఎప్పుడూ కూడా, ఆ కర్మకు తగిన రీతిలో సమానంగానే ఉంటుంది. అందులో ఏమాత్రం హెచ్చుతగ్గులుండవు. మనం అనుభవిస్తున్న సుఖానికీ, దుఃఖానికీ కూడా ఒకవిధంగా కారకులం మనమే! వివిధ జన్మలలో మనం చేసుకున్న కర్మలు వాటికి సరిపోయే సమాన ఫలితాల్ని ఆ తర్వాత మనకు అందిస్తూ ఉంటాయి. అంటే ప్రతి కర్మా కూడా దానికి తిరిగి ఎదురొచ్చే సమాన కర్మ ఫలితాన్ని కలిగిఉంటుందన్నమాట. ఇందులో న్యూటన్ 3వ సూత్రం అచ్చంగా ప్రతిధ్వనిస్తుంది చూడండి.

ఎవరి కర్మఫలం వారికే చెంది తీరుతుందని కృష్ణ పరమాత్మ స్పష్టంగా వివరించడం జరిగింది. అంటే పుణ్యకర్మకు సౌఖ్యాన్నీ, పాపకర్మకు శిక్షనూ ఎవరిది వారే అనుభవించి తీరాలన్నమాట. అప్పుడే పాపభీతీ, దైవభక్తీ నిలుస్తాయి మరి! విచ్చలవిడితనానికి అడ్డుకట్ట పడుతుంది. ఒకరి పాపభారాన్ని మరొకరు మోస్తారని భావించడం ఒక వెర్రిభ్రమ. గాయం చేసుకున్న వారికే రక్తస్రావం కలుగుతుంది గానీ, మరొకరికి కాదు కదా! ఒకరి బదులు మరొకరు రక్తాలు కార్చడం అనేది హాస్యాస్పదం.

"చేసుకున్నవారికి చేసుకున్నంత! ఎవరి ఖర్మ వారిదే!" అనే విషయం మాత్రం ఖాయం.

## 10. వైద్య విషయాలు

మనిషికి సంబంధించిన ఆరోగ్య శాస్త్రాన్ని గురించి (మహాభారతంలో) శ్రీకృష్ణపరమాత్మ ఈవిధంగా వివరించారు. "వ్యాధివల్ల ఆరోగ్యం చెడుతుంది. వ్యాధులు రెండు విధాలు. 1. శరీర వ్యాధి, 2. మనోవ్యాధి. వాతం, పిత్తం, శ్లేష్మం ..... ఈ మూడూ సమంగా ఉంటేనే మనిషి ఆరోగ్యంగా ఉంటాడు. ఈ మూడింటిలో ఏ ఒక్కటి వికారం పొందినా అది 'శరీరవ్యాధి' అనిపించుకుంటుంది. సత్వము, రజస్సు, తమస్సూ ... ఈ మూడూ సమంగా ఉంటేనే మనస్సు ఆరోగ్య స్థితిలో ఉంటుంది. అవి తికమకలు కావడం 'మనోవ్యాధి' అనిపించుకొంటుంది". కృష్ణపరమాత్మ మొత్తం విశ్వానికే "మెగా సూపర్ స్పెషలిస్ట్" కదా! అందుకే అంతటి ఆరోగ్యశాస్త్రాన్ని స్థూలంగా ఇలా రెండుముక్కల్లో వివరించగలిగారు.

జీవుల దేహములందు జఠరాగ్ని స్వరూపుడనై అవి భుజించు భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య పదార్థములను జీర్ణము చేయుచున్నానని భగవద్గీతలో ఆయన సెలవిచ్చారు. పంచభూతాల్లో ఒకటైన 'అగ్ని' జఠరాగ్ని రూపంలో మన ఉదరంలో ఉండి జీర్ణక్రియకు తోడ్పడుతుంది. పంచభూతాలన్నీ పరమాత్మలోనివే కదా! జీవుల జీర్ణక్రియకు పరమాత్మ తోడ్పడడం అంటే ఏమిటో తెలుస్తోంది దీన్నిబట్టి.

వ్యక్తుల మానసిక పరిస్థితిని గురించి భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చక్కగా వివరించారు. అధికమైన ప్రాపంచిక వాంఛలు గల వ్యక్తికి, వాటిపై అనురాగం అధికమై, అది కామంగా మారి, చివరకు క్రోధంగా రూపుదాలుస్తుంది. క్రోధంవల్ల అవివేకం కలుగుతుంది. దానివల్ల జ్ఞాపకశక్తి నశించి, బుద్ధిని కోల్పోయి, చివరకు అధోగతి చెందుతాడు. మానసిక పరిస్థితిని, స్థిరంగా పెట్టుకోవడం ఆరోగ్యానికి మంచిదని దీనివల్ల అర్థమౌతోంది. క్రోధంవల్ల మెదడు, రక్తనాళాలు దెబ్బతింటాయనీ, రక్తం ఉడుకెత్తి దానిలో విషకణాల ఉత్పత్తి జరుగుతుందనీ, ఉదరంలో అధిక ఆమ్లాలు (ACIDS) ఊరుతాయనీ, ఉదర వ్యాధులు, గుండెజబ్బులూ, కీళ్ళనొప్పులూ, నరాల బలహీనతలూ రావడం జరుగుతుందనీ మన ఇతర శాస్త్రాల్లో కూడా చెప్పారు. (సాత్వికాహారం క్రోధాన్ని అదుపు చేస్తుందనీ, మాంసాహారం రక్తపోటును పెంచివేస్తుందనీ మన ఆరోగ్యశాస్త్రాలు చెప్తున్నాయి.)

* * *

# 9. పురాణకాలం నాటి "విద్య"

జ్ఞాన, విజ్ఞానముల సముపార్జనకు ఉద్దేశించబడినది "విద్య". సృష్టినీ, ప్రకృతినీ అవగాహన చేసుకునేందుకు, మనిషి తనలోని శక్తియుక్తుల్ని పెంచుకునేందుకూ అతి ప్రాచీనకాలంలోనే 'విద్య' (EDUCATION) ను ఏర్పాటుచేసుకోవడం జరిగింది. ప్రకృతిలోని భాగమైన విద్యను, చదువులతల్లి 'సరస్వతి' గా భావించి, ఆమెను 'ప్రకృతికి' అనగా 'బ్రహ్మదేవునికి' భార్యగా ఆరాధించడం మన ప్రాచీన సాంప్రదాయం.

విద్య అనేదానికి పరిపూర్ణమైన అర్థాన్ని ఇచ్చేవిధంగా పురాణకాలం నాటి విద్య ఉండేది. అది జీవుల వ్యక్తిగత, సామాజిక ప్రయోజనాల్ని నెరవేర్చే విధంగా ఉండేది. ఆనాటి విద్య మనిషిలోని మానవత్వాన్ని పెంపు చేసేది. విద్య అనేది వినయాన్ని నేర్పుతుందనే నమ్మకంగల కాలం అది. ఉదరపోషణ కంటే ముందుగా 'విజ్ఞానంకోసం విద్య' అని ఆరోజుల్లో విశ్వసించేవారు. అప్పటి విద్యావిధానం కూడా 'నైతిక ప్రాముఖ్యత' కలిగి, అందుకు తగినట్లుగానే ఉండేది. సకల కళలూ పోషించబడాలనే ఉద్దేశ్యంతో నాడు చాలా రకాల కళల్ని నేర్పేవారు. ఆనాడు ముఖ్యంగా 64 కళలుండేవి. (వాటి పేర్లు : 1. గీత, 2. వాద్య, 3. నృత్య, 4. ఆలోఖ్య, 5. విశేష కచ్ఛాద్య, 6. తండోల కుసుమ బలి వికార, 7. పుష్పాస్తరణ, 8. దశనవ సనాంగ రాగ, 9. మణిభామికా కర్మ, 10. శయన రచన, 11. ఉడక వాద్య, 12. ఉదకాఘాత, 13. చిత్రాశ్చయోగ, 14. మాల్యగ్రథన వికల్ప, 15. శేషరకాపీడ యోజన, 16. నేపద్య ప్రయోగ, 17. కర్ణపత్ర భంగ, 18. గ్రంథయుక్త, 19. భూషణ యోజన, 20. ఇంద్రజాల, 21. కౌచుమారయోగ, 22. హస్తలాఘవ, 23. విచిత్ర శాక యూష భక్ష వికార, 24. పానక రసరాగసవ యోజన, 25. సూచీవాన కర్మ 26. సూత్రక్రీడ, 27. వీణా, ఢమరుక వాద్య, 28. ప్రహేళిక, 29. ప్రతిమాల, 30. దుర్వాచకయోగ, 31. పుస్తక వాచన, 32. నాటక ఖ్యాయికా దర్శన, 33. కావ్య సమస్యా పూరణ, 34. పట్టికా వేత్రవాన వికల్ప, 35. తక్షకర్మ, 36. తక్షణ, 37. వాస్తువిద్య, 38. రూప్యరత్న పరీక్ష, 39. ధాతువాద, 40. మణి రాగాకర జ్ఞాన, 41. వృక్షాయుర్వేద యోగ, 42. మేషకుక్కుట లావక యుద్ధ విధి, 43. శుకసారికా ప్రలాపన, 44. ఉత్సదన సంవాహన, 45. కేశమర్ధన కౌశల, 46. అక్షర ముష్టికా కధన, 47. మ్లేచ్ఛి కవితల్ప, 48. దేశభాషా విజ్ఞాన, 49. పుష్ప శకటిక, 50. నిత్తమిజ్ఞాన, 51. యంత్రమాతృక, 52. ధారణ్యా మాతృక సంపాఠచ్య, 53. మానసి కావ్యక్రియ, 54. అభిదాన కోష, 55. ఛందోజ్ఞాన, 56. క్రియాకల్ప, 57. ఛలిత యోగ, 58. వస్త్ర గోప్య, 59. దూత్యవిశేష, 60.

అకర్షక్రీడ, 61. బాలక్రీడనిక, 62. వైనయికీ జ్ఞాన, 63. వైజయికీ జ్ఞాన, 64. వ్యాయామ విద్య.) ఇవన్నీ కూడా సాధారణంగా గురుకులాల్లో నేర్పించడం జరిగేది. ఎవరి శ్రద్ధా, నైపుణ్యాన్ని బట్టి వారు, ఆయా కళల్లో ఆరితేరేవారు. కొందరు అన్ని కళల్లోనూ ప్రావీణ్యత పొందేవారు. రాజకుమారుడైనా, నిరుపేద బిడ్డ అయినా మొత్తం అంతా కలసి కఠినమైన ఆశ్రమ జీవితాన్ని గడుపుతూ, గురుసేవ చేస్తూ ఒకే విధమైన విద్యను పొందేవారు. (పూర్వకాలంలో ఇందుకు భిన్నంగా కొన్ని విషయాలు జరిగి ఉండవచ్చు. అది వ్యవస్థలో తప్పుకాదు. అనాటి కొంతమంది స్వార్థపరుల ప్రవర్తన అది.) అలనాటి ఆశ్రమవిద్య, విద్యార్థులలో చక్కటి క్రమశిక్షణ తీసుకురాగలిగేది. విద్యార్థులకు విద్యపై ఆసక్తి, గురువుపై భక్తి గౌరవాలు మెండుగా ఉండేవి. నిజమైన ప్రావీణ్యత ఉంటేనే, నాటి విద్యార్థులు ఉత్తీర్ణత సాధించేవారు. పురాణకాలం నాటి విద్య కేవలం జీవనోపాధికే కాదు. వ్యక్తి జీవన విధానాలకు, సామాజిక క్షేమానికీ కూడా ఎంతగానో ఉపయోగ పడేది. ఆ విధంగా విద్య అనేదానికి ఒక సార్థకత ఉండేది అనాడు.

పురాణకాలంనాటి విద్యలో "సత్యం, ధర్మం, ప్రేమ, అహింస, సహనం, సహకారం, నీతి, నిజాయితీ, జాలి, కరుణ, వాత్సల్యం, ఆర్ద్రత, దయాగుణం, క్షమాగుణం, దాన గుణం, త్యాగ గుణం, స్నేహశీలత, పరస్పరావగాహన, వినయం, విధేయత, ఆప్యాయత, అభిమానం, ఆదరణ, శీలానికీ వ్యక్తిత్వానికీ విలువనివ్వడం" మొదలగు అంశాలన్నీ ఇమిడిఉండేవి. ఈ అంశాలన్నీ వ్యక్తియొక్క నైతిక వర్తనకు అత్యంత అవసరం. వీటితోపాటూ వ్యక్తిలోని అంతర్గత శక్తులను వృద్ధిపరచే 'ఆధ్యాత్మిక విద్య' కూడా అనాడు ఉండేది. జీవులలోని అంతర్గత శక్తుల గురించీ, ప్రకృతి శక్తుల గురించీ, సృష్టిని గురించీ నాటి విద్యలో బోధించబడేది. అందువల్లనే నాటి విద్య ఇహపరాలను సాధించుకోగల శక్తిని అందించగలిగేది.

ఇక ఈనాటి విద్య సంగతి చూద్దాం. పురాణకాలపు విద్యకు నేటివిద్య పూర్తిగా వ్యతిరేకం. మానసిక అభివృద్ధికి సహకరించని యాంత్రిక విద్యను నేడు మనం అభ్యసిస్తున్నాం. మంచితనం, మానవత్వం, ఆర్ద్రత, నీతి, నిజాయితీ మొదలగు వాటి గురించి మరచిపోతోంది నేటి విద్య. కేవలం అవసరాల గురించీ, సదుపాయాల గురించీ, స్వార్థం గురించీ పాఠాలను అందిస్తోంది. ఈనాటి విద్యావిధానం ఎంతో మెరుగుగా తయారయిందనీ, అది ఉన్నత ప్రమాణాలను అందుకొంటోందనీ ఈనాడు ఎంతోమంది భ్రమపడుతున్నారు. కానీ విజ్ఞులైనవారు మాత్రం నేటి విద్యావిధానంలోని లోపాలను గుర్తించగలుగుతున్నారు. నైతిక, ఆధ్యాత్మిక విద్యలు లోపించిన నేటి మన విద్యావిధానం పూర్తిగా యాంత్రికంగా తయారయింది. దాంతో వ్యక్తుల ప్రవర్తన

చెడి, నైతికంగా సమాజ అధోగతికి పునాదులు ఏర్పడుతున్నాయి. మనసుకు ఉత్తమమైన స్పందన కలిగించే విద్య లేకపోవడం, నేటి అరాచక సమాజానికి ఒక మూల కారణం. విద్యావిధానంలో అనుక్షణం మార్పులూ, చేర్పులూ చేస్తుండడంతో నేటి విద్యార్థులు అయోమయ పరిస్థితులకు లోనైతున్నారు. స్వాతంత్ర్యం వచ్చి ఇన్నేళ్ళు గడిచినా మనకో నిర్దిష్టమైన విద్యావిధానం ఇప్పటికీ లేదు. కేవలం విదేశాలను అనుసరిస్తూ పోవడమే ధ్యేయంగా కనబడుతోంది. ఒకసారి చరిత్రను తిరగేయండి. పూర్వం విదేశీయులు ఉన్నతవిద్యకోసం మన దేశంలోని నలంద, తక్షశిల, కాశీ విశ్వవిద్యాలయాలకు వచ్చేవారు. ఇప్పుడు పరిస్థితి తారుమారయింది. ఉన్నత విద్య కావాలంటే మనం విదేశాలకు వెళ్ళవలసిన స్థితి వచ్చింది. ఈనాటి చదువులు కేవలం అర్థబలం, అధికార బలం మొదలైన కొన్ని ప్రత్యేకతలున్న వారికి అరచేతిలో అరటిపండుగా మారింది. ప్రతిభకు ప్రాధాన్యత తగ్గింది. ఈ కారణంగానే నేటి చదువుల్లో ఉత్తమప్రమాణాలు కరువౌతున్నాయి. ఏదోవిధంగా పట్టాలు పొందడం, ఆ తర్వాత ఉద్యోగాల వేట, ధనార్జన ...... ఇవే నేటి విద్యయొక్క లక్ష్యాలు. చదివే చదువుకూ, చేసే పనికీ నేడు పొంతన లేదు. నేటి విద్యావిధానంలోని లోపాలవల్ల చాలామంది తెలివైన విద్యార్థులు కూడా పూర్తిగా ఏ విద్యలోనూ సరైన ప్రావీణ్యత లేకుండా మిగిలిపోతున్నారు. అనేకమంది విద్యార్థులు దౌర్జన్యవాదులుగా, గూండాలుగా తయారవుతున్నారు. సామాజిక వ్యవస్థ నాశనమౌతోంది. (ఘనమైన మన యదార్థ చరిత్రను తెలియజెప్పే విద్య నేడు మనకు లేదు. మన ప్రాచీన హైందవ మేధావుల గురించి, మన జాతికి తెలియజెప్పే పాఠాలు నేడు కరువయ్యాయి. విద్యావ్యవస్థలో రాజకీయ వ్యవస్థయొక్క జోక్యం వల్ల కలుగుతున్న అనర్థం ఇది!)

పురాణకాలం మాదిరిగా నైతికవిద్య కలిగిన విద్యావిధానాన్ని మనం రూపొందించుకోవాలి. అప్పుడే వ్యక్తిగత వికాసం, సమాజప్రగతి సాధ్యమౌతాయి. రామలక్ష్మణులు, పాండవులు, శ్రీకృష్ణ-కుచేలులు, ద్రోణ-ద్రుపదాదులు పొందిన ఆశ్రమ విద్య ఎప్పటికీ ఆదర్శప్రాయమైనదే! గడచిన కాలాన్ని పునాదిగా వేసుకుని చక్కని భవిష్యత్తును నిర్మించుకోగలగాలి మనం. మన దేశానికి (అంటే మన వాతావరణానికి, ప్రజలకూ) తగిన విద్యావిధానాన్ని పటిష్ఠంగా రూపొందించుకోవడానికి, మన "స్వదేశీ పరిజ్ఞానం" చాలు. అయితే మనకు కావలసిందల్లా 'లక్ష్యశుద్ధి'. అది లోపించడం వల్లనే ప్రస్తుతం అవసవ్యత ఏర్పడింది.

విద్య (EDUCATION) యొక్క వర్గీకరణను ఒకసారి తెలుసుకుందాం. అది ఈవిధంగా ఉంటుంది.




నేటి మన విద్యావిధానంలో పై అంశాలన్నీ సమగ్రంగా ఉండడం లేదు. పురాణకాలంలో మాత్రం పైన తెలిపిన అన్నిరకాల విద్యాంశాలూ బోధింపబడేవి. అందుకే ఆనాటి విద్య "సంపూర్ణమైనది" అని చెప్పగలం.

*(గమనిక : విద్యలోని అన్ని సబ్జెక్ట్స్ కూడా పై వర్గీకరణలో చేరుతాయి. వివరాల కోసం మా తర్వాత ప్రచురణలు చూడండి.)*

★ ★ ★

## 10. ఇతిహాస కాలంలో టెస్ట్‌ట్యూబ్ బేబీలు

హైందవ ఋషీశ్వరులు గొప్ప సైంటిస్ట్‌లని చెప్పుకున్నాం కదా! టెస్ట్‌ట్యూబ్ బేబీల తయారీకూడా వారికి తెలుసు. మహాభారత కాలంలో వ్యాసమహర్షి

నూటొక్కమంది టెస్ట్‌ట్యూబ్ బేబీలను తయారు చేశారు. (అయితే టెస్ట్‌ట్యూబుల బదులుగా ఆయన "కుండలను" వాడడం జరిగింది.) కుండలలో నూటొక్కమంది పిల్లలను తయారుచేయడానికి ఆయన ఉపయోగించిన ప్రక్రియ, మన ఆధునిక సైన్స్‌కు అందనిది.

ఆధునిక సైన్సు ప్రగతికి ఒక మచ్చుతునకగా 'టెస్ట్‌ట్యూబ్ బేబీలను' చెప్పుకుంటాం మనం. సైన్సులో మిడిమిడి పరిజ్ఞానంగల కొంతమంది తమ కాలర్లు ఎగరేస్తూ "ఇంకా దేవుడేమిటండీ! టెస్ట్‌ట్యూబ్‌లో పిల్లల్ని తయారు చేసేస్తుంటేనూ! రేపోమాపో చనిపోయిన మనిషికి ప్రాణం కూడా పోసేస్తారు" అని అంటూంటారు. ఇవన్నీ కేవలం ఊకదంపుడు మాటలే! మన విజ్ఞాన శాస్త్రం, వైద్యశాస్త్రం ఇంకా అంతగా ఏం ఎదిగిపోలేదు. ఈనాటికీ ఎయిడ్స్, కేన్సర్, పోలియో, ఫైలేరియా, రేబీస మొదలగు కొన్ని వ్యాధులు వచ్చి "ముదిరితే" వాటి నివారణ సాధ్యం కాదు. ఇక శవాలకేం ప్రాణం పోస్తారు? ఈ రోజుల్లో నివారణ సంగతి ఎలా ఉన్నాకూడా, వైద్యానికి అయ్యే ఖర్చులు మాత్రం బాగా అభివృద్ధి చెందాయి. అది మాత్రం నిజం.

## ఆధునిక టెస్ట్‌ట్యూబ్ బేబీల సంగతి

టెస్ట్‌ట్యూబ్ బేబీలంటూ గొప్పలు చెప్పే చాలామందికి, ఆ బేబీల్ని ఎలా తయారుచేస్తారో తెలియదు. పూర్తిగా పిల్లల్ని టెస్ట్‌ట్యూబుల్లోనే తయారు చేస్తారని అనుకునే వాళ్ళు చాలామంది ఉన్నారు. ఇందులో యదార్థం ఏమంటే - స్త్రీయొక్క అండమూ, పురుషుని వీర్యమూ తీసుకుని టెస్ట్‌ట్యూబ్‌లో కలుపుతారు. ఫలదీకరణం జరిగిన తర్వాత, ఆ పిండాన్ని స్త్రీ గర్భాశయంలోకి ప్రవేశ పెడతారు. ఆ పిండం ఎదిగి బిడ్డగా రూపొందడం ఆ గర్భాశయంలోనే జరుగుతుంది. ప్రసవం కూడా మామూలే. జనన విషయంలో మామూలు బిడ్డకూ, టెస్ట్‌ట్యూబ్ బేబీకి తేడా ఒక్కటే! టెస్ట్‌ట్యూబ్ బేబీ విషయంలో స్త్రీపురుష సంపర్కం లేకుండా అండము, వీర్యాలను టెస్ట్‌ట్యూబ్‌లో కలుపుతారు. ఆ విషయం తప్పించి, మిగిలిన ప్రక్రియ అంతా ఒకటే! టెస్ట్‌ట్యూబ్ బేబీ తయారీ మరీ అద్భుత విషయమేమీ కాదు. మానవుడు ఈ ప్రక్రియలో దైవనిర్మితాలనే హెచ్చుగా వాడుకుంటున్నాడు. అండం, వీర్యం, గర్భాశయం ..... ఇవన్నీ దైవదత్తాలే! మానవుడు అండాన్నిగాని, వీర్యాన్నిగాని బాహ్యంగా తయారు చేయలేడు. గర్భాశయం వంటి నిర్మాణం అతనివల్ల కాదు. ఫలదీకరణం చెందించడం ఒక్కటే మానవుని స్వంత ప్రక్రియ. మిగిలినపని అంతా భగవంతునిదే!

## ఇతిహాస కాలపు టెస్ట్‌ట్యూబ్ బేబీలు

ఇప్పటికి 5వేల సంవత్సరాలకు పూర్వమే వ్యాసమహర్షి ఆధునికం కంటే

మెరుగైన పద్ధతిలో నూటొక్కమంది టెస్ట్‌ట్యూబ్ బేబీలను తయారుచేశాడు. టెస్ట్‌ట్యూబుల బదులుగా ఆయన 'కుండలను' వాడడం జరిగింది కాబట్టి ఆ బేబీలను "కుండ బేబీలు" (POT BABIES) అని పిలవాలేమో!

## మహాభారతంలోని టెస్ట్‌ట్యూబ్ (కుండ) బేబీలు

తనకంటే ముందుగా కుంతీదేవికి ప్రసవం జరగడంతో గాంధారి చాలా అసూయకు లోనయింది. బాధతో తన గర్భాన్ని చేతులతో మోదుకుంది. దాంతో గర్భం విచ్ఛిన్నమై, పిండం బయటపడింది. ఆ పరిస్థితిని చూశాడు వ్యాసమహర్షి. విచ్ఛిన్నమైన ఆ పిండ భాగాలను తనకు తెలిసిన విజ్ఞాన ప్రక్రియతో నూటొక్క కుండల్లో పెట్టించాడు. ఆ కుండల్లోనే కౌరవులు వంద మందీ, వారి చెల్లెలు 'దుస్సల' తయారయ్యారు. విడివడిన పిండభాగాలు కూడా ప్రత్యేక పిండాలవలే సంపూర్ణంగా శిశువులకు జన్మలనివ్వగలవని ఆధునిక సైన్సు నిరూపిస్తోంది. ఈ విషయం ఆనాడే వ్యాసమహర్షికి తెలుసునన్నమాట. అందువల్లనే విచ్ఛిన్నమైన పిండభాగాలను విడివిడి కుండల్లో శాస్త్రీయంగా భద్రపరచి, శిశువులను రూపొందించాడాయన. తిరిగి మళ్ళీ గర్భాశయం అవసరం లేకుండా కేవలం కుండల్లోనే శిశువులు తయారయ్యే సైన్సు ప్రక్రియ ఉపయోగించాడు వ్యాసుడు. అధునిక శాస్త్రవేత్తలకు మాత్రం స్త్రీ గర్భాశయం వినియోగం తప్పనిసరి అవుతోంది. నేటి సైన్స్ పరిజ్ఞానం కంటే, వ్యాసుని సైన్స్ పరిజ్ఞానం ఓ మెట్టు పైనే ఉంది. ఇతిహాసకాలంలోని ద్రోణుడు, ద్రుపదుడు, శుకుడు మొదలైన వారి జన్మలు, టెస్ట్‌ట్యూబ్ బేబీల జన్మల వంటివే!

★ ★ ★

# II. ఇతిహాసకాలపు గర్భిణీ మార్పిడి

ఒక స్త్రీ ధరించిన గర్భాన్ని తీసి, వేరొక స్త్రీ గర్భంలోకి మార్చిన ప్రక్రియ కూడా ఇతిహాస కాలంలో కనపడుతోంది. తన చెల్లెలికి పుట్టబోయే 8వ శిశువు, తనను సంహరిస్తాడనే భయంతో కంసమహారాజు తన చెల్లెలు దేవకినీ, బావ వసుదేవుణ్ణీ చెరసాలలో బంధించి ఉంచాడు. దేవకికి పుట్టిన ఆరుగురు బిడ్డల్ని వరుసగా చంపేశాడు కంసుడు. దేవకి 7వ గర్భంగా ఆదిశేషుని అవతారం ఉదయించనున్నది. ఆ గర్భాన్ని రక్షించ నెంచాడు శ్రీమహావిష్ణువు. వసుదేవుని మొదటి భార్య అయిన రోహిణి, అప్పుడప్పుడూ చెఱసాలకు వస్తూ, తన భర్తను కలుసుకుంటూ ఉండేది. శ్రీమహావిష్ణువు యోగమాయను పిలచి, దేవకి సప్తమ గర్భాన్ని రోహిణికి

మార్చవలసిందిగా ఆదేశించాడు. యోగమాయ ఆ ప్రకారమే చేసింది. దేవకికి గర్భస్రావం అయిందనుకున్నారంతా. రోహిణికి మార్పిడి చేయబడిన ఆమె గర్భం, శిశువుగా జన్మను పొందింది. ఆ జన్మను పొందిన శిశువే "బలరాముడు". ఈ విధంగా ఇతిహాసకాలంలో గర్భిణీ మార్పిడి విజయవంతంగా జరిగినట్లు మనకు కన్పిస్తోంది.

★ ★ ★

## 12. అలనాటి వీర్యదాన ప్రక్రియలు

ఆధునిక సైన్సు పరిజ్ఞానంలో కృత్రియ గర్భధారణ కలిగించడం అనేది ఒక విశేషం. సంభోగక్రియ లేకుండా భర్తయొక్క వీర్యాన్నిగాని, లేదా వేరొక పురుషుని వీర్యాన్ని గాని స్త్రీ యందు ప్రవేశపెట్టి "కృత్రిమ గర్భధారణ" కల్గిస్తున్నారు. (ఈ కృత్రియ గర్భధారణ ప్రక్రియ మనుషులకే కాక ఇతర జీవులకు కూడా అమలు చేయబడుతోంది.) ఇది ఒక విశేష సైన్సు ప్రక్రియగా నేడు చెప్పుకోబడుతోంది. భర్తకు సంభోగశక్తి లోపం ఉన్నప్పుడూ, స్త్రీ జననేంద్రియాలలో కొంత అపసవ్యత ఉన్నప్పుడూ, మరియూ భర్త వీర్యంలో పురుషకణాలు లేనప్పుడూ - ఈ కృత్రిమ గర్భధారణ ప్రక్రియ నేడు ఎంతో ఉపయోగకరంగా ఉంటోంది.

సంభోగక్రియ లేకుండా భర్త యొక్క వీర్యాన్ని స్త్రీకి కృత్రిమంగా ఇవ్వడాన్ని "ARTIFICIAL INSEMINATION BY HUSBAND"(A.I.H.) అంటారు. భర్త వీర్యంలో పురుషకణాలు లేకపోతే భార్యకు గర్భం రావడం జరగదు కదా! అటువంటి భార్యకు వేరే పురుషుని వీర్యాన్ని కృత్రిమ పద్ధతిలో ఇవ్వడాన్ని "ARTIFICIAL INSEMINATION BY DONOR" (A.I.D.) అంటారు. ఈ పద్ధతి ద్వారా 1957 నాటికే అమెరికాలో లక్షమందికి పైగా శిశువులకు జన్మలనివ్వడం జరిగింది.

ఆధునిక కాలంలో పురుషుని వీర్యాన్ని ఫ్రీజ్ చేసే పద్ధతిని కనుగొన్నారు. వీర్యాన్ని గ్లిజరాల్‌తో కలిపి -79°C (మైనస్ 79 డిగ్రీల సెంటీగ్రేడ్) దగ్గర ఘనీభవింపజేసి ఉంచితే, ఆ వీర్యం 20 సంవత్సరాల వరకూ జీవంతో ఉంటుంది. నైట్రోజన్ ద్రవం ద్వారా -196.5°C (మైనస్ 196.5 డిగ్రీల సెంటీగ్రేడ్) ఉష్ణోగ్రత దగ్గర కోడిగ్రుడ్డు సొన, గ్లిజరాల్, యాంటీ బయొటిక్స్ కలిపి ఉంచితే, ఆ వీర్యం శాశ్వతంగా జీవంతో ఉంటుంది.

అయితే తాత్కాలికంగా దాచిన వీర్యం కంటే, శాశ్వతంగా నిలువ ఉంచిన

వీర్యం త్వరగా పనిచేయదు. సరాసరిగా 19 సార్లు ప్రయోగించగా, ఒకసారి పనిచేస్తుంది.

స్త్రీకి గర్భాన్ని కల్గించడంలో పైవిధమైన సైన్స్ ప్రక్రియలు నేడు అమలులో ఉన్నాయి. ఆధునిక కాలంలో ఈ పద్ధతులన్నీ 'నాగరికం' గా అంగీకరించబడుతున్నాయి. ప్రభుత్వాలే స్వయంగా "వీర్యదాన కేంద్రాలను" నడుపుతున్నాయి. వీటినే "స్పెర్మ్ బ్యాంక్స్" అంటారు. ప్రస్తుతం మన దేశంలో కూడా ప్రముఖ నగరాల్లో ఈ "స్పెర్మ్ బ్యాంక్స్" ఉన్నాయి. అవి సమర్థవంతంగా పనిచేస్తున్నాయి కూడా! ఆరోగ్యవంతులైన పురుషుల నుండి వీర్యాన్ని సేకరించి, ఈ కార్యాలయాల్లో నిలువ చేసి ఉంచుతారు. ఏ వీర్యం ఎవరిదైనదీ మాత్రం ఎవరికీ తెలియనివ్వరు. వీర్యాలను దానం చేసిన వ్యక్తులయొక్క శక్తి సామర్థ్యాలను బట్టి, వృత్తులూ ప్రవృత్తులను బట్టి ఆ వీర్యాలను 'వర్గీకరణ' చేసి ఉంచుతారు. భర్తలోని లోపంవల్ల గర్భం పొందలేని భార్య, ఈ స్పెర్మ్ బ్యాంకు నుండి వీర్యం తీసుకోవడం ద్వారా గర్భాన్ని పొందవచ్చు. వీర్యాన్ని తీసుకునే స్త్రీ తన అభీష్టాన్ని బట్టి క్రీడాకారుని వీర్యమో, కళాకారుని వీర్యమో, శాస్త్రవేత్త వీర్యమో .... ఇలా తనకు నచ్చిన తరహావారి వీర్యాన్ని అక్కడ పొందవచ్చు. ఆమెకు ఎవరి వీర్యం ఇవ్వబడిందో తెలియకుండా ఉండే జాగ్రత్త స్పెర్మ్ బ్యాంకువారు తీసుకుంటారు. (ఈ జాగ్రత్తగాని తీసుకోకపోతే భవిష్యత్తులో ఎన్నో గొడవలొచ్చే ప్రమాదం ఉంటుంది కదా మరి!)

ఆధునిక కాలంలోని వీర్యదాన ప్రక్రియల్ని ఇంతవరకూ తెలుసుకున్నాం. వీర్యాన్ని నిలువచేయడం, సంభోగక్రియ లేకుండా కృత్రిమ పద్ధతిలో స్త్రీకి వీర్యాన్ని ఇచ్చి గర్భాన్ని కలిగించడం.... ఇవీ నేటి సైన్సు విజయాలు. అయితే ఈ పద్ధతులన్నీ మన ప్రాచీన హైందవులకు పాతవే! ఆధునిక విజ్ఞాన పురోగతిగా పైన తెలుసుకున్న అంశాలన్నీ పురాణకాలంలోనే ఆచరించబడ్డాయి. వంశాభివృద్ధి కోసం పరపురుషుని వీర్యాన్ని స్త్రీకి ఇవ్వడం, వీర్యంలోని జీవం నశించకుండా దాన్ని మరోచోటుకు పంపించి వినియోగంలోకి తేవడం ..... ఇలాంటి ప్రక్రియలన్నీ మన పురాణాల్లో కోకొల్లలుగా కన్పిస్తాయి.

"కుమార సంభవం" కథలో శివుడు తన వీర్యాన్ని వాయుదేవుని ద్వారా "అగ్నికి ' అందివ్వగా, పార్వతి తన అండాన్ని "స్వాహాదేవికి" అందివ్వగా - అగ్ని, స్వాహాదేవిల కలయికతో "కుమారస్వామి" పుట్టాడు. అలాగే శివుని వీర్యాన్ని తీసుకున్న వాయుదేవుడు, అంజనాదేవితో కలిసి 'హనుమంతునికి' జన్మనిచ్చాడు. యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వనీదేవతలిరువురు... ఈ ఐదుగురూ మహావిష్ణువు వీర్యాన్ని కుంతీదేవి, మాద్రిలకు అందించి "పాండవుల జన్మలకు" కారకులయ్యారు. వీటి

అర్థం ఏమంటే యముడు, వాయువు, ఇంద్రుడు, అశ్వనీదేవతలు, అగ్ని .... వీరంతా అలనాటి "స్పెర్మ్ బ్యాంక్స్" అన్నమాట. ఈ స్పెర్మ్ బ్యాంక్స్, మహనీయ శక్తుల "వీర్యాన్ని" (అనగా అంశను) తమ వద్ద దాచి, లోక కళ్యాణార్థం 'కృత్రిమ గర్భోత్పత్తికి' తోడ్పడేవి. ఆధునిక కాలంలో స్పెర్మ్‌బ్యాంక్స్ ద్వారా పరాయి పురుషుని వీర్యంతో గర్భం దాల్చడం ఎలా చట్టబద్ధమూ, ధర్మబద్ధమూ అయిందో, అలాగే అదీనూ! పురాణాల్లో వాయుదేవుడు ఒక పెద్ద స్పెర్మ్ బ్యాంకు. కుమారస్వామి, హనుమంతుడు, భీముడు జన్మలనెత్తేందుకు ఆయనే తోడ్పడ్డాడు.

మహాభారతంలో మరో చిత్రమైన గాథ ఉంది. అడవిలో ఉన్న సమయాన వసురాజు అనే ఒక మహారాజుకు వీర్యస్ఖలనమైందట. పెంపుడు గ్రద్దచే ఆయన తన వీర్యాన్ని, తన భార్య 'గిరిక' కోసం పంపించాడట. కానీ విధివశాన ఆ వీర్యం, దారిలో ఒలికిపోగా దాన్ని ఒక చేప మ్రింగిందట. దాని ఫలితంగా ఆ చేపకు 'సత్యవతి' అనే అమ్మాయి పుట్టింది.

ఇలా వీర్యదానాలతో, కృత్రిమ గర్భాలతో చిత్రవిచిత్ర జననాలను పొందినవారు పురాణాల్లో ఎందరో కన్పిస్తారు మనకు.

భర్త ద్వారా వంశాభివృద్ధి జరగని పక్షాన, పురాణ కాలంలో కొంతమంది స్త్రీలు స్పెర్మ్‌బ్యాంక్స్ ద్వారా కాకుండా ప్రత్యక్షంగా ఎవరో ఒక మహాపురుషుని ద్వారా వీర్యదానాన్ని పొందేవారు. అట్టి గర్భాదానం ఒక పవిత్ర కార్యంగా చూడబడేది. వీర్యదానం చేయడం వరకే ఆ మహాపురుషుని కర్తవ్యం. ఆ తర్వాత వారి ఇరువురి మధ్యా ఎట్టి కలయికా ఉండదు. ఈ విధంగా చేసే గర్భాదానం కేవలం 'వంశాభివృద్ధి' కొరకే గాని, 'కామసేవనం' గురించికాదు. ఇట్టి వీర్యదాన ప్రక్రియకు ఉదాహరణ మహాభారతంలో కన్పిస్తుంది. అంబిక, అంబాలిక అనే స్త్రీలకు వ్యాసభగవానుడు ఈవిధంగానే గర్భాదానం చేస్తాడు. ఫలితంగానే "ధృతరాష్ట్రుడు, పాండురాజు" జన్మించారు. అంబిక వద్ద దాసిగా పనిచేస్తున్న స్త్రీ, వ్యాసుని వీర్యంద్వారా 'విదురుణ్ణి' కంటుంది.

ప్రత్యక్షంగా వీర్యదానాన్ని చేసే ప్రక్రియ పురాణకాలంలో కాబట్టి సవ్యంగా సాగింది. ఆధునికమైన ఈ ఆకతాయి కాలంలో అటువంటి ప్రక్రియలు చాలా చెడు పరిణామాలకు దారితీస్తాయి. అందువల్ల ప్రత్యక్ష వీర్యదానం కాకుండా నేటికాలంలో ప్రత్యేకించి "స్పెర్మ్ బ్యాంక్స్" అంటూ పెట్టారు. అక్కడ కూడా ఏ వీర్యం ఎవరిదో తెలియకుండా ఉండే ఏర్పాట్లు చేశారు. ఇలాంటి ఏర్పాట్లు చెయ్యకపోతే, నేటి పోకిరీ సమాజం మరింత రెచ్చిపోతుంది.

వీర్యదాన ప్రక్రియలు, కృత్రిమగర్భాల విషయంలో అనేకానేక సైన్స్ ప్రక్రియలు పురాణకాలంలోనే అమలుపరచబడ్డాయి. ఇంతేకాదు. అండ, వీర్యాల సంయోగం లేకుండానే అనేక 'జన్మలు' పురాణాల్లో కన్పిస్తాయి. కొన్ని గంటల వ్యవధిలోనే గర్భం కలిగి, ప్రసవం కూడా జరిగిపోవడం పురాణకాలంలో జరిగేది. ఇటువంటి గర్భాన్ని 'సద్యోగర్భం' అనేవారు. ఇవన్నీ వింటే, నేటి మన సైన్సుకు కళ్ళు తిరగడం ఖాయం.



# 13. ఇతిహాస కాలంలో లింగమార్పిడి

పురుషుణ్ణి 'స్త్రీగానూ', స్త్రీని 'పురుషునిగానూ' మార్చివేసే 'లింగమార్పిడి' ప్రక్రియ నేటి ఆధునిక కాలంలో కనిపెట్టబడింది. దీన్ని విచిత్రమైన వైద్యప్రక్రియగా నేడు చెప్పుకుంటున్నాం. అయితే పురాణకాలంలో ఇదేమీ విశేషం కాదు. అనాటి వారికి 'లింగమార్పిడి' సంగతి తెలుసు. మహాభారతంలోని 'శిఖండి కథ'లో లింగమార్పిడి అంశం కన్పిస్తుంది మనకు.

శిఖండి కథ : భీష్ముని మరణానికి కారణంకాగల కుమారునికై ద్రుపద మహారాజు శివునికోసం తపస్సు చేస్తాడు. శివుడు ప్రత్యక్షమౌతాడు. భీష్ముని మరణానికి కారణం కాగల కుమార్తె జన్మిస్తుందని వరాన్ని ఇస్తాడు. కుమార్తెకాదు, కుమారుని ప్రసాదించ మంటూ వేడుకుంటాడు ద్రుపదుడు. అప్పుడు శివుడు "ద్రుపదా! నీకు తప్పనిసరిగా కుమార్తే జన్మిస్తుంది. అయితే యవ్వనకాలం వచ్చిన తర్వాత, ఆమె 'పురుషునిగా' మారడం జరుగుతుంది" అని చెప్పి అంతర్ధానమౌతాడు. శివుని వరం ప్రకారం ద్రుపద దంపతులకు కుమార్తె జన్మించింది. (భీష్ముని మరణానికి కారకురాలిని కావాలంటూ తపస్సు చేసి తనువు చాలించిన 'అంబ' అనే స్త్రీ, ద్రుపదునికి కుమార్తెగా ఇప్పుడు జన్మించింది.) బయట ప్రపంచానికి మాత్రం, తమకు కుమారుడు జన్మించినట్లుగానే ప్రచారం చేయించారు ద్రుపద దంపతులు. తమ కుమార్తెకు 'శిఖండి' అని పేరుపెట్టి, ఆమెను పురుషుని మాదిరిగా పెంచి పెద్ద చేశారు. వివాహ వయస్సు వచ్చేసరికి ఏం చెయ్యాలో ద్రుపదునికి తోచలేదు. శివుని దయవల్ల తమకుమార్తె ఎలాగూ పురుషునిగా మారిపోతుందని తలపోసి, ఆమెకోసం తగిన కన్యను వెదికాడు. దశార్ణదేశం రాజు హేమవర్మ కూతురితో శిఖండికి వివాహం జరిపించాడు. వివాహమైన తర్వాత, శిఖండి పురుషుడు కాడని, పెళ్ళికుమార్తె గమనించింది. ఆ వార్త మెల్లగా తన తండ్రికి చేరవేసింది. ద్రుపదుడు చేసిన మోసానికి

హేమవర్మ మండిపడుతూ దండయాత్రకు సిద్ధపడ్డాడు. ఈ వ్యవహారమంతా గమనించిన శిఖండి, ఇక తనకు ఆత్మహత్యే శరణ్యమనుకుంటూ ఒక యక్షుడు తిరిగే అడవిలోకి చేరింది. అక్కడ ఆత్మహత్యకు తలపడుతూండగా యక్షుడైన స్థూలకర్ణుడు వచ్చి అడ్డుకున్నాడు. ఆమె జాలికథ విన్నాడు. తాను ఆమెకు సహాయపడాలని నిశ్చయించుకున్నాడు. 10 రోజుల పాటు తన పురుషత్వాన్ని శిఖండికి ఇచ్చి, ఆమె స్త్రీత్వాన్ని తను తీసుకునేందుకు నిర్ణయం చేశాడు. శిఖండి సంతోషించింది. శిఖండి స్త్రీత్వాన్ని తను తీసుకుని, తన పురుషత్వాన్ని ఆమెకు మార్పిడి చేశాడు స్థూలకర్ణుడు. శిఖండి పురుషునిగా వెళ్ళి మామగారికి కన్పించి, పరిస్థితిని చక్కబరిచాడు. ఈలోగా యక్షరాజైన కుబేరుడు, స్థూలకర్ణుని స్త్రీగా చూసి "నువ్వు ఈ రూపంలోనే ఉండిపో!" అని శాసించాడు. చాలా బాధపడ్డాడు స్థూలకర్ణుడు. అప్పుడు కుబేరుడు జాలిపడి, 'శిఖండి మరణానంతరం నీ పురుషత్వం నీకు వస్తుందిలే!' అని చెప్పి స్థూలకర్ణుణ్ణి ఊరడించాడు. అలా కుబేరుని కారణంగా జన్మంతా పురుషునిగా ఉండిపోగలిగాడు శిఖండి. ఇదీ శిఖండి కథ! ఈ కథలో లింగమార్పిడి ప్రక్రియ మనకు స్పష్టంగా కన్పిస్తోంది కదా!

మహాభారతంలో అర్జునుడు 'బృహన్నల'గా మారడం, పురాణాల్లో నారదుడు కొంతకాలం 'స్త్రీ' గా మారడం ... ఇత్యాదులన్నీ అలనాటి 'లింగమార్పిడి' ని సూచిస్తున్నాయి.

ఏనాడో మన పూర్వీకులకు తెలిసిన విజ్ఞాన ప్రక్రియలనే, నేటి విదేశీ శాస్త్రవేత్తలు ఇప్పుడు కనుగొంటున్నారు.

★ ★ ★

## 14. ఫ్రాయిడ్ సిద్ధాంతం పాతదే!

స్త్రీయొక్క మానసిక స్థితి ప్రభావం, ఆమె గర్భంలోని పిండంపై పడుతుందనే ఆధునిక సిద్ధాంతం ఒకటి ఉంది. ఇటువంటి కొన్ని సిద్ధాంతాలకు మూలపురుషునిగా విదేశీ శాస్త్రవేత్త "ఫ్రాయిడ్" ను చెప్పుకుంటాం. అయితే పైన తెలిపిన సిద్ధాంతం మిగిలిన ప్రపంచ దేశాలకు క్రొత్తేమో గాని, మన భరతఖండానికి మాత్రం క్రొత్తకాదు.

మానసిక పరిస్థితులను బట్టి శారీరక పరిస్థితుల్లో మార్పులు సంభవిస్తాయని, మన ప్రాచీన ఋషులు, పురాణకర్తలు అనేక సందర్భాల్లో చెప్పడం జరిగింది. స్త్రీ మానసిక స్థితి ప్రభావం, ఆమె గర్భంలోని శిశువుపై పడుతుందని పురాణాల్లో అనేకచోట్ల

నిరూపించబడింది. కాబట్టి ఈ సిద్ధాంతాన్ని "ఫ్రాయిడ్ సిద్ధాంతం" అనేకంటే "ఒక హైందవ సిద్ధాంతం" అని చెప్పుకుంటే బావుంటుంది. ఈ సిద్ధాంత ప్రకారం మన హైందవులకు ఎన్నో ఆచారవ్యవహారాలు ఏర్పడ్డాయి. ("హైందవ ఆచారాలు - అంతరార్థాలు" అనే మా తర్వాత ప్రచురణలో వివరాల్ని చూడవచ్చు.)

పై సిద్ధాంతాన్ని నిరూపిస్తూ మన పురాణాల్లో ఉన్న కొన్ని సంఘటనల్ని చూద్దాం ఇప్పుడు.

కశ్యప ప్రజాపతి తన భార్యలను, మీకెలాంటి బిడ్డలు కావాలని అడిగేవాడట. వారు చెప్పేవారట. వారు కోరిన దానిని బట్టి ఆచరించవలసిన వ్యవహారాలను తెల్పి, వాటి ఆచరణ అనంతరం వారితో సంగమించేవాడట. ఆ ప్రకారంగా కోరిన బిడ్డలు కలిగేవారట.

అలాగే మహాభారతంలో సంగతి. అంబికతో, అంబాలికతో, అంబిక యొక్క దాసితో సంగమించిన వ్యాస మహర్షి - వారికి తనవల్ల ఎలాంటి బిడ్డలు పుడతారో ముందుగానే చెప్పేశాడు. అది అక్షరాలా నిజమయింది. ఈ సందర్భంలో ఆయన తన మహిమనేమీ ఉపయోగించలేదు. సంగమ సమయంలో స్త్రీయొక్క మనఃస్థితి ప్రభావం, వీర్యఅండాల కలయిక అయిన "పిండంపై" పడుతుంది. ఈ విజ్ఞాన విషయం ఆధారంగా వ్యాసమహర్షి పై సంగతి చెప్పగలిగాడు. సంగమించే సమయంలో వ్యాసుని రూపానికి భయపడిన అంబిక కళ్ళు మూసేసుకుంది. సంగమ అనంతరం వ్యాసుడు ఆమెకు కలగబోయే బిడ్డను గురించి చెప్తూ "ఈమెకు మహాబలవంతుడైన కొడుకు పుడతాడు. అయితే భయంతో కళ్ళు మూసుకుని ఉండిపోయిన మాతృదోషంవల్ల, పుట్టే కుమారుడు పుట్టుగ్రుడ్డివాడై ఉంటాడని" అన్నాడు. వ్యాసుడు చెప్పినట్లే జరిగింది. అంబికకు పుట్టుగ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు జన్మించాడు. ఇక పాండురాజు తల్లి అయిన అంబాలిక సంగతి! సంగమ సమయంలో వ్యాసుని వికార రూపానికి ఆమె తెల్లబోయింది. అది గమనించిన వ్యాసుడు, ఆమెతో సంగమించిన అనంతరం ఆమెకు కలగబోయే కుమారుని గురించి చెప్తూ, "ఈమెకు బలవంతుడూ, పరాక్రమవంతుడూ, రూపవంతుడూ అయిన కుమారుడు పుడతాడు. కానీ సంగమ సమయంలో తల్లిదోషంవల్ల పాండుదేహం వాడుగా అవుతాడు"అని అన్నాడు. అలాగే పాండురాజు, పాండువర్ణంతో పుట్టాడు. అంబిక యొక్క దాసీ మాత్రం నిశ్చలమైన నిండు మనసుతో వ్యాసుణ్ణి కలిసింది. ఆమెకు తనవల్ల తేజోవంతుడూ, ధర్మనిష్ఠాపరుడూ, శాంతి స్వరూపుడూ అయిన బిడ్డ కలుగుతాడని వ్యాసుడు చెప్పాడు. ఆ విధంగానే ఆమెకు ధర్మపరుడైన 'విదురుడు' జన్మించడం

జరిగింది. ఈ మూడు సందర్భాల్లోనూ కూడా ఖచ్చితంగా కుమారులే పుడతారని వ్యాసమహర్షి చెప్పడాన్ని గమనించండి.

## పుట్టబోయే బిడ్డయొక్క లింగ నిర్ధారణ

పుట్టబోయే బిడ్డయొక్క లింగ నిర్ధారణ కూడా ముందుగానే చేయడం వ్యాసుని గొప్పదనం. సంగమం జరిగిన వెంటనే ఆయన ఆ విషయాన్ని నిర్ధారణగా చెప్పగలిగాడు. ఈ రోజుల్లోనూ పుట్టబోయే బిడ్డయొక్క లింగనిర్ధారణ చేస్తున్నారు. అయితే గర్భంలోని శిశువు కొన్నాళ్ళు ఎదిగిన తర్వాత మాత్రమే 'ఆడ' లేక 'మగ' అనేది చెప్పగలుగుతున్నారు. వ్యాసుని మేధస్సుకంటే ఆధునిక సైన్సు చాలా వెనుకబడి ఉందన్నమాట. పుట్టబోయేది ఆడబిడ్డా, మగబిడ్డా అనే విషయం - సంగమం జరిగిన వెంటనే చెప్పగల శక్తి ఆనాటి విజ్ఞానులకుంది. వారి సైన్సు పద్ధతులూ, శక్తీ అటువంటివి. సంగమం జరిగిన అనంతరం కొన్ని పద్ధతులను అవలంభించడం ద్వారా లింగనిర్ధారణ మన చేతుల్లో ఉన్నదని కూడా మన శాస్త్రాలు చెప్తున్నాయి. పుట్టబోయే బిడ్డయొక్క లింగనిర్ధారణ చేయగలిగే విధానాలు నేటికీ కోణార్క్‌లోని సూర్య దేవాలయంపై వ్రాయబడి ఉన్నాయి. వెళ్ళి చూడవచ్చు.

ఈసారి మరో విషయం చూద్దాం. అర్జునుడు చెప్తుండగా సుభద్ర గర్భంలోని అభిమన్యుడు "పద్మవ్యూహ రచన" వినడం కేవలం కథాలంకార విశేషం. నిజానికి సుభద్ర సగంవరకూ వ్యూహరచన విన్నది. ఆ ప్రభావం గర్భస్థ శిశువైన అభిమన్యునికి అంటింది. సుభద్ర నిద్రలోకి జారగానే, మిగిలిన వ్యూహరచన అభిమన్యునికి చేరలేదు.

అలాగే హిరణ్యకశిపుని భార్య లీలావతి గర్భంలో ఉన్న ప్రహ్లాదునికి నారదుడు హరిభక్తిని ఉపదేశించడం కథాలంకారమే! నిజానికి నారదుడు లీలావతికే హరిభక్తిని ఉపదేశించాడు. అయితే ఆ ఉపదేశ ప్రభావం ఆమె గర్భంలో ఉన్న ప్రహ్లాదునిపై పడింది. దాంతో అతను 'హరిభక్తుడుగా' జన్మించాడు.

మహాభారతంలో ఉన్న 'అష్టావక్రుని కథ' కూడా ఈ కోవకు చెందినదే! ఏకపాదుడనే ముని, అష్టావక్రుని తండ్రి. ఏకపాదుడు మహావిద్వాంసుడు. శిష్యులచేత ఎప్పుడూ వేదాల్ని చదివిస్తుండేవాడు. ఏకపాదుని భార్య సుజాత. ఆమె గర్భంలో అష్టావక్రుడు ఉండగా ఒక చిత్రం జరిగింది. ఏకపాదుడు తన శిష్యులకు పగలూ, రాత్రీ విరామం లేకుండా పాఠాల్ని చెప్పడాన్ని తల్లి గర్భంలోనుండే గమనించాడట అష్టావక్రుడు. తండ్రిపద్ధతి నచ్చక ఆయన్ని ఉద్దేశించి "శిష్యులచే రేయింబవళ్ళు చదివించడమేనా? నిద్రా అదీ లేక వారు మందమతులౌతున్నారు. ఏం చదువుతున్నారో

వారికే తెలియకుండా ఉంది. ఏం చదువిది?" అని అష్టావక్రుడు, తల్లి గర్భంలోంచే అడిగాడట. ఆవిధంగా కుమారుడు తనను ఆక్షేపించడంతో ఏకపాదునికి ఆగ్రహం కలిగింది. "వేదాధ్యయనానికి వంకలు పలుకుతున్నావు. అందుచేత అష్ట (8) వంకరలతో పుడతావు" అంటూ కొడుకుని శపించాడు. ఆ కారణంగా అష్టవంకరలతో పుట్టిన ఆ శిశువుకు "అష్టావక్రుడు" అనే నామం స్థిరపడింది. ఇదీ అష్టావక్రుని కథ. అయితే దీనిలో అంతర్లీనంగా ఇమిడిఉన్న విశేషాంశాన్ని ఇప్పుడు పరిశీలిద్దాం. నిజానికి శిష్యుల ప్రయాస చూసి బాధపడిన వ్యక్తి "సుజాత". అంతేగాని ఆమె గర్భంలోని అష్టావక్రుడు కాదు. సరైన నిద్రకూడా లేక మందమతులౌతున్న శిష్యగణం, వేదాలు సరిగా చదవలేకపోవడం చూసి ఆమె మనసు వికలత్వం చెందింది. ఆమెకు కలిగిన ఆ మనోవికలత్వం "గర్భస్థ శిశువును" దెబ్బతీసింది. ఆ కారణంగా 8 వంకరలతో శిశువుకు వికలత్వం ఏర్పడింది. ఈ కథలో అంతర్లీనంగా ఉన్న యదార్థం ఇది! గర్భస్థ శిశువు తన తండ్రితో మాట్లాడ్డం, ఆయన కోపించి శపించడం .... ఇవన్నీ వ్యాసమహర్షి చమత్కారాలు. తల్లి ఆలోచనా సరళి ప్రభావం గర్భస్థ శిశువుపై పడుతుందనే ఫ్రాయిడ్ సిద్ధాంతం, ఏనాటిదో అయిన ఈ గాథలో కన్పిస్తుంది చూడండి.

గర్భవతి అయిన సుభద్ర వీరగాధలు వినడంవల్లా, వ్యూహరచనలు వినడం వల్లా ఆమెకు మహావీరుడైన 'అభిమన్యుడు' పుట్టాడు. గర్భవతిగా ఉన్నప్పుడు లీలావతి సేవించిన భక్తిరసం వల్ల ఆమె బిడ్డ 'ప్రహ్లాదుడు' మహా భక్తుడయ్యాడు. గర్భవతి అయిన అష్టావక్రుని తల్లి మనోవైకల్యం పొందిన కారణంగా, ఆమెకు పుట్టిన శిశువు అష్టవంకరలతో పుట్టాడు.

గర్భవతి మనోభావాలు శిశువుపై ప్రభావం చూపుతాయని పై విషయాలవల్ల తెలుస్తోంది. 'గర్భవతులు భక్తిగాథలూ, వీరగాథలూ వినాలనీ, చదవాలనీ, ఎల్లప్పుడూ అందమైన, ఆరోగ్యవంతమైన బిడ్డ తలంపుతో ఉండాలనీ; భయంకర వార్తలూ, విషాద వార్తలూ వినకూడదనీ, అలాంటి దృశ్యాలు చూడరాదనీ' అంటారు. ఆధునిక వైద్యులు కూడా వీటిని ధృవీకరిస్తున్నారు. ఈ విషయాలనన్నింటినీ మన పూర్వీకులు కొన్ని ఆచార వ్యవహారాలుగా మలిచారు. (గర్భవతులు గ్రహణాలు చూడరాదనీ, కూరగాయలు తరగరాదనీ కూడా మనవాళ్ళు అంటూంటారు. ఎందువల్లనంటే ఆకారంలో తరుగుదల కన్పించే సూర్యచంద్రులూ, కూరగాయలూ ఆమె మనోస్థితిలో మార్పు తేగలవేమోనని పెద్దలు భావించి ఉంటారు.) ఇప్పట్లో బిడ్డలు వద్దు అనుకునే దంపతులు (ముఖ్యంగా భార్య) సంభోగ సమయంలో గానీ, ముందుగానీ లేదా తర్వాత గానీ చంటిపిల్లల్ని చూడరాదనే సాంప్రదాయం ఉంది. దీనికీ పై సిద్ధాంతమే కారణం.

గర్భంలో రూపుదిద్దుకుంటున్న బిడ్డయొక్క అందం, ఆరోగ్యం, గుణం, ధైర్యం, విజ్ఞానం, వీరత్వం ..... ఇలాంటి ఎన్నో విషయాలు, తల్లి మనోగత పరిస్థితులపై కూడా అధారపడి ఉంటాయని "ఆధునిక సైన్స్" చెప్తోంది. (ఈ సూత్ర ప్రకారమే కశ్యపుడు, వ్యాసుడు తమ ద్వారా కలగబోయే బిడ్డల స్థితిగతులను ముందుగానే చెప్పగలిగారు.)

కెనడాకు చెందిన ప్రఖ్యాత మానసిక శాస్త్రవేత్త 'డాక్టర్ థామస్ వెర్నే' పైన తెలిపిన మన ప్రాచీన విజ్ఞాన విషయాలకు అనుకూలమైన అభిప్రాయాలతో "ది సీక్రెట్స్ అఫ్ ది అన్‌బోర్న్ చైల్డ్" అనే గ్రంథాన్ని ఇటీవలే వ్రాశాడు.

మన పూర్వీకులకు తెలిసిన "పాత విజ్ఞానాన్నే", విదేశీయులచే "క్రొత్త విజ్ఞానంగా" చెప్పించుకుంటున్నాం మనం. అదీ అసలు సంగతి!!

★ ★ ★

# 15. రామాయణంలో కన్పిస్తున్న జీవపరిణామ సిద్ధాంతం

ఆధునిక కాలంలో డార్విన్ అనే శాస్త్రవేత్త జీవపరిణామ సిద్ధాంతాన్ని చెప్పాడు. ఈ పరిణామ సిద్ధాంత ప్రకారం, సుమారు 10 లక్షల సంవత్సరాల క్రిందట కోతి నుండి క్రమంగా మనిషి రూపొందడం జరిగిందని చెప్పబడింది. ఇప్పటినుండి 10 లక్షల సంవత్సరాల వెనక్కి అంటే, త్రేతాయుగంలోకి వెళ్తాం మనం. త్రేతాయుగం అనగా 'రామాయణ కాలం'. వాల్మీకి మహర్షి తన రామాయణ గ్రంథంలో కోతినుండి మనిషి పరిణామదశను సూచించడం కనపడుతోంది.

అతి ప్రాచీనకాలంలో భూమిపై అటు ఉత్తరధ్రువం, ఇటు దక్షిణధ్రువం 'సమశీతోష్ణమండలాలు'గా నివాసయోగ్యమై ఉండేవి. భూమిపై ముందుగా ఈ రెండు ధ్రువప్రాంతాలలోనూ మానవజాతి ఏర్పడి నివసించేది. క్రమంగా సూర్యుని ఉష్ణోగ్రత తగ్గుతూండడంవల్ల మెల్లగా భూమి 'మంచుగోళం'గా మారే దశలోకి వెళ్తోంది. ఉత్తర, దక్షిణ ధ్రువాలు మంచుమయంగా తయారవుతూ ఉండడంతో ఉత్తరధ్రువం లోని మానవజాతి, భూమధ్యరేఖ వైపు క్రిందకు దిగడం ప్రారంభించింది. అలాగే దక్షిణధ్రువంలోని మానవజాతి కూడా తమస్థానాన్ని వీడి, భూమధ్యరేఖ దిశగా పైకి విస్తరించడం ప్రారంభించింది. భూమధ్యరేఖా ప్రాంతానికి ఇటూ అటూ సమశీతోష్ణ వాతావరణం ఏర్పడసాగింది. అనుకూల వాతావరణం వైపుగా శ్రీరాముని ముందు

తరాలవారు ఉత్తరధ్రువంనుండి క్రిందకు దిగిరావడం, రావణాసురుని ముందు తరాలవారు దక్షిణధ్రువం నుండి పైకి విస్తరించడం జరిగాయన్నమాట. ఉత్తరధ్రువం నుండి క్రిందకు దిగివచ్చిన శ్రీరాముని వంశం వారు 'అయోధ్య ప్రాంతంలో' నివాసం ఏర్పరచుకున్నారు. దక్షిణధ్రువం నుండి పైకి విస్తరించిన రావణాసురుని జాతి 'లంక ప్రాంతం'లో నివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఈ రెండు జాతుల మధ్యనున్న ఉష్ణప్రాంతం అప్పటికే 'వానరజాతి' తో నిండి ఉంది. అక్కడి వానరజాతి మానవ లక్షణాలను పొందుతూ, కోతినుండి మనిషి రూపొందుతున్న దశలో ఉందన్నమాట. వాలి, సుగ్రీవుడూ, హనుమంతుడూ మొదలగువారు ఆ జాతివారే! 10 లక్షల సంవత్సరాల క్రితం కోతినుండి మానవుడు రూపొందే దశను, వాల్మీకి మహర్షి తన రామాయణ గ్రంథంలో స్పష్టంగా చూపిస్తున్నాడు.

★ ★ ★

## 16. పురాణకాల మంత్రాలు - ఆధునిక సైన్సు

పురాణాల్లోని సైన్సు విషయాల్ని తెలుసుకునేటప్పుడు "మంత్రం" అనే అంశాన్ని గూర్చి ఒక అవగాహన కలిగి ఉండాలి మనం. ఎందువల్లనంటే పురాణాల్లో అనేక మంత్రతంత్రాలు కన్పిస్తాయి మనకు. అందువల్ల మంత్రాలకూ, సైన్సుకూ ఉన్న సంబంధాన్ని మనం తెలుసుకుని తీరాలి. పురాణకాలాన్ని 'మంత్రయుగమనీ', ఆధునిక కాలాన్ని'యంత్రయుగమనీ' అంటూంటారు. అది యదార్థమే!

'మంత్రం' అనేది సైన్సుకు విరుద్ధమని చాలామంది అనుకుంటారు. కానీ అది నిజం కాదు. మంత్రం అనేది ఒక సైన్సు ప్రక్రియే! అయితే ఈ విషయం తెలియని వాళ్ళంతా "మంత్రాలకు చింతకాయలు రాలతాయా?" అని హేళన చేస్తుంటారు.

### మంత్రం అంటే ఏమిటి?

నిర్ణీత పౌనఃపున్యం (Frequency) తో ఉచ్ఛరించబడే శబ్దతరంగాలే "మంత్రాలు". మంత్ర శబ్ద తరంగాలు చాలా శక్తివంతమైనవి.

శబ్దతరంగాలకున్న శక్తిని ముందుగా అర్థం చేసుకోగలిగితే, మంత్రంయొక్క ప్రభావాన్ని తెలుసుకోగలం. నిర్ణీత పౌనఃపున్యం కలిగిన శబ్ద తరంగాలు జీవులమీదా, ప్రకృతిమీదా, సృష్టిమీదా ప్రభావాన్ని కల్గిస్తాయి. ఇది సైన్సు ఒప్పుకుంటున్న సత్యం కూడా! జీవుల శారీరక, మానసిక స్థితులపై శబ్దతరంగాల ప్రభావం చాలా ఉన్నదని

ఆధునిక పరిశోధనలు నిరూపిస్తున్నాయి. కొన్నిరకాల శబ్దతరంగాల వల్ల ఆరోగ్యం క్షీణించడం, భయం కలగడం, నిరాశ కలగడం; మరికొన్నిరకాల శబ్ద తరంగాలవల్ల ఆరోగ్యం మెరుగుకావడం, ఉత్సాహం పుట్టడం మొదలైనవి శాస్త్రవేత్తలు గమనిస్తున్నారు. నిత్యజీవితంలో సంగీతమూ, పాటలూ మొదలగునవి మన మనసుపై ప్రభావాన్ని చూపడం మనకు తెలిసిన విషయమే కదా! మొత్తంమీద జీవులను ప్రభావితం చేయగల శక్తి, శబ్దానికి ఉన్నదని తెలుస్తోంది. మంత్రాలంటే శక్తివంతమైన శబ్దతరంగాలే! అందువల్లనే మంత్ర ప్రభావం మన సూక్ష్మగ్రంథులపైనా, షట్చక్రాలపైనా, శక్తికేంద్రాల పైనా సూటిగా పడుతుంది. అప్పుడు మనలోని సూక్ష్మజగత్‌శక్తి కేంద్రం జాగృతమౌతుంది. వివిధ మంత్ర శబ్దాలు వాటికి సంబంధించిన గ్రంథులకు చలనం కలగజేస్తాయి. అవి పోగొట్టుకున్న శక్తిని మేల్కొలుపుతాయి. మంత్రోచ్ఛారణ ద్వారా ఉద్భవించిన శబ్దతరంగాలు ముందుగా చెవిని చేరి, తద్వారా మెదడుకు వెళ్తాయి. మెదడుకు అన్ని అంగములతో సంబంధం ఉండుటచేత, ఆ మంత్ర శబ్ద తరంగాల ప్రభావం, ప్రతీ అవయవం మీదా పడగలదు. శబ్దతరంగాల ప్రభావం కేవలం మనుషులమీదనే కాదు. పశువులు, పంటలూ, మొక్కలూ, వృక్షాలపై కూడా ఉంటుందని ఆధునిక పరిశోధనలు తెలుపుతున్నాయి. సంగీతం వినిపించడం వల్ల ఆవులు, గేదెలు హెచ్చుగా పాలివ్వడం, పంట దిగుబడి పెరగడం వంటి విచిత్రాలు ఈ ఆధునిక కాలంలో మన కళ్ళముందు జరుగుతున్నాయి. సంగీత శబ్దతరంగాల ద్వారా మనుషుల వ్యాధుల్ని తగ్గించడం, ఆధునిక వైద్యంలో ఒక ప్రక్రియగా ఉంటోంది.

భాషలోని అక్షరాలు బీజాలు. ప్రతీ బీజమూ ఒక ప్రత్యేక మహత్తును కలిగిఉంటుంది. ఈ బీజముల ఏకీకరణమే 'మంత్రనిర్మాణం'. స్పష్టమైన ఉచ్ఛారణ కలిగి, సరైన పౌనఃపున్యంతో శబ్దతరంగాల్ని సృష్టించగల ఏకైక భాష "సంస్కృతం". దేవభాషగా పేరొందిన ఈ సంస్కృతంలోనే మంత్రాలన్నీ ఉన్నాయి.

ఈ జగత్తు స్థూలమనీ, సూక్ష్మమనీ రెండు విధాలు. మన కళ్ళకు కన్పించేది 'స్థూలము' అనీ, కళ్ళకు కన్పించనిదీ, కొలతకూ, తూకానికీ దొరకనిదీ, ప్రత్యేకించి స్థలాన్ని కోరనిదీ 'సూక్ష్మము' అనీ చెప్పబడుతోంది. ఉదాహరణకు చూడండి. శరీరం అనేది 'స్థూలం'. 'మనస్సు' అనేది 'సూక్ష్మం'. స్థూలమైన దానికంటే సూక్ష్మమైన దానికే శక్తి ఎక్కువ. (మన శారీరక శక్తి కంటే, మానసిక శక్తి చాలా గొప్పది.) సూక్ష్మశక్తుల జాగృతివల్లనే మానవుడు 'మహాత్ముడై' అసాధారణ కార్యాలు చేయ గలుగుతాడు. ఈ సూక్ష్మజీవుల జాగృతికి, మంత్రశబ్ద తరంగాలు తోడ్పడతాయి. జీవులలోని అంతఃశక్తులనే కాదు, ప్రకృతియందు ఆవరించివున్న అనేక అదృశ్యశక్తుల్ని

మంత్రాలు ప్రేరేపించగలవు. వర్షాలు కురిపించడం, దీపాలను వెలిగించడం మొదలగు పనులు, సంగీతమనే శబ్దతరంగాల ప్రక్రియతో మన పూర్వీకులు సాధించి చూపారు. అణువులను కదిలించగల శక్తి 'శబ్దతరంగాలకు' ఉండడంవల్లనే ఇవన్నీ సాగుతున్నాయి. అయితే ఇక్కడో ముఖ్యవిషయాన్ని మనం గమనించాలి. మంత్రాల్ని పలికినప్పుడు చాలా స్పష్టంగా పలకాలి. ఖచ్చితమైన పౌనఃపున్యంతో నిర్ణీత స్వరాన్ని అనుసరించి పలకాలి. అలా అయితేనే దాని ఫలితం ఉంటుంది. జీవుల వివిధ అంగాల సూక్ష్మశక్తుల్నీ, ప్రకృతిలో వ్యాపించి ఉన్న వివిధ శక్తుల్నీ ప్రేరేపించడానికి, దైవశక్తిని మనకు అనుసంధాన పరచడానికీ 'మంత్రశబ్దాలు' ఉపకరిస్తాయి.

## ప్రకృతి శక్తులను ప్రేరేపించగల శక్తి "మంత్రాలకు" ఉన్నదా?

ఖచ్చితంగా ఉంది. నిర్ణీత పౌనఃపున్యం (Frequency) తో వెలువడే మంత్రశబ్ద తరంగాలు, ప్రకృతిలోని అద్భుత శక్తుల్ని పలుకరించగలవు. ప్రకృతిలో కొన్ని మార్పులను కల్గించగలవు. అంతేకాదు. ప్రకృతిలోనే కాకుండా సృష్టిలో కూడా అనంతంగా వ్యాపించి ఉన్న (దైవ) శక్తిని మంత్రాలు మనకు అనుసంధాన పరచగలవు. (దైవాంశను మనకు అనుసంధానపరచే శబ్దమే "ఓంకారమని" గమనించండి.) అయితే మంత్రానికి "త్రికరణ శుద్ధి" అవసరం. మనసా, వాచా, కర్మణా శుద్ధి కలిగిన జీవికే మంత్రోచ్ఛారణ సంపూర్ణ ఫలితాన్ని ఇస్తుంది. అయితే నేటికాలంలో త్రికరణ శుద్ధి అనేది చాలావరకూ తరిగిపోయింది. అందువల్లనే మంత్రాల ప్రభావం కూడా తగ్గిపోయింది. పురాణకాల మేధావులు మంత్రాలకు చింతకాయలన్నేకాదు, అవసరమైతే నక్షత్రాలను కూడా రాలగొట్టగలిగే శక్తి కలిగి ఉండేవారు. అన్నివిధాలా భ్రష్టుడైన నేటి కలియుగ మానవుడు మాత్రం - మంత్రాల ద్వారా చింతకాయల్ని కాదుగదా, పువ్వులోని పుప్పొడిని కూడా రాలగొట్టలేడు. మనకు ఫలించనంత మాత్రాన మంత్రశక్తిని విమర్శించడం అవివేకం. చేతకాకపోయినా కూడా కనీసం శాస్త్రీయ సత్యాన్ని తెలుసు కోవడం వివేకం. ఆధ్యాత్మిక శక్తి ద్వారా దైవశక్తి సహాయంతో కార్యాలు సాధించగలిగేది "మంత్రం". మనసు యొక్క యుక్తితో, తద్వారా పుట్టిన శక్తితో కార్యాలు సాధించేది "యంత్రం" (Machine).

## శబ్ద తరంగ శక్తికి ఒక ఉదాహరణ

నిర్ణీత పౌనఃపున్యంతో వెలువడే మంత్రశబ్దాలు ప్రకృతిలోని అద్భుత శక్తుల్ని పలకరించగలవా? వాటినుండి జవాబు పొందగలవా? ఇవి చాలా సహజమైన ప్రశ్నలు. వీటికి నిదర్శన సహితంగా జవాబు చెప్పగలగాలి. అప్పుడే మంత్రప్రభావం నిజమని

తెలుస్తుంది. ప్రకృతిలోని అదృశ్యశక్తిని పలుకరించగల శక్తి శబ్దతరంగాలకు ఉన్నదా? అనే విషయాన్ని పరిశీలించాలి మనం. ఇందుకోసం ఒక చిన్న ఉదాహరణగా "కీ ట్రేసర్" అనే పరికరం గురించి తెలుసుకుందాం.

'కీ' ట్రేసర్ : తాళం చెవులు తగిలించుకునే 'కీ ట్రేసర్' అనే పరికరం, అగ్గిపెట్టె సైజులో ఉంటుంది. బ్యాటరీ సహాయంతో పనిచేస్తుంది. తాళం చెవులతో సహా అది గదిలో ఏమూల పడిపోయినా, మనం కష్టబడి వెదకనవసరం లేదు. 'ఒక విజిల్' వేస్తే చాలు. కీ ట్రేసర్ ఏ మూలనున్నాసరే, అక్కణ్ణుంచే మూడుసార్లు కూతకూస్తూ మనకు బదులిస్తుంది. మనకు తాళంచెవుల ఆచూకీనిస్తుంది కనుక దాన్ని 'కీ ట్రేసర్' అన్నారు. మనం వేసే విజిల్ పుట్టించిన శబ్దతరంగాలు తనకు చేరగానే, దానికి సమాధానంగా మూడుసార్లు కూస్తుంది కీ ట్రేసర్. ఈ కీ ట్రేసర్‌లలో రకరకాలుంటాయి. అన్నీ ఒకేరకం విజిల్‌కు బదులు పలకవు. ఒక్కొక్క కీ ట్రేసర్‌కు ఒక్కొక్క రకం విజిల్ అవసరమౌతుంది. కొనేముందు విజిల్ వేసి పరీక్షించుకుని, కీ ట్రేసర్‌ను ఎంచుకోవాలి. అంటే ఒక్కొక్క కీ ట్రేసర్ ఒక్కొక్క విధంగా, నిర్ణీత పౌనఃపున్యం కలిగిన విజిల్ (శబ్ద) తరంగాలకు సమాధానం ఇస్తుందన్నమాట. ఇదంతా మన కంటికి అందని విషయం. కానీ కళ్ళముందు జరుగుతున్న యదార్థం. అందువల్లనే "కంటికి అందనంత మాత్రాన ఏ శక్తీ లేదంటూ కొట్టిపారేయకూడదు". నిర్ణీత పౌనఃపున్యంతో వెళ్ళే శబ్ద తరంగాలకు బదులిచ్చే శక్తులుంటాయని 'కీ ట్రేసర్' ద్వారా మనకు అర్థమౌతోంది. మంత్రశక్తి కూడా ఇటువంటిదే! మంత్రశబ్ద తరంగాలతో ప్రకృతి శక్తులను పలకరించి, బదులు పొందవచ్చునని ఇందుమూలంగా తెలుస్తోంది.

కంటికి కనపడితేనే నమ్ముతాం అనే సిద్ధాంతం అన్నివేళలా కుదరదు. కంటికి అందని శక్తులు సృష్టిలో అనేకం ఉన్నాయి. విద్యుచ్ఛక్తి, అయస్కాంతశక్తి మొదలగు శక్తులు ఈ కోవకు చెందినవే!

## సృష్టిలో శక్తియొక్క రూపాలు

సృష్టిలో శక్తి అనేది "అయస్కాంత, విద్యుత్, కాంతి, ఉష్ణ, గురుత్వాకర్షణ" వంటి వివిధ రూపాలలో ఉంటుంది. ఈ శక్తి రూపాలన్నింటిలోనూ కేవలం కాంతిలోని కొన్నిరకాల పౌనఃపున్యాల్ని కలిగిన శక్తిభాగాన్ని మాత్రమే (ఇంద్రధనుస్సులో కన్పించే రంగులను మాత్రమే) మనం చూడగలం. మిగిలిన ఏ శక్తినీ మనం చూడలేము. అయితే ఆ శక్తుల ద్వారానూ మరియు శబ్దతరంగాల ద్వారానూ మన కంటి చూపులకు అందని విధంగా సృష్టిలో అనేక కార్యాలు జరుగుతున్నాయి. (మన కంటిచూపు ఎంత శక్తి హీనమైనదో దీన్నిబట్టి తెలుస్తోంది.)

## నేటి రిమోట్ కంట్రోల్ సిస్టమ్

సాధారణంగా రిమోట్ కంట్రోల్ సిస్టం కోసం 'ఇన్‌ఫ్రారెడ్ కాంతికిరణాల్ని' ఉపయోగిస్తారు. ఇవి కంటికి కనపడవు. ఈ ఇన్‌ఫ్రారెడ్ కాంతికిరణాలు అదృశ్య రూపంలో వెళ్ళి, నిర్ణీత లక్ష్యాన్ని నెరవేరుస్తాయి. ఆధునిక కాలంలో ఇదీ ఒక మహాత్మ్యమే కదా!

ఈవిధంగా కంటికి కనిపించని కొన్నిరకాల కాంతి కిరణాల వల్లనూ, కొన్నిరకాల శబ్దతరంగాల వల్లనూ అనేక కార్యాలు చిత్రవిచిత్రంగా నెరవేరడం నేడు మనం చూస్తున్నాం. కంటికి కనిపించని మంత్రశబ్ద తరంగాల శక్తి కూడా ఈవిధంగానే పనిచేసి, అనేక మహత్కార్యాలను సాధించగలదు. పురాణకాలంలో వర్షాలకోసం యజ్ఞాలు చేసేవారు. ఆ యజ్ఞ సమయాల్లో ఋషులు చదివే మంత్రాల శబ్ద తరంగాలు ఆకాశంలోకి వెళ్ళి మేఘాల సమీకరణకు తోడ్పడేవి. ఈవిధంగా మంత్రాల వల్ల అనేక కార్యాలు నెరవేరడం పురాణాల్లో కన్పిస్తుంది. పరుచ్ఛేపుడు అనే మహర్షి 'సామిధేనీ మంత్రాలను' ఉచ్చరించి తడిచిపోయిన కట్టెలో అగ్ని పుట్టించాడని 'కృష్ణ యజుస్సంహిత' చెప్తోంది. మన అధర్వణ వేదమంతా వైద్యానికి ఉపయోగపడే మంత్రాలు, సామాజిక జీవనానికి ఉపయోగపడే మంత్రాలతో నిండి ఉంది.

## ఓంకారం ఒక అద్భుత మంత్రం

మంత్ర శబ్దాలకు శక్తివంతమైన తరంగ దైర్ఘ్యం ఉంటుందనీ, ఆ తరంగాలు ప్రకృతిలోని అదృశ్య (దైవ) శక్తులను కదిలిస్తాయనీ, పలకరిస్తాయనీ, మనకు అనుసంధాన పరుస్తాయనీ ఇంతకుముందే తెలుసుకున్నాం. ప్రకృతి శక్తులను ప్రేరేపించగల మంత్రశబ్దాలను రూపొందించి సిద్ధపరిచారు మన ఋషీశ్వరులు. త్రికరణ శుద్ధితో ఆ మంత్రాలను జపించడమే మనం చేయవలసిన పని. అక్కడితో ఎన్నో అద్భుత శక్తులు మనకు సంక్రమిస్తాయి. మానవుడు మహాత్ముడౌతాడు.

ఓంకారం అనేది ఒక మహామంత్రం. ప్రత్యేకించి రూపొందించి సిద్ధపరచిన మంత్రం కాదది. అదే దాని ప్రత్యేకత! అన్నింటికంటే ఆదిలో పరమాత్మ తత్త్వం నుండీ స్వతహాగా ఉద్భవించిన నాదం అది. ఓంకార నాదం నుండే సృష్టిలోని సకలమూ ఉద్భవించడం జరిగిందని పురాణాలు చెప్తున్నాయి. దైవశక్తిని మనకు అనుసంధాన పరచడంలో ఓంకారం మనకు చక్కగా ఉపకరిస్తుంది. ధ్యాన ముద్రలో ఉండి ఓంకారాన్ని నిర్ణీత స్వరంతో అతిదీర్ఘంగా అనేకసార్లు ఉచ్చరించాలి. అప్పుడు ఆ శబ్దతరంగాలు వాతావరణమంతా వ్యాపించి, సర్వవ్యాపకమైన దైవశక్తిని

ప్రవేశిస్తాయి. తద్వారా సర్వజనులకూ శుభమూ, సుఖమూ కలుగుతాయి. (కేవలం జపించిన వారికే కాకుండా యావత్ ప్రపంచానికీ శాంతి సౌభాగ్యాలను కల్గిస్తుంది ఓంకారం.) క్లుప్తంగా చెప్పుకోవాలంటే ఓంకారం యొక్క మహాత్మ్యం ఇది.

మొత్తంమీద మనం గ్రహించవలసినదేమంటే - "మంత్రం" అనేది ఒక శాస్త్రీయ ప్రక్రియ. మంత్రాలనేవి సైన్సుకు వ్యతిరేకమైనవి కావు. వివిధ పౌనఃపున్యాల శబ్దతరంగాలతో, శక్తివంతమైన తరంగ దైర్ఘ్యంతో అదృశ్యశక్తులచే పనిచేయించడమే మంత్రాలు చేసే పని. శాస్త్రీయంగా ఇది అంగీకారమైన ప్రక్రియే!

★ ★ ★

## 17. అలనాటి ఆకాశ, అంతరిక్ష విహారాలు

ఈ అధునిక యుగాన విమానాల్లో ఆకాశ విహారాలూ, రాకెట్లలో అంతరిక్ష విహారాలూ విరివిగా సాగుతున్నాయి. ఈ ఆకాశ, అంతరిక్ష విహారాలను చూస్తూ, మనం సైన్సులో పండిపోయామనుకుంటూ సంబరపడుతుంటాం. అయితే ఆకాశ, అంతరిక్ష విహారాలు మన పురాణకాలానికి క్రొత్తేంకాదు. పురాణకాలంలో ఇంతకంటే ఘనమైన ఆకాశ, అంతరిక్ష విహారాలు సాగినట్లు మనకు గ్రంథపరంగా తెలుస్తోంది. విజ్ఞానం అనేది పురాణకాలం నుండీ ఉన్నదే! కాకపోతే కాలానుగుణంగా అందులో కొన్ని మార్పులూ, చేర్పులూ వస్తున్నాయంతే!

సాధారణంగా అధునిక విమానాలు భూవాతావరణ పరిధిలోనే తిరుగు తుంటాయి. అయితే ఈ మధ్య అమెరికా వారు తయారు చేసిన 'డిస్కవరీ, ఛాలెంజర్' వంటి స్పేస్ షటిల్స్ అంతరిక్షంలోకి కూడా వెళ్ళి వస్తున్నాయి. వీటిని 'టు-ఇన్-వన్' విమానాలుగా చెప్పుకోవచ్చు. అయితే వీటి వాడకం చాలా పరిమితం. పురాణకాలంలో కూడా టు-ఇన్-ఒన్' విమానాలుండేవని ఋగ్వేదం చెప్తోంది. ఇటు భూవాతావరణ పరిధిలోనూ, అటు అంతరిక్షంలోనూ కూడా అవి ప్రయాణించి వచ్చేవట. అటువంటి విమానాలు ఆనాడు సర్వసాధారణమైనవని ఋగ్వేదం ద్వారా తెలుస్తోంది.

విమానం కనిపెట్టింది ఎవరని అడిగితే 'రైట్ సోదరులంటూ' పాశ్చాత్యుల పేర్లు చెప్తూ ఉంటాం మనం. అది చాలా పొరబాటు. రైట్ సోదరులకంటే వేలవేల సంవత్సరాల పూర్వమే మన హైందవులకు 'విమానయానం' తెలుసు.

### వేదకాలంనాటి విహారాలు

వేదకాలం నాటికి విమానయానం తెలుసునని ఋగ్వేదం అనేకచోట్ల

సాక్ష్యమిస్తోంది. ఋగ్వేదంలోని ప్రథమ మండలంలో 116 వ సూక్తంలోని 3వ మంత్రంలో ఇలా ఉంది - "తుగ్రుడనే రాజర్షి తన శత్రువులను జయించడం కోసం భుజ్యుడనే తన కొడుకును విమానంలో పంపాడు. ఆ విమానాన్ని అశ్వినీదేవతలు నడిపారు. (అశ్వినీదేవతలను అతి ప్రసిద్ధ పైలెట్లుగా వేదాల్లో చెప్పడం జరిగింది.) ఆ విమానం యంత్రాలతో నడిచిందట. దానికి అంతరిక్షంలో తిరగగల సామర్థ్యం ఉందట. అది నీటిపై నడిచే విమానం కాదని ప్రత్యేకించి చెప్పబడింది. ఆనాటి విమానాలు జలంలోనూ, భూవాతావరణ పరిధిలోనూ, అంతరిక్షంలోనూ తిరగ గలిగేవిగా ఉండేవట. ఆధునిక కాలంలో మనమింకా ఇలా మూడురకాలుగా నడిచే శక్తిగల విమానాలను తయారు చేసుకోలేదు.

విమానాల ప్రస్తావన కేవలం ఋగ్వేదంలోనే కాకుండా యజుర్వేదంలోనూ (19-43, 19-54), అధర్వణ వేదంలోనూ (7-63-3) కూడా ఉంది. ఆ విమానాలకు మూడు చక్రాలున్నట్లు ఋక్సంహిత (8-58-3) చెప్తున్నది. పురాణకాలంలో దేవతలూ, మానవులూ కూడా రకరకాల విమానాల్ని ఉపయోగించినట్లుగా ప్రాచీన గ్రంథాల వల్ల తెలుస్తోంది. ఆ గ్రంథాల వివరాల్ని ఇస్తూ, తన స్వంత సిద్ధాంతాలను కూడా అందించిన ప్రాచీన విజ్ఞాని 'భరద్వాజుడు". ఈయన బృహస్పతి కుమారుడు. భరద్వాజుడు వ్రాసిన గ్రంథం పేరు "యంత్రసర్వస్వం". ఇందులో మొత్తం 40 అధ్యాయాలు ఉండేవట. అయితే మనకు మాత్రం వాటిలో చివరి అధ్యాయమైన "వైమానిక శాస్త్రం" యొక్క విశేషాలే కొన్ని లభిస్తున్నాయి.

## భరధ్వాజుని వైమానిక శాస్త్రం

1952లో మైసూరులోని అంతర్జాతీయ సంస్కృత అకాడమీ డైరెక్టరు జి.ఆర్. జైసార్ గారికి భరధ్వాజుని వైమానికి శాస్త్రానికి చెందిన అంశాలు లభించాయట. సంస్కృతంలో ఉన్న అతి ప్రాచీన ప్రతి అది. ప్రస్తుతం దాన్ని బరోడా మహారాజా వారి గ్రంథాలయంలో చూడవచ్చు. భరధ్వాజుని వైమానిక శాస్త్రం 8 అధ్యాయాలతో, 100 అధికరణాలతో, 500 సూత్రాలతో ఉండేదట. అందులో కేవలం 37 సూత్రాలు మాత్రమే మనకు లభించాయి.

భరధ్వాజుడు తన గ్రంథంలో ఆనాటి వైమానిక శాస్త్రజ్ఞులైన నారాయణముని, శౌనకముని, గర్గుడు, వాచస్పతి, చాక్రాయణి, దండినాథుడు, విశ్వనాథుడు, గౌతముడు, లల్లాచార్యుడు, విశ్వంభరుడు, అగస్త్యుడు, గోభిలుడు, అత్రి, గాలవుడు, వ్యాసుడు మొదలైన ముప్పైఆరు మంది గురించి వివరాలిచ్చాడు. వారంతా రచించిన

విమానయాన శాస్త్రాల పట్టిక (క్రియాసారః, యంత్రకల్పం, శౌనకీయం, లోహతంత్రం, దర్పణ ప్రకరణం, విమాన చంద్రిక, వ్యోమయాన తంత్రం, ఖేటయాన ప్రదీపిక, యానబిందువు, మణిభద్రకారిక, లోహప్రకరణం, వ్యోమయానార్క ప్రకాశః, శక్తితంత్రం, దర్పణ శాస్త్రం, ధాతు సర్వస్వం, శబ్దమహోదధి, గతినిర్ణయాధ్యాయః, సమ్మోహక్రియా కాండము, రూపశక్తి ప్రకరణము, ఓషధి కల్పము మొదలగు 97 గ్రంథాల)ను కూడా భరద్వాజుడు ఉదహరించాడు. ఆ గ్రంథాలేవీ మనకు దొరకడం లేదు. లేకుంటే ప్రాచీన విమానాల చరిత్ర మనకు మరింతగా లభించి ఉండేది.

భరద్వాజుడు తన గ్రంథంలో అనేకరకాల విమానాల తయారీ గురించి వివరించాడు. అగ్నితో కూడా నాశనంకాని విమాన తయారీకూడా చెప్పబడింది. నేలమీదా, నీటిలోనూ, వాతావరణంలోనూ, అంతరిక్షంలోనూ పోగల విమానాల్ని గురించి భరద్వాజుడు వివరించాడు.

విమానాలను నడిపేవాళ్ళను "విమాన చోదకులు" (పైలెట్స్) అంటారు. ఆ విమాన చోదకులకు 'లల్లాచార్యుడు' అనే ప్రాచీన విమాన శాస్త్రవేత్త 32 విమాన రహస్యాలను (తన గ్రంథమైన 'రహస్యలహరి'లో) వివరించాడట. వాటి వివరాలను భరద్వాజుడు మనకందించాడు. (ఆ 32 విమాన రహస్యాల పేర్లు ఇవి : 1. మాంత్రిక, 2. తాంత్రిక, 3. కృతక, 4. అంతరాలక, 5. గూఢ 6. దృశ్య, 7. అదృశ్య, 8. పరోక్ష 9. అపరోక్షక, 10. సంకోచ, 11. విస్తృత, 12. విరూపకరణ, 13. రూపాంతర, 14. సురూప, 15. జ్యోతిర్భావ, 16. తమోమయ, 17. ప్రళయ, 18. విముఖ, 19 తారా, 20. మహాశబ్ద విమోహన 21. లంఘన, 22. సర్పగమన, 23.చపల 24. సర్వతోముఖ, 25. పరశబ్ద గ్రాహక 26. రూపాకర్షణ, 27. క్రియా రహస్యహరణ 28. కర్షణ, 29 దిక్ ప్రదర్శన, 30. అకాశాకార, 31. స్తబ్ధక, 32. జలదరూప. ఇవన్నీ కూడా విమానాల్ని నడపడంలోని ప్రత్యేక పద్ధతులు. విమాన చోదకులకు ఈ పద్ధతులన్నీ బాగా తెలిసి ఉండాలి. అంతేగాక రేఖాపథమూ, మండలమూ, కక్ష్య, శక్తి మరియు కేంద్రము అనే ఐదు విధాలైన ఆకాశమార్గాలను గురించి కూడా 'చోదకుడు' అవగాహన కలిగి ఉండాలట.)

అనాటి విమానాలు గ్రహాంతర యానాలు కూడా చేసేవని చెప్పుకున్నాం కదా! అందువల్ల విమానం, వాతావరణ కక్ష్యను దాటేసమయంలో చోదకుడు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో భరద్వాజుడు వివరించాడు. గ్రహాల అకర్షణ నుండి విమానాలను ఎలా తప్పించాలో కూడా తెలియజేయబడిందట. ఋతువులను బట్టి భూవాతావరణంలో రకరకాల మార్పులు కలుగుతుంటాయి కదా! విమాన చోదకుడు

గాలిలో ఎగురుతుంటాడు కనుక, అతను ఆయా వాతావరణాలకు అనుగుణంగా ఉండే దుస్తుల్ని ధరిస్తూ ఉండాలని భరద్వాజుడు సూచించాడు. అటువంటి దుస్తుల తయారీ గురించికూడా తెలిపాడు. చోదకుడు పాటించవలసిన ఆహార నియమాల్ని చెప్పాడు. ఆనాటి విమానాలు ముఖ్యంగా 3 రకాలని వివరించాడు. 1. మాంత్రిక విమానాలు, 2. తాంత్రిక విమానాలు, 3. యాంత్రిక విమానాలు. ఇవి త్రేతాయుగం, ద్వాపర యుగాలలో వాడబడ్డాయట. శకున, సుందర, రుక్మ మండల, వక్రతుండ..... ఇలా 25 పేర్లు గల విమానాలు ఉండేవట. మనకు దొరికిన భరద్వాజుని గ్రంథ భాగంలో సుందర, శకున, రుక్మ అనే విమానాల బొమ్మలుకూడా ఉన్నాయట. విమాన నిర్మాణానికి ఉపయోగించే 16 రకాల తేలికైన లోహాలను గురించి భరద్వాజుడు వివరించాడు. అటువంటి లోహాలను "ఊష్మ లోహాలు" అంటారని చెప్పాడు. కొన్ని క్షారాలవల్లనూ, కొన్ని ద్రావకాల వల్లనూ ఒక రకమైన రసాయన విద్యుత్తును పుట్టించవచ్చుననీ, ఆ విద్యుత్తుతో విమానాల్ని నడిపించవచ్చుననీ భరద్వాజుడు వివరించాడు. మరోవిధంగా కూడా విద్యుచ్ఛక్తిని పుట్టించడానికి "రౌద్రీ దర్పణం" అనే పరికరం గురించి చెప్పాడు. రౌద్రీ దర్పణంవల్ల పుట్టే రౌద్రశక్తితో సూర్యకిరణాల సంయోగం జరుగుతుంది. దానివల్ల "మారికా" అనే శక్తి పుడుతుంది. ఈ మారికా శక్తి వలన ప్రచండమైన విద్యుచ్ఛక్తి పుడుతుందని వివరించాడు భరద్వాజుడు.

విమానాల ద్వారా అనేక అద్భుత కార్యాలను చేయవచ్చుననీ, అందుకు ఉపకరించే 32 రకాల యంత్రాలను గురించి చెప్పాడు. భరద్వాజుడు "యుద్ధ విమానాలను" గురించి కూడా వివరించాడు. శత్రువిమానాలపై ఆయుధాల ప్రయోగం, శత్రువిమాన పైలెట్లకు దృష్టి సరిగా కనపడకుండా భూతద్దాల కాంతిప్రయోగం, శత్రువుల దాడిని తట్టుకునే విమాన చోదక మెలకువలు ... ఇవన్నీ వివరించాడు. ఆనాడు విమాన యుద్ధాల్లో విశ్వక్రియా దర్పణము, శక్తి ఆకర్షక దర్పణము, వైరూప్య దర్పణము, కుంటినీ దర్పణము, పింజులా దర్పణము, గుహగర్భ దర్పణము, రౌద్రీ దర్పణము మొదలగు దర్పణాలను వాడేవారట. ఊర్ధ్వ గమనము, అధోగమనము, చక్రగతి, విచిత్రగతి, ధూమగతి, దక్షిణగతి మొదలైన వివిధ చలన విధానాలు ఆనాటి విమానాలకు తెలుసు. శక్త్యాకర్షణ, మంత్రవిధానం ద్వారా అల్ట్రావయొలెట్ కిరణాలనుండి తప్పించుకొనుట; భూమిపై, నీటిపై, ఆకాశంలో నడచుట ఆనాటి విమానాల ప్రత్యేకతలు.

మయుడు, భరద్వాజుడు తమ శాస్త్రాల్లో 16 రకాల విమానాలను పేర్కొన్నారు. అందులో మళ్ళీ ఒక్కొక్కటి 8 తెగలుగా విభజింపబడి, మొత్తం 128 రకాల విమానాలు

చెప్పబడ్డాయి. (16 రకాల విమానాల పేర్లు - 1. దేవ, 2. గంధర్వ, 3. గరుడ, 4. సిద్ధ, 5. సాధ్య, 6. చారుణ, 7. యక్ష, 8. రాక్షస, 9. కింపురుష, 10. కిన్నెర, 11. ధాతృ, 12. భారతీ, 13. విష్ణు, 14. లక్ష్మీ 15. మహాదేవ, 16. గౌరీ)(తిరిగి ఒక్కొక్కరకం 8 తెగలుగా విభజించబడ్డాయి. 1. కళ్యాణ, 2. సుందర, 3. మాంగల్య, 4. లలిత, 5. ఖద్యోత, 6. పుష్కర, 7. కామ్య, 8. కంకాళ.)

ఈ విమానాల చరిత్ర అలా ఉండగా "పుష్పక విమానం" అనబడే అద్భుతమైన ప్రయాణ సాధనం "రామాయణంలో" మనకు కన్పిస్తోంది.

పుష్పక విమానం : యక్షుల రాజైన కుబేరుని స్వంత విమానం ఇది. దాన్ని రావణాసురుడు బలవంతంగా తెచ్చుకుని లంకాద్వీపాన తన అధీనంలో పెట్టుకున్నాడట. రావణాసురుని మరణానంతరం ఆ విమానం, విభీషణునికి సంక్రమించింది. రావణవధ తర్వాత రాముడు, సీత, లక్ష్మణుడు, వానరసేన, విభీషణుడు మొదలగు వారంతా లంకా ద్వీపం నుండి అయోధ్యకు ఈ పుష్పక విమానంలోనే అతి స్వల్ప వ్యవధిలో చేరుకున్నారట.

నేటి మన ఓడలలో మాదిరిగా పుష్పక విమానంలో ఎన్నో గదులు, సభాస్థలాలు (మీటింగ్ హాల్స్), క్రీడాస్థలాలు, స్నాన వాటికలు మొదలైనవన్నీ ఉన్నాయని వర్ణించడం జరిగింది. ఇన్ని సదుపాయాలున్న విమానాలు నేడింకా తయారుకాలేదు. పుష్పక విమానంలో ఎంతమంది ఎక్కినా, ఇంకా ఒకరికి చోటు మిగిలేదని చెప్పబడింది. ఈ విషయాన్ని గురించి కాస్త ఆలోచించి అర్థం చేసుకోవచ్చు మనం. పుష్పక విమానం అనేది ఒక పుష్పం మాదిరిగా అనేక రేకలవంటి అంతస్థులను కలిగి ఉండేదేమో! తక్కువమంది ఎక్కినప్పుడు అవసరమైనన్ని అంతస్థుల (రేకల)ను తెరచి, మిగిలిన వాటిని మడచిపెట్టి, జనం పెరిగే కొలదీ అవసరాన్ని బట్టి అదనంగా అంతస్థుల (రేకల)ను తెరుస్తూ పరిమాణం పెంచుకునే సదుపాయం ఈ విమానంలో ఉండి ఉండవచ్చు. అందువల్లనే ఎంతమంది ఎక్కినా, పుష్పక విమానంలో ఇంకా చోటు ఉంటుందని చెప్పబడిందేమో!

పురాణాల్లోని కొన్ని విమానాలకు కొన్ని ప్రత్యేక లక్షణాలు కూడా చెప్పబడ్డాయి. తలచినంతనే ప్రయాణం సాగించడం, మళ్ళీ తలచినంతనే ఆగి, క్రిందకు దిగడం .... ఇలాంటి లక్షణాలన్నమాట. వీటి మర్మం మనకు తెలియడం లేదింకా.

## ఆధునిక కాలంలో తొలి విమాన నిర్మాత

ఆధునిక కాలంలో తొలి విమాన నిర్మాతలు రైట్ సోదరులు కాదు. రైట్

సోదరులు 1903 డిసెంబరు 17న వారి విమానానికి రూపకల్పన చేశారు. అయితే అంతకుముందే 8 సంవత్సరాల క్రితం అనగా 1895లో బొంబాయిలో చౌపాటీ సముద్ర తీరంనుండి "శివరాం బాపూజీ తల్పాడే" అనే భారతీయ పండితుడు తయారుచేసిన విమానం, గాలిలో 1500 అడుగుల ఎత్తువరకూ లేచింది. ఆ విమానానికి అయన "మరుత్సఖి" అని పేరు పెట్టారు. వేదాల్లో ఇవ్వబడిన సూత్రాల ఆధారంగా పాదరసం, సూర్యరశ్మిల సహాయంతో అయన ఆ విమానాన్ని రూపొందించి, బొంబాయి ఆర్టు సొసైటీ ఆధ్వర్యంలో టౌన్‌హాలులో ప్రదర్శించారట. అనంతరం ప్రజల సమక్షంలో ఆ విమానం ఆకాశయానం చేసింది. ఆ వింతను అప్పటి బరోడా మహారాజు మహాదేవ గోవింద రణడే మొదలగు ప్రముఖులు కూడా చూశారట. శివరాం బాపూజీ తల్పాడే గొప్ప వేదపండితుడు. అయన మరాఠీ భాషలో "ప్రాచీన విమాన విద్యేథాశోద" అనే గ్రంథాన్ని వ్రాశారు. భార్య మరణానంతరం విరక్తితో ఆయన తన పరిశోధనల్ని వదులుకున్నారట. అయన వారసులు "మరుత్సఖి విమానం యొక్క ప్లాన్‌ను" ఒక అంగ్లేయకంపెనీకి అమ్మివేయడం జరిగిందట. మనలో చాలామందికి తెలియని ఆధునిక యదార్థ విమానగాథ ఇది!

మొత్తంమీద ఏదిఏమైనా వేదకాలం నుండీ విమానయానం ఉన్నదనే విషయం మాత్రం ఖచ్చితం. పురాణాల్లో, వేదాల్లో ఉన్న ఖగోళ, భూగోళ సూత్రాలు "యదార్థాలుగా" నేడు నిరూపించబడుతున్నాయి. వాటినిబట్టి చూసినాకూడా, అలనాటి విమానయానాలు నిజమని తెలియగలవు.

## అంతరిక్ష విహారాలు

భూమి ఉపరితలం నుండి సుమారు 5 వందల కిలోమీటర్ల ఎత్తువరకూ వాతావరణం వ్యాపించి ఉంది. ఆ పరిధిలో ఉన్న దేనినైనా భూమి ఆకర్షించ గలుగుతుంది. ఆ దూరాన్ని దాటివెళ్తే భూవాతావరణాన్ని దాటినట్లే! ఆధునిక విమానాలన్నీ భూవాతావరణ పరిధిలోనే ఎగురుతాయి. రాకెట్లు మాత్రమే ఆ పరిధిని దాటి వెళ్తాయి. (భూవాతావరణ పరిధిని దాటేందుకే రాకెట్‌ను పేల్చి, చాలా వేగంతో పైకి పంపడం జరుగుతుంది.) భూవాతావరణ పరిధిని దాటిన ఏ వస్తువునూ, ఏ మనిషినీ భూమి ఆకర్షించలేదు. అక్కడ విడవబడిన ఏ వస్తువు అయినా, మనిషి అయినా ఏ ఆధారమూ లేకుండా అక్కడే అలా ఉండిపోవడం జరుగుతుంది. భూవాతావరణ అవతలి ప్రదేశాన్ని 'అంతరిక్షం' లేదా 'రోదశి' అంటారు. మనం అంతరిక్ష ప్రయాణం చెయ్యాలంటే రాకెట్‌లో వెళ్ళాలి. చంద్రమండల యాత్రలకూ, గ్రహ యాత్రలకూ రాకెట్లనే మనం ఉపయోగిస్తుంటాం. అయితే పురాణకాలంలో

అంతరిక్ష ప్రయాణాలు కూడా విమానాల్లోనే జరిగేవి. అనాటి విమానాలు అంతరిక్ష యానాలు కూడా చేసేవని ఇంతకుముందే తెలుసుకున్నాం కదా! అయితే ఇంతేకాదు. ఏ విమానాలూ, రాకెట్లూ కూడా లేకుండా పురాణకాలంలో కేవలం మంత్రప్రభావంతో అంతరిక్షయానాలు జరిగిన సందర్భాలున్నాయి. (వాటిని ఖచ్చితంగా నిరూపించే ఆధారాలు మనకు లభ్యంకాకుండా నశించడం జరిగింది.)

## పురాణకాలంలో రాకెట్

మంత్రయుక్తంగా కాకుండా కేవలం యంత్రయుక్తమని అనుకోదగిన ఒక రాకెట్ ప్రయోగం పురాణకాలంలో జరిగింది. ఆ రాకెట్‌ను తయారుచేసి పంపినవాడు "బ్రహ్మర్షి విశ్వామిత్రుడు". యంత్రయుక్తమైన ఆ రాకెట్‌లో అంతరిక్షయానం చేసిన మొదటి యాత్రికుడు "త్రిశంకుడు". ఋషులంటే అలనాటి శాస్త్రవేత్తలని ఇంతకుముందు చెప్పుకున్నాం కదా! వారు ఎప్పుడూ అనేకానేక ప్రయోగాలు చేస్తూండేవారు. మహర్షు లలో ఒకరైన విశ్వామిత్రుడు బ్రహ్మాండమైన కృషితో అద్భుత శక్తులను పొంది "బ్రహ్మర్షి" గా పట్టా పొందాడు. ఆ కాలంలో త్రిశంకుడని ఒక మహారాజు ఉండేవాడు. బొంది (శరీరం)తో స్వర్గానికి వెళ్ళాలనే కోరిక పుట్టిందతనికి. అయితే అందుకు తగ్గ దివ్యశక్తులేమీ అతనికి లేవు. తన కోరిక తీర్చుకునేందుకు దివ్యశక్తులుగల ఋషులను ఆశ్రయించాడు. తనను ఎలాగయినా బొందితో స్వర్గానికి పంపించమని, ఎందరో ఋషులను అర్థించాడు. అర్హతలేని వాడికి అంతరిక్షయానం కూడదని, అనవసరమైన ఆ కార్యక్రమం కోసం తమ శక్తిని వృధా చేసుకోలేమనీ మహర్షులంతా చెప్పారు. ఋషులలో తన ప్రతిభను పెంచుకోవడం కోసం త్రిశంకుని కోరికను తీరుస్తానన్నాడు విశ్వామిత్రుడు. పురాణపరంగా ఆ తర్వాత ఏం జరిగిందంటే... విశ్వామిత్రుడు తన తపోశక్తితో త్రిశంకుణ్ణి స్వర్గలోకానికి పంపిస్తాడు. స్వర్గప్రవేశానికి అర్హత లేదంటూ అతన్ని ఇంద్రుడు క్రిందకు త్రోసివేస్తాడు. త్రిశంకుడు అక్కణ్ణుంచి తలక్రిందులుగా పడిపోతూ తనను రక్షించవలసినదిగా, భూమిపైనున్న విశ్వామిత్రుణ్ణి కోరతాడు. అతని ప్రార్థన విన్న విశ్వామిత్రుడు, త్రిశంకుణ్ణి అంతరిక్షంలోనే ఆపేస్తాడు. (త్రిశంకుడి పరిస్థితి మాత్రం తలక్రిందులుగానే ఉంది.) తన మాట నెరవేర్చుకోడానికై త్రిశంకుడి కోసం ప్రత్యేకంగా ఒక స్వర్గాన్ని అక్కడే సృష్టిస్తాడు విశ్వామిత్రుడు. త్రిశంకుడు ఇటు భూమి మీదకు చేరకుండా, అటు స్వర్గానికి వెళ్ళకుండా మధ్యలోనే మరో క్రొత్త స్వర్గంలో తలక్రిందులుగా వ్రేలాడుతూ ఉండిపోయాడు. దాన్నే "త్రిశంకు స్వర్గం" అన్నారు. (ఇటూఅటూ చెందకుండా మధ్యలో అఘోరించే పరిస్థితిని "త్రిశంకు స్వర్గం"గా ఇప్పటికీ మనం చెప్పుకోవడం పరిపాటి.) పురాణపరంగా ఇదీకథ! అయితే ఇందులోని అంతరార్థాన్ని ఇప్పుడు చూద్దాం.

విశ్వామిత్రుడు తన ప్రయోగాల శక్తి ఫలితంగా యంత్రపరమైన ఒక అంతరిక్షనౌక (రాకెట్)ను రూపొందించాడు. (ఈ విషయాన్నే 'తపోశక్తి' అని చెప్పారు.) త్రిశంకుణ్ణి ఆ రాకెట్‌లోకి ఎక్కించి, అంతరిక్షంలోకి వదిలాడు. అయితే ఏదో సాంకేతిక లోపంవల్ల రాకెట్ చెడిపోయి, అందులోని త్రిశంకుడు బయటకు తలక్రిందులుగా పడిపోయాడు. (ఇలా పడిపోవడాన్నే ఇంద్రుడు త్రోసివేయడంగా అభివర్ణించారు.) త్రిశంకుడు పడినది అంతరిక్షంలో కాబట్టి, ఎలా పడినవాడు అలాగే అక్కడే ఏ ఆధారం లేకుండా ఉండిపోయాడు. ఏ వైర్లెస్ లాంటి సాధనం ద్వారానో విశ్వామిత్రుడికి విషయాన్ని వివరిస్తూ, రక్షించమని వేడుకున్నాడు. ఎటూతోచని స్థితి ఏర్పడింది విశ్వామిత్రుడికి. "నాయనా! ఇక నువ్వు అక్కడే ఉంటావు. ఎప్పటికీ నీ ఉనికి అదే!" అంటూ త్రిశంకుణ్ణి అనునయించాడు. (పడిపోతున్న త్రిశంకుణ్ణి మధ్యలో నిలిపి, అతనికి ఓ స్వర్గాన్ని సృష్టించడంలోని అసలు విషయం ఇదే!) నిజానికి విశ్వామిత్రుడు త్రిశంకుణ్ణి మధ్యలో ఆపలేదు. అంతరిక్షంలో పడినవాడు ఎలాగూ ఎక్కడివాడు అక్కడే ఉంటాడు. విశ్వామిత్రుడు అతనికోసం స్వర్గాన్నేమీ సృష్టించలేదు. త్రిశంకుడున్న ప్రదేశం ఒక విధమైన "స్వర్గ వాతావరణంగా" పోల్చబడింది. ఎందువల్లనంటే త్రిశంకుడు అక్కడ ఆకలి దప్పులతో మరణించినా కూడా, అతని శరీరం ఏమాత్రం చెడిపోదు. ఆ అంతరిక్షంలో అతని శవం నిత్య నూతనంగా ఎన్నాళ్ళయినా, ఎన్నేళ్ళయినా అలాగే స్థిరంగా ఉంటుంది. చివరకు అతను పొందిన స్వర్గదశ అదన్నమాట! అకాలంలో విషువత్ రేఖ (Equinox) చలనంవల్ల దక్షిణ ఆకాశంలో ప్రక్కకు జరిగిన ఒక నక్షత్రరాశికి "త్రిశంకురాశి" అని పేరు పెట్టబడింది. త్రిశంకుని గాథకు గుర్తుగా ఆ రాశికి ఆ పేరు పెట్టడం జరిగింది. ఈరాశినే నేడు విదేశీయులు "సదరన్ క్రాస్" అంటారు. అగస్త్యతార ఈ రాశి లోనిదే!

వాతావరణం లేని కారణంగా, అంతరిక్షంలోని త్రిశంకుని శవం పాడవకుండా ఈనాటికీ అలాగే ఉంటుంది. వెదికి పట్టుకునే ఓపిక మనకుండాలి గాని, అంతరిక్షంలో త్రిశంకుని శరీరం నేటికీ భద్రంగా ఉంటుంది.

మొట్టమొదటి అంతరిక్ష యాత్రికుడు ఎవరని అడిగితే రష్యాదేశస్థుడైన 'యూరీగగారిన్' అంటాం. అవిధంగానే రాకెట్‌ను కనుగొన్నది ఎవరని అడిగితే జర్మన్ శాస్త్రవేత్త 'ఓబర్త్' అని చెప్తాం. నిజానికి ఈ రెండు విషయాలూ పొరబాట్లే! యాంత్రికపరమైన రాకెట్‌ద్వారా మొట్టమొదటగా అంతరిక్షయానం చేసినవాడు "త్రిశంకుడనే హైందవ మహారాజు". యాంత్రిక రాకెట్‌ను మొదటగా రూపొందించిన వాడు "బ్రహ్మర్షి విశ్వామిత్రుడు".

అయితే విశ్వామిత్రుడు పంపించిన రాకెట్ దెబ్బతినడం, మన భారతీయులకేమీ

చిన్నతనం కాదు. నేడు అమెరికా, రష్యాలకు చెందిన ఎన్నో రాకెట్లు ఏదొక లోపంతో కూలిపోయిన సంఘటనలు చాలా ఉన్నాయి. అందుకు కొన్ని ఉదాహరణలను చూడండి. 1959లో ప్రయోగించబడిన రష్యా అంతరిక్షనౌక "లూనా-2" చంద్రునిపై కూలిపోయింది. 1961లో రష్యా ప్రయోగించిన 'వీనస్-1' శుక్రగ్రహం చేరకుండానే దారిలో విఫలమయింది. 1964లో అమెరికా అంతరిక్షనౌక 'రేంజర్-7' చంద్రునిపై కూలిపోయింది. 1965లో అమెరికా అంతరిక్షనౌక 'రేంజర్-8' చంద్రునిలో 'సీ ఆఫ్ ట్రాంక్విలిటీ' వద్ద కూలిపోయింది. 1967లో రష్యావారి అంతరిక్ష నౌక 'సూయజ్-1' కూడా విఫలమై పతనం చెందింది. (అంతరిక్ష యాత్రికులు కూడా వివిధ యాత్రల్లో మరణించడం జరిగింది.)

## భవిష్య అంతరిక్షయానం

అంతరిక్ష ప్రయాణాలు అన్నిసార్లూ సఫలం అవుతాయని చెప్పలేం. ఒకసారి విజయవంతంగా జరిగిన ప్రయాణం, ఆ తర్వాతసారి విఫలం కావచ్చు. అలా జరిగిన సందర్భాలు చాలా ఉన్నాయి. 1969లో అపోలో-11 అనే అమెరికా అంతరిక్షనౌక ద్వారా మానవుడు చంద్రునిపై కాలుపెట్టి, తిరిగి భూమికి చేరగలిగాడు. అంతవరకూ బాగానే ఉంది. ఆ సంఘటన అనంతరం మనిషి, అనేక ఆశలు పెంచుకున్నాడు. చంద్రునిపై నివాసాలు ఏర్పరచవచ్చుననీ, అంతరిక్షంలో ప్రత్యేకించి ఇళ్ళ సముదాయాలు నిర్మించగలమనీ, జనాభాతో భూగోళం ఇరుకయితే, కొంతమందిని ఆ నూతన నిర్మాణాలకు తరలించవచ్చుననీ శాస్త్రవేత్తలు రకరకాల ఊహాగానాలు చేసేశారు. ఇప్పటికీ అలాంటి ఆశలు చిగురిస్తూనే ఉన్నాయి. చంద్రునిపై నివాసాల రిజర్వేషన్ కోసం, అమెరికా అంతరిక్ష సంస్థవారికి అడ్వాన్సులు చెల్లించిన కోటీశ్వరులు కూడా ఉన్నారట. అయితే ఈ అంతరిక్ష ప్రయాణాలనేవి అన్నిసార్లూ సజావుగా సాగవనే విషయం, మనిషి మరచిపోతున్నాడు. (చంద్రునిపై దిగడం నేర్చుకున్నాం. ఇక ఎన్ని సార్లయినా అటూఇటూ తిరిగేస్తామని చెప్పలేం.) అమెరికా అంతరిక్షనౌకలు అపోలో-11, అపోలో-12 లు చంద్రలోక యాత్రల్ని విజయవంతంగా చేసి వచ్చాయి. ఆ తర్వాత మళ్ళీ 1970లో అపోలో-13 చంద్రలోక యాత్ర ఘోరంగా విఫలమయింది. అప్పటినుండీ చంద్రలోక యాత్రంటే అమెరికాకు భయంగానే ఉంది.

ఇక చంద్రలోకంలోనూ, అంతరిక్షంలోనూ ఇళ్ళెలా కడతారో, అక్కడ జీవులకు కావలసిన వాతావరణాన్నీ, ఇతర సదుపాయాలనూ ఎలా కల్పిస్తారో ఆ దేవుడికే ఎరుక! భూవాతావరణాన్ని విడిచిపెట్టి హెచ్చుకాలం అంతరిక్షపరిధిలో నివసిస్తే మనిషి చాలా అనారోగ్యం పాలవుతాడని ఆధునిక శాస్త్రవేత్తలు కనుగొన్నారు. ఆ అనారోగ్యం

ఈవిధంగా ఉంటుందట. "వాంతులు, వికారాలతో నీరసం వస్తుంది. వెన్నుపూసలు దూరదూరంగా జరిగి మనుషులు పొడవుగా అవుతారట. తద్వారా భరించలేని నడుంనొప్పికి గురౌతారట. శరీరంలోని కాల్షియం హరించబడి, ఎముకలు బలహీన పడతాయట. గుండెతో సహా పలుభాగాల్లో కండరాలు అలసటతో దెబ్బతింటాయట. రక్తంలోని తెల్లరక్తకణాలు, ఎర్రరక్తకణాలు సంఖ్యాపరంగా తగ్గిపోతాయట." భూమి ఆకర్షణ శక్తినుండి తప్పించుకున్న మనిషికి, ఇన్ని బాధలు కలుగుతాయని స్వయంగా ఆధునిక విజ్ఞానులే చెప్తున్నారు. ఇక అంతరిక్ష మనుగడ ఎలా సాధ్యమో ఆలోచించండి. స్థిరంగా భూమిపైనే ఆరోగ్యదాయకంగా గడపలేక చస్తున్నాం. ఇక అంతరిక్ష నివాసం తక్కువయిందా మనకు? ఉట్టికెగరలేనివాడు .... అనే సామెతలా ఉంది కదూ!

★ ★ ★

# 18. నేటి ఆయుధాల్ని మించిన నాటి అస్త్రశస్త్రాలు

అస్త్రశస్త్రాల మాటకొస్తే, ఆధునిక కాలంలోని ఆయుధాలముందు పురాణకాలం నాటి ఆయుధాలు ఒక లెక్కలోనివి కావని చాలామంది భ్రమ పడతారు. అయితే ఈనాటి ఆయుధాల కంటే కొన్నివేల, లక్షల రెట్లు శక్తిగల ఆయుధాలు పురాణకాలంలో ఉన్నాయి. పురాణకాల అస్త్రాలతో అనేక అద్భుతాలు సాధించబడ్డాయి. ఆధునిక బాంబులకంటే శక్తిగల అస్త్రాలు, నాటికాలంలో అనేకం ఉన్నాయి. వాటివల్ల కలిగే చెడు పరిణామాల్ని ఆపడానికి పురాణకాలం నాటి పెద్దలు, అలాంటి అస్త్రప్రయోగాల్ని నిషేధించారు. ఒక్క పాశుపతాస్త్రం ప్రయోగిస్తే చాలు. మొత్తం భూమండల మంతా మాడి మసైపోతుంది. దానితో సమఉజ్జీకాగల ఆయుధం నేడింకా కనిపెట్టబడలేదు.

యజుర్వేదానికి ఉపవేదం 'ధనుర్వేదం'. ఈ ధనుర్వేదం మచ్చుకయినా దొరకకుండా నశించడం నిజంగా మన దురదృష్టం. పురాణకాలం నాటి వివిధ అస్త్రశస్త్రాల విషయాలు అందులో కూలంకషంగా ఉన్నాయని మాత్రం వివిధ గ్రంథాల ద్వారా తెలుస్తోంది. నాటి ధనుర్వేదం మనకు లభించివుంటే దుందుడుకు బుద్ధిగల దేశాలకు భయభక్తులు నేర్పి, ప్రపంచాన్ని 'శాంతిమండలం'గా చేసి ఉండేవాళ్ళం.

పురాణకాలం నాటి ఆయుధాలు ముఖ్యంగా రెండు రకాలుగా ఉండేవి. 1. శస్త్రాలు, 2. అస్త్రాలు. పిడిబాకు, కత్తి, గద, బల్లెం, శూలం, మామూలు బాణాలు మొదలయినవి శస్త్రాల కోవకు చెందుతాయి. శస్త్రప్రయోగానికి నిపుణత, ధైర్యం, వీరత్వం చాలు. అస్త్రం విషయం అలాకాదు. అది మంత్రయుక్తంగా ప్రయోగించ బడుతుంది. అస్త్ర సముపార్జనకు ప్రత్యేక శ్రద్ధాసక్తులతో పాటూ తపస్సు

లేదా మంత్రసాధన అవసరం. సాధించిన శక్తితో (మంత్రయుక్తంగా) గడ్డిపరకనైనా సరే, అస్త్రంగా మార్చి ప్రయోగించవచ్చు. శస్త్రానికంటే అస్త్రానికున్న శక్తి అపారమైనది. మామూలు వీరులకు శస్త్రాలే శరణ్యం. అస్త్రాలయుద్ధం కేవలం మహాశక్తి సంపన్నుల మధ్యనే జరుగుతుంది. ఎందుకంటే అస్త్రాల సాధన మహాశక్తి సంపన్నులకే సాధ్యం. ఒక శక్తిసంపన్నుడు ప్రయోగించిన ఒకే అస్త్రంవల్ల కొన్నివేల మంది లేదా లక్షలమంది మరణించే అవకాశం ఉంది. భయంకర ప్రకృతి ఉత్పాతాలు కూడా కలగవచ్చు. ప్రయోగించిన అస్త్రాన్ని, కావాలంటే తిరిగి ఉపసంహరించవచ్చు. లేదా దాని లక్ష్యాన్ని మార్చవచ్చు. అస్త్రాలకు ఉదాహరణలుగా నారాయణాస్త్రం, పాశుపతాస్త్రం, బ్రహ్మ శిరాస్త్రం, బ్రహ్మాస్త్రం, ఆగ్నేయాస్త్రం, వారుణాస్త్రం, ఐంద్రాస్త్రం, వాయువ్యాస్త్రం, సమ్మోహనాస్త్రం మొదలగు అనేక అస్త్రాలను చెప్పుకోవచ్చు.

ఆధునిక కాలంలో రివాల్వర్, తుపాకీ, మరతుపాకీ, ఫిరంగి, శతఘ్ని వంటి శస్త్రాలు తయారయ్యాయి. ఇక అస్త్రాల సంగతి. పురాణకాల అస్త్రాలు మంత్ర యుక్తమైతే, ఆధునిక కాల అస్త్రాలు యంత్రయుక్తమైనవి. ఆధునిక అస్త్రాలుగా వివిధ బాంబులను, క్షిపణులను చెప్పుకోవచ్చు. అయుధాలను నిర్ణీత స్థలాలకు తీసుకువెళ్ళి ప్రయోగించే "క్షిపణులు" (అనగా మిస్సైల్స్) నేటి ప్రత్యేకత. క్షిపణులను ప్రయోగించిన తర్వాత కావాలనుకుంటే వాటి దిశను మార్చవచ్చు. గమ్యాన్ని చేరకముందే వాటిని ప్రేలేటట్లు కూడా చేయవచ్చు. ఇటువంటి ప్రత్యేకతలున్న క్షిపణుల వంటి ఆయుధాలు పురాణకాలంలోనూ ఉన్నాయి. వాటి సంగతి తెలుసుకుందాం, రండి.

## పురాణకాల అస్త్ర విన్యాసాలు

అస్త్రాలకు సంబంధించిన మంత్రాలు నిర్ణీత పౌనఃపున్యంతో శక్తివంతమైన శబ్దతరంగాల్ని పంపించి, వాతావరణాన్ని మార్చివేసేవి. అంతేకాదు. ఆ మంత్రాలు అనేక సైన్సు ప్రక్రియల్ని జరిపి, చిత్రవిచిత్రాలు చేసేవి. ఆగ్నేయాస్త్రం మంటల్ని పుట్టించేది. (నేటి మన విధ్వంశక అయుధాల వల్ల మంటలు పుట్టి ఎలా వ్యాపిస్తున్నాయో, అలాగే ఇదీనూ!) ప్రకృతిలో కొన్ని పదార్థాల విభజన వల్ల లేదా కలయిక వల్ల 'నీరు, గాలి, అగ్ని' పుట్టే అవకాశాలున్నాయి కదా! వారుణాస్త్రం, వాయువ్యాస్త్రం కూడా ఈ సిద్ధాంతాలపై పనిచేసేవే! వారుణాస్త్రం నీటిని వర్షింపజేసేది. వాయువ్యాస్త్రం విపరీతమైన గాలిని సృష్టించేది. ఒక అస్త్రాన్ని అదుపుచేయడానికి, మరో అస్త్రాన్ని వాడేవారు. ఆగ్నేయాస్త్రాన్ని, వారుణాస్త్రంతో చల్లార్చేవారు. వారుణాస్త్రంవల్ల సమీకరించబడిన మేఘాల్ని, వాయువ్యాస్త్రంతో చెల్లాచెదరు చేసేవారు.

అక్కర్లేదని అనుకుంటే ప్రయోగించిన వారే, తిరిగి తన అస్త్రాన్ని ఉపసంహరించవచ్చు. మరోలా కావాలనుకుంటే, అస్త్రం లక్ష్యాన్ని మార్చవచ్చు.

అనాడు సమ్మోహనాస్త్రం అనే అస్త్రం ఉండేది. దాన్ని ప్రయోగిస్తే శత్రువులంతా హిప్నటైజ్ చేయబడినట్లుగా సమ్మోహితులై పడిపోయేవారట. బహుశా ఒకరకం మత్తును కలిగించే గ్యాస్ ఏదయినా ఆ అస్త్రం నుండి విడుదలయ్యేదేమో! ఆ గ్యాస్ నేటి మన 'టియర్ గ్యాస్, లాఫింగ్ గ్యాస్'ల జాతికి చెందినదై ఉండాలి. మహాభారతంలోని ఉత్తర గోగ్రహణ సందర్భంలో అర్జునుడు ఈ సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించి కౌరవ వీరులందరినీ సమ్మోహితుల్ని చేసి పడగొడతాడు.

ఐంద్రాస్త్రం అనేదాన్ని ప్రయోగిస్తే దానిలోనుండి చిన్నచిన్న శస్త్రాలు వందలూ, వేలుగా వెలువడి శత్రునాశనం చేస్తాయి. నేడు కొన్నిరకాల ఆధునిక బాంబులు ప్రేలినప్పుడు అందులోనుండి ఇనుపముక్కలు, ఇనుప సూదులు మొదలైనవి వెదజల్లబడి ప్రాణాలు తీస్తాయి. ఇదేవిధంగా ఐంద్రాస్త్రం పనిచేస్తుందన్నమాట.

బ్రహ్మశిరాస్త్రం : అస్త్రాల చరిత్రలో ఇదొక ప్రముఖ అస్త్రం. తనకిచ్చిన అజ్ఞను నెరవేర్చే అస్త్రం ఇది. మహాభారతంలోని ఒక సంఘటనను చెప్పుకుంటే, తద్వారా మనకు ఈ అస్త్రం గురించి తెలుస్తుంది. పాండవుల వంశం అంతరించి పోవాలనే తలంపుతో అశ్వత్థామ బ్రహ్మశిరాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. ఆ అస్త్రానికి ప్రతిగా అర్జునుడు తానొక బ్రహ్మశిరాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. అయితే ఈ బ్రహ్మశిరాస్త్రం అనేది అన్నివేళలా ప్రయోగించకూడనిది. ఆ అస్త్రప్రయోగంవల్ల ప్రకృతి ఉత్పాతాలు పుట్టుకొస్తాయి. ఆ అస్త్రం యొక్క 'హెచ్చుశక్తి' ప్రయోగించబడిన దేశంలో, 12 సంవత్సరాల వరకూ వర్షాలు పడవు. పంటలు పండవు. వృక్షజాలం నశిస్తుంది. ప్రాణులకు రోగాలూ, అంగవైకల్యాలూ ప్రాప్తిస్తాయి. గర్భవతులకు గర్భస్రావాలూ, గర్భస్థపిండాల మరణాలూ సంభవిస్తాయి. అశ్వత్థామ, అర్జునుడూ ఈ అస్త్రాల్ని ప్రయోగించడంతో వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యాడు వ్యాసమహర్షి. పైన తెలిపిన విధంగా బ్రహ్మశిరాస్త్రం కలిగించే ప్రకృతి ఉత్పాతాలను చెప్తాడు. ఒక బ్రహ్మశిరాస్త్రంతో మరో బ్రహ్మశిరాస్త్రం అణగిపోయినా కూడా ఆ దేశంలో 12 సంవత్సరాల పాటు వర్షాలు పడవని వివరించి, రెండు బ్రహ్మశిరాస్త్రాలనూ ఉపసంహరించమని ఇరువురినీ ఆదేశిస్తాడాయన. (బ్రహ్మశిరాస్త్రం ప్రయోగిస్తే కలిగే అనర్థాలే, నేటి అణుబాంబు ప్రయోగంవల్ల కలుగుతాయి. రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్‌పై ప్రయోగించబడిన అణుబాంబు వల్ల పైన తెలిపిన విధంగా చెడుఫలితాలెన్నో సంవత్సరాల తరబడి కలిగాయి. అటువంటి ఆయుధాల వల్ల కలిగే చెడు ఫలితాల్ని, దాదాపు 5వేల సంవత్సరాల

క్రితమే వ్యాసమహర్షి వివరించడం అత్యద్భుతం!) వేసిన అస్త్రాన్ని ఉపసంహరించాలంటే అది అందరికీ సాధ్యం కాదు. పైగా బ్రహ్మశిరాస్త్రాన్ని ఉపసంహరిస్తే అది ప్రయోగించిన వారినే చంపుతుంది. తపస్సూ, దానమూ, బ్రహ్మచర్యమూ, సత్యమూ, గురుభక్తి ఉన్నవారు మాత్రమే దాన్ని ఉపసంహరించ గలరు. ఈ సద్గుణాలన్నీ అర్జునునిలో ఉన్నాయి కనుక వ్యాసమహర్షి చెప్పినంతనే అతను తన అస్త్రాన్ని ఉపసంహరించాడు. అశ్వత్థామకు మాత్రం అస్త్ర ఉపసంహరణ చేతకాలేదు. అయితే ఆ అస్త్రం వల్ల కలిగే కీడును మాత్రం తగ్గించాడతను.

అశ్వత్థామ వదిలిన బ్రహ్మశిరాస్త్రం యొక్క శక్తి, పాండవ స్త్రీల గర్భాలను సంహరించింది. ఉత్తర (అభిమన్యుని భార్య) గర్భంలో ఉన్న 'పరీక్షిత్తు'ను కూడా చంపింది. (తిరిగి మళ్ళీ పరీక్షిత్తును శ్రీకృష్ణుడు బ్రతికించాడనుకోండి. అది వేరే కథ.) ఇక్కడ బ్రహ్మశిరాస్త్రం ప్రతిభ ఏమిటో చూడండి. తల్లికి ఏమాత్రం హాని కలిగించకుండా, ఆమె గర్భంలోని శిశువును మాత్రమే చంపింది. అదే నేటికాలంలోని ఆయుధమైతే గర్భస్థ శిశువుతో పాటూ తల్లిని కూడా చంపేస్తుంది. కానీ బ్రహ్మశిరాస్త్రం అలాకాదు. తల్లిని క్షేమంగా ఉంచి, తన లక్ష్యమైన గర్భస్థ శిశువునే దెబ్బతీసింది. నిజంగా అద్భుతమైనది ఈ అస్త్రం. కోరిన లక్ష్యాన్ని అత్యంత జాగరూకతతో ఛేదించగలదు.

పాశుపతాస్త్రం : అతిశక్తివంతమైన ఒక అస్త్రం ఇది. తపస్సుతో శివుని మెప్పించి అర్జునుడు పొందాడు దీన్ని. అర్జునిడికి శివుడు ఈ అస్త్రాన్ని ఇస్తూ "పాశుపతానికి అసాధ్యమైనది ఏదీలేదని, అయితే దాన్ని శక్తిహీనులపై ప్రయోగిస్తే లోకాన్ని తగలబెడుతుందనీ, అది అన్నివేళలా అందరిమీదా ప్రయోగించేది కాదనీ" చెప్పాడు. అస్త్రంగా ఇది మారణహోమాన్ని సృష్టించగలదు. అంతేకాదు, దేనినైనా నిర్ణీతస్థానానికి చేర్చే 'మిస్సైల్'గా కూడా పనికొస్తుంది. ఇది టు-ఇన్-వన్ లాంటి ఆయుధం అన్నమాట. మారణాస్త్రంగా దీన్ని ప్రయోగిస్తే, బ్రహ్మశిరాస్త్రం మాదిరిగానే ప్రకృతి ఉత్పాతాల్ని కల్పిస్తుంది. అందువల్ల ఈ పాశుపతాన్ని కూడా ఎప్పుడుపడితే అప్పుడు వాడరాదని ఆనాటి పెద్దలు (ఋషులు) ఆంక్ష విధించారు. కాబట్టే అర్జునుడు మారణాస్త్రంగా తన పాశుపతాన్ని కురుక్షేత్రయుద్ధంలో వాడలేదు. మారణాయుధంగా దాన్ని కనుక ఉపయోగించి ఉంటే, అర్జునుడు కేవలం ఒక్కక్షణంలోనే కౌరవుల్ని నశింపజేసేవాడు. పాశుపతాస్త్రాన్ని మిస్సైల్‌గా మాత్రం ఒకసారి వాడాడు అర్జునుడు. ఆ విషయం గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. కౌరవులకూ, పాండవులకూ బావమరిది 'సైంధవుడు'. సైంధవుడికి అతని తండ్రి అయిన వృద్ధక్షత్రుడు, ఒక వరం ప్రసాదించాడు. "ఎవరివల్ల తన తనయుని తల నేలపై పడుతుందో, వారియొక్క

శిరస్సు ముక్కముక్కలై వ్రేలిపోవాలని" తన తపశ్శక్తితో శాసించాడు. ఈ విషయం కృష్ణునికి తెలుసు. కురుక్షేత్ర యుద్ధంలో అర్జునుడు తన బాణంతో సైంధవుడి తలను తెగనరుకుతాడు. ఆ 'తల' క్రిందపడిందంటే, అర్జునుని శిరస్సు వ్రేలిపోయి ఉండేదే! ప్రమాదాన్ని పసిగట్టాడు శ్రీకృష్ణుడు. సైంధవుని తలను నేలపై పడనివ్వవద్దని అర్జునిడితో చెప్పాడు. అర్జునుడు తన బాణాలను ఉపయోగిస్తూ, సైంధవుడి తలతో బంతి ఆట ఆడసాగాడు. "ఈ తలను ఏం చెయ్యమంటావు? అయినా ఎందుకూ ఇదంతా?" అంటూ కృష్ణుణ్ణి అడిగాడు. కృష్ణుడు అసలు విషయం చెప్పాడు. "అయితే ఏం చేద్దాం మరి?" అన్నాడు అర్జునుడు. "సైంధవుని తండ్రి వృద్ధక్షత్రుడు శమంతపంచకంలో తపస్సు చేసుకుంటున్నాడు. అతని తొడపై ఈ తలకాయ పడేలా చెయ్యి. ఆ పని ఒక్క పాశుపతాస్త్రం వల్లనే సాధ్యం" అని చెప్పాడు శ్రీకృష్ణుడు. పాశుపతాన్ని తీసి మంత్రించి వదిలాడు అర్జునుడు. ఆ అస్త్రం సైంధవుని తలను ఎక్కడో ఉన్న శమంతపంచకానికి తీసుకొనిపోయి, వృద్ధక్షతుని తొడపై పడేసింది. దాన్ని తన కుమారుని శిరస్సుగా గుర్తించలేకపోయాడు వృద్ధక్షతుడు. ఉలిక్కిపడి క్రిందకు నెట్టేశాడు. సైంధవుని తల ఆ విధంగా నేలపై పడింది. ఆ తలను నేలపై పడగొట్టినవాడు వృద్ధక్షత్రుడు కాబట్టి, అతని తల ముక్కముక్కలుగా వ్రేలిపోయింది. తాను ఇచ్చిన వరానికి తానే బలి అయ్యాడు వృద్ధక్షత్రుడు. ఈ సందర్భంలో పాశుపతాస్త్రం ఒక "క్షిపణి" గా పనిచేయడం మనం గమనించవచ్చు.

పాశుపతాస్త్రం, బ్రహ్మశిరాస్త్రం ఈ రెండూ కూడా జగత్ సంహారం చెయ్యగలవు. మారణాయుధాలుగా వీటిని ఉపయోగిస్తే అనేక లక్షల శూలాలూ, గదలూ, సర్పాల్లాంటి బాణాలూ వాటినుండి పుడతాయి. వీటిని మనుషులపై ప్రయోగిస్తే ఎన్నో ఆపదలు వస్తాయి. ఎంత ప్రమాదం వచ్చినా, ఇతరితర ఉపాయాలవల్లనే తప్పించుకోవాలి గాని, ఈ అస్త్రాల్ని ప్రయోగించకూడదు. మారణకాండకై వీటిని ప్రయోగించడాన్ని నిషేధించారు నాటి విజ్ఞులు.

బ్రహ్మాస్త్రం : బ్రహ్మాస్త్రం అనేది ఈనాటి బాంబులవలె మారణకాండను సృష్టించగల అస్త్రం. పురాణకాల యుద్ధాల్లో మహావీరులు వీటిని వాడేవారు.

సుప్రసిద్ధ రష్యన్ పండితుడు డాక్టర్ A.A. గోర్బోవ్స్కి తన గ్రంథమైన "బుక్ ఆఫ్ హైపోథెసిస్" లో మహాభారతకాలం నాటి అస్త్రాలను సమర్థిస్తూ వ్రాశాడు. అలనాటి అస్త్రాలు ఇప్పటి అణ్వాయుధాలకంటే భయంకరమైనవని ఆయన తెలిపాడు. నాటి అస్త్రాల ప్రయోగం వల్ల నేటి అటంబాంబు, హైడ్రోజన్ బాంబులవల్ల కలిగే ఫలితాలే "పురాణాల్లో" చెప్పబడ్డాయని, ఆయన ఆశ్చర్యపోతూ వ్రాసుకొచ్చాడు.

దాదాపు 4 వేల ఏళ్ళక్రిందట మరణించిన ఒక వ్యక్తి అస్థిపంజరంలో మామూలు ప్రమాణంకంటే ఎన్నో హెచ్చు రెట్లు రేడియోధార్మికత కన్పించిందనీ, బ్రహ్మాస్త్రం వంటి ఆయుధంవల్ల మరణించిన వారిలో అతను ఒకడై ఉంటాడని ఆయన తన గ్రంథంలో వివరించడం జరిగింది. ప్రాచీన కాలంలో భోజుడు వ్రాసిన 'సమరాంగణ సూత్రధార' అనే గ్రంథాన్ని ఆయన ఉదహరిస్తూ "ప్రాచీన హైందవులకు ఎగిరే యంత్రాలు తెలుసుననీ, అయితే అవి అజ్ఞానుల చేతుల్లో పడకుండా వాటి వివరాల్ని రహస్యంగా ఉంచారనీ" అయన వక్కాణించాడు. (ఈ వార్త 9-9-1986 నాటి ఆంధ్రపత్రిక డైలీలో ప్రచురితమైంది.)

పురాణకాలపు అస్త్రాల గురించి చెప్పాలంటే చాలా ఉందిగానీ, ఇప్పటికి ఈ వివరాలు సరిపోతాయి.

## ప్రాచీన కాలంలో నేటి (ఆధునిక) ఆయుధాలు

అతి ప్రాచీన కాలంలో భారతీయులు "నాళికాస్త్రాలు" అనే ఆయుధాల్ని ఉపయోగించేవారట. 'లఘునాళికాస్త్రాలు' నేటి తుపాకులను పోలి ఉండేవట. నాళికాస్త్రాల్లో ఉపయోగించే గుళ్ళను (బుల్లెట్లను) 'గర్భఘుటికలు' అనేవారట. "బృహన్నాళికలు" అనేవి ఫిరంగులను పోలి ఉండేవట. తుపాకీమందును పోలిన 'అగ్నిచూర్ణం' అనే మందును నాడు వాడేవారట. 'అగ్నిధారణ, క్షైప్య అగ్నియోగ, విశ్వాస ఘూటి' అనే 3 రకాల ఆయుధాలు నేటి మన బాంబులను పోలి ఉండేవట. బాంబుల వంటి ఈ 3రకాల ఆయుధాల వల్ల పుట్టే మంటలను ఆర్పడానికి 'పర్జన్య' అనే యంత్రం ఉండేదట. భారతీయుల నాళికాశాస్త్ర పరిజ్ఞానం, వాటికి చెందిన ప్రయోగాలూ వేదాల్లో ఉన్నట్లుగా తెలుస్తోంది. అయితే ఆ వేద విభాగాలు పాశ్చాత్య దేశాలకు తీసుకుపోబడ్డాయట. (శ్రీ డి.వి. శేషగిరిరావు గారి "మన విజ్ఞాన సంపద" అనే గ్రంథం చూడండి.)

## నాటి యుద్ధాలు - నేటి యుద్ధాలు

ఈనాటి యుద్ధాలు పూర్తిగా అనాగరికమైనవి, క్రూరమైనవి. ఏమరిపాటులో ఉన్నవారి పైనా, యుద్ధంతో సంబంధంలేని సాధారణ ప్రజలపైనా కూడా (వయోభేదం పాటించకుండా) దొంగల్లా దాడిచేసి, చంపుతున్నారు. నీతినియమాలూ, హెచ్చరికలూ లేకుండా నిరాయుధులూ, ఆర్తులూ అయిన వారిపై దొంగదెబ్బతీసి చంపడం నేటి యుద్ధనీతి.

ఎన్నో నియమాలూ, ధర్మాలూ ఆచరిస్తూ సమఉజ్జీ అయిన శత్రువుతో బాహాబాహీగా పోరాడడం ఆనాటి యుద్ధనీతి. నాటి యుద్ధాల కోసం 'వ్యూహరచనలు, యుద్ధతంత్రాలు, వీరోచిత విద్యలు, అస్త్రశస్త్ర ప్రయోగాలు' నేర్చుకునేవారు ఆనాడు. శత్రువులను శిక్షించడమే కాకుండా ఇంకా ఉధృతంగా ఉత్పాతాల్ని సృష్టించే పెద్ద ఆయుధాలను, 'విచక్షణ కలిగిన వీరులు' అనాలోచితంగా ప్రయోగించేవారు కాదు. దీనికి ఉదాహరణగా రామాయణంలోని ఒక సంఘటనను మనం చెప్పుకోవచ్చు. ఇంద్రజిత్, లక్ష్మణుల మధ్య యుద్ధం కొనసాగుతుండగా దుష్టుడైన ఇంద్రజిత్ బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. అతని ఆగడాన్ని కట్టించడానికి లక్ష్మణుడు కూడా బ్రహ్మాస్త్రం తీయబోగా, శ్రీరాముడు అడ్డుపడి "తమ్ముడూ! ఉత్పాతాల్ని కలిగించే అటువంటి ఆయుధాల్ని, ఒక వ్యక్తికోసం అన్నివేళలా ప్రయోగించరాదు" అని చెప్తాడు. ఈనాటి యుద్ధాల్లో ఇటువంటి విచక్షణ కన్పించదు.

ఇకపోతే మిస్సైల్స్‌ని పోలిన అస్త్రాలు ఆనాడు ఉన్నాయని తెలుసుకున్నాం కదా! అటువంటి అస్త్రాన్ని ప్రయోగించినా కూడా తిరిగివద్దని భావిస్తే, వినాశనం జరిగేలోగా దాన్ని ఉపసంహరించేవారు. లేదా ఆ అస్త్రాన్ని దారిమళ్ళించి, లక్ష్యాన్ని మార్చగల శక్తి కలిగి ఉండేవారు. రామాయణగాథలో శ్రీరాముడు, పరశురామునిపై అస్త్రం సంధిస్తాడు. పరశురాముడు తాను ఓడినట్లు ఒప్పుకోగానే "ప్రయోగించిన అస్త్రానికి తిరుగులేదంటూ" చెప్పి, ఆ అస్త్రలక్ష్యాన్ని పరశురాముని శరీరంనుండి తప్పించి, అతని పుణ్యఫలంవైపు మళ్ళిస్తాడు శ్రీరాముడు. మహాభారతంలో అశ్వత్థామ పాండవులనూ, వారి సంతతినీ నశింపజేసే తలంపుతో బ్రహ్మశిరాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. ఆ తర్వాత వ్యాసుని మాటపై ఆ అస్త్రం లక్ష్యాన్ని పాండవ స్త్రీల గర్భాలకు పరిమితం చేస్తాడు. రాముడు, అర్జునుడు వంటి పురాణ పురుషులు అస్త్రలక్ష్యాల ఉపసంహరణ (లేక మళ్ళింపు) చేసేవారు.

ఆధునిక మారణాస్త్రాలకు ధీటైన, అంతకంటే ఘనమైన అస్త్రశస్త్రాలను కనుగొనడమే కాకుండా, వాటికి విరుగుడు కూడా కనుగొన్న మేధావులు 'హైందవ మహర్షులు'. ఆనాటి అస్త్రాలు కేవలం మంత్రయుక్తాలే కాదు. మహాఋషులు తమ మేధస్సుతో ప్రయోగాల్ని సాగించి, వాటిని తయారుచేసేవారు. వాటిని దేశరక్షణకు, ప్రజారక్షణకు, దుష్టశిక్షణకు ఉపయోగించమని వీరులకు అందించేవారు. రామాయణంలో విశ్వామిత్రుడు, శ్రీరామునకు అనేక అస్త్రాలను అందించడం ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు.

★ ★ ★

# 19. ఋషులే అలనాటి ఐక్యరాజ్యసమితి

ఆటంబాంబు దెబ్బ ఎలా ఉంటుందో ప్రపంచం ఒకే ఒక్కసారి రుచి చూసింది. రెండవ ప్రపంచయుద్ధం చివరిదశలో, అనగా 1945 ఆగష్టు 6 మరియు 9 తేదీలలో జపాన్‌లోని హీరోషిమా, నాగసాకీ నగరాలపై ఆటంబాంబులు ప్రయోగించబడ్డాయి. దానివల్ల కలిగిన భయంకర పరిణామాలను చూసి, మానవాళి ఇప్పటికీ భయంతో వణికిపోతూనే ఉంది. ఆటంబాంబు ప్రయోగిస్తే జీవులు మరణించడం, కట్టడాలూ, ఆస్తులూ నాశనం కావడం మాత్రమే కాదు. అనేక సంవత్సరాల వరకూ కూడా అక్కడి వాతావరణం కలుషితమై పోతుంది. ఈ కారణంగా ఏళ్ళ తరబడి సరైన వానలు కురవకపోవడం, పంటలు సరిగా పండకపోవడం, జీవులకు క్రొత్తక్రొత్త రోగాలు రావడం, స్త్రీలకు గర్భవిచ్ఛిన్నాలు జరగడం, పుట్టబోయే పిల్లలు వికలాంగులుగా జన్మించడం లాంటి చెడు పరిణామాలు సంభవిస్తాయి. ఇవన్నీ కూడా జపాన్ దేశం ఎదుర్కొంది. ఇటువంటి దారుణ పరిస్థితి, భవిష్యత్తులో మళ్ళీ ఎక్కడా కలగకూడదని ప్రపంచ దేశాలన్నీ నిశ్చయించుకున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచ శాంతి కోసం వివిధ దేశాల కూటమిగా "ఐక్యరాజ్యసమితి" అనే సంస్థ (U.N.O.) 1945 అక్టోబరు 24న అమెరికాలోని న్యూయార్క్ నగరంలో ఏర్పరచబడింది. ప్రపంచ దేశాలమధ్య యుద్ధాలు జరగకుండా శాంతిని పరిరక్షించడం, అణ్వాయుధాల ప్రయోగాల్ని నివారించడం ఈ సంస్థ ముఖ్య లక్ష్యాలు. ఈ సంస్థలో వివిధ దేశాలకు చెందిన అధికారులు సభ్యులుగా ఉంటారు. వీరంతా కలసి ప్రపంచ సంక్షేమంకోసం కృషి చేస్తుంటారు. దుందుడుకు దేశాల ప్రవర్తనను ఐక్యరాజ్యసమితి అడ్డుకుంటూ ఉంటుంది. ఈనాడు ప్రపంచంలో అనేక దేశాలవద్ద అణ్వాయుధాలున్నాయి. ఇటువంటి స్థితిలోగాని 3వ ప్రపంచయుద్ధం వచ్చిందంటే, భూమిపై సర్వం వినాశనానికి లోనౌతుంది. అందువల్లనే అటువంటి ప్రమాదం ఏదీరాకుండా ప్రపంచశాంతి నిలిచి ఉండడంకోసం ఐక్యరాజ్యసమితిని ఏర్పరచుకున్నాం. అణు ఆయుధాలవల్ల కలిగే దారుణ పరిణామాల్ని దృష్టిలో పెట్టుకుని, ఒక దేశం మరో దేశంపై అటువంటి ఆయుధాల్ని ప్రయోగించకుండా చూస్తుంది ఈ సంస్థ.

ప్రపంచశాంతి కోసం ప్రతికాలంలోనూ ఒక సంస్థ లేదా వ్యవస్థ అవసరం. ప్రస్తుతకాలంలో మనం ఐక్యరాజ్యసమితిని ఏర్పాటు చేసుకున్నాం. మరి పురాణ కాలంలోని పరిస్థితి ఏమిటి? "ఋషులే అలనాటి ఐక్యరాజ్యసమితి". భూమండలంపై క్షేమకర పరిస్థితుల్ని ఋషులే సమీక్షించేవారు. అవసరమైన చర్యల్ని తీసుకునేవారు.

ప్రపంచానికి ఆయుధాల ముప్పు అనేది ఈనాడే కాదు, పురాణకాలంలోనూ ఉండేది. ఈనాటి ఆయుధాల కంటే పురాణకాలంనాటి ఆయుధాలు మరింత శక్తివంతమైనవని ఇంతకుముందే తెలుసుకున్నాం. నేటి మన అణుబాంబులకంటే ఆనాటి బ్రహ్మాశిరాస్త్రం, పాశుపతాస్త్రం మొదలైనవి ఎన్నోరెట్లు శక్తివంతమైనవి. ఈ బ్రహ్మాశిరాస్త్రం, పాశుపతాస్త్రం మొదలైన అస్త్రాల ప్రయోగంవల్ల కలిగే ప్రకృతి ఉత్పాతాలను గురించి ఇంతకుముందు వ్యాసంలో తెలుసుకున్నాం కదా! ఇటువంటి అస్త్రాలను ప్రయోగిస్తే సంవత్సరాల తరబడి సరైన వర్షాలు పడకపోవడం, జీవులు అనేక కష్టనష్టాలకు గురికావడం జరుగుతుందని పురాణాలు చెప్తున్నాయి. లోకాన్ని మాడ్చి మసి చేయగల ఇటువంటి ఆయుధాల్ని ఎవరూ ప్రయోగించకుండా ఆనాటి మహర్షులు చూసేవారు. తొందరపడి ఎవరైనా ఇటువంటి మహాస్త్రాల్ని ప్రయోగించబోతే, వెంటనే మహర్షులు అక్కడ ప్రత్యక్షమై, "ఆ అస్త్రాన్ని ప్రయోగించవద్దనీ', దానివల్ల లోకకంటకమైన పరిస్థితులు ఉత్పన్నమౌతాయనీ" చెప్పి వారించేవారు. మహాభారతంలో అశ్వత్థామ, అర్జునుడు బ్రహ్మాశిరాస్త్రాల్ని ప్రయోగించినప్పుడు వ్యాసమహర్షి, నారదుడు అక్కడ ప్రత్యక్షమై, ఆ అస్త్రాలను ఉపసంహరించమని కోరడం ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. 'లోకాన్ని దహించే అటువంటి అస్త్రాలను ప్రయోగించకూడదని, వాటి ప్రయోగం వల్ల అనేక సంవత్సరాల పాటు అరిష్టాలు సంభవిస్తాయని' ఆ సందర్భంలో చెప్తాడు వ్యాసమహర్షి. (ఇందుకు సంబంధించిన ఇతర వివరాలకు దీనిముందు వ్యాసం చూడండి.) ఐదువేల సంవత్సరాల క్రితం వ్యాస మహర్షి చెప్పిన ఆ అరిష్టాలన్నీ, రెండవ ప్రపంచ యుద్ధంలో జపాన్‌పై ప్రయోగించబడిన అటంబాంబుల వల్ల కన్పించాయి. దీన్నిబట్టి పురాణకాలపు అస్త్రాలను గురించి వ్యాసుడు చెప్పిన విషయాలు యదార్థాలని తెలుస్తోంది. ప్రయోగించకూడని ఆయుధాలను ప్రయోగించడంవల్ల ఎలాంటి అనర్థాలు కలుగుతాయో, వ్యాసుడు అనాడే స్పష్టంగా వివరించాడు. ఈ విషయం మనజాతికి నిజంగా గర్వకారణం.

ప్రపంచశాంతిని కాపాడడంలో నేటి ఐక్యరాజ్యసమితి కంటే నాటి ఋషీశ్వరులే ఓ మెట్టు పైనున్నారు. ఈనాడు బలమైన దేశాల శక్తిముందు, ఐక్యరాజ్యసమితి శక్తి చాలడంలేదు. అయితే ఋషీశ్వరుల శక్తి మాత్రం అలాకాదు. వారికి నియంత్రణా శక్తి చాలా ఎక్కువ. ఆయుధ ప్రయోగాల్ని నిరోధించడమే కాకుండా, ప్రయోగించిన ఆయుధాల యొక్క శక్తిని కూడా అణగార్చగలరు. ఋషీశ్వరుల ఘనత అలాంటిది మరి!

★ ★ ★

# 20. వేదకాలంలో కరెంటు

విద్యుచ్ఛక్తి అనేది ఆధునిక నాగరికతకు ఒక మూలస్తంభం. విద్యుచ్ఛక్తినే 'విద్యుత్తు' అనీ, దాన్నే సామాన్య పరిభాషలో 'కరెంటు' అనీ అంటాం. కరెంటులేని జీవితాలను మనం ఊహించలేం. కరెంటుతో అంతటి అనుబంధం ఉంది మనకు. సుఖప్రదమైన జీవితాలకు 'కరెంటు' ఒక ఆలంబన అని మన ఉద్దేశ్యం. అయితే పురాణకాలంలో కరెంటు అనేది లేకుండానే హాయిగా జీవించగలిగారు. సుఖప్రదమైన జీవితానికి ఆనాటికి కావలసిన సౌకర్యాలన్నీ, అనాడు ఉండేవి. ఏదయినా అలవాటుని బట్టి ఉంటుంది. ప్రస్తుతం మన జీవితంలో ఆడియో మరియు వీడియో సౌకర్యాలు (T.V. లూ, V.C.R. లూ, రేడియోలూ, టేప్‌రికార్డర్‌లూ, సినిమాలూ మొదలైనవి) సర్వసాధారణమై పోయాయి. ఇవేవీ లేకుండా మన ముందు తరాల వాళ్ళు జీవితాల్ని ఎలా గడిపారో మనకు అర్థంకాదు. నిజానికయితే వాళ్ళు మనకంటే ఆరోగ్యమైన స్థాయిలో హాయిగా జీవితాల్ని గడిపారు. దృశ్యశ్రవణ (వీడియో, ఆడియో) కాలుష్యాల వల్ల మన తరంవారికి కంటిశక్తీ, వినికిడి శక్తీ కూడా క్షీణిస్తున్నాయి. అయితే మత్తుమందులాంటి నేటి నాగరికత నుండి మనం తప్పించుకోలేక పోతున్నాం.

## వేదాల్లో విద్యుత్తు ప్రస్తావన

పురాణకాలం వారు కరెంటులేకుండా జీవించగలిగారు. అయితే అంతమాత్రాన వారికి కరెంటును గురించి తెలియదని అనుకోకండి. వేదకాలానికే మన హైందవులకు విద్యుత్తును గురించిన పరిజ్ఞానం ఉంది. విద్యుత్తుయొక్క స్పష్టమైన లక్షణాలను కూడా వారు వివరించారు. యజుర్వేదం ఈ విషయాన్ని స్పష్టపరుస్తోంది. యజుర్వేదంలో (4-15-19) ఐదుమంత్రాల్లో విద్యుత్తును గురించి ప్రస్తావించడం జరిగింది. విద్యుత్తు అగ్ని స్వరూపమని, అది రవ్వల రూపంలో ఆవిర్భవిస్తుందనీ, దానికి రెండు తలలనీ, ఒక తలతో వస్తూ మరో తలతో వెనక్కి పోతుందనీ చెప్పబడింది. ఋణ, ధనాత్మకమైన రెండు విద్యుత్తు మార్గాల్నీ (పాజిటివ్, నెగిటివ్ లను) "రెండు తలలుగా" పోల్చడం జరిగిందని మనం గమనించవచ్చు. (తిరుమల తిరుపతి దేవస్థానం వారి ప్రచురణ "అర్షవిజ్ఞాన సర్వస్వం-1" చూడండి.) (ఏదయినా విద్యుత్ పరికరానికి రెండు తీగలు పెనవేసిన కరెంటు వైరు కనెక్షన్ ఉండడం మనం చూస్తూంటాం. ఆ రెండు తీగల్లో ఒకటి 'ధనాత్మకం' అనగా పాజిటివ్ (+), రెండవది 'ఋణాత్మకం' అనగా నెగెటివ్ (-). కరెంటు అనగా ఎలక్ట్రానుల ప్రవాహం. పాజిటివ్ తీగద్వారా పరికరంలోకి ప్రవేశించిన కరెంటు, ఆ పరికరాన్ని పనిచేయిస్తూ తిరిగి మళ్ళీ నెగెటివ్ తీగ ద్వారా

బయటకు వెళ్ళిపోతూ ఉంటుంది. విద్యుత్తు ఒక తలతో లోపలకు రావడం, మరో తలతో బయటకు పోవడం అంటే ఇదే! విద్యుత్తు స్వభావాన్ని యజుర్వేదంలో ఎంత స్పష్టంగా వివరించారో చూడండి మరి!

## వేదకాలం నుండీ కరెంటును ఎందువల్ల వాడుకోలేదు?

'విద్యుత్తును గురించి తెలిసి కూడా అనాటినుండీ ఎందువల్ల దాన్ని వాడు కోలేదు? ఇదంతా వట్టి కల్పన మాత్రమే!' అని వాదించే వారు మనలో ఉండవచ్చు. అటువంటి వారికి వివరణ ఇవ్వవలసిన బాధ్యత మనకుంది. భవిష్యత్తులో లోటునూ, కష్టాన్నీ, నష్టాన్నీ కలిగించే ఏ పనినీ మన పూర్వీకులు చేసేవారు కాదు. అలాగే ప్రకృతి సమతౌల్యతను దెబ్బతీసే ఏ కార్యక్రమాన్నీ వారు చేపట్టేవారు కాదు. భవిష్య తరాలకు లోటునూ, ఇబ్బందినీ కల్గించే తక్షణ సుఖాల జోలికి పూర్వీకులు వెళ్ళేవారు కాదు. కరెంటు వాడనంత మాత్రాన మన పూర్వీకులు ఎదుర్కొన్న ఇబ్బందులేమీ లేవు. ఆరోగ్యానికి హాని చెయ్యని నూనె, క్రొవ్వు దీపాలవీ వాడుకునేవారు. ఆనాడు ప్రకృతి సమతౌల్యత బావుండేది కాబట్టి ఆరోగ్యకరమైన గాలి విస్తారంగా లభించేది. వారికి ఫ్యాన్లు, A.C. ల అవసరం ఉండేది కాదు. కేవలం వింద్యామరలు, విసన కర్రలు సరిపోయేవి. అవిధంగానే ఆ కాలానికి సరిపడిన సాంకేతిక పరిజ్ఞానానికి, కరెంటు అవసరం కలగలేదు. అంతమాత్రాన సాంకేతికంగా వారు వెనుకబడి ఉన్నారా అంటే, అదీలేదు. కరెంటు అవసరం లేకుండానే, లోహాలను రకరకాలుగా వినియోగించుకోగలిగారు. భారీ పరిశ్రమలవీ లేకుండానే, మనిషి మనుగడకు కావలసిన సమస్తాన్నీ ఆరోగ్యకరమైన రీతిలో ఏర్పాటు చేసుకోగలిగారు. ఈవిధంగా సౌఖ్యవంతమైన జీవితం పొందగలిగినప్పుడు కరెంటు లేనంతలో వారికి అసౌకర్యం, ఇబ్బందీ ఏముంది? ఆ మాటకొస్తే మనమే కరెంటు అనే సౌకర్యాన్ని కల్పించుకుని, ఆ తర్వాత రకరకాలుగా దారుణమైన అసౌకర్యాలకు గురౌతున్నాం. వాతావరణ కాలుష్యానికి విద్యుత్తు ఒక మూలకారణం. అంతేకాదు. ప్రకృతిపరంగా సహజ వనరుల సమతౌల్యం కూడా విద్యుత్తు కారణంగా దెబ్బతింటుంది. ఈ విషయాలు భవిష్యత్తులో కీడును కల్గిస్తాయి. అంతేకాదు, ఏమాత్రం అజాగ్రత్తగా ఉన్నా విద్యుత్తు అనేది జీవుల ప్రాణాల్ని తీస్తుంది. ప్రాణాలతో చెలగాటం ఆడే శక్తి అది. (ఆధునిక కాలంలో విద్యుత్తు వాడకం మొదలుపెట్టిన తర్వాత ఇంతవరకూ ప్రపంచం మొత్తం మీద కొన్ని కోట్లమంది విద్యుత్తు ఘాతానికి బలి అయి మరణించడం జరిగింది.) మొత్తం ఈ అన్నికారణాలవల్లా విద్యుత్తు సంగతి తెలిసికూడా మన పూర్వీకులు, దాని జోలికి పోలేదు. కానీ నేటి మనిషి సంగతి అలాకాదు. భవిష్యతరాలకు హాని

కలిగినా సరే, తనకు మాత్రం తక్షణ సుఖాలకు లోటు రాకూడదంటాడు. విద్యుత్తు అనేది తాత్కాలిక సుఖాలను అందిస్తుంది నిజమే! అయితే దాని ద్వారా ఏర్పడే ఇబ్బందికర పరిస్థితులను కూడా మనం గుర్తుంచుకోవాలి!

అంతేకాకుండా మరోవిషయం! సుఖపడ్డ ప్రాణం, ఇబ్బందిని తట్టుకోలేదు. కరెంటును వాడివాడి, చివరకు దానికి బానిసలుగా మారిపోయాం మనం. ఇది మన పాలిట ఒక మత్తుమందుగా తయారయింది. క్షణకాలం కరెంటుపోతే, గిజగిజలాడి పోయే పరిస్థితికి వచ్చేశాం. కరెంటు పేరిట వివిధ రకాల కాలుష్యాలకు లోబడి, అనేక జబ్బులను కొని తెచ్చుకుంటున్నాం. ఇప్పుడు చెప్పండి, పూర్వీకుల కంటే మనం ఎంతవరకూ అదృష్టవంతులమో!

★ ★ ★

## 21. పురాణకాలంలో లోహాలు

ఆధునిక కాలంలో లోహాల వాడకం అతి సాధారణ విషయం. ఇనుము, బంగారం, వెండి, రాగి, ఇత్తడి, కంచు, మొదలయినవన్నీ లోహాలు. ఇవన్నీ మనకు భూమిలోనే లభిస్తాయి. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానంతో ఆయా లోహాలు భూమిలో ఎక్కడెక్కడున్నాయో తెలుసుకోవడం, వెలికి తీయడం, భారీ పరిశ్రమల సహాయంతో వాటిని రకరకాల ఉపయోగాలకు మలచుకోవడం చేస్తున్నాం మనం. అయితే ఈనాడు మనం వాడుకుంటున్నట్లుగానే పురాణకాలంలో కూడా లోహాల్ని విరివిగా వాడుకున్నారు. అందుకు (పురాణాల్లో) అనేక ఆధారాలు కన్పిస్తున్నాయి. నేటి సైన్స్ ప్రక్రియలేవీ తెలియకుండా, ఆనాటి వారు లోహాల్ని ఎలా తీసి వాడుకోగలిగారని మనకు సందేహం రావచ్చు. అందుకు కావలసిన పరిజ్ఞానం వారికి వేరే విధంగా ఉండేదన్నమాట. లోహాల్ని కనుగొనడానికీ, వెలికి తియ్యడానికీ, వాడకానికి సిద్ధపరచడానికీ పురాణకాలం వారికి ఒక ప్రత్యేక టెక్నాలజీ ఉండేదని మనం గ్రహించవచ్చు. మన విజ్ఞానం మనకుంటే, వారి విజ్ఞానం వారికుండేది. విజ్ఞానం అనేది ఒకడి సొత్తుకాదు కదా! ఏ కాలానికి ఉండే పద్ధతులు ఆ కాలానికి ఉంటాయి. పృథువు అనే మహర్షి ఖనిజాలనూ, రత్నాలనూ భూమినుండి వెలికితీసే ఎన్నో ప్రక్రియలను తెల్పినట్లుగా మన పురాణాలు చెప్తున్నాయి.

పురాణాల ఆధారంగా చూస్తే, ప్రస్తుతానికంటే హెచ్చుగా కూడా వారు బంగారం, వెండి మొదలైనవి వాడినట్లు తెలుస్తోంది. పురాణకాలం వారు వెండి, బంగారాలతో ఆభరణాలను, సామగ్రినీ..... చివరకు రథాలను కూడా చేయించుకున్నట్లు మనకు

తెలియవస్తుంది. (బంగారానికి రోగాల్ని నశింప చేయగల శక్తి ఉన్నదనీ, బంగారు ఆభరణాలు ధరిస్తే దీర్ఘాయువు కలుగుతుందనీ కూడా పూర్వీకులు తెలుసుకోగలిగారు. కేవలం మోజుకొద్దీ బంగారాన్ని వాడుకుంటున్న మనకు ఈ విషయాలింకా తెలియనే తెలియవు). అనేక కట్టడాలలో కూడా ఆనాడు వెండి, బంగారాలనూ, మణి మాణిక్యాలనూ విరివిగా వాడినట్లు తెలుస్తోంది. కట్టడాలు, రథాలు మొదలగు వాటి తయారీలో ఇనుమును బాగా వాడినట్లు కూడా తెలుస్తోంది. పురాణకాలంలో రకరకాల దానాలు ఇవ్వడానికి కూడా వెండి, బంగారాలనూ, మణిమాణిక్యాదులనూ వాడేవారు. పురాణకాలం నాటి ఈ విషయాలన్నీ కొంతమందికి చాలా ఆశ్చర్యం కల్గించవచ్చు. అటువంటి వారికి మన చరిత్రలోని కొన్ని విషయాలను ముందుగా చెపుదాం. గుప్తుల కాలంలోనూ, శ్రీ కృష్ణదేవరాయల కాలంలోనూ వెండి, బంగారాలే కాదు, నవరత్నాలను రాసులుగా పోసి, కొలపాత్రలతో కొలిచి అమ్మేవారట. పురాణకాలం నుండి చరిత్రకాలం వరకూ బంగారు నాణాలు అమలులో ఉండేవి. బంగారంతో చేసిన కిరీటాలూ, భుజకీర్తులూ మొదలైనవెన్నో పురాణాల కాలం నుండీ చరిత్రకాలానికీ ఉన్నాయి. పూర్తిగా బంగారము, నవరత్నాలతో చేయించిన నెమలి సింహాసనం వంటి అద్భుత వస్తువులు ఎన్నో భారతీయ చరిత్రలో కన్పిస్తాయి. ఒక రాజస్థాన్ మహారాజు సంపూర్ణంగా వెండి మాత్రమే ఉపయోగించి ఒక రాజభవనం కట్టించాడు. ముస్లింల దండయాత్రల కాలంలో ఒక ముస్లింరాజు, ఆ భవనాన్ని పునాదులతో సహా దోపిడీ చేసుకుపోయాడు. మన రాజపుత్ర చరిత్ర ఈ విషయాన్ని మనకు అందిస్తోంది. "మన చరిత్ర కాలంలో ఇంత వెండి బంగారాల్ని ఉపయోగించారు కదా! ఈనాడు ఆ సంపదంతా ఏదీ? ఎక్కడుంది? ఆనాటి నవరత్నాలన్నీ ఎక్కడకు పోయాయి?" ఇలా అనేక సందేహాలు మనకు కలగవచ్చు. దీనికి జవాబు ఒక్కటే! "కాలక్రమేణా ఆ సంపదంతా కనుమరుగై భూస్థాపితం అయిపోతోంది." దీన్నిబట్టి మనకు అర్థమౌతున్నదేమంటే ప్రస్తుత కాలంకంటే చరిత్రకాలంలోనూ, చరిత్రకాలం కంటే పురాణకాలంలోనూ హెచ్చు మోతాదులో వెండి, బంగారాలుండేవన్న మాట. మరి పురాణకాలం వారికి అంత హెచ్చుగా ఆ లోహాలు ఎక్కడ లభ్యమైనట్లు? ఖచ్చితంగా భూగర్భంలో నుండే కదా! అంటే భూగర్భం నుండి లోహాలను వెలికితీసి, శుద్ధిచేసి వాడుకునే ప్రక్రియలు వారికీ చక్కగా తెలుసునని అర్థమౌతోంది. వారి ప్రక్రియలు, ఆధునిక విజ్ఞానానికి ఏ మాత్రం తీసిపోవని చెప్పగలం. వారు లోహాలను వాడుకున్న తీరే దానికి సాక్ష్యం.

లోహాల్ని తీసి వాడుకోవడంలో ఏకాలం పద్ధతులు ఆ కాలానికి ఉన్నాయి. పురాణకాలం వారి టెక్నాలజీ ఒక రకం అయితే, చరిత్రకాలం వారి టెక్నాలజీ మరో రకం. ఇక ఆధునిక కాలం గురించి చెప్పేదేముంది? విద్యుత్తూ, యంత్ర పరికరాలూ,

భారీ పరిశ్రమలూ..... వీటితో నడుస్తోంది నేటి టెక్నాలజీ. మార్గాలు వేరయినా లక్ష్యం ఒక్కటే! ఫలితం కూడా ఒక్కటే! పురాణకాలం వారికంటే మనం అధికులం అనుకోవడం ఎంత పొరబాటో దీనివల్ల అర్థమౌతోంది.

మహాఋషులే పురాణకాలపు శాస్త్రవేత్తలని చెప్పుకున్నాం కదా! ఈ సందర్భంలో దీనికి సంబంధించిన విషయం ఒకటి తెలుసుకుందాం. మహాభారతంలోని అంశం ఇది. మను వంశానికి చెందిన ఒకానొక మహారాజు మరుత్తుడు. ఆయన ఒక యజ్ఞం చేయతలపెడతాడు. బృహస్పతి తమ్ముడైన 'సంవర్తుడు' ఆ యజ్ఞానికి ఉపద్రష్టగా కుదురుతాడు. యజ్ఞం చేసేందుకు అవసరమైన ధనరాసుల కోసం మరుత్తునికి సంవర్తుడు సలహానిస్తూ "హిమాలయాల ఉత్తరభాగాన ముంజవంత పర్వతం ఉంది. ఆ పర్వతంపై పార్వతీదేవితో శివుడు విహరిస్తూ ఉంటాడు. ఆ పర్వతం ఇరుప్రక్కలా విపరీతంగా బంగారపు కణికెలూ, ముతకపాటి బంగారపు ఇసుక ఉన్నాయి. శివుణ్ణి ప్రసన్నం చేసుకుని, అక్కడి బంగారాన్ని తీసుకు వద్దాం" అని చెపుతాడు. ఆ సందర్భంలో సంవర్తుణ్ణి, ఒక భూగర్భ శాస్త్రవేత్తగా తెలుసుకోవాలి మనం. ఎక్కడో ఉన్న బంగారం నిల్వలను అంతకుముందుగానే ఆయన తన పరిశోధనల ద్వారా పసిగట్టి ఉన్నాడు. సమయం వచ్చింది కనుక ఆ విషయాన్ని గురించి మరుత్త మహారాజుకు చెప్పాడు. మరుత్తుడు శివుణ్ణి మెప్పించి సంవర్తుని ఆధ్వర్యంలో అక్కడి బంగారు రాసులను వశపరచుకుని, అతి వైభవంగా తన యజ్ఞాన్ని పూర్తి చేసుకున్నాడు. అనంతరం అంతులేనంత బంగారాన్ని బ్రాహ్మణోత్తము లకు దానం చేశాడు. యజ్ఞానికి విచ్చేసిన బ్రాహ్మణులంతా తాము మోయగలిగినంత బంగారాన్ని మోసుకుని పోతూ, ఇంకా మిగిలిపోయిన బంగారాన్ని హిమాలయ పర్వత ప్రాంతాల్లో ఒకచోట 'నిధిగా' భూగర్భంలో దాచి పెట్టారు. 'కాలాంతరంలో దాన్ని ఎవరు చూస్తారో, అది వారికే చెందుతుందని' చెప్పారు ఆ బ్రాహ్మణులు. అనేక వేల సంవత్సరాల పాటు ఆ నిధి అలాగే ఉండిపోయింది. మహా భారతకాలం వచ్చింది. కురుక్షేత్ర యుద్ధం కూడా ముగిసింది. ధర్మరాజు పట్టాభిషిక్తుడయ్యాడు. కురుక్షేత్ర యుద్ధకారణంలో కలిగిన పాపశంక వల్ల ధర్మరాజు చాలా విచారంలో మునిగాడు. అశ్వమేధయాగం చేసి, దానాలు ఇవ్వడం ద్వారా ఆ పాప శంకను వదుల్చుకోమని సలహా ఇస్తాడు వ్యాసమహర్షి. అశ్వమేధయాగానికి అంతులేని ధనసంపత్తి అవసరం. అయితే కురుక్షేత్ర యుద్ధకారణంగా ఖజానా అంతా ఖాళీ అయిఉంది. ఇదే మాట వ్యాసునితో అంటాడు ధర్మరాజు. హిమాలయాల్లో బ్రాహ్మణులు దాచిన నిధి గురించి అప్పుడు వివరిస్తాడు వ్యాసుడు. ఆ నిధి తెచ్చుకుని, దానితో అశ్వమేధ యాగం చేయమని ధర్మరాజుకు సలహా ఇస్తాడు. (వ్యాసమహర్షి

త్రికాలజ్ఞుడూ, శాస్త్రవేత్తా కూడా! అందువల్లనే వేల సంవత్సరాల క్రితం నాటి నిధి గురించి ఆయన సులభంగా తెలుసుకోగలిగాడు). వ్యాసుడు చెప్పిన ప్రకారం హిమాలయాలకు వెళ్ళి ఆ బంగారు నిధిని తెచ్చుకుని అశ్వమేధయాగం చేస్తాడు ధర్మరాజు.

పురాణకాలం వారి లోహాల వాడకం గురించి ఇలా ఎన్ని విషయాలయినా చెప్పుకోవచ్చు. వారికి శాస్త్రీయ పరిజ్ఞానంతోపాటు, దివ్యశక్తి కూడా ఉండేది. అందువల్లనే మనకు నమ్మశక్యంకాని విషయాలను కూడా వారు సాధించి చూపారు.

★ ★ ★

## 22. పురాణకాలం వారికి పెట్రోలియం, నేలబొగ్గు తెలియవా?

భూగర్భంలోని వివిధ లోహాలను వెలికి తీసి పురాణకాలంవారు విరివిగా వాడుకున్నారని తెలుసుకున్నాం. అన్నిరకాల లోహాలూ ఒకేచోట ఉండవు కదా! వేర్వేరు చోట్ల ఎక్కడెక్కడో ఉంటాయి. వాటి గురించి మన పూర్వీకులు విస్తృతమైన భూగర్భ పరిశోధనల్ని అనేకచోట్ల చేసి ఉంటారు. లేకుంటే అన్ని లోహాలు వారికి లభ్యం కావుకదా! అంతటి విస్తృతమైన పరిశోధనల్ని చేసి, వివిధ లోహాలను వెలికితీసి నప్పుడు, ఆనాటి పరిశోధకులకు పెట్రోలియం, నేలబొగ్గు కన్పించకుండా ఎలా ఉంటాయి? కన్పించే ఉంటాయి. అయితే వాటి వాడకం వల్ల రాగల చెడు ఫలితాలను (అనగా కాలుష్యాన్ని) గమనించి, ఆనాటి పరిశోధకులు వాటిని వెలికి తియ్యలేదు. భవిష్యత్తుకు కీడు తెచ్చే దేనినీ మన పూర్వీకులు వాడేవారు కాదు. ఎల్లప్పుడూ కూడా ఆరోగ్యవంతమైన జీవనం కోసమే వారు కృషి చేసేవారు. ఏ పని చేసినా భవిష్యతరాలవారి ఆరోగ్యాన్ని కూడా, వారు దృష్టిలో పెట్టుకునేవారు.

నేల బొగ్గువల్లా మరియూ పెట్రోలియం నుండి వచ్చే పెట్రోలు, డీసిల్ అయిలు, కిరసనాయిలు, తారు మొదలైన వాటివల్లా 'నేటి ఆధునిక ప్రపంచానికి' ఎన్నో ఉపయోగాలున్నాయి, నిజమే! అయితే వాటివల్ల కలిగే వాతావరణ కాలుష్యం కూడా అధికం. ఈ కారణంగా జీవుల ఆరోగ్యాలు పాడవుతాయి. క్రొత్తక్రొత్త రోగాలు పుట్టుకొస్తాయి. పాడి పంటలకూ, వృక్షసంపదకూ కూడా ఈ కాలుష్యం వల్ల కీడు కలుగుతుంది. ఈ కాలుష్యం అనే సైడ్ ఎఫెక్ట్‌ను గమనించిన మన పూర్వీకులు, నేలబొగ్గు - పెట్రోలియంలను వెలికి తీయలేదని మనం గ్రహించవచ్చు. తక్షణ

సుఖాల కోసం అర్రులు చాచే మనం మాత్రం, ఏ ఆలోచనా లేకుండా వాటిని బయటకు తీసి వాడుకుంటూ 'కాలుష్య రాక్షసిని' సృష్టిస్తున్నాం. ఆ కాలుష్యం బారినపడి సతమతమౌతూ కూడా తప్పును దిద్దుకోలేక పోతున్నాం. కాలుష్యాన్ని సృష్టించే పెట్రోలు వంటి పదార్థాల వాడకం తగ్గించాలని ప్రపంచ వ్యాప్తంగా ఇటీవల స్లోగన్లు బయలుదేరాయి. ఇవి ఎంతవరకూ సత్ఫలితాలనిస్తాయో వేచి చూడాలి. (సాధ్యమైనంత వరకూ పెట్రోలు వాహనాల బదులుగా సైకిళ్ళనూ, గుర్రాలనూ ఉపయోగించాలనే ఆలోచన కూడా నేడు ప్రపంచవ్యాప్తంగా మొదలయింది. వీలయినంత వరకూ సైకిళ్ళను హెచ్చుగా ఉపయోగిస్తూ, కాలుష్యాన్ని తగ్గించేందుకు దోహదపడాలనే ఉద్దేశానికి మద్దత్తుగా విదేశాల్లో పెద్ద ఎత్తున సైకిల్ ర్యాలీలు కూడా జరుగుతున్నాయి. ఈ గొడవంతా లేకుండా మన పురాణకాలం వారు 'గుర్రాలనూ, రథాలనూ' ప్రయాణ సాధనాలుగా వాడుకుంటూ హాయిగా కాలక్షేపం చేశారు. అవసరమైతే వారు ఆకాశ, అంతరిక్ష విహారాలు కూడా చేసేవారనే విషయాన్ని మనం మరువరాదు).

దొరికిందే తడవుగా ప్రకృతినందలి సమస్తాన్నీ విచక్షణారహితంగా వాడేస్తూ వాతావరణ సమతౌల్యానికి మనం విఘాతం కల్గిస్తున్నాం. పెట్రోలియం అనేది ఆధునిక ప్రపంచానికి ఎంత సుఖాన్ని అందిస్తున్నదో, అంతటి కాలుష్యాన్నీ వెదజల్లుతోంది. భూమిలో పెట్రోలియంతో పాటు 'సహజవాయువు' (Natural Gas) కూడా ఉంటుంది. ఈ సహజ వాయువు మరియు పెట్రోలియంలు నేటి సైన్సు ప్రగతికి ఎంతగానో సహకరిస్తున్నాయి. అయితే ప్రమాదవశాత్తూ అవి మనకు ఎదురు తిరిగి విజృంభిస్తే, భయంకర మారణహోమాన్ని ఎదుర్కొనవలసి ఉంటుంది. దాంతో దారుణమైన వాతావరణ కాలుష్యాన్నీ, అనారోగ్య దుర్భిక్ష పరిస్థితులనూ, ఎంతో ధనవ్యయాన్నీ తట్టుకోవలసి వస్తుంది. (1995 జనవరి నెలలో ఆంధ్రప్రదేశ్ నందలి తూర్పుగోదావరి జిల్లాలో పాశర్లపూడి చమురుబావి నందు సంభవించిన 'బ్లోఔట్' సంఘటన దీనికి స్పష్టమైన ఉదాహరణ. ఈ బ్లోఔట్ కొన్నాళ్ళపాటు మన ఆధునిక సైన్సుకు పెద్ద సవాల్‌గా నిలిచింది. ఈ సంఘటనలో సహజవాయువు, పెట్రోలియంల కారణంగా లేచిన మంటల్ని అదుపు చెయ్యడానికి దేశవిదేశీ నిపుణులంతా రెండు నెలలకు పైగా తలక్రిందులయ్యారు. ప్రకృతి పరమైన సహజశక్తులు గాని విజృంభిస్తే, అది మనకెప్పుడూ సమస్యే! పరిస్థితులు అంతవరకూ రాకుండా జాగ్రత్తలు తీసుకోవలసిన బాధ్యత మనకుంది).

పెట్రోలు, తారు, కిరసనాయిలు మొదలైనవి మండినప్పుడు వచ్చే పొగ, కేవలం జీవుల ఆరోగ్యాలనే కాకుండా, వాతావరణ స్థితిగతులను కూడా దెబ్బతీస్తాయి.

(మొన్నటి గల్ఫ్‌యుద్ధంలో చాలా పెట్రోలియం మంటలకు ఆహుతయింది. ఫలితం మనకు తెలుసుకదా! అక్కడి వాతావరణం అంతా పూర్తిగా చెడిపోయి, అమ్లవర్షాలు (Acid Rains) కూడా కురిశాయి).

ఇంట్లో కిరోసిన్ దీపాలను పెద్దగా వత్తిచేసి పెట్టుకుంటే, మన ఇంటిల్లిపాది ఆరోగ్యాలూ పాడౌతాయని మనకు తెలుసు. అందుకే పురాణకాలంలో ఆముదము, నెయ్యి, జంతువుల క్రొవ్వు మొదలగు వాటితో దీపాలు వెలిగించుకునే వారు. ఆ దీపాలవల్ల వచ్చే పొగ, మన ఆరోగ్యాలకేమీ హానికరం కాదు. ఆముదం దీపం నుండి వచ్చే పొగ, మన కళ్ళకు ఆరోగ్యకరం కూడా! అందువల్లనే ఆముదం దీపంవల్ల వచ్చే పొగతో ఏర్పడిన మసిలో వెన్న, పచ్చ కర్పూరం కలిపి 'కాటుక' తయారు చేసు కుంటారు. ఆ 'కాటుక' మన కళ్ళ ఆరోగ్యానికి చాలా మంచిదని అందరకూ తెలుసు.

ఆధునిక ప్రపంచంలో ఎన్నో పరిశ్రమలలోనూ, రైలు ఇంజన్లలోనూ వాడే నేలబొగ్గు వల్ల కూడా విపరీతమైన కాలుష్యం ఏర్పడుతోంది. విశ్వవ్యాప్తంగా మొత్తం గాలి కలుషితమౌతోంది. ఆరోగ్యవంతమైన గాలి లేకపోవడంతో జీవుల ఆరోగ్యాలు నశించడమే కాక, వృక్షసంపద కూడా దెబ్బతింటోంది. వృక్షాలు నశిస్తే, ప్రకృతి సమతుల్యత దెబ్బతింటుంది. దానివల్ల కలిగే అనర్థం మాటల్లో చెప్పలేనిది.

ప్రకృతికి హాని చేసే పదార్థాల పట్ల మన పూర్వీకులు అతి జాగ్రత్తగా వ్యవహరించే వారు. ఆ పదార్థాలవల్ల కొన్ని ఉపయోగాలున్నా కూడా, అంతకంటే మించి హాని జరిగే పరిస్థితులుంటే మాత్రం, వాటిని పూర్వీకులు నిషేధించేవారు. హాని కల్గించకుండా తమకు ఉపయోగపడే పదార్థాలను మాత్రమే మన పూర్వీకులు భూగర్భంనుండి సేకరించుకునేవారు. అందువల్లనే పెట్రోలియం, నేలబొగ్గు వంటి వాటిని భూగర్భం లోనే విడిచిపెట్టేశారు. అపాయకరం అంటూ వారు విడిచిపెట్టేసిన విషపదార్థాలను తీసి వాడుకుంటూ, నాగరికత పేరిట 'కాలుష్య రక్కసి కోరల్లోకి' దూసుకుపోతున్నాం మనమంతా.

★ ★ ★

## 23. పురాణకాలపు సోలార్ కుక్కర్

అత్యధిక వాడకం వల్ల భూమిపై ఉన్న ఇంధనాలు ఈ ఆధునిక కాలంలో అంతకంతకూ కరువైపోతున్నాయి. ఇటువంటి స్థితిలో ఆధునిక శాస్త్రవేత్తల దృష్టి 'సౌరశక్తి' (సూర్యుని శక్తి)పై పడింది. నేడు సూర్యరశ్మితో విద్యుచ్ఛక్తిని కూడా తయారు

చేస్తున్నారు. విద్యుచ్ఛక్తితో చేయగల పనులన్నీ నేడు సౌరశక్తితో చేయగలుగుతున్నారు.

సూర్యరశ్మితో వంట చేసుకునేందుకు నేడు సోలార్ కుక్కర్‌లు కూడా తయారవుతున్నాయి. మనకు ఇదొక అధునిక ప్రక్రియ. అయితే నిజానికి ఇదేం క్రొత్త కాదు. సోలార్ కుక్కర్ ప్రస్తావన, మన పురాణాల్లో ఉంది. దీనికి సంబంధించిన వివరాలను తెలుసుకోవడం కోసం శివపురాణంలోని ఒక చిన్నగాథను చెప్పుకుందాం!

పూర్వం కాశీ రాజ్యాన్ని దివోదాసు అనే మహారాజు పరిపాలించేవాడు. ఆయన గొప్ప శివభక్తుడు. శివభక్తిలో పడి, ఆయన ఇంద్రుణ్ణి లక్ష్యపెట్టలేదట. అందుకు ఇంద్రుడు కోపించి, కాశీరాజ్యంలో 'అగ్ని పుట్టకూడదని' శాసించాడట. దాంతో కాశీరాజ్యంలో అగ్ని రగులుకోవడం మానేసింది. నిప్పు లేకపోతే ఇక ఏముంది? రాజ్యంలో ఇక ఎవరి ఇంటా కూడా వంటావార్పులు లేకుండా పోయాయి. అందరూ కాయకసరులవీ తినేవారట. ఇదంతా మహారాజుకేం తెలీదు. ఆయనకు మాత్రం రోజూ భోజనం మామూలుగానే అందుతోంది. అందువల్ల ఆయనకు మిగిలినవారి బాధ తెలియలేదు. కొన్నాళ్ళ తర్వాత ప్రజలంతా ఆయనవద్దకు వెళ్ళి, తమ బాధ చెప్పుకున్నారు. "మరి తనకు రోజూ భోజనం ఎలా వస్తుందని ఆశ్చర్యపోయాడు మహారాజు. మంత్రులను పిలిచి, విషయం అడిగాడు. 'మహారాజా! ప్రజలు చెప్పింది యదార్థమే! మీకు తప్ప రాజ్యంలో ఇంకెవరికీ వంటలు జరగడం లేదు" అంటూ ఇంద్రునివల్ల వచ్చిపడిన ఉపద్రవం గురించి చెప్పుకొచ్చారు వారు. 'మరి నాకు భోజనం ఎలా వస్తుంది?" అని అడిగాడు రాజు. "మహారాజా! మీకు మాత్రం సూర్యరశ్మి సాయంతో వంట చేయిస్తున్నాం" అన్నారట మంత్రులు. వెంటనే వంటచేసిన పండితులను పిలిపించాడు మహారాజు. "రాజ్యంలోని ప్రజలందరకూ ఇలా వంట చేయవచ్చుకదా" అని వారిని అడిగాడు. అందుకు వారు వినయంగా "మహారాజా! సౌరశక్తితో ఇలా వంట చేయడం అనేది చాలా శ్రమతో కూడిన పని. సమయం కూడా చాలా తీసుకుంటుంది. అందువల్ల హెచ్చు మందికి అలా వంట చేయాలంటే కష్టమౌతుంది" అంటూ జవాబిచ్చారట. (ఆ తర్వాత దివోదాసు, పరమశివుని సాయంతో అగ్నిని ప్రసన్నం చేసుకోవడం జరిగిందనుకోండి.... అది వేరే కథ!)

మొత్తం మీద సూర్యశక్తితో వండిన భోజనాన్ని మొట్ట మొదటగా తిన్న మానవుడు "దివోదాసు." ఆ అదృష్టం అందరికంటే ముందుగా, ఒక హైందవ మహారాజుకు కలగడం మనకు గర్వకారణం.

★ ★ ★

# 24. అలనాటి వృక్ష విజ్ఞానం

'తరు గుల్మ లతాదులకు కూడా సుఖదుఃఖానుభవం ఉందనీ, ఆ భావాలు పైకి మనకు కన్పించకపోయినా, వాటిలో ఆ అనుభవాలు యదార్థమని' మన ప్రాచీన శాస్త్రాలు చెప్తున్నాయి. బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలూ కలిగి సుఖదుఃఖాలను అనుభవించే పంచభూతమయ శరీరాలుగల మనుషులవలే, వృక్షాలకు కూడా సుఖదుఃఖాలూ, జనన మరణాలు స్వభావసిద్ధములని 'మహాభారతమందలి శాంతి పర్వంలో' భృగు, భరద్వాజుల సంవాదం ద్వారా తెలుస్తోంది. మొన్నమొన్నటి వరకూ ఆధునిక సైంటిస్టులెవరికీ ఈ సంగతి తెలీదు. మన భారతీయ శాస్త్రవేత్త శ్రీ జగదీశ్ చంద్రబోస్ - నవీనశాస్త్ర పరిజ్ఞానంతో, మళ్ళీ ఈ విషయాన్ని లోకానికి తెలియజేశారు. తమకు కీడును కలగజేసేవారు దగ్గరకొస్తే మొక్కలు భయపడతాయనీ, మేలు చేసే వారొస్తే సంతోషిస్తాయనీ ఆధునిక పరికరాల ద్వారా శాస్త్రవేత్తలు కనుగొన్నారు. మనుషుల భావనల్ని మొక్కలు ముందుగానే గ్రహిస్తాయని కూడా నవీన శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు. 'పీటర్ టామ్ కిన్స్', 'క్రిస్టోఫర్ బర్డ్' అనే శాస్త్రవేత్తలు వ్రాసిన "ది సీక్రెట్ లైఫ్ ఆఫ్ ప్లాంట్స్" అనే గ్రంథంలో పై విషయాల్ని స్పష్టంగా వివరించారు. మన భావావేశం మొక్కలకెలా తెలుస్తుందని ఆశ్చర్యపోకండి. "యన్మనసా మనుతే తద్ వాత మపి గచ్ఛతి" అంటోంది ఋగ్వేదం. మనం మనసులో తలచుకున్నది కూడా వాయుమండలంలో వ్యాపిస్తుందట. మనం పలికే పలుకే కాకుండా,మన భావం కూడా వ్యాపిస్తుందని ఋగ్వేద ఋషులు తెలుసుకున్నారు. అలా వ్యాపించే భావాల్ని పసిగట్టగల శక్తి, వృక్షజాతికి బాగా ఉందన్నమాట. (టెలిపతీ సిద్ధాంతం ఇదే కదా!)

వృక్షజాతికి జీవం కలదని నిరూపించే మరో ఉదాహరణ కూడా వేదాల్లో ఉంది. ఒక ఋషి, దర్భలు కోస్తూ "ఓ దర్భలారా! నేనిలా మిమ్మల్ని కోయడం వల్ల మీకు బాధ కలుగుతుంది. జీవహింస పాపమే అయినా, జీవశ్రేయస్సుకై చేసే యజ్ఞం కోసం ఇలా కోస్తున్నాను. అయినా తిరిగి మీరు చిగుర్చే విధంగానే కోస్తానులెండి" అని దర్భలతో చెప్పిన సందర్భం వేదాల్లో కన్పిస్తుంది.

వృక్షజాతిలోని రకాల్ని వివరించడం, వృక్షజాతికి ప్రాణం ఉందని చెప్పడం, వన్య సంరక్షణ భూగోళానికి చాలా మేలు కల్గిస్తుందని ఉద్బోధించడం.... ఇలా ఎన్నో విధాల వృక్షవిజ్ఞానాన్ని మన వేదాలు అందిస్తున్నాయి.

వృక్షజాతులు 20 లక్షలని మన పురాణాల్లో స్పష్టంగా చెప్పబడింది. మన

ఆధునిక వృక్షశాస్త్రవేత్తలు వృక్ష జాతుల వర్గీకరణ (Classification) మాత్రమే చేశారు. మొత్తం సృష్టిలోని వృక్షజాతుల సంఖ్యను తేల్చి చెప్పలేదింకా.

(మన పురాణాల్లో కేవలం వృక్ష జాతుల సంఖ్యనే కాకుండా సృష్టియందలి మొత్తం జీవజాతుల సంఖ్యను కూడా వివరంగా చెప్పడం జరిగింది. సృష్టిలో 84 లక్షల రకాల జీవజాతులున్నాయని పురాణాలు చెప్తున్నాయి. వృక్షజాతులు 20 లక్షలు, నీటియందు పుట్టిన జీవజాతులు 9 లక్షలు, క్రిమికీటక జాతులు 11 లక్షలు, వేర్వేరు జాతుల మనుషులు 4 లక్షలు, నాలుగు కాళ్ళ జీవజాతులు 30 లక్షలు, పక్షిజాతులు 10 లక్షలు..... మొత్తం సృష్టిలో జీవజాతులు ఈ విధంగా 84 లక్షలని పురాణవచనం. (శ్రీ పరమహంస సచ్చిదానంద యోగీశ్వరులు వ్రాసిన 'జీవ బ్రహ్మైక్య రాజయోగ సారం" అనే గ్రంథం నుండి ఈ వివరాలు సేకరించబడినవి). మొత్తం జీవరాశుల సంఖ్యను గురించి ఇటువంటి వివరణ ఏదీ కూడా ఆధునిక శాస్త్రవేత్తలు ఇంతవరకూ ఇవ్వలేదు.)

## ప్రాచీన కాలంలో మరుగుజ్జు వృక్షాలు :

పెద్ద పెద్ద మొక్కల్నీ, వృక్షాల్నీ వాటి రూపలక్షణాలు మారకుండా "చిన్న మొక్కలుగా" పెంచే ప్రక్రియ నేడు ప్రపంచమంతటా అమలులోకి వచ్చింది.ఇలా చిన్న రూపాల్లో పెంచుతున్న వృక్షాలనే "మరుగుజ్జు వృక్షాలు" అంటున్నాం. ఈ ఆధునిక కాలాన 'బోన్‌సాయ్' అని పిలవబడుతున్న ఈ ప్రక్రియను వృక్షవిజ్ఞానంలో సరికొత్త విషయంగా భావిస్తున్నారంతా. నిజానికి ఇదేమీ సరికొత్త విషయం కాదు. భారతీయులకు అతి పాత విషయమే! ప్రాచీన కాలంలో చరకుడనే ప్రసిద్ధ అయుర్వేద వైద్యుడు ఈ 'మరుగుజ్జు వృక్షాలను' రూపొందించి పెంచడం జరిగింది. ఈయన తన "చరక సంహిత" గ్రంథంలో "వామన తను వృక్షాది విద్య" అనే ఒక ప్రకరణం వ్రాశాడు. పెద్ద పెద్ద మొక్కల్నీ, వృక్షాల్నీ "చిన్న చిన్న మొక్కలు"గా పెంచడం గురించి అందులో స్పష్టంగా వివరించాడు. "వైద్యానికి ఉపకరించే పెద్ద పెద్ద మొక్కలనూ, వృక్షాలనూ ఈ ప్రక్రియ ద్వారా "చిన్నచిన్న మొక్కలుగా" ఎక్కడైనా సరే పెంచుకోవచ్చుననీ, వాటి ఔషధశక్తి ఏమాత్రమూ తగ్గిపోదనీ" ఆయన చెప్పాడు. (అలంకరణ కోసం కూడా అనేక వృక్షజాతుల్ని ఇలా చిన్నచిన్న సైజుల్లో పెంచుకోవడం నేడు జరుగుతోంది.) చరకుడు వివరించిన ఈ విద్య, మనదేశంనుండే ఇతర దేశాలకు విస్తరించిందని తెలుస్తోంది. (శ్రీ పురాణపండ రంగనాథ్‌గారి "సంస్కృతంలో సైన్స్ ఫిక్షన్" అనేవ్యాస పరంపర నుండి ఈ వివరాలు సేకరించబడ్డాయి.)

వృక్షవిజ్ఞానంలో కూడా ప్రాచీన హైందవులదే ప్రపంచాన పైచేయి' అని చెప్పేందుకు, ఇప్పటికి ఈ విషయాలు చాలు.

★ ★ ★

## 25. ఇతిహాస కాలపు మాంసాహార వృక్షాలు

ప్రస్తుతకాలంలో కీటకాలను ఆహారంగా తీసుకునే మొక్కలు, ప్రపంచమంతటా ఉన్నాయి. ఆ మొక్కలు తమ పెరుగుదలకు అవసరమైన మాంసకృత్తుల్ని, ఆ కీటకాలనుండి గ్రహిస్తాయి. ఇటువంటి మొక్కలను "కీటకాహార మొక్కలు" లేదా "మాంసాహార మొక్కలు'" అంటారు. ఈ మొక్కల గురించి నేడు మనం సైన్సు పుస్తకాల్లో చదువుకుంటున్నాం. "డ్రోసిరా, నెపెంథిస్, యుట్రిక్యులేరియా, డయోనియా" అనే మొక్కల్ని ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. ఇవి మన దేశంలో కూడా ఉన్నాయి. ఈనాడు మనకు కన్పిస్తున్న ఈ మొక్కలన్నీ చాలా చిన్నవిగా ఉంటాయి. తమపై వాలిన చిన్నచిన్న పురుగులనూ, కీటకాలనూ రకరకాలుగా బంధించి, వాటిని ఆహారంగా తీసుకుంటాయి. ఈ మొక్కల ఆకారాల్లో తేడాలున్నాయి. డ్రోసిరా మొక్క ఆకులపై స్పర్శజ్ఞానం కలిగిన నాళికలు (గొట్టాలు) ఉంటాయి. ఈ నాళికలే కీటకాలను బంధిస్తాయి. నెపెంథిస్ యొక్క ఆకు 'కూజా' ఆకారంలో ఉంటుంది. ఆ కూజా నిర్మాణానికి ఒక మూత వంటి ఏర్పాటు కూడా ఉంటుంది. కీటకం ఆ కూజాలోకి దూరగానే మూత బిగుసుకుపోతుంది. యుట్రిక్యులేరియా ఆకులు తిత్తివంటి బోనుగా తయారై ఉండి, కీటకాలను బంధిస్తాయి. డయోనియా మొక్క యొక్క ఆకు, రెండు దొప్పలవలె ఉంటుంది. కీటకం వాటిలో వాలగానే, దొప్పలు రెండూ దగ్గరకు వచ్చి కలిసిపోతాయి. తమకు కావలసిన మాంసకృత్తులకోసం పురుగులనూ, కీటకాలనూ ఆహారంగా తీసుకోడానికి ఆ మొక్కలకు వివిధరకాల ఏర్పాట్లున్నాయి. ఇదే పద్ధతిలో హెచ్చుగా మాంసకృత్తులను సేకరించుకునే అతి పెద్ద వృక్షం ఒకటి, రామాయణ గాథలో కన్పిస్తుంది. అది వేరెవరో కాదు. భయంకర రాక్షసునిగా వర్ణించబడిన 'కబంధుడే' ఆ మాంసాహార వృక్షం. కబంధుని గురించి వివరంగా తెలుసుకుందాం.

రావణాసురుడు సీతను ఎత్తుకుపోయిన అనంతరం రామలక్ష్మణులు ఆమెను వెదుకుతూ అడవుల్లో తిరుగుతూ ఉంటారు. ఆ సమయంలో కబంధుడు అనే రాక్షసుడు తన చేతులతో రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ బంధిస్తాడు. రామాయణంలోని ఈ సన్నివేశంలో కబంధుడు ఈ విధంగా వర్ణించబడ్డాడు, చూడండి. "కబంధుడు

పర్వతమంత ఆకారంతో ఉన్నాడు. వాడి రొమ్ముపై గుహవంటి పెద్దనోరు ఉంది. కాళ్ళు మొత్తానికి లేవు. మొండెమునకు అతుకబడి ఉన్న బలమైన చేతులు బహుదూరానికి వ్యాపించి ఉన్నాయి. చేతుల సంఖ్య అనేకం. ఆ చేతుల మధ్య పెద్ద పులులూ, సింహాలూ, ఎలుగుబంట్లూ నలిగిపోతున్నాయి. ఆ జంతువులను గుహవంటి తన నోట్లో పడేసు కుంటున్నాడు." 'సుదీర్ఘమైన ఆ చేతుల సాయంతోనే ఆహార సంపాదన చేస్తున్నానని' కబంధుడు చెప్తాడు కూడా! మొత్తం ఈ లక్షణాలన్నీ నేటి మన కీటకాహార మొక్కల లక్షణాలే! నేటి కీటకాహార మొక్కలు చిన్నవి కనుక తమకు కావలసిన మాంసకృత్తుల కోసం పురుగులనూ, కీటకాలనూ తింటున్నాయి. కబంధుడు పెద్దవృక్షం కనుక, తనకు కావలసిన మాంసకృత్తులకోసం పెద్దపెద్ద జీవాలనే తినేసేవాడు. అందువల్లనే దారినపోతున్న రామలక్ష్మణులను కూడా తన చేతులతో బంధించాడు. ఇద్దరినీ మ్రింగేసే ప్రయత్నంలో ఉన్నాడు. సరిగ్గా ఆ సమయంలో రామలక్ష్మణులిద్దరూ తమ కత్తులను దూసి, అతని చేతుల్ని నరికేశారు. దాంతో కబంధుని పీడ విరగడయింది. కబంధుణ్ణి కాల్చి బూడిద చేశారు రామలక్ష్మణులు. అతి ప్రమాదకరమైన అటువంటి వృక్షజాతిని సమూలంగా నాశనం చేసేందుకే రామలక్ష్మణులు ఆ పని చేశారని మనం అర్థం చేసుకోవచ్చు. దీన్నే పురాణపరంగా వాల్మీకి తన రామాయణంలో మరోలా చెప్తాడు. 'కబంధుడు నిజానికి ఒక గంధర్వుడనీ, శాపవశాన అలా మారాడనీ, రామలక్ష్మణులు అతన్ని కాల్చి బూడిద చేసిన తర్వాత, తిరిగి గంధర్వుడుగా మారాడనీ' వ్రాసుకొచ్చాడు. ఋషీశ్వరుల పురాణపరిభాష మనకు క్రొత్తకాదుకదా!

కబంధుని కంటే ముందుగా రామలక్ష్మణుల చేతిలో మరణించిన విరాధుడనే రాక్షసుడు కూడా నాటి మాంసాహార వృక్షజాతికి చెందినవాడేమో అనిపిస్తుంది. కబంధుని ఖండించినట్లే విరాధుని బాహువులు కూడా ఖండిస్తారు రామలక్ష్మణులు. ఎంతకూ వాడు చావకపోవడంతో, ఒక గొయ్యితీసి వాణ్ణి పూడ్చేశారట. అక్కడితో విరాధుడు మరణించినట్లుగా రామాయణం చెప్తోంది. కబంధుణ్ణి పూర్తిగా కాల్చివేయడమూ, విరాధుణ్ణి మళ్ళీ లేవకుండా పాతిపెట్టడమూ గమనిస్తే, మాంసాహార వృక్షజాతిని సమూలంగా నాశనం చేసేందుకే రామలక్ష్మణులు అలా చేసి ఉంటారని అనిపిస్తోంది. ఇక అప్పటినుండి ఇప్పటివరకూ మాంసాహార వృక్షజాతి భూమిపై ఎక్కడా కన్పించలేదు. (మహాభారతంలోకూడా వాటి ప్రస్తావన ఉండదు.) అటువంటి భయంకర వృక్షజాతిని నశింపజేసినందుకు రామలక్ష్మణులకు ధన్యవాదాల్ని తెలుపుకోవాలి మనం.

★ ★ ★

# 26. బెర్ముడా ట్రయాంగిల్‌ను పోలిన రాక్షసి "సింహిక"

రామాయణ గాథలో ఒక చిత్రమైన అంశం, ఆధునిక కాలంలోని ఒక విచిత్రాన్ని పోలి ఉన్నది. దాని గురించి తెలుసుకుందాం ఇప్పుడు.

సీతాన్వేషణకై హనుమంతుడు గాలిలో ఎగురుతూ సముద్రాన్ని లంఘిస్తున్న సందర్భం అది. ఆ సముద్రంలో "సింహిక" అనబడే ఒక భయంకరమైన రాక్షసి ఉంది. సముద్రంపై పడిన నీడ (Shadow) ను పట్టేయడం ద్వారా ఆ సింహిక దేనినైనా సరే, తన నోట్లోకి లాక్కుని మ్రింగగలదు. అందువల్ల దాన్ని "ఛాయా గ్రాహిణి" అన్నారు. ఎగురుతున్న హనుమంతుని నీడ, సముద్రంపై పడగానే, ఆ నీడను పట్టేసింది సింహిక. హనుమంతుడు ముందుకు దూసుకుపోలేక గాలిలో ఆగిపోయాడు. ఎందువల్ల అలా జరిగిందో హనుమకు అర్థంకాలేదు. చుట్టూ చూసుకున్నాడు. ఎవరూ కన్పించలేదు. అంతలో తాను క్రిందకు లాగబడుతున్నట్లుగా గమనించి, సముద్రంలోకి చూశాడు. తన నీడను పట్టి బంధించి, మ్రింగడానికి సిద్ధంగా ఉన్న 'సింహిక' కన్పించింది. తూర్పుసముద్రంలోనూ, దక్షిణ సముద్రంలోనూ "ఛాయాగ్రాహిణులు" ఉన్నట్లుగా సుగ్రీవుడు చెప్పిన మాటలు హనుమంతునికి గుర్తుకొచ్చాయి. (హనుమంతుడు దాటుతున్నది దక్షిణ సముద్రం. దాన్నే ఇప్పుడు 'హిందూ మహాసముద్రం' అంటున్నాం.) విషయాన్ని అర్థం చేసుకున్న హనుమంతుడు తన శరీరాన్ని విపరీతంగా పెంచసాగాడు. అది చూసిన సింహిక తన నోరు మరింత విశాలం చేయసాగింది. అకస్మాత్తుగా హనుమంతుడు సూక్ష్మరూపం ధరించి, సింహిక శరీరంలోకి ప్రవేశించి, దాన్ని చీల్చి చెండాడి బయటకు వచ్చాడు. సింహిక మరణించింది. హనుమంతుడు చేసిన పనికి దేవతలంతా సంతోషించారు. ఎందుకంటే సింహిక ఉన్న సముద్రప్రాంతం "మృత్యుప్రాంతం"గా ఉండేది. అటుగా వెళ్ళిన ప్రతీ జీవీ దానికి ఆహారంగా మారుతూ ఠక్కున మాయమయ్యేది. ఆ పీడ వదిలినందుకు దేవతాగణం సంతోషించింది. ఇతిహాసంలో చెప్పబడిన ఇటువంటి "మృత్యుప్రాంతం", ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో నేటికీ ఉంది. దానిపేరే "బెర్ముడా ట్రయాంగిల్". (దీన్నే "బెర్ముడా త్రికోణం" అనికూడా అంటారు.)

## బెర్ముడా ట్రయాంగిల్

అమెరికాలోని ఫ్లోరిడాకు, ప్యూర్టోరికో దీవికి, బెర్ముడా అనే ప్రదేశానికి మధ్య

ఉన్న సముద్ర ప్రాంతాన్నే "బెర్ముడా ట్రయాంగిల్" అంటారు. ఈ ప్రాంతం 39 లక్షల చదరపు కిలోమీటర్ల వైశాల్యంతో 25° లనుండి 40° ల ఉత్తర అక్షాంశం, 55° లనుండి 85° ల పశ్చిమ రేఖాంశాలపై ఉంది. ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో ఉన్న ఈ ముక్కోణ ఆకారపు ప్రాంతం "ఒక మృత్యుప్రాంతంగా" పేరుపొందింది. దీన్ని "దెయ్యపు ముక్కోణం" అని కూడా ప్రపంచ ప్రజలు పిలుస్తుంటారు.

గత రెండువందల సంవత్సరాల్లోనూ ఈ ప్రాంతంలో 50 ఓడలూ, 20 విమానాలూ విచిత్రంగా అదృశ్యమయ్యాయి. సింహిక చేత ఎలాగయితే జీవులు సముద్రంలోకి లాగబడేవో, అదేవిధంగా ఈ బెర్ముడా త్రికోణ ప్రాంతంలో ఓడలూ, విమానాలూ సముద్రంలోకి లాగబడుతూ గల్లంతు అవుతున్నాయి. 1945వ సంవత్సరంలో అమెరికా వారి 5 బాంబరు విమానాలు విన్యాసాలు చేస్తూ, ఈ ప్రదేశంలోకి రాగానే అంతు తెలియకుండా పోయాయి. వాటిని వెదకడానికి వెళ్ళినవారూ, వారికి రక్షణగా వెళ్ళినవారూకూడా ఈ ప్రాంతంలోనే అడ్రసు లేకుండా పోయారు. 1968వ సంవత్సరంలో అమెరికా నావికాదళానికి చెందిన "స్కార్పియన్" అనబడే అణుజలాంతర్గామి ఈ ప్రాంతంలో మాయంకావడం, ప్రపంచంలో పెద్ద సంచలనాన్ని కల్గించింది. ఇప్పటివరకూ మొత్తంమీద సుమారు వెయ్యిమంది ఈ ప్రాంతంలో ప్రాణాలు కోల్పోయారు. ఏదైనా ఒక ఓడ ఈ ప్రదేశంలోకి ప్రవేశించిన వెంటనే ఓడనుండి వెలువడే రేడియో సిగ్నల్స్ విచిత్రంగా ఆగిపోతున్నాయట. ఆ వెంటనే ఓడ మాయమౌతుంది. వివిధ దేశాలకు చెందిన అనేకమంది ఎంత ప్రయత్నించినా కూడా, ఈ బెర్ముడా త్రికోణ రహస్యం ఇప్పటికీ తెలిసి రాలేదు.

బెర్ముడా త్రికోణ ప్రాంతంలోని అంతర్ముఖమైన గాలులు, సముద్రపు సుడులు అక్కడకు వచ్చే ఓడలనూ, విమానాలనూ నాశనంచేసి సముద్రంలో కలిపేస్తున్నాయని కొంతమంది శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఈ త్రికోణ ప్రాంతంలో బలమైన అయస్కాంత క్షేత్రమున్నదనీ, దానివల్లనే 'వాహనాల రేడియో సిగ్నల్స్' ఫెయిల్ కావడం జరుగుతుందనీ మరికొంతమంది శాస్త్రజ్ఞులు అంటున్నారు. ఇవన్నీ కేవలం ఊహాగానాలే! ఈ ప్రాంతంలో జరుగుతున్న అదృశ్యాల గురించి తృప్తికరమైన సమాధానం ఎవరూ చెప్పలేక పోయారు. అది ఇప్పటికీ మిస్టరీగానే ఉండిపోయింది. ప్రపంచ దేశాలన్నీ కూడా ఈ ముక్కోణ ప్రాంతంలోకి ప్రవేశించడం మానుకున్నాయి.

నిర్ణీత సముద్రప్రాంతంలో విచిత్రంగా సంభవిస్తున్న ఈ అదృశ్యాల పర్వం గురించి తెలుసుకున్నారు కదా! అలనాడు రామాయణ కాలంలో కూడా ఇదేవిధంగా తూర్పు, దక్షిణ సముద్రాలలో అదృశ్యాల పర్వం కొనసాగేదన్నమాట. నేడు 'బెర్ముడా

ట్రయాంగిల్ ఒక్కటే మృత్యుప్రాంతంగా ఉంది. పూర్వం ఇటువంటి మృత్యుప్రాంతాలు సముద్రాల్లో చాలా చోట్ల ఉండేవని రామాయణ గ్రంథం ద్వారా తెలుస్తోంది. నేటి బెర్ముడా త్రికోణ ప్రాంతం, ఆనాడు సింహిక నివసించిన ప్రాంతం వంటిదే కావచ్చు. పురాణకాలంలోని ఆ మృత్యుప్రాంతాన్ని 'సింహిక' అనే రాక్షసిగా వాల్మీకి వర్ణించి ఉంటాడు. దక్షిణ సముద్రంలో ఉన్న ఆ మారణశక్తి (సింహిక)ని ఆనాడు హనుమంతుడు నిర్మూలించాడు. అటువంటిదే మరో మారణశక్తి, ఇప్పుడు ఉత్తర అట్లాంటిక్ సముద్రంలో 'బెర్ముడా త్రికోణం' పేరిట ఉంది. దీని సంగతి మనకేమీ అంతుపట్టడం లేదు. చివరకు ఏం జరుగుతుందో చూద్దాం.

★ ★ ★

# 27. పురాణకాలంలో కృత్రిమ వర్షాలు

వాన రాకడ, ప్రాణం పోకడ ఎవరూ చెప్పలేమని అంటారు. వర్షాలు మనకు కావలిసినప్పుడు కురవవు. వద్దంటే మానవు. అతివృష్టి, అనావృష్టులతో నేడు ప్రపంచ దేశాలు అల్లకల్లోలమౌతున్నాయి. ఆధునిక శాస్త్రవేత్తలు ఎంతో కృషిచేసి, కృత్రిమ వర్షాలను కురిపించడంలో విజయాన్ని సాధించారు. అయితే అందులో కొన్ని ఇబ్బందులున్నాయి.

ఆధునిక కృత్రిమ వర్షాలవల్ల ఇబ్బందులు : రసాయన పదార్థాలను ఉపయోగించి కురిపించే ఈ కృత్రిమ వర్షాలు, స్వాభావిక వర్షాలకు ఏ మాత్రం సాటిరావు. ఆధునిక కృత్రిమ వర్షాలవల్ల అనేక చెడు పరిణామాలు సంభవిస్తున్నాయి. వాటిగురించి తెలుసుకుందాం. నేడు కృత్రిమ వర్షాల కోసం ఉపయోగిస్తున్న రసాయన పదార్థాలవల్ల ప్రకృతిలోని స్వాభావికత దెబ్బతింటోంది. కృత్రిమ వర్షాలను కురిపించిన ప్రాంతంలో మళ్ళీ చాలాకాలం వరకూ 'సహజ వర్షాలు' కురవకపోవడం, ఒక ప్రాంతపు మేఘాలు మరో ప్రాంతానికి బలవంతంగా తరలించబడడం వల్ల మొదటి ప్రాంతంలో అనావృష్టి ఏర్పడడం మొదలగు పరిస్థితులవల్ల 'ప్రకృతి సమతౌల్యానికి' విఘాతం ఏర్పడుతోంది. ఈ విధమైన చెడు ఫలితాలు కలుగుతున్నందున కృత్రిమ వర్షాలను పదేపదే కురిపించేందుకు ఆధునిక శాస్త్రవేత్తలు వెనకడుగు వేస్తున్నారు. (ఆధునిక సైన్సులో ప్రగతి అనుకున్న చాలా అంశాలు, తిరిగి చెడు ఫలితాలను ఇస్తూనే ఉన్నాయి. ఇది జగమెరిగిన సత్యమే!)

కృత్రిమ వర్షాలనేవి మన పురాణకాలం వారికీ తెలుసు. వేదపురాణేతిహాసాల్లో అనేకచోట్ల ఈ కృత్రిమ వర్షాల ప్రస్తావన కనపడుతోంది. పైగా పురాణకాల కృత్రిమ

వర్షాలు చాలా స్వాభావికమైన రీతిలో కురిపించబడేవి. వాటివల్ల ఇతరితరంగా చెడు పరిణామాలేవీ ఉండేవి కావు. అవి సహజ వర్షాలతో సమానమే! దీనికి కారణం ఏమంటే నాటి మహర్షులు ఈ కృత్రిమ వర్షాలకోసం ఏవిధమైన రసాయన పదార్థాలనూ వాడేవారు కాదు. వారు అనుసరించే మార్గాలే వేరు. కృత్రిమ వర్షాల సాధనకోసం యజ్ఞాలు నిర్వహించేవారు. యజ్ఞాల్లో వివిధ మూలికల్ని (అగ్నికి) ఆహుతి ఇవ్వడం ద్వారా వచ్చే ధూమం (అనగా పొగ) వల్లనూ, మరియూ ఆ సమయంలో మహర్షులు చదివే మంత్రాల శబ్ద తరంగాల వల్లనూ 'మేఘాలు' సమీకరించబడి, వర్షాలు కురిసేవి. ఇవి కృత్రిమ వర్షాలే అయినా, అతి సహజరీతిలో కురిసేవి. అందువల్ల ఇతర చెడు పరిణామాలేవీ ఉండేవి కావు.

కృత్రిమవర్షాల కోసం మహర్షులు వాడిన మూల పదార్థాలు రెండే! అవి ఏమంటే 'మూలికలు, మంత్రాలు'. (మంత్ర శబ్ద తరంగాల శక్తి ఎలాంటిదో 'పురాణకాల మంత్రాలు' అనే వ్యాసంలో ఇంతకుముందే తెలుసుకున్నారు కదా!) 'సముత్పతన్తు' అనే సూక్తం (అధర్వణ వేదం 4-15) ద్వారా వర్షాన్ని కురిపించవచ్చునని వేదం చెప్తోంది.

## కృష్ణయజుస్సంహిత లోని ప్రస్తావన

కృత్రిమ వర్షాల ప్రస్తావన కృష్ణయజుస్సంహితలో ఉంది. జలాధిపతి వరుణుడు. వారుణ మంత్రాలు కృష్ణయజుస్సంహితలో 42 అనువాకాల్లో చెప్పబడ్డాయి. అనావృష్టి సమయాల్లో తైత్తిరీయ శాఖను పూర్తిగా అధ్యయనం చేసి, వారుణమంత్ర రహస్యాన్ని తెలుసుకున్న యజుర్వేద పండితులచే 'వరుణ జపం' చేయిస్తే, కుంభవృష్టి కురుస్తుందట. (ప్రయోగాత్మకంగా జరుపబడిన ఈ కార్యక్రమం మన దేశంలో అనేక చోట్ల విజయవంతం కావడం విన్నాం.)

సంగీతం ద్వారా వర్షాలను కురిపించిన సందర్భాలు పూర్వ చరిత్రలో కన్పిస్తాయి. వీటికి కారణం, శబ్దతరంగాలే! అక్బర్ ఆస్థాన సంగీత విద్వాంసుడైన 'తాన్‌సేన్', హైందవ సంగీత శబ్ద తరంగాలతో దీపాలను వెలిగించడం, వర్షాలు రప్పించడం చేసేవాడని మన చరిత్ర చెప్తోంది. సంగీత శబ్ద తరంగాల శక్తికి ఇదొక ఆధునిక ఉదాహరణ. పురాణకాలంలోని కొంతమంది భక్తులు దేవుణ్ణి ఆరాధించి వర్షాన్ని కురిపించిన సంఘటనలు కొంతవరకూ ఈ కోవకు చెందినవే! కొన్ని సంగీత శబ్దతరంగాలు, ప్రకృతిలో మార్పులను తీసుకురాగలవని, శాస్త్రాలద్వారా తెలుస్తోంది.

పురాణకాలంలో కృత్రిమ వర్షాల్ని యజ్ఞయాగాదుల ద్వారా రప్పించేవారని

తెలుసుకున్నాం కదా! దానికి ఉదాహరణగా మహాభారతమందలి అరణ్యపర్వంలో ఉన్న ఋష్యశృంగుని గాథను చెప్పుకుందాం.

అంగదేశాన్ని రోమపాదుడనే మహారాజు పరిపాలిస్తుండేవాడు. ఒకసారి అతని దేశంలో వర్షాలు కురవడం మానేశాయి. నీటికి విపరీతమైన కొరత ఏర్పడింది. అందుకు తరుణోపాయం సూచించమని పండితులను అర్థించాడు రోమపాదుడు. అందుకు పండితులు ఒక సలహానిస్తూ "ఋష్యశృంగుడనే ఒక ముని ఉన్నాడు. విభాండక ముని కుమారుడతను. అతను ఎక్కడుంటే అక్కడ వర్షాలు పుష్కలంగా కురుస్తాయి. అతనికి ఇంద్రుడిచ్చిన వరం అది! అతణ్ణి మన రాజ్యానికి రప్పించుకుంటే సరి" అని చెప్పారు. రోమపాద మహారాజు ఎన్నో ప్రయానలకోర్చి ఋష్యశృంగుణ్ణి తన రాజ్యానికి రప్పించుకున్నాడు. తన కుమార్తె శాంతను అతనికిచ్చి వివాహం జరిపించాడు. ఋష్యశృంగుని రాకతో రాజ్యమంతటా వర్షాలు కురిసాయి. రాజ్యం సుభిక్షంగా మారింది. ఈ గాథలోని అంతరార్థాన్ని తెలుసుకుందాం ఈసారి. ఋష్యశృంగుడు ఎక్కడుంటే అక్కడ వర్షాలు కురుస్తాయని ఇంద్రుడు వరమివ్వడం అనేది, కేవలం పురాణపరమైన వర్ణన! ఋష్యశృంగుడు కృత్రిమ వర్షాల్ని కురిపించగల దిట్ట అని మనం ఇక్కడ గ్రహించాలి. అతను తనకు తెలిసిన ప్రయోగాత్మక పద్ధతుల ద్వారా యజ్ఞాల్ని నిర్వహించి, తద్వారా రాజ్యమంతటా వర్షాలను కురిపించడం ఇందులోని అసలు విషయం.

ఇకపోతే అశ్వమేధయాగాలవల్ల కూడా వర్షాలు కురిసేవని, గ్రంథాలవల్ల తెలుస్తోంది. మహారాజులు తన విజయకేతనాన్ని ఎగురవేయడానికే కాకుండా, దేశంలోని దుర్భిక్ష పరిస్థితులను ఎదుర్కొనేందుకు కూడా అశ్వమేధయాగాలు చేసేవారట. పైగా అశ్వమేధయాగం ద్వారా వివిధ దేశాల నుండి కలిసివచ్చిన నిధుల సాయంతో భూగర్భ జలనిధులను వెలికి తియ్యవచ్చు. ఇలా పూర్వకాలపు యజ్ఞ యాగాదులకు వివిధ ఆశయాలూ, లక్ష్యాలూ ఉండేవి.

ఇంతకూ మనం తెలుసుకోవలసిన విషయం ఏమంటే, కృత్రిమ వర్షాలనేవి మన 'భరత వర్షానికి' క్రొత్తేం కాదు (పద్ధతి మారింది గానీ, ప్రక్రియ మాత్రం పాతదే!) చెడు పరిణామాలను కలిగించే ఆధునిక కృత్రిమ వర్షాలవలె కాకుండా, స్వాభావిక రీతిలో కృత్రిమ వర్షాలను కురిపించగల ప్రత్యేకత మన ఋషీశ్వరుల కుండేది.

★ ★ ★

# 28. పురాణకాలం నాటి కాలమానం, గణితం

## (I) కాలమానం

కాలాన్ని లెక్కించేది కాలమానం. ప్రపంచాన కాలమాన విషయంలో కూడా హైందవులు, మహామేధావులు. హైందవులు చెప్పే కాలమానం అతి ప్రాచీనమైనది, ఖచ్చితమైనదీనూ! ("భూమిపై ప్రకృతి పుట్టుక - బ్రహ్మదేవుని వయసు" అనే అంశంలో ఇంతకుముందే ఈ విషయం గురించి వివరంగా ఇవ్వబడింది కదా!)

మన ప్రాచీన గ్రంథాల్లో 'సమయాన్ని లెక్కించే విధానాలు' అనేకం ఇవ్వబడ్డాయి. వాటిలో కొన్నింటి గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

మన పురాణాల్లో కొన్నిచోట్ల అతి సూక్ష్మమైన కాలమానం కన్పిస్తోంది. కనురెప్పపాటులో 30వ వంతును "తత్పర" అనేవారట. ఆ 'తత్పర'లో 100వ వంతును 'తృటి' అనేవారట. ఆ 'తృటి'లో 100వ వంతును 'సంక్రమణ కాలం' అనేవారట. ఆనాడు సూక్ష్మాతి సూక్ష్మమైన కాలమాన ప్రమాణం "సంక్రమణ కాలం".

క్రీ.శ. 18వ శతాబ్దంలో పాశ్చాత్య దేశాల్లో 'గడియారాలు' కనిపెట్టారు. భారతీయులకు అంతకు ముందే అతి ప్రాచీన కాలంలోనే 'గడియారాలు' తెలుసు. రామాయణ, మహాభారత కాలాలనుండీ సమయాల్ని తెలిపే 'ఘటికా యంత్రాలు' ఉన్నాయి. పురాణకాలం నుండీ రాజప్రాసాదాల్లో సమయాన్ని తెలుపుతూ గంటలు కొట్టే పద్ధతులు కూడా ఉన్నాయి. ఆనాడు ఘడియ, విఘడియ అనే కాలమాన ప్రమాణాలను వాడేవారు.

మనుస్మృతి ప్రకారం : 18 కనురెప్పపాట్లు = 1 కాష్ఠగా లెక్క. 30 కాష్ఠలు = 1 కళ; 30 కళలు = 1 ముహూర్తం; 30 ముహూర్తాలు = 1 అహోరాత్రం (అనగా 1 రోజు); ఈ విధమైన లెక్క ప్రకారం ముహూర్తం అనగా 48 నిమిషాలు; 1 కళ అనగా 1 నిమిషం 36 సెకన్లు; 1 కాష్ఠ అనగా 3 1/5 సెకన్లు.

భాగవత గ్రంథం ప్రకారం : ఇంటి కిటికీ రంధ్రం నుండి వచ్చు సూర్యకిరణమున ఆకాశానికి ఎగురునట్లు కన్పించు నలుసును 'త్రసరేణువు' అంటారు. సూర్యుడు ఒక త్రసరేణువు ఉండునంత మేర పయనించు కాలమును '1 త్రసరేణు కాలము' అంటారు. 3 త్రసరేణు కాలములు = 1 తృటి కాలం; 100 తృటి కాలములు = 1 వేధ; 3 వేధలు = 1 లవము; 3 లవములు = 1 నిమేషము; 3 నిమేషములు =

1 క్షణము; 5 క్షణములు = 1 కాష్ఠ; 15 కాష్ఠలు = 1 లఘువు; 15 లఘువులు = 1 ఘడియ; 2 ఘడియలు = 1 ముహూర్తం; 6 ముహూర్తాలు = 1 ఝాము; 8 ఝాములు = 1 రోజు (రాత్రింబవళ్ళు) 15 రోజులు = 1 పక్షం; 2 పక్షములు = 1 నెల; 2 నెలలు = 1 ఋతువు; 3 ఋతువుల = 1 అయనము; 2 అయనములు = 1 సంవత్సరం.

సంవత్సరాలు 5 రకములని భాగవతం చెప్తోంది.

1. సంవత్సరం : సూర్యుడు 12 రాసుల్లో సంచరించే కాలం

2. పరివత్సరం : బృహస్పతి 12 రాసుల్లో సంచరించే కాలం.

3. ఇలావత్సరం : 300 సూర్యోదయములతో 12 మాసములు నిండినవి.

4. అనువత్సరం : చంద్రుడు 12 రాసుల్లో సంచరించు కాలం.

5. వత్సరం : నక్షత్రములు సంచరించు 12 నెలల కాలం.

ప్రాచీన జ్యోతిష శాస్త్రాల ప్రకారం : 6 ప్రాణములు = 1 విఘడియ; 60 విఘడియలు = 1 ఘడియ; 60 ఘడియలు = 1 రోజు (1 ఘడియ = 24 నిమిషాలు; 1 విఘడియ = 24 సెకన్లు; ప్రాణకాలం అనగా 4 సెకన్లు)

ఖగోళశాస్త్ర లెక్కల కోసం ప్రాచీనకాలంలో వాడిన కాలమానం ఇలాఉంది. 1 రోజు = 60 ఘడియలు; 1 ఘడియ = 60 విఘడియలు; 1 విఘడియ = 60 పరఘడియలు; 1 పరఘడియ = 60 సూక్ష్మఘడియలు;

కౌటిల్యుని అర్థశాస్త్ర ప్రకారం : నీరు నింపిన చిల్లుకుండతో కాలమానం, నీడ గడియారంతో కాలమానం మొదలైనవి అర్థశాస్త్రంలో కన్పిస్తున్నాయి. మన పూర్వీకులు సెకనులో 16వ వంతును లెక్కించి, 'తుటం' అనే పేరుతో దాన్ని కాలమానంలో వాడేవారు. కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఇవ్వబడిన కాలమానం ప్రకారం-2 తుటములు = 1 లవం; 2 లవములు = 1 నిమిషం; 5 నిమిషాలు = 1 కాష్ఠ; 30 కాష్ఠలు = 1 కళ; 40 కళలు = 1 నాళిక; 2 నాళికలు = 1 ముహూర్తం.

*(గమనిక : పైన తెలిపిన వివిధ కాలమానాల్లో తృటి, కాష్ఠ, కళ, ఘడియ, ముహూర్తం మొదలగు పదాలు మళ్ళీ మళ్ళీ కన్పిస్తాయి. పదాలు ఒకటే అయినా కూడా ఏ మానానికి ఆ మానంలో, వాటి విలువల్లో తేడాలున్నాయి).*

పై విధంగా సూక్ష్మ కాలపరిమాణాన్ని కూడా లెక్కించి చూడగల మేధావులు "ప్రాచీన హైందవులు."

చాంద్రమాన, సౌరమాన సంవత్సరాల కాలపరిమితులను మన పూర్వీకులు స్పష్టంగా చెప్పారు.

చాంద్రమాన సంవత్సరం = 354 రోజుల, 11 ఘడియల, 38 విఘడియలు.
సౌరమాన సంవత్సరం = 365 రోజుల, 15 ఘడియల, 31 విఘడియలు.

సూర్యుడు 12 నక్షత్ర రాసుల్లోనూ ఉన్నట్లు కన్పించే మొత్తం కాలాన్ని "సౌరమాన సంవత్సరం"గా మనవారు లెక్కిస్తారు. ఒక్కొక్క నక్షత్రరాశిలోనూ సూర్యుడు ఉండే సమయం ఈ క్రింది విధంగా ఉంటుంది. (60 విఘడియలు = 1 ఘడియ; 60 ఘడియలు = 1 రోజు)

| | రాశి | రోజులు | ఘడియలు | విఘడియలు |
|---|---|---|---|---|
| 1. | మేషం | 30 | 56 | 29 |
| 2. | వృషభం | 31 | 24 | 49 |
| 3. | మిధునం | 31 | 38 | 01 |
| 4. | కర్కాటకం | 31 | 28 | 13 |
| 5. | సింహం | 31 | 01 | 50 |
| 6. | కన్య | 30 | 26 | 42 |
| 7. | తుల | 29 | 53 | 13 |
| 8. | వృశ్చికం | 29 | 29 | 50 |
| 9. | ధనస్సు | 29 | 19 | 34 |
| 10. | మకరం | 29 | 27 | 17 |
| 11. | కుంభం | 29 | 48 | 43 |
| 12. | మీనం | 30 | 20 | 50 |
| **సౌరమాన సంవత్సరం =** | | **365** | **15** | **31** |

12 సంవత్సరాలు = 1 పుష్కరం (బ్రాస్పత్య మానం).

4,32,000 సంవత్సరాలు = కలియుగం. కలియుగానికి రెట్టింపు కాలం 'ద్వాపరయుగం', కలియుగానికి 3 రెట్లు 'త్రేతాయుగం', 4 రెట్లు 'కృతయుగం'. ఈ నాలుగు యుగాలూ కలిసి 43,20,000 సంవత్సరాలు. దీన్ని '1 మహాయుగం'

అంటారు. సుమారు 71 మహాయుగాల కాలాన్ని '1 మన్వంతరం' అంటారు. అలాంటి 14 మన్వంతరాల్ని '1 కల్పకం' అంటారు. ఇంత పెద్ద కాలమానాన్ని, భూమిపై మరో జాతి ఏదీ చెప్పలేకపోయింది, అదే మనవారి ఘనత!

ప్రస్తుతం మనం కలియుగంలో ఉన్నాం. శ్రీకృష్ణ భగవానుని నిర్యాణం అనంతరం, కలియుగం ప్రారంభమయింది. క్రీ.పూ. 3102 ఫిబ్రవరి 18న శ్రీకృష్ణుని నిర్యాణం సంభవించింది. ఆ క్షణం నుండీ కలియుగం మొదలయింది. అది ప్రభవ నామసంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమి, శుక్రవారం అని ఆధునిక చరిత్రకారులు నిర్ధారణ చేశారు. ఆనాటి గ్రహతారకల నడకలను బట్టి ఖగోళ విజ్ఞాన ఆధారంగా ఇదంతా యదార్థమని విదేశీ చరిత్రకారులైన బెంట్‌లే, మోన్స్, బైలే, H.P. బ్లావట్ స్కై మొదలగువారు కూడా అంగీకరించారు. ఇంగ్లీషువారిలా "క్రీస్తుశకం" లాంటి ఏ ఒక్కవ్యక్తిమీదనో ఆధారపడిన విధంగా కాకుండా-- మన భారతీయులు తమ శకాల, కాలమానాలకోసం ఒక ఖచ్చితమైన విధానాన్ని అనుసరించారు. అదేమిటంటే సూర్యచంద్రుల గమనాలపైనా, నక్షత్రం, తిథి, వారం మొదలైన అంశాలపైనా ఆధారపడిన విధంగా ఖచ్చితమైన లెక్కలు వేసేవారు. అలాగే పంచాంగాలు కూడా రూపొందించారు. (ఈ పేరాలోని అంశాలు డాక్టర్ వేదవ్యాస్, I.A.S., గారి "భారతదేశ చరిత్ర - సంస్కృతి" అనే గ్రంథం నుండి సేకరించబడినవి.)

5 వేల సంవత్సరాల క్రితం కలియుగారంభంలో ఉన్న గ్రహగతులను గురించి మన ఋషులు స్పష్టంగా వివరించి ఉన్నారు. అది నిజమో, కాదో చూడాలని నేటి పాశ్చాత్య శాస్త్రవేత్తలు లెక్కలు వేశారు. టెలిస్కోపులతో నానాతంటాలు పడుతూ, 5వేల సంవత్సరాల వెనక్కి గ్రహగతులను లెక్కించుకుంటూ వెళ్ళారు. మన ఋషులు చెప్పిన విషయాలు యదార్థమని తేలింది. నేడు టెలిస్కోపులతో గాని సాధ్యంకాని లెక్కలనుకూడా, ప్రాచీన ఋషులు ఏ స్కోపులూ లేకుండా సులభంగా గణించేవారు. వారి మేధాశక్తికి ఇంతకంటే నిదర్శనం ఏం కావాలి? 26 వేల సంవత్సరాలకు ఒకసారి అదే ధ్రువనక్షత్రం మళ్ళీ వస్తుందనే విషయాన్ని కూడా, ఏనాడో లెక్కించి చెప్పారు మన ఋషీశ్వరులు. వారి మేధస్సు అపూర్వం, అసమానం, అనంతం.

## (2) ప్రాచీన హైందవ గణితం

మన ప్రాచీనులకు గణితశాస్త్రం కొట్టిన పిండి. మన వేదాల్లో అపారమైన గణితశాస్త్ర విజ్ఞానం ఇమిడి ఉంది. ఆధునిక కాలంలో వృద్ధి చెందుతున్న కొన్ని గణిత సూత్రాలకు మన ' వేదగణితమే' మూలమని ఇప్పుడిప్పుడే ప్రపంచ జనావళి తెలుసుకుంటోంది. కాగితాలూ, కలం లేకుండానే కేవలం మన చేతివేళ్ళు పదింటినీ ఉపయోగించి ఎన్నో చిక్కు లెక్కలను గణించే పద్ధతులు మన వేదాల్లో ఉన్నాయి.

(ఆధునిక కాలాన కూడా భారతీయులు గణితశాస్త్రంలో ఒక ఉన్నత శ్రేణిలోనే ఉన్నారు.)

"బీజగణిత, రేఖాగణితాలను ప్రపంచానికి మొట్టమొదట అందించడమే కాకుండా, వాటిని ఖగోళ శాస్త్రంతో సమన్వయపరచి చెప్పగలిగిన మేధావులు "ప్రాచీన హైందవులని" ఎమ్. విలియమ్స్ అనే ఆంగ్ల పండితుడు "ఇండియన్ విజ్‌డమ్" అనే తన గ్రంథంలో (185వ పేజీలో) సమర్థించడం కన్పిస్తోంది.

గణితశాస్త్ర పరిజ్ఞానంలో వేద ఋషుల అనంతరం చెప్పుకోదగిన హైందవ మహాశయుడు "ఆర్యభట్టు". గణిత శాస్త్రంలోని 'వర్గము, వర్గమూలము, ఘనము, ఘనమూలము' అనే వాటిని గురించి ఈయన వివరించాడు. బీజగణితంలోని ఎన్నో సమీకరణాలను రూపొందించాడు. వృత్తపరిధిని కనుక్కోవడంలో మనం ఈనాడు ఉపయోగిస్తున్న 'π' (పై) అనే గ్రీకు సంకేతపు విలువను "3.14"గా, ఏనాడో తన స్వంత సిద్ధాంతాల ప్రకారం ఖచ్చితంగా లెక్కించిన మహా మేధావి ఈయన. (ఆ కాలానికి ఇంకా 'π' అనే సంకేతం లేదు).

మన పూర్వులకు "బీజగణితం, రేఖాగణితం, క్షేత్రగణితం, అంకగణితం" బాగా తెలుసు. వీటికి సంబంధించి ఆర్యభట్టు, బ్రహ్మగుప్తుడు, వరాహమిహిరుడు మొదలగువారు చాలా ప్రసిద్ధ గ్రంథాల్ని వ్రాశారు.

**ప్రాచీన రేఖాగణిత పరిజ్ఞానం :** భారతీయులు రేఖాగణితాన్ని (జామెట్రీని) గ్రీకులనుండి నేర్చుకున్నారనే తప్పుడు ప్రచారం మన 'చరిత్ర' (History) లో ఉంది. 'యూక్లిడ్' అనే గ్రీకు పండితుడు, రేఖాగణితాన్ని కనిపెట్టినట్లు ఆధునికుల భ్రమ. నిజానికి రేఖాగణితాన్ని 'శుల్బవిద్య' అనే పేరుతో మొట్టమొదటగా రూపొందించిన వారు మన ప్రాచీన ఋషులు. శ్రౌతసూత్ర, కల్పసూత్ర, గృహ్యసూత్రాలతో పాటూ 'శుల్బసూత్రాలు' కూడా మన భరత ఖండంలో అతి ప్రాచీనకాలం నుండీ ఉపయోగించబడేవి. 'శుల్బము' అనగా 'కొలత్రాడు' అని అర్థం. శుల్బ సూత్రాలు అనగా రేఖాగణితం (జామెట్రీ). ప్రాచీన హైందవులు యజ్ఞయాగాల సమయాల్లో వేద విహారాదులను నిర్మించుకోడానికి ఈ గణితాన్ని రూపొందించుకున్నట్లుగా, Dr. Thibant అనే ఆంగ్లదొర తన పరిశోధనల్లో తెలియజేసాడు. 1875వ సంవత్సరంలో "జర్నల్ ఆఫ్ ది ఆసియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" అనే పత్రిక మార్చినెల సంచికలో ఈ విషయానికి చెందిన వ్యాసాలను అయన విపులంగా వ్రాశాడు. 'రమేష్ చంద్ర దత్' అనే ICS ఆఫీసరు, "భారతీయ సంస్కృతి - చరిత్ర" అనే తన గ్రంథంలో కూడా, ఇదే విషయాన్ని నిరూపించి చూపారు.

మన ప్రాచీనుల శుల్బ సూత్రాల లోనిదే "పైథాగరస్ సిద్ధాంతం". ఈ విషయాన్ని గురించి కూడా అనేకమంది ఆంగ్ల పండితులు తమ తమ గ్రంథాల్లో తెలిపారు.

## పైథాగరస్ సిద్ధాంతం

గణితశాస్త్రం లోని పైథాగరస్ సిద్ధాంతాన్ని 'పైథాగరస్' అనే గ్రీకు పండితుడు కనిపెట్టినట్లుగా ఆధునికుల భావన. అయితే ఈ విషయంలో మనం తెలుసుకోదగిన చిన్న విశేషం ఉంది. అసలు ఏ కాలంలోనూ ఎక్కడా కూడా ఈ 'పైథాగరస్' అనే మానవుడెవరూ పుట్టనే లేదు. అయితే ఈ 'పైథాగరస్' అనే మాట ఎలా వచ్చిందో తెలుసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. పైథాగరస్ సిద్ధాంతాన్ని మన ప్రాచీన హైందవులు ముందుగా కనుగొనగా, దాన్ని నేర్చుకున్న 'బౌద్ధ గురువులు', గ్రీకువారికి నేర్పారు. 'బౌద్ధ గురువులు' అనేమాట గ్రీకుల పలుకుబడిలో క్రమంగా 'బుధగురూస్' గానూ, అ తర్వాత 'పుథగోరస్'గానూ, అదే చివరకు 'పైథాగరస్' గానూ మారింది. గ్రీకు గ్రంథాలు బుద్ధ గురువులనే 'పైథాగరస్'గా వ్రాసుకున్నాయి. (ఎడ్వర్డ్ పోకాక్ వ్రాసిన "ఇండియా ఇన్ గ్రీస్" అనే గ్రంథంలో ఈ విషయం ఇవ్వబడింది.)

గణిత శాస్త్రవేత్త భాస్కరాచార్యుడు : చరిత్రకాలంలోకి వచ్చి చూస్తే, గణితంలో పేరు మోసిన ఆచార్యుడుగా భాస్కరాచార్యుణ్ణి చెప్పుకోవాలి. మంచి పాండిత్యంతో చిక్కు లెక్కలను చక్కని శ్లోకాలలో ఇమిడ్చి వ్రాసిన మేధావి ఆయన. భాస్కరాచార్యుడు గొప్ప ఖగోళ శాస్త్రవేత్త కూడా!

భాస్కరాచార్యుని గణిత సిద్ధాంతాలను నేడు ప్రపంచమంతా ఉపయోగించు కుంటోంది. ఈయన 36 సంవత్సరాల వయస్సులో వ్రాసిన "సిద్ధాంత శిరోమణి" అనే గ్రంథం దేశదేశాలా పేరు పొందింది. 69వ యేట "కరణ కుతూహలము" అనే ప్రముఖ గ్రంథాన్ని కూడా వ్రాశాడు. ఈయన రచనలు జర్మనీ, అరేబియా, ఇంగ్లాండు మొదలగు దేశాల్లో బాగా ప్రాచుర్యం పొందాయి. "సిద్ధాంత శిరోమణి" గ్రంథంలో 4 భాగాలున్నాయి. అవి వరుసగా "పాటీ గణితం, బీజగణితం, గ్రహ గణితం, గోళాధ్యాయం" అనే పేర్లు కలిగి ఉన్నాయి. పాటీ గణితాన్నే "లీలావతీ గణితం" అనికూడా అంటారు. ఈ లీలావతీ గణితంలో 278 శ్లోకాలున్నాయి. వాటి ప్రారంభంలో గణితంలోని 'కొలమానం' గురించి చెప్పాడు. అ తర్వాత సంఖ్యలు, కూడికలు, తీసివేతలు, గుణకారాలు, భాగహారాలు, వర్గం, వర్గమూలం, ఘనం, ఘనమూలం మొదలైన వాటిని గురించి వివరించాడు. రెండవ భాగమైన బీజగణితంలో ఎన్నో సూత్రాల్నీ, నియమాల్నీ చెప్పాడు. ఈనాడు మనం బీజగణితంలో, విలువ

తెలుసుకోవలసిన అంశాల్ని రాబట్టేందుకు "a,b,x,y" అంటూ కొన్ని ఇంగ్లీషు అక్షరాల్ని అజ్ఞాత సంజ్ఞలుగా వాడుతున్నాం. అతి ప్రాచీన కాలంలోనే మన భాస్కరాచార్యుడు ఆ మాదిరి లెక్కల కోసం "కొన్ని పదాలను" (a,b,x,yల వలె) వాడుతూ వచ్చాడు. అంతేకాక +, - (ప్లస్, మైనెస్)ల సిద్ధాంతాల మాదిరిగా, ఆయన కొన్ని నియమాలను కూడా రూపొందించాడు. "యావత్ - తావత్; కాలక - నీలక; పీతక - లోహితక" అనే వివిధ రకాల నియమాలను తయారు చేశాడు. 'తెలియని దానిని, దానికి సంబంధించిన దానితో కలపవచ్చు. విభిన్నమైన దానితో అలా చేయడానికి వీల్లేదు. 'యావత్ - తావత్'ను మరొక 'యావత్ - తావత్'కు కలపవచ్చు. కానీ 'కాలక-నీలక' వంటివి భిన్నమైన వాటితో కలపడానికి వీల్లేదు' అని చెప్పాడు భాస్కరాచార్యుడు. 'గ్రహగణితం'లో గ్రహాలు, వాటి గతులకు సంబంధించిన లెక్కలను వివరించాడు. చంద్రుడు, బుధుడు, శుక్రుడు, రవి, మంగళ, గురువులు ఆకాశాన నక్షత్రమండలంలో ఏ విధంగా ఉన్నవో శాస్త్రోక్తంగా చెప్పాడు. భూమి నీడ వల్లనే చంద్రగ్రహణం ఏర్పడుతుందని శాస్త్రబద్ధంగా వివరించాడు. 'గోళాధ్యాయం'లో జ్యోతిష సూత్రాలెన్నో వ్రాశాడు. ఇంకా ఇందులో సృష్టి స్వరూపాన్ని గురించీ, భూమిని గురించీ కూడా వర్ణించాడు. భూమి గోళాకారంలో ఉండి ఏ ఆధారమూ లేకుండా ఆకాశంలో నిలిచి ఉన్నదనీ, భూమికి ఆకర్షణ శక్తి ఉన్నదనీ చెప్పాడు. 'కడిమి పువ్వు మధ్యలో ఉన్న దుద్దుకు అన్ని వైపులా కేసరాలున్నట్లు భూమిపై అన్ని వైపులా సముద్ర, పర్వత, అరణ్య, గ్రామ, నగరాలున్నాయని' చెప్పాడు. ఈ ప్రాతిపదికపైనే న్యూటన్ గురుత్వాకర్షణ సిద్ధాంతం ఆవిర్భవించింది. ఈయన వ్రాసిన రెండవ గ్రంథమైన "కరణ కుతూహలం"లో గ్రహాల లెక్కలను, పంచాంగం వ్రాసేందుకు అనుసరించ వలసిన విధానాలను చెప్పుకొచ్చాడు. (గణిత శాస్త్రంలో Ph.D. లు సాధించిన మన ఆధునిక మేధావులు చాలా మందికి భాస్కరాచార్యుని పేరయినా తెలీదు. అది మన దౌర్భాగ్యం! అయినప్పటికీ కూడా ఆధునిక కాలాన గణితశాస్త్రంలో భారతీయులు ప్రథమంలోనే ఉన్నారు. గణితము, కంప్యూటర్ టెక్నాలజీకి చెందిన భారతీయ మేధావులెంతో మంది ప్రపంచాన వివిధ దేశాల్లో ఉన్నారు. ఆధునిక భారతీయ గణిత శాస్త్రవేత్త శ్రీ "రామానుజం" ప్రపంచ ప్రసిద్ధుడు. గణితంలో ఆయన మేధస్సు, ప్రపంచ మేధావులందరినీ ఇప్పటికీ ఆశ్చర్యపరుస్తూనే ఉంది. మన దురదృష్టం కొలదీ శ్రీ రామానుజం అతి పిన్న వయసులోనే స్వర్గస్థులు కావడం జరిగింది. ఆయన రూపొందించిన గణిత సిద్ధాంతాలపై ఇప్పటికీ ప్రపంచవ్యాప్తంగా పరిశోధనలు సాగుతూనే ఉన్నాయి. ఆయన మేధస్సును పరిపూర్ణంగా అర్థం చేసుకునే సమర్థత నేడు ఎవరికీ ఉన్నట్లుగా లేదు.)

## అంకెలు - సంఖ్యలు

గణిత శాస్త్రాభివృద్ధికి కారణమైన '0' (సున్న) అనే ముఖ్యమైన అంకెను కనుగొన్నవారు ప్రాచీన హైందవులే! ఇది మొత్తం ప్రపంచం అంగీకరించిన విషయం ('ఇంపీరియల్ గెజిట్ ఆఫ్ ఇండియా'లో ఈ విషయం ప్రచురించబడింది కూడా!) సున్న అనేది లేకపోతే గణితశాస్త్రం గతి ఎలా ఉండేదో మనం ఊహించలేం. (అనంతర కాలంలో భాస్కరాచార్యుడు 'సున్న'ను గురించి తన గణిత శాస్త్రాల్లో వివరణ ఇస్తూ "ఒక సంఖ్యనుండి సున్నను తీసివేసినా, కలిపినా, దానివిలువలో ఏ మార్పూ ఉండదనీ, సున్నచే గుణించినా, భాగించినా 'సున్న'యే వస్తుందనీ వివరించాడు. ఈ విషయం పాశ్చాత్య గణిత శాస్త్రవేత్తల్ని ముగ్ధుల్ని చేసింది.

దశాంశ సంజ్ఞలను కనిపెట్టినది కూడా మన ప్రాచీనులే! ఈ విషయాన్ని జర్మనీ విద్వాంసుడైన 'షెలెగల్' ధ్రువపరిచాడు కూడా! ('షెలెగల్స్ హిస్టరీ ఆఫ్ లిటరేచర్ అనే పుస్తకంలో పేజి 126 చూడండి.)

వేదాల్లో చాలా చోట్ల అంకెలను కూడా అక్షరాల్లో వ్రాయడం కన్పిస్తుంది. మెల్లగా సంఖ్యలను రూపొందించుకుంటూ, సంఖ్యల విషయంలో కూడా మనవారే అగ్రస్థానాన్ని పొందారు.

భారతీయ సంఖ్యామానంలో 1 ప్రక్కన 63 సున్నలున్న సంఖ్య వరకూ చేసిన నామకరణాలు మనకు దొరుకుతున్నాయి. అంతకంటే పెద్ద సంఖ్యలకు కూడా మనవాళ్ళు నామకరణాలు చేశారు గాని, అవి మనకు ప్రస్తుతం దొరకడంలేదు.

### భారతీయ సంఖ్యామానం

| | | |
|---|---|---|
| 1 తర్వాత | 5 సున్నలుంటే | లక్ష |
| 1 తర్వాత | 6 సున్నలుంటే | దశలక్ష |
| 1 తర్వాత | 7 సున్నలుంటే | కోటి |
| 1 తర్వాత | 8 సున్నలుంటే | దశకోటి |
| 1 తర్వాత | 9 సున్నలుంటే | శతకోటి |
| 1 తర్వాత | 10 సున్నలుంటే | అర్బుదం |
| 1 తర్వాత | 11 సున్నలుంటే | న్యర్బుదం |
| 1 తర్వాత | 12 సున్నలుంటే | ఖర్వం |
| 1 తర్వాత | 13 సున్నలుంటే | మహాఖర్వం |

1 తర్వాత 14 సున్నలుంటే పద్మం
1 తర్వాత 15 సున్నలుంటే మహాపద్మం
1 తర్వాత 16 సున్నలుంటే క్షోణి
1 తర్వాత 17 సున్నలుంటే మహాక్షోణి
1 తర్వాత 18 సున్నలుంటే శంఖు
1 తర్వాత 19 సున్నలుంటే మహాశంఖు
1 తర్వాత 20 సున్నలుంటే బృందం
1 తర్వాత 21 సున్నలుంటే మహాబృందం
1 తర్వాత 22 సున్నలుంటే క్షితి
1 తర్వాత 23 సున్నలుంటే మహాక్షితి
1 తర్వాత 24 సున్నలుంటే క్షోభం
1 తర్వాత 25 సున్నలుంటే మహాక్షోభం
1 తర్వాత 26 సున్నలుంటే నిధి
1 తర్వాత 27 సున్నలుంటే మహానిధి
1 తర్వాత 28 సున్నలుంటే పర్వం
1 తర్వాత 29 సున్నలుంటే అంత్యం
1 తర్వాత 30 సున్నలుంటే మధ్యం
1 తర్వాత 31 సున్నలుంటే పరార్థం
1 తర్వాత 32 సున్నలుంటే అనంతం
1 తర్వాత 33 సున్నలుంటే సాగరం
1 తర్వాత 34 సున్నలుంటే అవ్యయం
1 తర్వాత 35 సున్నలుంటే అచింత్యం
1 తర్వాత 36 సున్నలుంటే అమేయం
1 తర్వాత 37 సున్నలుంటే భూరి
1 తర్వాత 38 సున్నలుంటే మహాభూరి
1 తర్వాత 57 సున్నలుంటే ఓఘం
1 తర్వాత 63 సున్నలుంటే మహోఘం

★

ఒకే సంఖ్యను వివిధ దేశాల సంఖ్యామానాల ప్రకారం చదివి చూద్దాం.

## భారతీయ సంఖ్యామానం

1,22,34,56,78,998,76,54,321

ఒక శంఖు, రెండు మహాక్షోణుల, రెండు క్షోణుల, మూడు మహా పద్మముల, నాలుగు పద్మముల, అయిదు మహాఖర్వముల, ఆరు ఖర్వముల, ఏడు న్యర్బుదముల, ఎనిమిది అర్బుదముల, తొమ్మిది వందల తొంభై ఎనిమిది కోట్ల, డబ్బై ఆరు లక్షల, యాభై నాలుగు వేల, మూడు వందల ఇరవై ఒకటి.

## ఆంగ్ల, జర్మన్ సంఖ్యామానంలో

1,223,456,789,987,654,321

ఒక ట్రిలియను, రెండు వందల ఇరవైమూడువేల, నాలుగు వందల యాభై ఆరు బిలియన్ల, ఏడువందల ఎనభై తొమ్మిది వేల, తొమ్మిది వందల ఎనభై ఏడు మిలియన్ల, ఆరువందల యాభైనాలుగు వేల, మూడు వందల ఇరవై ఒకటి.

## ఫ్రెంచి, అమెరికన్ సంఖ్యామానంలో

1,223,456,789,987,654,321

ఒక క్వింట్రిలియన్, రెండు వందల ఇరవైమూడు క్వాడ్రిలియన్ల, నాలుగు వందల యాభై ఆరు ట్రిలియన్ల, ఏడు వందల ఎనభై తొమ్మిది బిలియన్ల, తొమ్మిది వందల ఎనభై ఏడు మిలియన్ల, ఆరు వందల యాభైనాలుగు వేల, మూడు వందల ఇరవై ఒకటి.

(ఇంతవరకూ ఇచ్చిన సంఖ్యల, సంఖ్యామానాల వివరాలు శ్రీ డి.వి. శేషగిరిరావు గారి గ్రంథం "మన విజ్ఞానసంపద" నుండి సేకరించబడినవి)

ఈ విధంగా కాలమానంలోనూ, గణితంలోనూ కూడా మన ప్రాచీన హైందవులు, ప్రపంచం మొత్తంలో ముందున్నారు.

## సైనిక బలాల సంఖ్యామానాలు

ఈనాడు దేశ రక్షణకోసం ఏర్పాటు చేసుకుంటున్న సైనిక బలగాలకు కూడా ఒక విధమైన సంఖ్యామానం ఉంది.

పదాతి మిలటరీ దళాలకు శిక్షణ ఇచ్చే శిబిరాల్లో అయితే - కొంతమంది జవాన్లను కలిపి 'సెక్షన్' అంటారు. అటువంటి కొన్ని సెక్షన్లు కలిపి 'ప్లెటూన్' అవుతుంది. కొన్ని ప్లెటూన్లను కలిపి 'కంపెనీ' అనీ, కొన్ని కంపెనీలను కలిపి 'బెటాలియన్' అనీ అంటారు. కొన్ని బెటాలియన్లు కలిపి ఒక 'ట్రెనింగ్ సెంటర్' అవుతుంది. యుద్ధంలో పాల్గొనే పదాతి దళాలకు కూడా ఒక మానం ఉంది. కొంతమంది జవాన్లను 'సెక్షన్' అనీ, కొన్ని సెక్షన్స్ కలిపి 'ప్లెటూన్' అనీ, కొన్ని ప్లెటూన్స్ కలిపి 'కంపెనీ' అనీ, కొన్ని కంపెనీలు కలిపి 'రెజిమెంట్' అనీ, కొన్ని రెజిమెంట్స్ కలిపి ఒక 'బ్రిగేడ్' అనీ, కొన్ని బ్రిగేడ్సను ఒక 'డివిజన్' అనీ, కొన్ని డివిజన్సను కలిపి ఒక 'కోర్' అనీ అంటారు. ఇవన్నీ పదాతి దళాలకు చెందిన వివరాలు. ఈ విధంగానే విమాన, నౌకాదళ బలాలకు కూడా వేర్వేరు సంఖ్యామానాలున్నాయి.

ఈ విధంగా సైనిక బలాల సంఖ్యామానం, మన ప్రాచీన హైందవులకు కూడా ఉండేది. ఉదాహరణకు మహాభారతకాలం నాటి సైనిక బలాల సంఖ్యామానాన్ని గురించి తెలుసుకుందాం.

## మహాభారత కాలం నాటి సైనిక బలాల సంఖ్యా మానం :

| సేనయొక్క పేరు (సైనికమానం) | రథాలు | ఏనుగులు | గుర్రాలు | భటులు |
|---|---|---|---|---|
| పత్తి | 1 | 1 | 3 | 5 |
| సేనాముఖం | 3 | 3 | 9 | 15 |
| గుల్మం | 9 | 9 | 27 | 45 |
| గణం | 27 | 27 | 81 | 135 |
| వాహిని | 81 | 81 | 243 | 405 |
| పృతన | 243 | 243 | 729 | 1,215 |
| చమువు | 729 | 729 | 2,187 | 3,645 |
| అనీకిని | 2,187 | 2,187 | 6,561 | 10,935 |
| అక్షౌహిణి | 21,870 | 21,870 | 65,610 | 1,09,350 |

★ ★ ★

# 29. పురాణకాలము - వాయువు

పంచభూతాల్లో వాయువు ఒకటని చెప్పాయి పురాణాలు. పంచభూతాల్లో మొదటిదైన ఆకాశం తర్వాత వాయువు ఉద్భవించిందని భాగవతం చెప్తోంది. వాయువుకు అధిదేవతగా 'వాయుదేవుణ్ణి' పూజించడం మన సాంప్రదాయం.

వాయువునే మనం వ్యవహారికంగా "గాలి" అంటాం. గాలిని గురించి మన ప్రాచీనులకు చక్కటి పరిజ్ఞానం ఉంది. గాలి ఆవరించి ఉన్న ప్రదేశాన్ని 'వాతావరణం'గా పురాణాలు కూడా చెప్పాయి. గాలి స్వభావమూ, గుణగణాలూ అనాటివారికి తెలుసు. గాలికి శబ్ద, స్పర్శ గుణాలున్నాయని చెప్పారు. సమస్త జీవులకూ గాలి ప్రాణాధారం అనీ, అది అగ్నిని ప్రజ్వలింపజేసే మూలకారకం అనీ, గాలి ఎప్పుడూ కూడా చరిస్తూ ఉంటుందనీ, గాలిలో రకరకాల సూక్ష్మక్రిములు కూడా ఉంటాయనీ, పరిశుభ్రమైన గాలి మాత్రమే ఆరోగ్యాన్ని పరిరక్షిస్తుందనీ, గాలిని మలినం చేసుకుంటే మనకే నష్టమనీ పురాణకాలం వారికి తెలుసు.

గాలిని గురించి అనేక విషయాలు వేదాల్లో చెప్పబడ్డాయి. వర్షం కురిపించడం గాలియొక్క ముఖ్యకృత్యాల్లో ఒకటని (మేఘాలకు చల్లని గాలులు తగిలితే వర్షాలు కురుస్తాయని వారికి తెలుసన్నమాట), ఆరోగ్య ప్రదమైన గాలి, 'రోగాలనుండి' రక్షణనిస్తుందని ఋగ్వేదం చెప్తోంది. (ఋగ్వే 2-33); పర్వతాలను పెకలించగల శక్తీ, ప్రపంచాన్ని కలియబెట్టగల శక్తీ, అడవులనూ - జీవులనూ సర్వనాశనం చేయగల శక్తి గాలికి ఉన్నదని కూడా ఋగ్వేదం అంటోంది. (ఋగ్వే 1-39, 1-64). వాయుశక్తిని ఒక దేవతగా వేదాల్లో, పురాణాల్లో చెప్పడం జరిగింది. గాలి యొక్క ప్రవర్తన అన్ని వేళలా ఒకే విధంగా ఉండదని కూడా మన ప్రాచీనులకు తెలుసు. ప్రాణవాయువై ప్రాణులకు జీవాన్ని పోస్తుంది. ఆరోగ్యాన్ని కల్గిస్తుంది. పిల్ల తెమ్మెరలతో ఆహ్లాదాన్ని కల్గిస్తుంది. అప్పుడప్పుడూ అతి భయంకరంగా మారి ఉత్పాతాలను కూడా సృష్టిస్తుంది. వివిధ సమయాల్లో వివిధ రకాలుగా ప్రవర్తించే ఈ గాలిని, రకరకాల రూపాల్లో చూశారు పూర్వులు. ఆ రూపాలనే ఋగ్వేదంలో 'వాయు పుత్రులు'గా వర్ణించారు. వారినే 'మరుత్తులు' అంటారు. ఈ మరుత్తులు చాలా శక్తివంతులు. వీరంతా ఒకే వయసూ, ఒకేశక్తీ, ఒకే మనస్సూ గల సోదరులని చెప్పబడింది. 'రోదశి' (అంతరిక్షం) అనేది వీరి భార్య అనీ (ఋగ్వే 5-56), సరస్వతి వీరి స్నేహితురాలు అనీ (ఋగ్వే 10-86, 7-96) వర్ణించబడింది. ఇలా చెప్పడంలో చక్కని అంతరార్థాలున్నాయి. సృష్టిలో ప్రక్కప్రక్కగా ఉండే శక్తులనూ, అంశాలనూ 'భార్యాభర్తలు'గా వర్ణించడం

మన పూర్వీకుల ఆనవాయితీ. సూర్యుని భార్య 'ఛాయాదేవి' అని చెప్పారు. అలా ఎందుకు చెప్పారో ఆలోచించండి. సూర్యుని ఎండ ప్రక్కనే 'నీడ' (ఛాయ) ఏర్పడుతుంది కదా! ఆ నీడనే 'ఛాయాదేవి' అని చెప్పి, ఆమెను సూర్యుడికి భార్యగా చేశారు. అలాగే అగ్నిదేవుని భార్య సంగతి - అగ్ని దేనినైనా స్వాహా చేస్తుంది కదా! అగ్నికి అనుసంధానమై ఉండే ఆ స్వాహాశక్తిని 'స్వాహాదేవి'గా చెప్పి, ఆమెను 'అగ్నిదేవుని భార్య' అన్నారు. 'ఉషస్సు' వెనుకే సూర్యుడు ఉదయిస్తాడు కనుక, ఉషస్సును సూర్యునకు ప్రియురాలుగా చెప్తూ, సూర్యుడు ఆమె అందానికి దాసుడై ఆమె వెనుకే వస్తూ ఉదయించడం జరుగుతుందని ఋగ్వేదంలో ఋషులు చమత్కరించారు. ఇదే విధంగా మరుత్తులకు భార్యగా 'రోదశి'ని (అనగా అంతరిక్షాన్ని) చెప్పారు. మరుత్తులు అంటే 'గాలి' కదా! భూగోళం చుట్టూ 5 వందల కిలోమీటర్ల వరకూ ఆవరించి ఉన్న గాలికి ఆవలి వైపు 'ప్రక్కగా' రోదశి (అంతరిక్షం) ఉంది. అందువల్లనే దానిని మరుత్తులకు (గాలికి) భార్యగా వర్ణించారు. (వాతావరణం ఆవల వున్న అంతరిక్ష ప్రదేశాన్ని వేద ఋషులు ఆనాడే గమనించారని దీనివల్ల అర్థమౌతోంది.)

ప్రకృతి అనగా 'బ్రహ్మ'. ప్రకృతికి సంబంధించిన విజ్ఞానం 'సరస్వతి'. ప్రకృతి విజ్ఞానంలో 'గాలి' కూడా ఒక అంతర్భాగం. అందువల్లనే గాలి దేవునికి సరస్వతి స్నేహితురాలని వర్ణించబడింది.

మన పూర్వీకులు కేవలం వాయువును గురించే కాదు. పంచభూతాల శక్తి సామర్థ్యాలను మొత్తం అవగాహన చేసుకున్నారు. పంచభూతాలకు, వాటి సమ్మేళనమైన మన శరీరాలకూ ఉన్న సంబంధాలను కూడా తెలుసుకున్నారు. అందుకే వారు దివ్యజ్ఞాన సంపన్నులు కాగలిగారు.



## 30 పురాణకాలము - అగ్ని

అగ్ని పుట్టుకను గురించి ప్రపంచ ఆధునిక చరిత్రలో సరైన యదార్థ విజ్ఞానం ఏమీ లేదు. తలాతోకాలేని వివరాలేవో ఉంటాయి. నిజానికి అగ్ని అనేది సృష్టి ఆదినుండీ ఉంది. ఈ విషయాన్ని మన భాగవతం చెప్తోంది. పంచభూతాల్లో ఒకటైన వాయువు నుండి 'అగ్ని' ఉద్భవించినట్లుగా మన భాగవత ప్రవచనం. మొట్టమొదట్లో సూర్యుని నుండి 'వాయుగోళంగా' విడిపోయిన భూమి, మంటలతో ప్రజ్వరిల్లింది.

ఈ విషయాన్నే వాయువునుండి అగ్ని పుట్టినట్లుగా చెప్తోంది భాగవతం. పంచభూతాల్లో అగ్ని కూడా ఒకటి. అగ్నికి అధిదేవతగా 'అగ్నిదేవుణ్ణి' పూజించడం మన సాంప్రదాయం.

అగ్ని స్వభావమూ, లక్షణాలూ మన పూర్వీకులకు బాగా తెలుసు. అగ్నికి శబ్ద, స్పర్శ, రూప గుణాలున్నాయని వారు చెప్పారు. మన నాలుగు వేదాల్లోనూ కూడా అగ్ని ప్రస్తావన అనేక చోట్ల ఉంది. మన పూర్వీకులు అగ్నిని పలురకాలుగా గుర్తించారు. భూగోళ మనుగడకు కారణమైన సూర్యుని వెలుతురూ, వేడీ కూడా అగ్ని ప్రభావమేనని తెలుసుకున్నారు. సూర్యుణ్ణి అగ్నికి రూపాంతరంగా చెప్పారు వేదాల్లో!

## వర్షాలకు కారణం మన పూర్వీకులకు తెలుసు

సూర్యశక్తిని అగ్నిగా గుర్తించారు మన పూర్వీకులు. సూర్యుడు వర్షాలను కలగజేస్తున్నాడని వేదాల్లో వ్రాశారు. సూర్యుడు వర్షాల ద్వారా అన్నాదులను ఇస్తూ, అందరి జీవనాలూ చూస్తున్నాడని కృష్ణయజుస్సంహితలోని 31-20, 33-30 సూక్తాల్లో ఉంది. సూర్యునిలోని అగ్నివల్ల భూమిపై నీరు ఆవిరియై మేఘాలుగా మారి, తద్వారా వర్షాలు కురుస్తాయనే విషయం మన ప్రాచీనులకు తెలుసు. అందువల్లనే సూర్యుని వల్ల వర్షాలు కురుస్తున్నాయని వారు స్పష్టంగా చెప్పగలిగారు. సూర్యుని అగ్నివల్ల మనకు లభిస్తున్న నీరే "వర్షం" అని మన హైందవ మేధావులు అతి ప్రాచీన కాలంలోనే గ్రహించారు. అగ్నితో జరుపబడే యజ్ఞయాగాదులవల్ల కూడా వర్షాలు వస్తాయి కాబట్టి, అగ్ని ద్వారా వర్షాలు కురుస్తాయని ఋగ్వేదంలో చెప్పబడింది.

మన పూర్వీకులు "అగ్నిని" ఆకాశంలో మెరుపుగానూ, పిడుగుగానూ, అడవుల్లో కార్చిచ్చుగానూ, నీటిలో బడబాగ్నిగానూ, విద్యుత్తుగానూ, జీవులు తినే ఆహార పదార్థాలను జీర్ణం చేసే జఠరాగ్నిగానూ, మానవ జీవితావసరాలకు తయారు చేసుకున్న అరణిగానూ.... ఇలా ఎన్నోరకాలుగా గుర్తించారు.

అగ్నిని కొన్ని సందర్భాల్లో మనం "నిప్పు"గా వ్యవహరిస్తాం. భూమిపై మన మనుగడకు నిప్పు అత్యంత అవసరం. మొట్టమొదటగా నిప్పును కనుగొన్నవాడు "దధీచి మహర్షి". నిప్పును కనుగొన్న మహనీయునిగా ఆయన గౌరవార్థం మన భారత ప్రభుత్వం ఆయన బొమ్మతో ఒక తపాలా స్టాంపును కూడా విడుదల చేసింది.

## వజ్రాయుధం దధీచి మహర్షి వెన్నెముకా?

మెరుపు, పిడుగుల్లోని కరెంటు 'ఒక విధమైన అగ్ని అని' మన పూర్వీకులకు తెలుసు. మెరుపును ఇంద్రుని వజ్రాయుధంగానూ, పిడుగును వజ్రాయుధ

భూతంగానూ చెప్పుకొచ్చినట్లుగా పురాణాల్లో కనపడుతోంది. నిప్పుకథకు మూల పురుషుడు దధీచి మహర్షి కనుక, ఆయన వెన్నెముకను 'వజ్రాయుధం'గా చమత్కరించారు తర్వాత కాలంలోని ఋషులు.

అరణి : అతి ప్రాచీన కాలపు నిప్పు ఏర్పాటు 'అరణి'. అరణి మధనంచే అగ్ని పుట్టుక, మనకు ఋగ్వేదకాలం నుండీ కన్పిస్తోంది (ఋగ్వేదం 3-29); రెండు కర్రల రాపిడితో అగ్ని పుట్టించడమే, అరణిమధనం అంటే! అరణి మధనానికి ఉపయోగించే కర్రలు, అగ్నికి "తల్లిదండ్రులు"గా వర్ణించబడ్డాయి. తాను పుట్టిన తర్వాత తన తల్లిదండ్రులను తినేస్తుందట అగ్ని. (ఋగ్వేదం 10:79); ఇలా చెప్పడంలో ఒక అంతరార్థం ఉంది. నిప్పు తాను పుట్టిన తర్వాత, తన జన్మకు కారణమైన కర్రల్ని కాల్చి మసి చేస్తుంది కదా! తన తల్లిదండ్రుల్ని 'నిప్పు' స్వాహా చేయడం అంటే అదే! పదిమంది స్త్రీలచే అగ్ని సృష్టించబడతాడని కూడా ఋగ్వేదం వర్ణిస్తోంది. అరణి మధనానికి ఉపయోగించే చేతి వేళ్ళు పదింటినీ, పదిమంది స్త్రీలుగా వర్ణించడం జరిగిందన్నమాట. నిప్పు పుట్టుకను గురించి మన పురాణకాల ఋషులు ఇలా చమత్కారంగా చెప్పుకొచ్చారు.

పురాణకాలం వారు తమ భౌతికావసరాలకు 'అరణి ద్వారా ఏర్పడిన నిప్పును' వాడుకునే వారు. ఆ కాలంలో ప్రతివారూ ఒక అరణి ఏర్పాటు చేసుకునే వారు. దాని ద్వారా పుట్టిన నిప్పును ఎవరికి వారే ఎప్పుడూ సంరక్షించుకుంటూ ఉండేవారు. మహాభారతంలో పాండవులు అజ్ఞాతవాసానికి వెళ్ళేటప్పుడు, తమ నిప్పు ఏర్పాట్లయిన అరణిలను 'సంరక్షణార్థం' ధౌమ్యుడు అనే మహర్షికి అప్పగిస్తారు.

## అగ్ని ప్రత్యేకత, పవిత్రత

అగ్ని ప్రత్యేకతనూ, పవిత్రతనూ మన పూర్వీకులు చక్కగా అవగాహన చేసుకున్నారు. అగ్ని అనే శక్తిని 'అగ్నిదేవుని'గా నిలిపి పూజించడం సాంప్రదాయంగా ఏర్పాటు చేసుకున్నారు. అగ్ని లేనిదే యజ్ఞయాగాలు లేవు. హోమాలు లేవు. కర్మకాండలు లేవు. వంటలూ, వార్పులూ అసలే లేవు.

అగ్నిని ఎక్కడ, ఎలా వాడాలో మన ప్రాచీనులకు బాగా తెలుసు. యజ్ఞయాగాల్లో యజ్ఞఫలాన్ని అంతరిక్షంలోని దేవతలకు అందించే శక్తిగా 'అగ్నిని' తలచేవారు ఋషులు. తనలో వేసిన హోమద్రవ్యాలను మండించి, వాటినుండి వచ్చే ధూమాన్ని (పొగను) పైపైకి పంపిస్తుంది అగ్ని. అగ్ని కీలల ద్వారా హోమద్రవ్యాల ధూమం, ఆకాశానికి (అంటే దేవతాశక్తులకు) అందుతుంది. ఈ క్రియవల్ల మానవాళికి శుభం

చేకూరుతుంది. ఈ విషయం స్పష్టంగా అవగాహన కావాలంటే ఒక ఉదాహరణ చెప్పుకుందాం. వర్షాల గురించి యజ్ఞాలు చేసేవారు పూర్వం. యజ్ఞసమయంలో కొన్ని ప్రత్యేక మూలికలను మండించేవారు ఋషులు. ఆ మూలికలు మండినప్పుడు వెలువడే ధూమం, అగ్ని కీలల ద్వారా ఆకాశానికి వెళ్ళేది. (అగ్నిదేవుడు యాగఫలాన్ని దేవతలకు అందించడం అంటే ఇదే!) ఆకాశానికి వెళ్ళిన ఆ పొగ, వర్షించే మేఘాలను సమీకరించేది. ఆ తర్వాత వర్షం కురిసేది. (అంటే యజ్ఞఫలాన్ని అందుకుని సంతోషించిన దేవతలు, వర్షాన్ని కురిపించేవారన్న మాట) వర్షానికి అధిదేవత 'వరుణుడు'. మూలికలు మండించగా వచ్చిన పొగను వరుణునికి అగ్నిదేవుడు నైవేద్యంగా పంపించాడు. అందుకు తృప్తి చెందిన వరుణుడు, వర్షాన్ని ప్రసాదించాడు. అదీ సంగతి. (ఈ సందర్భంలో 'అగ్ని' ఒక మధ్యవర్తిగా పని చేస్తుంది.)

మరణానంతర దహన క్రియలో కూడా 'అగ్ని' ఒక బ్రహ్మాండమైన పాత్రను నిర్వహిస్తుంది. పంచభూతాల కలయికతో ఏర్పడ్డ మానవుణ్ణి, ('అగ్ని' సంస్కారం ద్వారా) తిరిగి పంచభూతాల్లో విలీనం చేస్తుంది.

## వేదాల్లో అగ్ని గురించి

వేదాల్లో అగ్నిని యజ్ఞం యొక్క 'సారథి'గా చెప్పారు. (ఋగ్వే 1-25); యజ్ఞంలో హవిస్సును భోజనం చేసే ఇతన్ని (అనగా అగ్నిదేవుణ్ణి) 'దేవతల ముఖం'గా వర్ణించారు. (ఋగ్వే 2-1); ఇతని జ్వాలలే 'చంచాలుగా' వర్ణించబడ్డాయి. (ఋగ్వే 1-76, 10-6); ఇతను నెయ్యి, సమిధలు, సోమరసం ఆహారంగా తీసుకుంటాడు (ఋగ్వే 7-3, 2-7, 1-14); మానవులు సమర్పించిన ఆహుతులను దేవతలకిచ్చి, వారిని యజ్ఞ స్థలానికి తీసుకొస్తాడు (ఋగ్వే 1-72); దేవతలకు ప్రీతి కల్గించి, వర్షాలను రప్పిస్తాడు. యజ్ఞానికి ముఖ్యుడు కావడం వల్ల, ఇతనే పురోహితునిగా (ఋగ్వే 1-1), హోతగా (ఋగ్వే 1-72) స్తుతింపబడ్డాడు.

అగ్ని అప్పుడప్పుడూ భూమిపై నున్న అరణ్యాలను నశింపజేస్తాడు. (ఋగ్వే 10-142); ఇతని జ్వాలలు పిడుగులతో పోల్చబడ్డాయి (ఋగ్వే 5-25); ఇతని నుండి వచ్చే పొగ, ఆకాశం వరకూ వ్యాపించి ఆకాశానికి ఆధార స్తంభంగా ఉంటుంది. ధూమం (పొగ) ఇతని ధ్వజం. అందుచేతనే ఇతన్ని 'ధూమకేతువు' అంటారు. (ఋగ్వే 8-92).

అగ్ని అన్నిరకాల దోషాలనూ నివారణ చేస్తాడు. దుష్టులను శిక్షిస్తాడు. సూర్యుని ద్వారా ప్రాతఃకాలంలో లోకంలోని వస్తువులన్నింటినీ ప్రకాశింపజేస్తాడు. (యజుర్వేదం

3-10); భౌతికాగ్నిగా భూమి పరిపాలనకు కారణమై, జఠరాగ్నిగా ప్రాణులలోనూ, విద్యుత్తుగా జలంలోనూ 'శక్తిని' ఉత్పత్తి చేస్తున్నాడు (యజు 3-12).

## పర్వతాల్లో అగ్ని

అగ్ని తేజం దాగి ఉన్న పర్వతాలను "అగ్ని పర్వతాలు" అంటారు. ప్రపంచంలోని భూతలంపై అనేకచోట్ల అగ్ని పర్వతాలున్నాయి. సముద్రాల్లో 'బడబాగ్ని' పేరిట అగ్ని పర్వతాలున్నట్లుగా పురాణాలు చెప్తున్నాయి. "నీటిలో అగ్ని ఉండడం ఏమిటి? ఆరిపోతుంది కదా! పురాణాల్లో ఇలా చెప్పారేమిటని" ఆశ్చర్యపోకండి. సముద్రాల్లో నిజంగా అగ్ని పర్వతాలున్నట్లుగా ఆధునిక శాస్త్రవేత్తలు కూడా గమనించారు.

## అగ్ని కారణాన మన్మథుని మరణం

భూగోళాన్ని 'శివుని స్వరూపం'గా చెప్పుకున్నాం కదా! భూమిపై ఉన్న అగ్ని పర్వతాలే శివుని మూడవ నేత్రం. శివుడు మూడవ కన్ను తెరచి, మన్మథుణ్ణి భస్మం చేశాడంటారు. అంటే అగ్ని పర్వతాలు ప్రేలడంవల్ల, చక్కని ప్రకృతి శోభ అంతా మాడి మసికావడం అన్నమాట. ప్రకృతి శోభయే పురాణాల్లో 'మన్మథుని'గా వర్ణించబడింది. దీని నిరూపణ చూద్దాం. పురాణాల్లో మన్మథుని గురించి ఇలా ఉంది.

"మన్మథునికి ప్రత్యేకించి ఒక శరీరం అంటూ ఉండదట. కానీ అతను చాలా అందగాడట. ముందుగా వసంతుడు వస్తాడట. ఆ తర్వాత మన్మథుడు వేంచేస్తాడట. చెరుకు గడ అతని విల్లు అట. అతను పూలబాణాలు వేస్తాడట. చిలుక అతని వాహనమట." ఈ వర్ణనలోని అంతరార్థాన్ని వివరిస్తాం చూడండి. మన్మథుడంటే వివిధ తరుల సోయగాల శోభ. ప్రకృతి శోభ మనకు కనువిందు చేస్తుంది గానీ, ఆ అందాలకు ఒక నిర్ణీత ఆకారం ఉండదు కదా! మన్మథుణ్ణి 'శరీరంలేని అందగాడు'గా చెప్పడంలోని అంతరార్థం ఇదే! వసంతం వచ్చిన తర్వాత ప్రకృతి శోభ మరింత రమ్యంగా తయారౌతుంది. కనుకనే మన్మథుని కంటే ముందుగా వసంతుడొస్తాడని చెప్పబడింది. మానవాళికి మరులుగొలిపే మల్లె, జాజి మొగ్గలను మన్మథుని 'అమ్ములు' (బాణాలు)గా వర్ణించారు. ఆకారాన్ని బట్టి వసంతకాలపు చెరకు గడ(ల)ను, అతని విల్లుగా చెప్పారు. ఎల్లప్పుడూ వృక్షజాతిని ఆశ్రయించి ఉండే అందమైన చిలుకమ్మను, మన్మథుని వాహనంగా వర్ణించారు. ఇదే మన్మథ రూపం. అగ్ని పర్వతం ప్రేలితే అందులోని లావా కారణంగా సమస్త ప్రకృతి శోభా కూడా క్షణకాలంలో

నశిస్తుంది. శివుడు తన మూడవ కన్ను తెరవగా, మన్మథుడు మరణించడం అంటే ఇదే! మళ్ళీ శివుడే జాలిదలచి మన్మథుని బ్రతికించాడని చెప్తారు. అంటే శివుని స్వరూపమైన భూగోళంపై మళ్ళీ ఇంకొకచోట ప్రకృతి శోభ వికసిస్తుంది. అదే మన్మథుని పునర్జన్మగా లెక్క. అగ్ని పర్వతాల వివరణలో మన్మథుని కథను ఋషులు ఎలా చెప్పుకొచ్చారో చూశారా!

## అన్నింటా పరిశుద్ధమైనది అగ్ని

అనారోగ్యాన్ని కలిగించే వివిధ రకాల సూక్ష్మజీవులు వాతావరణం అంతటా వ్యాపించి ఉంటాయి. కానీ అగ్నిలో మాత్రం ఏ సూక్ష్మజీవులూ ఉండవు, ఉండలేవు. సహజ సిద్ధంగా పరిశుద్ధమైనది అగ్ని. అగ్నివలె పరిశుద్ధమైనది, సృష్టిలో మరొకటి లేదు. అందుకే అగ్ని అనేది అతి పవిత్రమైనదిగా ఎంచబడింది.

**అగ్నిసాక్షి :** పెద్ద సమక్షంలో సవ్యంగా నెరవేర్చే పని అందరి మన్ననలూ పొందుతుంది. అటువంటి పనికి ఆ పెద్దలు 'సాక్షులు'గా ఉంటారు. పరిశుద్ధత, పవిత్రత కలిగిన వారిని మాత్రమే 'పెద్దలు'గా అందరూ అంగీకరిస్తారు. అటువంటి పెద్దలకంటే కూడా పరిశుద్ధత, పవిత్రత కలిగినది "అగ్ని". అందువల్లనే అగ్నిని 'సాక్షీభూతం'గా తీసుకోవడం అతి గొప్ప విషయంగా భావించబడుతూ వస్తోంది. అగ్నిసాక్షిగా చేసిన పని స్థిరమైనది. దృఢమైనదిగా భావిస్తారు మన హైందవులు. వివాహం, స్నేహం మొదలగు వాటికి అగ్నిని 'సాక్షిగా' పెట్టుకుంటారు మనవాళ్ళు. (అగ్నిసాక్షిగా శ్రీరాముడు, సుగ్రీవునితో మైత్రి చేసుకోవడం రామాయణంలో కన్పిస్తుంది. ఇక అగ్నిసాక్షి వివాహాలంటారా? నిత్యజీవితంలో మనం ఇప్పటికీ చూస్తూనే ఉన్నాం. సత్య, అసత్యాల నిగ్గుతేల్చే సమయాల్లో కూడా, అగ్నిని 'సాక్షిగా' నిలుపుకోవడం మనకు తెలిసిన విషయమే.

★ ★ ★

# 31. పురాణకాలము - జలము

జలము పంచభూతాల్లో ఒకటని చెప్తున్నాయి పురాణాలు. ఆకాశం, వాయువు, అగ్ని... ఆ తర్వాత "జలం". జలాన్నే మనం వ్యవహారికంగా "నీరు" అంటాం. నీటిని గురించి సంపూర్ణమైన అవగాహన మన పూర్వీకులకుంది. ప్రకృతి ప్రారంభం కావడం కంటే ముందునుంచీ నీరు ఉన్నదని వారికి తెలుసు. 'ఒకనాడు మంటలతో ప్రజ్వరిల్లిన భూగ్రహం, వేల సంవత్సరాల అనంతరం చల్లబడి 'నీటిగోళం'గా మారిందనీ, ఆ

తర్వాత ప్రస్తుతపు భూగోళం ఏర్పడిందనీ' పురాణాలు చెప్తున్నాయి. (అగ్ని నుండి నీరు ఉద్భవించిందనీ, నీటినుండి నేల వచ్చిందనీ ఇందువల్లనే అంటారు మన పూర్వీకులు.)

హైందవ సాంప్రదాయంలో నీటికి అధిదేవత "వరుణుడు". నీటి స్వభావం, గుణగణాలు ప్రాచీన హైందవులకు బాగా తెలుసు. నీటికి శబ్ద, స్పర్శ, రూప, రస గుణాలున్నాయని వారు చెప్పారు. ప్రాణులకు నీరు జీవనాధారమనీ, నీరు లేకపోతే ప్రపంచ మనుగడే లేదనీ, జీవుల ఆరోగ్యం చాలావరకూ అవి తీసుకునే నీటి స్వభావంపై ఆధారపడి ఉంటుందనీ వేదకాలంనుండీ చెప్పబడుతుంది. కలుషితమైన నీటిలో ఉండే సూక్ష్మజీవుల వల్ల జీవులకు అనేక రోగాలు వస్తాయని కూడా వేదాలు చెప్తున్నాయి. భూమిపై నీరు, సూర్యుని వేడిమివల్ల మేఘాల రూపంలో ఆకాశానికి చేరి, చల్లని గాలులు సోకగానే వర్షరూపంలో తిరిగి భూమిపై పడుతుందని మన ప్రాచీనులకు తెలుసు. ఇలా కురిసే వర్షపునీరు స్వచ్ఛమైనదని వారు గుర్తించారు.

ఆధునిక మానవుడు తన ఆరోగ్య సంరక్షణలో నీటి ప్రాముఖ్యాన్ని బాగా అవగాహన చేసుకున్నాడు. తాను తీసుకునే నీటిలోని మలినాలను తొలగించడానికి అనేక పద్ధతులను ఉపయోగిస్తున్నాడు. పరిశుభ్రమైన నీటి ఉనికిని, ఆవశ్యకతను తెలుసుకున్నాడు. అయితే ఇదేం పెద్ద విషయమేమీ కాదు. పురాణకాలంలోనే మన హైందవులు ఈ విషయాలన్నీ చాలా క్షుణ్ణంగా తెలుసుకున్నారు. అందువల్లనే ఆరోగ్యానికి అతి ప్రశస్తమైన నీటిని అమృతంతో పోల్చారు. అటువంటి నీటి స్థానాల్ని కూడా తెలుసుకున్నారు.

## నదుల నీటి విశిష్టత

కొండలపై కురిసిన వర్షపు నీరే నదులుగా ఏర్పడి, క్రిందకు ప్రవహిస్తూ వస్తోంది. కొండలపైనన్నూ, అక్కడుండే అడవులలోనూ 'ఔషధీకృత వృక్ష సంతతి' ఉంటుంది. వాటిగుండా ప్రవహిస్తూ క్రిందికి జాలువారే నదులనీరు, ఆయా ఔషధ గుణాల్ని తమలో కలుపుకుంటాయి. అందువల్లనే ఆ నీరు చాలా శక్తివంతంగా మారుతుంది. ఈ సంగతిని పూర్వకాలం నుండీ మనవారు గ్రహించారు కనుకనే 'త్రాగడానికీ, స్నానాలకూ, ఔషధాల తయారీకీ' నదుల నీరు వాడేవారు. నదీజల స్నానం పుణ్యప్రదం అనీ, అది పాపాలను నశింపజేస్తుందనీ చెప్తున్నాయి మన గ్రంథాలు. ఈ మాటల్లో చాలా అంతరార్థం ఉంది. ఆరోగ్యమే మహాభాగ్యం కదా! నదులు మనకు ప్రసాదించే ఆరోగ్యం, మహాభాగ్యమే మరి! పుణ్యం వల్లనే కదా మనకు మహాభాగ్యం ప్రాప్తించేది.

అందువల్ల నదుల ద్వారా మనకు దొరికే ఆరోగ్య మహాభాగ్యమే "పుణ్యం"గా లెక్క. ఇక పాపాలు నశించడం గురించి తెలుసుకుందాం. ఈ సందర్భంలో 'పాపము' అనగా 'మలినం, అనారోగ్యం' అని అర్థం. ఏదైనా పాపకర్మ చేస్తే దాని ఫలితంగా మనకు అనేక కష్టనష్టాలు కలుగుతాయి. హాయిని కోల్పోతాడు మనిషి. మనిషికి అనారోగ్యం కలిగినా, ఈ ఫలితాల్నే పొందుతాడు. నదీ స్నానంవల్ల మలిన, అనారోగ్యాలను పోగొట్టుకోవడం ద్వారా కష్టనష్టాలనుండి మనిషి కొంతవరకూ తప్పించుకోగలుగుతాడు. ఇదే పాపనాశనం చేసుకోవడం అంటే! 'నదీస్నానం' పుణ్యాన్ని కల్గిస్తుందీ, పాపాల్ని నశింపజేస్తుందీ అంటే అర్థం ఇదే! ఈ కారణంగానే యాత్రల పేరిట దేశంలోని అన్ని నదుల్లోనూ స్నానం చేసే ఆచారం ఏర్పరచారు మన పెద్దలు. సంవత్సరానికి ఒకనదికి పుష్కరకాలంగా లెక్కించి, ప్రజల్ని దేశంలోని నదీ స్నానాలకు పంపించే ఏర్పాటు కూడా చేశారు. ఈ విషయాలేమీ తెలియని వితండ వాదులు 'నదీస్నానాలకూ, పాపపుణ్యాలకూ సంబంధం ఏమిటని" ప్రశ్నిస్తూ ఉంటారు. వారి అజ్ఞానానికి జాలిపడాలి మనం.

పురాణకాలంలో ఎంతో పరిశుద్ధంగా ఉండే నదులన్నీ నేటి కాలుష్య ప్రపంచంలో విపరీతంగా కలుషిత మౌతున్నాయి. మనం చేతులారా తెచ్చిపెట్టుకుంటున్న దౌర్భాగ్యం ఇది! అమృత తుల్యమైన జలాలను, ఆధునిక సైన్స్ పేరిట విషపూరితాలుగా మార్చుకుంటున్నాం.

## గంగానది విశిష్టత

హిమాలయాల్లో ఓషధుల మధ్య నుండి ప్రవహిస్తూ వస్తుంది గంగానది. అందువల్లనే గంగాజలాలు శక్తివంతమైన "ఔషధీకృత జలాలు"గా రూపొందడం జరుగుతోంది. జీవుల రోగాలను హరింపజేసి, ఆరోగ్యాన్ని ప్రసాదించే 'అమృతజలం' గా గంగాజలం పేరు పొందింది.

అనారోగ్యాన్ని కల్గించే సూక్ష్మక్రిముల్ని నశింపజేసే శక్తి గంగాజలానికి ఉంది. అందువల్లనే ఆ జలంలో సూక్ష్మక్రిములు పుట్టవు, పెరగవు. ఆ కారణంగానే ఎన్నేళ్ళయినా కూడా గంగాజలం పాడవకుండా ఆరోగ్యకరమైన రీతిలో నిలువ ఉంటుంది. ఈ విషయం మనకు అనుభవమే కదా! దేశ, విదేశాలకు చెందిన ఆధునిక శాస్త్రవేత్తలు 'గంగాజలం'పై శాస్త్రీయ పరిశోధనల్ని జరిపి, ఈ విషయం నిర్ధారణ చేశారు కూడా! పురాణ కాలంలోని మహర్షులనుండి ఆధునిక కాలంలోని శాస్త్రజ్ఞుల వరకూ ప్రశంసల్ని అందుకుంటూనే ఉంది గంగాజలం. ప్రపంచంలో ఏ ఇతర నదీ కూడా ఇంతటి విశిష్టతను పొందలేకపోయింది.

నదీస్నానం వల్ల ఒక విధంగా పుణ్యం లభిస్తుందనీ, పాపం నశిస్తుందనీ ఇంతకుముందు చెప్పుకున్నాం కదా! ఆ ప్రకారంగా గంగానదీ స్నానం, మిగిలిన నదీస్నానాలకంటే హెచ్చు పుణ్యాన్ని ఇస్తుందనీ, హెచ్చు పాపాన్ని నశింపజేస్తుందనీ చెప్పవచ్చు. ఎందుకంటే గంగాజలాలు, మిగిలిన నదుల జలాలకంటే హెచ్చు ఔషధ గుణాల్ని కలిగి ఉన్నాయి. ఈ కారణంగానే పుణ్యం పేరుమీద గంగానదీ స్నానాన్ని ఒక 'విధిగా' ఏర్పరచారు మన పెద్దలు. ప్రపంచాన సకల జీవులకూ ఆరోగ్య దాయకమైనది గంగానదీ స్నానం.

గంగానదీ తీర తీర్థయాత్రల సమయాల్లో గంగోత్రి, ఋషీకేష్, హరిద్వార్, కాశీ, ప్రయాగ మొదలగు చోట్లనుండి గంగాజలాలను సేకరించి తెచ్చుకోవడం మన హైందవ సాంప్రదాయం. అంతంత దూరాలు వెళ్ళలేనివారు, యాత్రలు చేసేవారిచే గంగాజలాలను తెప్పించుకుంటూ ఉంటారు. రోగజీవులు దరిచేరలేని జలాలు కాబట్టి అవి సంవత్సరాల తరబడి నిలువ ఉంటాయి. వాటిని మనం జపతపాల సమయాల్లోనూ, పూజాది కార్యక్రమాల్లోనూ, పర్వదినాల్లోనూ వినియోగిస్తూ ఉంటాం.

హైందవ ఆచార ప్రకారం మన ఇళ్ళలో గంగాజలాన్ని అనేక విధాల ఉపయోగిస్తాం. స్నానం చేసే నీళ్ళలో కలుపుకోవడం, ఇల్లంతా చల్లుకోవడం, మంచినీటి బావుల్లో కలుపుకోవడం చేస్తుంటాం. శుద్ధి చేసే అనేక క్రియలకు గంగాజలాన్ని వాడుతాం. ఇంటిల్లిపాదీ అమృతతుల్యంగా సేవిస్తాం కూడా! ఇవేవీ మూఢనమ్మకాలు కావు. గంగానదీ జలాల విశిష్టతే ఈ ఆచారాలకు మూల కారణం.

హిమాలయాల్లోని మూలికల సారాన్ని నింపుకున్న "గంగమ్మ" తన పవిత్రతచే, జనులందరినీ పవిత్రులుగా చేస్తూ లోకానికే "ఆరోగ్యప్రదాయిని"గా నిలిచింది.

## నదీ కాలుష్య నివారణ

జనావళి వివిధ రకాలుగా నదీ జలాలను వినియోగిస్తూ ఉండడంవల్ల, నదులు కాలుష్యానికి లోనౌతాయి. పురాణకాలం నుండీ కూడా గంగానదికి ఈ కాలుష్య బాధ హెచ్చుగానే ఉంటూ వచ్చింది. అందరి పాపాలూ తాను స్వీకరించి, గంగానది కాలుష్యానికి లోనయ్యేది. గంగానది ఆ పాప భారాన్ని మోయలేక ఏ ఋషీశ్వరునో, పతివ్రతనో, మహారాజునో ఆశ్రయించి వారి (తపో) శక్తిద్వారా తిరిగి పునీతమైనట్లుగా అనేక పురాణ గాథలున్నాయి. ఈ సందర్భంలో పాపాలు అనగా మలినం, అనారోగ్యం అని చెప్పుకున్నాం కదా! గంగాజలాల్లో ఎందరో స్నానాల్ని ఆచరిస్తూ తమతమ మలినాల్నీ అనారోగ్యాన్నీ వదిలించుకుని పోతుంటారు. ఆ మలినాలూ, అనారోగ్యాలతో

కొంతకాలానికి గంగాజలాలు కలుషితం అవుతాయి. అప్పుడు ఋషులో, పతివ్రతలో, మహారాజులో పూనుకుని గంగాజలాల కాలుష్య నివారణా కార్యక్రమాన్ని చేపట్టేవారని దీని అంతరార్థం. మన మాజీ ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ పరిపాలనా కాలం నుండీ గంగాజలాల కాలుష్య నివారణా పథకాల్ని మన ప్రభుత్వాలు అమలు జరుపుతూనే ఉన్నాయి. ఈ విధంగా అమలు జరుగుతున్న నదీ కాలుష్య నివారణా కార్యక్రమాలు, పురాణకాలం వారికి క్రొత్తేం కాదని తెలుస్తోంది. పారిశుధ్ధ్య కార్యక్రమాల్లో కూడా పురాణకాలం వారు ముందంజలోనే ఉన్నారు.

★ ★ ★

## 32. మన ప్రాచీన అద్భుత కట్టడాలు

ఆధునిక కాలంలో ఎన్నో అద్భుతమైన కట్టడాలను నిర్మించుకుంటున్నాం మనం. పూర్వీకుల కంటే కట్టడాల విషయంలో బాగా ఆరితేరిపోయామని మనం భావిస్తూ ఉంటాం. అయితే అది పొరబాటు. మన హైందవులు అతి ప్రాచీనకాలంలోనే అత్యద్భుతమైన కట్టడాల్ని నిర్మించారు. వాటి నిర్మాణాల తీరు ఇప్పటికీ ఆశ్చర్యకరంగానే ఉంది. ఆధునిక ఆర్కిటెక్ట్‌ల కంటే, అలనాటి ఆర్కిటెక్ట్‌లు హెచ్చు మేధస్సు గలవారని కొన్ని ప్రాచీన కట్టడాల్ని బట్టి అనిపిస్తుంది.

రామాయణంలో సముద్రంపై నిర్మించిన వారధి సంగతి చూడండి. వానరసేన లోని 'నలుడు' అనే ఇంజనీరు నిర్మింపజేసిన కట్టడం అది! నీటిలో తేలియాడే చెట్లు, రాళ్ళ సాయంతో అద్భుతమైన టెక్నాలజీని ఉపయోగించి ఆ వారధిని నిర్మింప జేసినట్లుగా వాల్మీకి రామాయణం చెప్తోంది. 'నీటిలో తేలియాడే రాళ్ళుంటాయా?' అని మీకు సందేహం రావచ్చు. వరంగల్ లోని రామప్పగుడి నిర్మాణానికి వాడిన ఇటుకలన్నీ నీటిపై తేలేవే! అటువంటి ఇటుకలను ముందుగా తయారుచేసి, ఆ గుడిని నిర్మించారు మన పూర్వీకులు. (ఈమధ్యకాలంలో పలుకుబడి కలిగిన పెద్దలంతా ఈ గుడి నిర్మాణంలో వాడిన తేలియాడే ఇటుకలను, తమ స్వగృహాలకు తీసుకుపోవడం మొదలెట్టారట. దీన్ని ప్రభుత్వం గమనించింది. అక్కడి ఇటుకలు ఊడిరాకుండా సిమ్మెంటుపని చేయించింది వెంటనే! రామప్పగుడిలోని ఇటుకలను దొంగిలించడం క్షమార్హంకాని నేరంగా కూడా ప్రకటించింది. ప్రభుత్వం ఇలా తగిన జాగ్రత్త తీసుకుని ఉండకపోతే,మరికొంత కాలానికి రామప్పగుడి మొత్తానికి మాయమై ఉండేది.)

మహాభారతంలోని "మయసభ" మరో అద్భుత నిర్మాణం. దేవశిల్పి అయిన మయుడు, పాండవుల కోసం మయసభను నిర్మించాడు. భౌతికశాస్త్రం (Physics)లోని కాంతిపరావర్తనం, కాంతి ప్రతిబింబించడం, ద్వైతీభూతం (Difraction) కావడం, కాంతి ఇంద్రధనుస్సుగా విరిగి వికృతి పొందడం లాంటి శాస్త్ర విషయాల ఆధారంగా ఈ మయసభ నిర్మించినట్లు తెలుస్తోంది. అందువల్లనే మయసభలోని వస్తువులు 'ఉన్నవి లేనట్లుగాను, లేనివి ఉన్నట్లుగానూ' కనిపించే ఏర్పాటు కలిగింది.

మనవాళ్ళు పూర్వకాలంలో చెక్కసున్నంతో నిర్మించిన వంతెనలు, భవనాలు, దేవాలయాలు శతాబ్దాల పాటు నిలిచిఉన్నాయి. వాటిని చూసిన విదేశీయులు ఇప్పటికీ చాలా ఆశ్చర్యపోతూంటారు.

చెక్కసున్నం తయారీ : సున్నం రెండు పాళ్ళు, ఇసుక ఒక పాలు కలిపి పాత్రల్లో ఉంచి మూతవేసి, ఆరునెలలపాటు వాటిని భూమిలో పాతిపెట్టి ఉంచేవారు. ఆ తర్వాత దానిలో బెల్లపునీరు, మినప్పప్పు నానవేసిన నీరు, కలబంద రసం మొదలయినవి కలిపి 100 సార్లు గానుగ ఆడేవారు. ఆ విధంగా చెక్కసున్నం తయారయ్యేదట.

పురాతనకాలంనుండీ మనవాళ్ళు రాజుల కోటలను మట్టితో కట్టేవారు. అయితే అది మామూలు మట్టి కాదు. మామూలు మట్టిని నీళ్ళతో తడిపి, ఏనుగులచేత మెత్తగా అడుసు త్రొక్కించి, దానిలో కోడిగ్రుడ్లసొన కలిపి, మళ్ళీ అడుసు త్రొక్కించేవారు. ఈ విధంగా తయారైన మట్టిని, కోటల నిర్మాణానికి వాడేవారు. ఓరుగల్లులో కాకతీయ రాజుల ఏడుకోటల యొక్క మట్టి గోడలు, ఫిరంగి గుండ్లనుకూడా లెక్కచేసేవి కావట.

ఇనుమును మరింత గట్టి పరిచేందుకు, అది త్రుప్పుపట్టకుండా ఉండేందుకు తీసుకోవలసిన చర్యలు మన పూర్వీకులకు బాగా తెలుసు. మనువు, కౌటిల్యుడు, వరాహమిహిరుడు వంటివారు ఇటువంటి ప్రక్రియలను గురించి వారివారి గ్రంథాల్లో వివరించారు. ఢిల్లీలో క్రీ.శ. 415లో మనవారు నిర్మించిన ఇనుపస్తంభం ఇప్పటికీ త్రుప్పు పట్టకుండా నిలిచి ఉంది. మన ప్రాచీన పద్ధతుల ప్రకారమే, ఈ స్తంభాన్ని నిర్మించడం జరిగింది. (త్రుప్పుపట్టని మరో ఇనుపస్తంభాన్ని దాని ప్రక్కనే నిర్మించాలని ఆధునికులు ప్రయత్నించారు. అయితే వారు నిర్మించిన ఇనుపస్తంభం చక్కగా త్రుప్పుపట్టి, ఇప్పటికీ ఢిల్లీలో నిలిచి ఉంది చూడండి.) గోల్కొండ కోటలోని శబ్ద ప్రసారపద్ధతి, అజంతా గుహలలోని కుడ్య చిత్రాలు, వివిధ దేవాలయాల్లో సంగీతాల్ని పలికే స్తంభాలు.... ఇలాంటివన్నీ మన ప్రాచీనుల నిపుణతకు మచ్చు తునకలే!

★ ★ ★

# 33. శాస్త్రీయ పరంగా మన ప్రాచీన మేధావులు

ప్రాచీన మేధావులను గురించి చెప్పుకునే ముందు, మనం ఒక విషయాన్ని తెలుసుకోవాలి. ఆధునిక చరిత్రకారులెవరూ కూడా మన ప్రాచీన మేధావుల యొక్క కాలనిర్ణయాలను సరిగా చేయలేకపోయారు. ఏ ఒక్క మేధావి కాలాన్నీ కూడా ఖచ్చితంగా, యథార్థంగా నిర్ణయించలేకపోయారు. వాటిలో భిన్నాభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. దీనికి కారణం ఏమంటే మన ప్రాచీన మేధావులకు సంబంధించిన కొన్ని వివరాలు, చరిత్రకారులకు అందనంత పురాతనంలో ఉండిపోయాయి. అంతటి ప్రాచీన చరిత్రగల మన మేధావుల కాలాలను ఆధునికం చేసే దుష్ట ప్రయత్నాల్ని చేశారు విదేశీ చరిత్రకారులు. భారతీయుల ప్రాచీనతను ఒప్పుకోడానికి పాశ్చాత్యుల మనసులు అంగీకరించడం లేదు. అందుకే తప్పుడు చరిత్రలు వ్రాసిపెట్టారు మనకు. వాటికి గంగిరెద్దుల్లా తలలూపుతున్నాం మనం. (మన యథార్థ చరిత్ర, సంస్కృతీ పరిరక్షణకై కృషిచేసిన విదేశీ మేధావులు లేకపోలేదు. వారికి మనం సర్వదా ఋణపడి ఉన్నాం.)

అసంఖ్యాకమైన మేధావులకు భరతభూమి పుట్టినిల్లు. మన హైందవ ప్రాచీన మేధావుల గురించి చెప్పుకోవడం మొదలుపెడితే, అది తరిగే విషయం కాదు. మహర్షులూ, మహారాజులతో పాటు అనేకమంది మేధావులున్నారు మన జాతిలో! శాస్త్రీయపరంగా మన ప్రాచీన మేధావుల గురించి తెలుసుకుందాం ఇప్పుడు. మొత్తం అందరినీ తలచుకోవడం మనకు సాధ్యం కాదు. మచ్చుకోసం కొద్దిమందిని గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. మహాఋషులే ప్రాచీన కాలంలోని శాస్త్రవేత్తలూ, ఇంజినీర్లూ, డాక్టర్లూ అని చెప్పుకున్నాం కదా! ఇంచుమించుగా మన ప్రాచీన విజ్ఞానమంతా వాళ్ళ చలువే!

## అలనాటి శాస్త్రవేత్తలు

రామాయణ, మహాభారతాల్లో ఎన్నో శాస్త్రీయపరమైన అంశాలను అందించిన వాల్మీకి మహర్షి, వ్యాస మహర్షుల గురించి ప్రత్యేకించి చెప్పుకోనక్కర్లేదు. అంతటి లోకప్రసిద్ధులు వాళ్ళు. ఈవిధంగానే జగమెరిగిన పురాణ ప్రసిద్ధులు అనేకమంది ఉన్నారు. వారి గురించి ప్రత్యేకించి చెప్పుకునేకంటే, సామాన్య జనావళి తెలుసుకో వలసిన విషయాలు కొన్నింటిని ముందుగా చర్చించుకుందాం.

శాస్త్రవేత్తలను ఇంగ్లీషు భాషలో సైంటిస్టులంటారు. మన మహాఋషులు సైంటిస్టులా? అని చాలామంది ఆశ్చర్యపోవచ్చు. నిజమే, మహర్షులు అలనాటి సైంటిస్టులే! (మన మహర్షులకు ఉండే గడ్డాన్నే అనుకరిస్తూ, విదేశీ సైంటిస్టులు

విల్లిగడ్డాల్ని పెంచుకున్నారు.) సైంటిస్ట్ అనే మాట వినేసరికి, మనలో చాలామందికి విదేశీ శాస్త్రవేత్తలే మదిలో మెదులుతారు. సైంటిస్టులకూ, ఇతర మేధావులకూ విదేశాలే నిలయాలని వాళ్ళ భావన (పాపం!). వారికి మన దేశ ప్రాచీన మరియు ఆధునిక మేధాసంపత్తి గురించి ఏమాత్రం తెలియదు. అది వాళ్ళ తప్పుకూడా కాదు. మన విద్యాలయాల పాఠ్యాంశాల్లో ఉంటున్న తప్పుడు పాఠాలే, వాళ్ళను ఆ దారికి మళ్ళిస్తున్నాయి. మన పాఠ్యాంశాల్లో న్యూటన్, గెలీలియో, కెప్లర్, కోపర్నికస్, ఎడిసన్, మెండలీఫ్, ఐన్‌స్టీన్ మొదలైన పాశ్చాత్య శాస్త్రజ్ఞుల వివరాలే ఉంటున్నాయి గాని, "వాల్మీకి, వ్యాసుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, భరద్వాజుడు, కణాదుడు, పతంజలి, ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు మొదలయిన హైందవ శాస్త్రవేత్తల గురించి" కనీస పరిచయం కూడా ఉండడం లేదు. మన హైందవ ప్రాచీన మేధావులు ఎన్నో శాస్త్రీయ విషయాల్ని కనుగొన్నారు. కానీ ఆ శాస్త్రీయ విషయాలన్నీ విదేశీ శాస్త్రవేత్తలు కనుగొన్నట్లుగా చరిత్రలో వక్రీకరించబడింది. పాశ్చాత్యులు కనుగొన్నట్లుగా చెప్పబడే విషయాలెన్నో, మన హైందవ శాస్త్రవేత్తల పురాతన గ్రంథాల్లో నేటికీ కన్పిస్తున్నాయి. వాటిని పట్టించుకోకుండా ఆధునిక పాశ్చాత్య రచనల్నే మనం నమ్ముతున్నాం. పాశ్చాత్యుల బాణీలోనే మన పాఠ్యాంశాల్ని రూపొందించుకుంటున్నాం. ఇక మన దేశ విద్యార్థికి మన ప్రాచీన విజ్ఞానవేత్తల గురించీ, వారి విజ్ఞాన పరిజ్ఞానాన్ని గురించీ ఏం తెలుస్తుంది? అందువల్లనే మన విద్యార్థులు చాలామంది మన దేశ విజ్ఞానంపై నమ్మకం లేకుండా తయారవుతున్నారు. అయినా కూడా మేధావితనంలో సంఖ్యాపరంగా మన దేశానికేం కొదువలేదు. ప్రపంచ మేధావుల్లో భారతీయ మేధావుల శాతం చాలా హెచ్చుగానే ఉంది. అయితే ప్రస్తుతం మన దేశంలో నెలకొని వున్న దుర్భాగ్య పరిస్థితులవల్ల మన మేధావులెందరో, విదేశాలకు అమ్ముడుపోతున్నారు. భారతీయుల మేధావితనం ప్రపంచవ్యాప్తంగా అమ్మబడుతోంది. విదేశాలకు పోయి, విజ్ఞానకృషి సాగిస్తున్నారు మనవాళ్ళు. పదిమంది భారతీయుల మేధస్సువల్ల కలిగిన ఫలితం, ఒక విదేశీ శాస్త్రవేత్త పేరున ప్రాచుర్యం పొందుతోందక్కడ. ఈ కారణంగానే ఏ సైన్సు విషయమైనా విదేశీయులే కనుగొనగలరనే దురభిప్రాయం, మన దేశ ప్రజల్లో ఏర్పడింది. ఇదీ ప్రస్తుత పరిస్థితి!

ఈసారి మన పురాణకాల శాస్త్రవేత్తల గురించి తెలుసుకుందాం. ఋషులే అలనాటి శాస్త్రవేత్తలని చెప్పుకున్నాం కదా! ఆనాటి ఋషులు ఏకాగ్రతతో తపస్సులు చేస్తూ మనో నిశ్చలత, వాక్శుద్ధి, దివ్యదృష్టి మొదలగు అనేక శక్తుల్ని సంపాదించేవారు. తమ శక్తితో అర్థం చేసుకున్న 'సృష్టి, ప్రకృతుల' గురించి తెలియజేస్తూ 'వేదాలను' వ్రాసుకొచ్చారు. (వేదాల్లో ఎంతో శాస్త్రీయ పరిజ్ఞానం ఉంది.) యజ్ఞయాగాలనబడే

ప్రయోగాలతో ప్రకృతి శక్తులను కైవసం చేసుకోవడం తెలుసుకున్నారు. దుష్టుల సంహారానికి అస్త్రాలను రూపొందించారు. లోక కళ్యాణానికి ఎన్నో మార్గాలను చూపారు. (ఆధునిక ప్రయోగాల్లోని ద్రావకాల (Acids) బుసబుసలే, ఆనాటి యజ్ఞకుండాల్లోని భుగభుగలు. ప్రజోపకరమైన యజ్ఞయాగాలు విజయవంతమైతే తమకు ఇబ్బంది కనుక, వాటిని చెడగొట్టేందుకు నాటి రాక్షసజాతి తంటాలు పడేది. ఈనాటి రౌడీ ముఠాలే, ఆధునిక రాక్షస బృందాలు. వారినుండి శాస్త్రవేత్తలను నేటి ప్రభుత్వం రక్షిస్తున్నట్లుగా, ఆ కాలంలోని మహారాజులు "ఋషీశ్వరులనూ, వారి యజ్ఞ వాటికలనూ" రక్షించేవారు. నాటి ఋషుల యజ్ఞవాటికలంటే, నేటి సైంటిస్ట్ల లాబొరేటరీల (Laboratories) వంటివి. అందుకే యజ్ఞయాగాలు 'ప్రజలకోసం, రాజ్యరక్షణ కోసం' అని పురాణాల్లో చెప్పబడింది.

'ఋషి' అనేది ఒక డిగ్రీ వంటిదని అనుకుంటే, 'మహర్షి' అనేది అంతకంటే పెద్దమెట్టు. అంటే పోస్ట్‌గ్రాడ్యుయేట్ వంటిది. 'బ్రహ్మర్షి' అనేది Ph.D. వంటి ఇంకో పైమెట్టు. ఋషి నిర్వహించే గురుకులం 'హైస్కూలు' వంటిది. మహర్షి నిర్వహించే గురుకులం 'కాలేజి' వంటిది. బ్రహ్మర్షి నిర్వహించే గురుకులాన్ని 'యూనివర్సిటీ' గా మనం అన్వయించుకోవచ్చు. ఋషులంతా చేసేది కేవలం జపమే అయితే, వారి శిష్యులు అనేక సంవత్సరాలపాటు శుశ్రూషచేస్తూ నేర్చుకోవలసిందేమీ ఉండదు. గురువుగారి వద్ద వారు చాలా శాస్త్రీయ పరిజ్ఞానం పొందవలసి ఉంటుంది. కనుకనే నాటి విద్యావిధానం సంక్లిష్టంగా ఉండేది. గురువుగారి వద్ద పట్టాపొందిన అనంతరం శిష్యుడు వెళ్ళి, తన స్వంత లాబొరేటరీ (అనగా మరో గురుకులం, యజ్ఞవాటిక వగైరాలు) ఏర్పాటు చేసుకునేవాడు.

వాల్మీకి, వ్యాసుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, అత్రి, జమదగ్ని, భరధ్వాజుడు, కపిలుడు మొదలైన ఎందరినో ప్రాచీన శాస్త్రవేత్తలుగా మనం చెప్పుకోవచ్చు. ఒకవిధంగా చెప్పాలంటే ప్రాచీన ఋషీశ్వరులంతా శాస్త్రవేత్తలే! వేదఋషుల యొక్క ఖగోళశాస్త్ర పరిజ్ఞానం అపారం. (మొట్టమొదటగా సంపూర్ణ సూర్యగ్రహణాన్ని పరిశీలించి, దాన్ని గ్రంథస్థం చేసినవాడు అత్రి మహర్షి.) విశ్వం స్వరూప స్వభావాలను గురించీ, ప్రకృతి శక్తుల గురించీ వేద ఋషులు స్పష్టమైన సిద్ధాంతాలను మనకు అందించారు. వారు తమ ఖగోళ విజ్ఞానాన్ని ఋగ్వేదంలో పొందుపరచారు.

ఋషుల అనంతర కాలాన ప్రాచీన ఖగోళ శాస్త్రవేత్తల్లో ముఖ్యులుగా ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, భాస్కరాచార్యులను చెప్పుకోవాలి. వీరు గణిత, జ్యోతిష శాస్త్రవేత్తలు కూడా!

గ్రహగతులకూ, మానవుని భవిష్యత్తుకూ అవినాభావ సంబంధం ఉన్నదని

మన ప్రాచీన మేధావులు గమనించారు. ఈ విషయంపై ఆధారపడే జ్యోతిషశాస్త్రం పుట్టింది. జ్యోతిషం కోసం గ్రహగతులను లెక్కించాలి కనుక, జ్యోతిషంతో పాటూ గణితం కూడా చెట్టాపట్టాలు వేసుకుని పెరిగింది. అటు జ్యోతిషంలోనూ, ఇటు గణితంలోనూ అరితేరిన వారిని 'జ్యోతిర్గణిత శాస్త్రవేత్తలు' అంటారు. వారిలో ప్రముఖుడు 'ఆర్యభట్టు.'

## ఆర్యభట్టు

ఈయన తన పరిశోధనా సిద్ధాంతాలతో "ఆర్యభటీయం" అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈ గ్రంథంలో "భూమి తన చుట్టూ తాను తిరుగుతోందనీ, చంద్రుడు మరియు భూమి నీడలే గ్రహణాలకు మూలకారణమనీ, చంద్రునికి స్వయం ప్రకాశ శక్తి లేదనీ, సూర్యుని కారణంగానే చంద్రునికి కాంతి కలుగుతోందనీ....." ఇలా ఇంకా అనేక ఖగోళ విషయాలు తెలియజేశాడు. అనంతర కాలంలో ఆర్యభటీయ గ్రంథం అరబ్బులకు ప్రామాణికం అయింది.

ఆర్యభటీయ గ్రంథంలో రెండు భాగాలున్నాయి. మొదటిది 'దశగీతిక', రెండోది 'ఆర్యాష్ట శతము'. ఆర్యాష్ట శతంలో మళ్ళీ 'గణితపాదము, కాలక్రియా పాదము, గోళపాదము' అనే 3 అధ్యాయాలున్నాయి. "భూమికి చలనం ఉన్నదనీ, అది తన అక్షంపై తిరుగుతోందనీ, భూమితో సహా కొన్ని ఇతర గ్రహాలు సూర్యునిచుట్టూ తిరుగుతున్నాయనీ" ఆర్యభట్టు చెప్పాడు. గణితశాస్త్రంలోని 'వర్గము, వర్గమూలము, ఘనం, ఘనమూలము' అనే వాటిని గురించి వివరించాడు. బీజగణితంలో ఎన్నో సమీకరణాలను రూపొందించాడు. వృత్తపరిధిని కనుక్కోడానికి మనం గణితంలో ఉపయోగిస్తున్న 'π' (పై) అనే గ్రీకు సంకేతపు విలువను అంతకుముందే ఏనాడో 3.14 గా లెక్కించి, తన గణితంలో ఉపయోగించుకున్నాడు. (π విలువను 22/7 గా అంటే 3.14 గా మనం వేస్తూంటాం. ఆర్యభట్టు వేసిన లెక్క, ఆధునికుల లెక్కతో సరిగ్గా ఏకీభవిస్తోంది.)

ఇంతటి మేధావి అయిన ఆర్యభట్టును, మన భారత ప్రభుత్వం కొన్తె గుర్తించిందనే చెప్పాలి. అదెలా అంటే, మనదేశం ప్రయోగించిన ఒక కృత్రిమ ఉపగ్రహానికి "ఆర్యభట" అని నామకరణం చేశారు. మనవాడైన ఆర్యభట్టుకు జాతిమొత్తం చూపించిన గౌరవం అది!

## వరాహమిహిరుడు

ఈనాడు మనం అనుసరిస్తున్న పంచాంగానికి మూలకర్త ఈయనే! పంచాంగం అనేది జ్యోతిషం నుండే పుట్టింది. పంచాంగం అంటే 5 భాగాలు కలిగినది అని

అర్థం. తిథి, వారం, నక్షత్రం, యోగం, కరణం అనేవే ఈ 5 భాగాలూనూ! ఆకాశంలోని నక్షత్ర సమూహాల్లో మన ప్రాచీన మేధావులు '12 రాశులను' ఊహించారు. సూర్య కుటుంబానికి చెందిన గ్రహాలు, ఆ నక్షత్రరాశులకు అనుబంధంగా చరించడాన్ని బట్టి 'జ్యోతిష శాస్త్రం, పంచాంగం' రూపొందాయి. వీటికి సంబంధించిన విషయాల్లో వరాహమిహిరుడు మహామేధావి. ఈయన బృహజ్జాతకం, లఘుజాతకం, వివాహ పటలం, బృహత్సంహిత, యోగయాత్ర, పంచ సిద్ధాంతిక" మొదలైన గ్రంథాలను వ్రాశాడు. 'బృహత్సంహిత' అనే గ్రంథం తర్వాత కాలంలో అనేక విదేశీ భాషల్లోకి అనువదించుకోబడింది. ఈ బృహత్సంహితలో సూర్యుడు, చంద్రుడు మొదలగు వాని సంచారం గురించీ, నక్షత్ర మండలాల్లో వాటి సంచారంవల్ల భూమిపై ప్రాణులకు కలిగే మంచీచెడుల గురించీ, సంవత్సర ఫలాల గురించీ, భూకంపాలు, ఉల్కా పాతాలు, పిడుగులు పడడం, ఇంద్రధనుస్సు ఏర్పడడం మొదలగు విషయాలను గురించీ స్పష్టంగా వివరించాడు. "పంచ సిద్ధాంతిక" అనే గ్రంథంలో భూగోళానికి సంబంధించిన ఎన్నో విషయాలను చెప్పాడు. ఇందులోని 13వ అధ్యాయమైన "త్రైలోక్య సంస్థానం" లో భూగోళాన్ని గురించి ఇలా చెప్పాడు. "పంచభూతాల్లో ఒకటైన భూగోళం, గోళాకారంగా ఉంది. ఆకాశంలోని తారాగణం అనే పంజరంలో అది ఉంది. రెండు అయస్కాంతాల మధ్య సమాన దూరాల్లో లోహం ఉన్నట్లు ఏ ఆధారం లేకుండా భూమి నిలిచి ఉంది". పెద్దపెద్ద టెలీస్కోపులవీ లేని ఆ కాలంలోనే ఇంత చక్కటి యథార్థాన్ని చెప్పాడంటే, అతని మేధస్సు ఎంతటిదో ఆలోచించండి. 'వాస్తుప్రకరణం' అనేగ్రంథంలో గృహనిర్మాణానికి అనువైన స్థలాలను గురించీ, ఇళ్ళనిర్మాణం ఎలా చెయ్యాలీ, వేటితో చెయ్యాలీ అనే విషయాల్ని గురించీ వివరించాడు. బృహజ్జాతకం అనే గ్రంథంలో సమస్త జాతక విషయాల్నీ చర్చించాడు. మనుషులు ఎక్కడ ఏవిధంగా, ఏ స్వరూప స్వభావాలతో జన్మిస్తారో నిర్ణయించే విధానాల్ని ఇందులో వివరించాడు. జాతకుని జీవితాన్ని తెలిపే యోగాలను గురించి సవిస్తరంగా చెప్పుకొచ్చాడు. ఈ బృహజ్జాతకం అనే గ్రంథాన్ని అందరూ అర్థం చేసుకోవడం కష్టం అని తలచి, దాన్ని సంక్షిప్తం చేస్తూ "లఘు జాతకం" అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈయన విక్రమార్క మహారాజు ఆస్థానంలో ఉండేవాడని చెప్తారు. ఉజ్జయినీలో నక్షత్ర వేధశాల (Space Observatory) ను నిర్మింపజేశాడట.

## బ్రహ్మగుప్తుడు

వరాహమిహురుని అనంతరం పేర్కొనదగిన మరో మేధావి ఈయన. "ఖండ ఖాద్యకం, బ్రహ్మస్ఫుట సిద్ధాంతం" మొదలైన ఖగోళ, గణిత శాస్త్రాల్ని వ్రాశాడు.

ఇకపోతే భాస్కరాచార్యుని గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం. (ఈ పుస్తకం నందలి 28వ వ్యాసంలోని 'ప్రాచీన హైందవ గణితం' అనే అంశంలో ఆయనను గురించిన వివరాల్ని చూడవచ్చు.)

ఇలా చెప్పుకుంటూ పోతే ఎందరో మేధావులున్నారు. అతి ప్రాచీనకాలంలోనే తమ శాస్త్రీయ పరిజ్ఞానంతో మన జాతిని ముందుకు నడిపించిన అటువంటి మేధావులందరికీ నిత్యం నమస్కరించాలి మనం.

## శాస్త్రీయ రంగాన అలనాటి రోబోట్లు

నేటి సైన్స్‌యుగాన మరమనుషుల (రోబోట్స్) తయారీ ఒక విశేష అంశం. ఆధునిక శాస్త్రవేత్తల మేధస్సుకు ఒకవిధమైన మచ్చుతునకలుగా "రోబోట్స్" ను చెప్పుకుంటున్నాం మనం. మన పురాణకాలంలోనూ ఈ రోబోట్స్ ప్రస్తావన కన్పిస్తోంది. "యోగవాసిష్టం"లో ఒక కథ ఉంది. "దాళ, వామ, కటు" అనే ముగ్గుర్ని బ్రహ్మదేవుడు సృష్టించాడట. ఆ ముగ్గురికీ స్వంతంగా ఆలోచించే శక్తి లేదట. స్వతంత్ర్యించి ఏ పనీ కూడా చేయలేరట. కానీ యజమాని చెప్పిన ఆజ్ఞను మాత్రం చక్కగా పాటిస్తారట. వీరిని యోగవాసిష్ఠం "చేతనామాత్ర జీవులు" అని పేర్కొన్నది. వీరి లక్షణాలు, ఆధునిక రోబోట్స్ లక్షణాల్ని పోలి ఉండడం గమనించండి.

ఇకపోతే చరిత్రకాలంలో చూస్తే 11వ శతాబ్దిలోనే మరమనుషుల (రోబోట్స్) వాడకం మనదేశంలో ఉన్నట్లు తెలుస్తోంది. పారమార వంశస్థుడైన భోజరాజు వ్రాసిన "సమరాంగణ సూత్రధార" అనే గ్రంథంలో ఇందుకు సంబంధించిన విషయాలు ప్రస్తావించబడ్డాయి. ఇంటి పనులకు ఉపయోగించే రకరకాల మరమనుషుల గురించి వర్ణనలు ఇవ్వబడ్డాయి. ద్వారపాలకులుగా కర్రతో చేసిన మరమనుషుల్ని నియోగించే వారట. వారి చేతిలో కర్ర, బల్లెం, శూలం వంటి ఏదొక ఆయుధం ఉండేదట. అక్రమంగా ఇళ్ళల్లోకి ప్రవేశించే వారిని, వీరు ఆపివేసేవారట. పనిమనుషులుగా ఉపయోగించబడే మరమనుషులు 'పెద్దలకు స్వాగతం చెప్పడం, ఆహార పదార్థాలను వడ్డించడం, సంగీత వాయిద్యాలను వాయించడం, మొక్కలకు నీళ్ళు పోయడం' వంటి పనులు చేసేవారట. ఈ మరమనుషులను కొయ్యతో చేసేవారట. తోలు లేదా వస్త్రాలతో వారిని అలంకరించేవారట. అవసరమైన చోట్ల రంధ్రాలు, నాళికలు, దారాలు, కడ్డీలు వంటివి అమర్చి - అవన్నీ ఒక యంత్రం ద్వారా కదిలే ఏర్పాటు చేసేవారట. ఇదీ.... ప్రాచీన కాలపు రోబోట్ల సంగతి!

## అలనాటి ఇంజినీర్లు

ఈసారి పురాణకాలపు ఇంజనీర్ల సంగతి చూద్దాం. దేవశిల్పిగా పేరుపడిన

'విశ్వకర్మ' త్రేతాయుగంలో అందమైన 'లంకానగరాన్ని' నిర్మింపజేశాడు. రామాయణం లో ఇవ్వబడిన లంకానగర వర్ణన మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. అక్కడి రాజవీధులు, నగర వీధులు, వివిధ కట్టడాల నిర్మాణ రీతులు నిజంగా అద్భుత మనిపిస్తాయి. కందకాలపై నిర్మించిన వంతెనల్ని కావాలంటే మామూలుగా ఉంచి, శత్రువులు వచ్చేవేళ పైకి ఎత్తివేయడం, చిత్రవిచిత్ర జలయంత్రాల (ఫౌంటెన్‌ల) ఏర్పాట్లు, రమణీయమైన వాస్తు..... మొదలైనవి లంకానగరంలోని కొన్ని ప్రత్యేకతలు. పుష్పకవిమానం సంగతి సరేసరి! దాన్ని తయారుచేసినవాడు కూడా విశ్వకర్మే! సకల కళలకూ, శిల్పశాస్త్రాలకూ ఆదిగురువు ఈయన.

రామాయణంలోని వానరసేనలో 'నలుడు' అనే గొప్ప ఇంజినీరున్నాడు. ఇతను విశ్వకర్మ కుమారుడు. లంకను చేరేందుకు సముద్రంపై 'వారధి' నిర్మింపజేసిన మేధావి ఇతనే!

ఋషీకేష్‌లో 'లక్ష్మణ ఝూలా' అనే ప్రసిద్ధమైన వంతెన నిర్మింపబడింది. ఊయల ఊగుతున్నట్లుగా ఉండే ఆ వంతెన, గంగానదిపై నిర్మించబడింది. దాన్ని త్రేతా యుగంలో లక్ష్మణుడు నిర్మింపజేశాడని ప్రతీతి. లక్ష్మణునికి సాంకేతిక విద్య బాగా తెలుసునన్నమాట. (ప్రస్తుతం ఋషీకేష్‌లో లక్ష్మణఝూలాగా ఉన్నది, ఆనాటి వంతెన కాదు. ఆనాటి లక్ష్మణఝూలా స్థానంలో ఆధునికంగా నిర్మించబడిన మరో వంతెన అది!)

ఇక ద్వాపర యుగానికి వద్దాం. మహాభారతంలో 'మయుడు' అనే ఇంజినీరు 'మయసభ'ను నిర్మించి, ధర్మరాజుకు బహూకరిస్తాడు. మయసభను గురించి వేరే చెప్పేదేముంది? మనందరకూ తెలుసు. అద్భుతమైన సాంకేతిక పరిజ్ఞానానికి మచ్చుతునక అది! బంగారం వంటి ఖనిజాలనూ, నవరత్నాలనూ, అద్దాలనూ ఉపయోగించి కాంతి పరావర్తనం, ప్రతిబింబించడం, వస్తువు రెండు విధాలుగా కన్పించడం మొదలైన ప్రక్రియలతో ... 'ఉన్నవి లేనట్లుగానూ, లేనివి ఉన్నట్లుగానూ' అనిపించే రీతిలో ఈ మయసభా నిర్మాణం జరిగింది. ఈనాటి ఆర్కిటెక్ట్‌లకు మతులు చెదరగొట్టగల నిర్మాణం అది.

పురాణకాలపు ఇంజనీర్లు ఎంతోమంది తమ మేధాసంపత్తితో నదుల దారిని మళ్ళించి, వివిధ ప్రాంతాలను సస్యశ్యామలం చేశారు. ఇందుకు సంబంధించిన విషయాల్ని 'నదుల దారి మళ్ళింపు' అనే ఈక్రింది అంశం ద్వారా తెలుసుకుందాం.

## నదుల దారి మళ్ళింపు

పురాణాల్లో నదుల పుట్టుకలను గురించి, నదులు ప్రవహించిన తీరును

గురించీ కొన్ని గాథలు, కథలు కన్పిస్తాయి. అయితే వాటిలో ఎంతో అంతరార్థం దాగిఉంది. గంగానది కథలోని 'దిలీపుడు, అంశుమంతుడు, భగీరథుడు' ఇంజినీర్లే! మేఘాలనుండి కురిసే వర్షపునీరు హిమాలయాలపై పడి వృధాగా పోతుందని, ఆ నీరంతా వృధాగాపోకుండా, ఒక మార్గానికి మళ్ళిస్తే 'ఒక నదిగా' ఏర్పడునని భావించిన 'దిలీపుడు, అంశుమంతుడు, భగీరథుడు' ఒకరి తర్వాత ఒకరుగా ప్రయత్నించి ప్లానుచేసి చివరకు "గంగానదిగా" మార్చి ప్రవహింపజేసి, ఉత్తర భారత భూమిని సస్యశ్యామలం చేశారు. ("పురాణేతిహాస గాథలు - అంతరార్థాలు" అనే మా తర్వాత ప్రచురణలో దీని వివరాలను చూడవచ్చు.)

నేడు "గంగా-కావేరి పథకం" అంటూ గంగానదినీ, కావేరీ నదినీ కలిపే పథకంలో ఎందరో ఇంజినీర్లు పనిచేస్తున్నారు. అలాగే తెలుగుగంగ పథకంలో కూడా ఎందరో ఇంజినీర్లు తమతమ బాధ్యతల్ని నెరవేరుస్తున్నారు. ఇటువంటి బృహత్తరమైన పథకాలకు ఒకే ఇంజినీరు సరిపోడు కదా! ఆ విధంగానే గంగానదిని రూపొందించి తీసుకురావడంలో 'దిలీపుడు, అంశుమంతుడు, భగీరథుడు' అనే ముగ్గురు ఇంజనీర్లు కావలసి వచ్చారు.

పూర్వం ఒకసారి కొన్ని ప్రాంతాల్లో 14 ఏళ్ళపాటు కరువు సంభవించగా, దాన్ని నివారించమని ప్రజలు కోరిన మీదట 'మహాపతివ్రత అనసూయ' తన మేధాశక్తితో జాహ్నవీ నదిని ఆ ప్రాంతాలకు మళ్ళించే ప్లానుచేసి, దాన్ని అమలు జరిపించి, కరువు నిర్మూలనకు తోడ్పడింది. అనసూయ ఆనాటి మహిళా ఇంజినీరన్నమాట. అయితే అనసూయ తన తపశ్శక్తితో జాహ్నవీనదిని దారి మళ్ళించిందని పురాణ పరిభాషలో గ్రంథస్థం చేయబడింది.

మన గోదావరి నది సంగతి చూడండి. పడమటి కనుమల్లో కురిసిన వర్షపునీరు వృధాగా పోతుందని గమనించిన గౌతమ మహర్షి, దాన్ని ఒకే ప్రవాహంగా తీసుకొచ్చి, 'గోదావరినది'గా ప్రవహింపజేశాడు. దీన్నే ఒక పురాణకథగా మన పూర్వీకులు చెప్తూ, 'గోహత్యాపాతక నివారణార్థం' తపశ్శక్తితో గోదావరినదిని గౌతముడు తెచ్చాడన్నారు.

దక్షారామ భీమేశ్వరస్వామి స్థాపనకోసం సప్తఋషులు, గోదావరి నదిని ఏడుపాయలుగా చేసి తీసుకువెళ్ళారని భీమేశ్వర పురాణం చెప్తోంది. హెచ్చుభూమిని సస్యశ్యామలం చేస్తూ వివిధ ప్రాంతాల జనావళికి ఉపయోగపడాలని, గోదావరినదిని సప్తపాయలుగా చేసిన 'సప్తఋషులు' కూడా గొప్ప ఇంజనీర్లని గ్రహించాలి మనం.

## అలనాటి వైద్యులు

పురాణకాలపు వైద్యవిజ్ఞానం అత్యంత మహనీయమైనది. ఇప్పటి అసాధ్యాలు,

అప్పటికి సుసాధ్యాలే! దేవతల వైద్యాచార్యుడు 'ధన్వంతరి'. అష్టాంగ అయుర్వేద విద్యకు ఆయన ఆద్యుడు.

అశ్వనీదేవతలు కూడా ప్రముఖ వైద్యులు. ఋగ్వేదంలో వీరిని ప్రస్తుతిస్తూ అనేక సూక్తాలున్నాయి. వీరు అనేకరకాల వ్యాధులను వివిధ ఔషధాలతో పోగొడతారు. (ఋగ్వే 8-22); గ్రుడ్డివారికి దృష్టినిస్తారు (ఋగ్వే 1-116); వీరి నైపుణ్యాన్ని చాటే కథలు చాలా ఉన్నాయి. చ్యవనుడనే మహర్షికి ముసలితనం పోగొట్టి యవ్వనాన్ని ప్రసాదించారు. రేభుడనే ఋషిని అతని శత్రువులు కట్టేసి పది రాత్రులూ, తొమ్మిది పగళ్ళూ నీటిలో ముంచారు. దాదాపుగా మరణస్థితిని పొందిన ఆ ఋషిని మళ్ళీ వీరు బ్రతికించారు. (ఋగ్వే 1-112-119.) 'అత్రిసప్తవధ్రి' అనే వానిని రాక్షసులు అగ్నికుండంలో పడవేయగా అతన్ని రక్షించి, ఆరోగ్యాన్నిచ్చారు. (ఋగ్వే 10-30); అలాగే ఋజ్రాశ్వుని గ్రుడ్డితనాన్నీ (ఋగ్వే 1-116), పరావృజుని కుంటితనాన్నీ (ఋగ్వే 1-112) పోగొట్టారు. 'విశ్పలా' అనే యువతి తన కాలిని యుద్ధంలో పోగొట్టుకొనగా, ఇనుముతో చేసిన కాలిని ఆమెకు అమర్చారు (ఋగ్వే 1-117, 10-39). వీరిని 'స్వర్గలోక వైద్యులుగా' ఋగ్వేదం చెప్తోంది.

వేదాలను వ్రాసిన మహాఋషుల్లో చాలామంది వైద్యులున్నారు. అధర్వణ వేదంలో అనేక ఆయుర్వేద వైద్య విషయాలున్నాయి. అందులో సమస్త రోగాల, బాధల వివరాలూ, వాటి మూల కారణాలూ, రోగ నివారణా పద్ధతులూ చర్చించబడ్డాయి. వాటిలో ఉదాహరణలుగా కొన్నింటిని తెలుసుకుందాం. 1-22 సూక్తంలో పచ్చకామెర్లకు వైద్యం, 2-3 సూక్తంలో అతిసార వ్యాధికి వైద్యం, 5-22, 19-34 సూక్తాలలో జ్వరానికి వైద్యం, 2-8, 3-7 సూక్తాల్లో అనువంశిక రోగాలకు వైద్యం, 8-56 సూక్తంలో పాము, తేళ్ళ విషాలకు వైద్యం, 19-38 సూక్తంలో క్షయవ్యాధికి వైద్యం, 1-17-1 సూక్తంలో రక్తస్రావం ఆపే వైద్యం, 6-21, 6-136, 6-137 సూక్తాల్లో కేశాలకు సంబంధించిన వైద్యం, 6-16 సూక్తంలో నేత్రవ్యాధులకు వైద్యం, 2-25, 20-96, 11-16 సూక్తాల్లో గర్భస్రావానికి వైద్యం, 2-31, 2-32, 4-37, 5-23 సూక్తాల్లో క్రిమినాశన వైద్యం వివరించబడ్డాయి. దెబ్బలు నయం కావడానికీ, విరిగిన ఎముకలు అతుక్కోడానికీ 'రోహిణ్యసి' (4-12) అనే సూక్తంతో అభిమంత్రించిన లక్కనీళ్ళతో ఆ భాగాలను ఉషఃకాలంలో తడపాలి అని సూచించారు.

ప్రకృతి వైద్యం వేదకాలం వారికి బాగా తెలుసు. రోగాల నివారణలో సూర్యరశ్మి ఎంతో ఉపయోగకారి అని ఐతరీయ బ్రాహ్మణం (1-5-2 సూక్తం) లో చెప్పబడింది. దెబ్బలు, కోతలు, కురుపులు మొదలైన వాటికి లేపనాలు (Ointments) తయారు చేయబడేవి (శతపథ బ్రాహ్మణం 3-1-3-7); చింతపండు, పెరుగు మొదలైనవాటిని

ఉపయోగించి వాంతులను, విపరీతంగా సురాపానం చేయడం వల్ల కలిగే దోషాలనూ పోగొట్టేవారు (ఐ.బ్రా. 2-8-4); జంతుశాస్త్రం (Zoology) లో కూడా అప్పటివారు మహాపండితులు. పశుయాగాన్ని పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది. (శ.బ్రా. 3-8-2-3); కుట్లు, కట్లు, ఆపరేషన్లు, కృత్రిమ అవయవాల ఏర్పాట్లు మొదలైనవన్నీ నాటి విజ్ఞానులకు తెలుసు.

మృతదేహాలు చెడిపోకుండా అవసరం కొలదీ నిలువ ఉంచే పద్ధతులు నేటికాలంలో ఉన్నాయి. ద్రావకాలను ఉపయోగిస్తూ కొన్ని రసాయన ప్రక్రియల ద్వారా నేడు ఇలా చేయగలుగుతున్నారు. అయితే ఇటువంటి ప్రక్రియ మన పూర్వీకులకు క్రొత్తేంకాదు. రామాయణ కాలానికే వారికి ఈ పద్ధతులు తెలుసు. దశరథుని మరణానంతర సందర్భాన్ని, ఇందుకు నిరూపణగా మనం చెప్పుకోవచ్చు. దశరథమహారాజు చనిపోయేనాటికి అయోధ్యలో ఆయన కుమారులెవరూ లేరు. రామలక్ష్మణులు వనవాసానికి వెళ్ళిపోయారు. భరతశత్రుఘ్నులు తమ మాతామహుల ఇంట కేకయదేశంలో ఉన్నారు. అదీ పరిస్థితి! భరతశత్రుఘ్నులను అయోధ్యకు తీసుకొచ్చేందుకు దూతలను పంపించాడు వశిష్ఠుడు. భరతశత్రుఘ్నులున్న కేకయదేశం అంటే, నేటి భౌగోళిక పరిస్థితి ప్రకారం అది మనకు విదేశమే! ప్రలంబ ప్రాంతం మీదుగా మాలినీనది దాటి, హస్తినాపుర సమీపంలో గంగానది దాటి, పాంచాలం మీదుగా బాహ్లిక దేశందాటి, సుదామా పర్వతం మీదుగా ప్రయాణించి 'కేకయదేశం' చేరవలసి ఉంది. (నేటి భౌగోళిక స్థితి ప్రకారం చెప్పాలంటే - ఉత్తరప్రదేశ్, ఢిల్లీ, హర్యానా, పంజాబ్‌ల మీదుగా ప్రయాణించి పాకిస్తాన్ దేశాన్నీ, సులేమాన్ పర్వతాలనూ దాటి వెళ్తే, కేకయదేశ ప్రాంతం వస్తుంది. నేటి అఫ్ఘనిస్తాన్ వైపు ప్రాంతమే, నాటి కేకయదేశం. అక్కడకు వెళ్ళే దారిలో కొన్ని నదులను దాటవలసి ఉంటుంది.) వేల మైళ్ళ దూరంలో ఉన్న కేకయ దేశం వెళ్ళేందుకు దూతలకు 5 రోజులు పట్టిందట. భరత శత్రుఘ్నులు అయోధ్య రావడానికి మరో 5 రోజులు ప్రయాణం ఉంటుంది. ఈలోగా దశరథుని శరీరం కుళ్ళిపోకుండా కాపాడేందుకు, ఆయన మృతదేహాన్ని తైలద్రోణంలో నిలువ ఉంచారట. మృతదేహాలను నిలువఉంచే రసాయన ప్రక్రియ ఇతిహాసకాలం వారికి తెలుసునని దీనివల్ల రుజువౌతోంది.

ఇతిహాసకాలపు వైద్యుల్లో సుషేణుడి గురించి ప్రత్యేకించి చెప్పుకోవాలి. సుషేణుడు రామాయణ కాలానికి చెందినవాడు. వానరుడైన ఈయన, వాలికి మామగారు. ఆ కాలంలో ఎక్కడెక్కడ ఏఏ మూలికలు, ఔషధాలు లభించేదీ సుషేణుడికి బాగా తెలుసు. ఇంద్రజిత్ ప్రయోగించిన నాగాస్త్రానికి లక్ష్మణుడు మూర్ఛ పోయిన సందర్భంలో తిరిగి అతనికి స్పృహ కల్గించే విధానాన్ని సుషేణుడు వివరిస్తూ

"దేవాసుర సంగ్రామంలో రాక్షసులచే చంపబడ్డ దేవతలను తిరిగి బ్రతికించడానికి బృహస్పతి మంత్రాలనూ, ఓషధులనూ ఉపయోగించేవాడు. ఆ ఓషధులు క్షీరసముద్రం దగ్గర ద్రోణపర్వతం మీదా, చంద్రగిరి మీదా ఉన్నాయి. మన హనుమంతుడు వెళ్ళి అక్కడి ఓషధులను వెంటనే తీసుకురావాలి" అని చెప్పాడు.

హిమాలయ పర్వతాలు దాటిన తర్వాత కైలాసగిరి మధ్యలో "విశల్యకరణి, సంధానకరణి, సువర్ణకరణి, సంజీవని" మొదలైన కాంతులీనే ఓషధుల గురించి రామాయణ కాలం వారికి తెలుసు. (బాణాలు, బల్లెం పోట్లు తగిలి బాధపడేవారికి త్వరితంగా బాధానివారణ కల్గించే ఓషధి 'విశల్యకరణి'. శస్త్రఘాతాలవల్ల లేదా అస్త్రప్రయోగాల వల్ల మూర్ఛపోయిన వారిని శీఘ్రంగా కోలుకునేలా చేయగల ఓషధి 'సంజీవని'.) ఇంద్రజిత్ వేసిన బ్రహ్మాస్త్రానికి మూర్ఛపోయిన లక్ష్మణునికి 'సంజీవని' అనే ఓషధి తోనే స్పృహ కలిగించారు.

పురాతన ఆయుర్వేద వైద్య శిఖామణిగా భరద్వాజ మహర్షిని చెప్పుకోవచ్చు. ఆయన శిష్యులైన ఆత్రేయుడు, అగ్నివేశుడు, పరాశరుడు, జతూకర్ణుడు, క్షారపాణి, హారీతుడు మొదలగువారు ఆయుర్వేద వివిధ శాఖలపై అనేక గ్రంథాలను వ్రాశారు.

## కపిల మహర్షి

ఈ మహర్షి ప్రస్తావన భాగవతంలోనూ, భారతంలోనూ, కొన్ని ఉపనిషత్తులలోనూ కన్పిస్తుంది. ఈయన "సాంఖ్యదర్శనం" అనే గ్రంథం వ్రాశాడు. అందులో మనస్సుయొక్క తత్త్వం విపులంగా చర్చించబడింది. మనస్సును గురించీ, దాని తత్త్వాన్ని గురించీ మొట్టమొదటగా వివరించి చెప్పినవాడు కపిల మహర్షి. మనస్తత్త్వ శాస్త్రానికి (సైకాలజీకి) మూలపురుషుడు ఈయన. మనస్సు యొక్క ప్రభావం, మనిషి ఆరోగ్యంపై చాలావరకూ ఉంటుందని చెప్పాడు. మనస్తత్త్వ శాస్త్రం అనేది వైద్య శాస్త్రంలో ఒక విధమైన అంతర్భాగమే! "మనిషికి, జ్ఞానేంద్రియాలూ, కర్మేంద్రియాలూ ఉన్నాయి. అవి మనసు చెప్పినట్లుగా నడచుకుంటాయి. అయితే మనసుకంటే గొప్పది మరొకటి ఉంది. అదే "బుద్ధి". ఇంద్రియాలు విషయాన్ని గ్రహించి మనసుకు అందిస్తాయి. ఆ మనసు దాన్ని 'బుద్ధి' కి నివేదిస్తుంది. మంచిచెడుల విచక్షణా జ్ఞానంతో ఆలోచించి ఆజ్ఞ జారీచేస్తుంది బుద్ధి. మనిషి యొక్క మంచిచెడులు, అతని బుద్ధిని బట్టి నిర్ణయించబడతాయి. బుద్ధికి కూడా అతీతంగా మనిషిలో ఉండే మరో మహత్తర శక్తి "ఆత్మ". ఆత్మకు సుఖంలేదు, దుఃఖం లేదు, సమస్త కార్యాలకూ శాశ్వత సాక్షి "ఆత్మ". ఇటువంటి అంశాలన్నీ కపిలుడు తన గ్రంథంలో చర్చించాడు. ఈయన మనస్తత్త్వ సిద్ధాంతాలనే కాకుండా, ఒక వస్తువునుండి మరో వస్తువు

రూపొందుచున్నదనే 'పరిణామ వాదాన్ని' కూడా ప్రతిపాదించాడు.

వ్రత నియమాది మార్గములను అవలంభించి చెడుమార్గానికి వెళ్ళే మనసును కట్టివేసి, ప్రాణవాయువును జయించుటకు 8 సోపానములుగల "అష్టాంగయోగ విధి"ని ఆచరించవలసి యున్నదని ఈయన చెప్పాడు. (ఆసన, పూరక, కుంభక, రేచక, అనులోమ, ప్రతిలోమ, ధారణ, ఇంద్రియ, ప్రత్యాహార, ధ్యానములనేవే అష్టాంగయోగ విధులు.) కపిలుడు తన తల్లి దేవహూతికి చేసిన ఉపదేశంలో జీవాత్మ పరమాత్మలకు సంబంధించిన సమస్త ఆధ్యాత్మిక విషయములనూ వివరించు కొచ్చాడు. ఈ ఉపదేశంలో పిండోత్పత్తి, గర్భధారణ, శిశోదయం వంటి వైజ్ఞానిక విషయాల గురించి కూడా వివరించినట్లు భాగవతం వల్ల తెలుస్తోంది.

## చరకుడు

ఈయన వేదకాలపు మహర్షి. ఆయుర్వేద వైద్య శిఖామణిగా ప్రఖ్యాతుడు. అతిప్రాచీన ఆయుర్వేద గ్రంథమైన "చరక సంహిత" ను వ్రాసింది ఈయనే! తర్వాత కాలంలో ఈ గ్రంథాన్ని అరబ్బులు, పర్షియన్లూ తమ భాషల్లోకి అనువదించుకున్నారు. చరక సంహితలో 8 విభాగాలున్నాయి. అవి వరుసగా "సూత్రస్థాన, నిదాన స్థాన, విమాన స్థాన, శరీర స్థాన, ఇంద్రియ స్థాన, చికిత్స స్థాన, కల్ప స్థాన, సిద్ధి స్థాన" అనే శీర్షికలతో ఉన్నాయి. ఈ 8 విభాగాల క్రింద 220 అధ్యాయాలు ఎంతో విపులంగా ఇవ్వబడ్డాయి. విరిగిన కాలును అతకడం గురించి చరకుడు స్పష్టంగా వివరించాడు. గ్రుడ్డితనం, పక్షవాతం, కుష్ఠు, మూర్ఛ, క్షయ, రాచపుండు మొదలైన జబ్బులకు సులభమైన నివారణోపాయాలను తన గ్రంథంలో ఇచ్చాడు. వైద్యానికి ఉపకరించే వృక్షాలను 'వామన తను వృక్షాది విద్య' ద్వారా వాటి రూప లక్షణాలు మారకుండా, చిన్నచిన్నమొక్కల రూపంలో పెంచుకునే ప్రక్రియను ఈయన కనుగొన్నాడు. (ఈ పద్ధతి నేడు "మరుగుజ్జు వృక్షాల ప్రక్రియగా" ప్రపంచమంతటా ప్రాకింది.) వైద్యంలో "పాదరసం" వాడకం, చరకునికి తెలుసు. ఇది సాధారణ విషయంకాదని ఆధునిక వైద్యులే అంగీకరిస్తున్నారు. వాత, పిత్త, శ్లేష్మ దోషాల పరంగా రోగనిర్ధారణ చేయడం, వాటికి తగిన ఔషధ, ధాతువులను నిర్ణయించడంలో చరకుడు హెచ్చు శ్రద్ధ చూపేవాడు. అంటే చికిత్సకు ముందు రోగకారణాన్ని నిర్ధారణ చేయడం (డయాగ్నొసిస్) ముఖ్యమని భావించే వాడన్నమాట. ఇది ఉత్తమవైద్యుని లక్షణం కదా! చికిత్సా విధానంలో వైష్ణవ దేవతల పేరిట మంత్రాలను ఉచ్ఛరించడాన్ని కూడా సరైన పద్ధతిగానే చరకుడు పేర్కొన్నాడు. కొన్నిరకాల శబ్దాలు ప్రత్యేక పరిస్థితుల్లో రోగాలపై ప్రభావాన్ని

చూపుతాయని ఆధునిక వైద్యులు కూడా చెప్తున్నారు. పైన తెలిపిన మంత్రవైద్యం కూడా ఇటువంటిదే! (దీన్ని 'అల్ట్రా సోనిక్ చికిత్సా విధానంగా' భావించవచ్చు.)

## శుశ్రుతుడు

శస్త్ర చికిత్సా విధానానికి (ఆపరేషన్స్‌కి) మూలపురుషుడు శుశ్రుతుడు. 120 అధ్యాయాలతో "శుశ్రుత సంహిత" అనే వైద్యగ్రంథాన్ని రచించాడు. (అరబ్బులు ఈ గ్రంథాన్ని తమ భాషలోకి అనువదించుకున్నారు.)

శస్త్రచికిత్స చేయాలంటే శరీరం లోపలి భాగాలను గురించి క్షుణ్ణంగా తెలిసి ఉండాలి. లేకుంటే చాలా ప్రమాదం. అందువల్లనే ముందుగా శవాలను ఖండించడం ద్వారా శస్త్రచికిత్సా విజ్ఞానాన్ని పొందడం శుశ్రుతుడు ప్రవేశపెట్టాడు. శవపరీక్ష (పోస్టుమార్టమ్) చేసి, మరణం ఎందువల్ల సంభవించిందో నిర్ధారణ చేసే విధానాన్ని కూడా ఈయనే ప్రారంభించాడు. ఈ పద్ధతులన్నీ కూడా ఆధునిక వైద్య ప్రపంచంలో ఆచరణలో ఉన్నాయి. 'అపర ధన్వంతరి'గా పేరుపడ్డ కాశీరాజైన దివోదాసు వద్ద శుశ్రుతుడు అనేక వైద్య విధానాలను నేర్చుకున్నాడట. శుశ్రుత సంహిత గ్రంథంలో శస్త్రచికిత్సకు సంబంధించిన అనేక విషయాలు వివరంగా చెప్పబడ్డాయి. 24 యంత్రాలను, 101 రకాల శస్త్ర చికిత్సా సాధనాలను శుశ్రుతుడు చెప్పాడు. ఇవన్నీ శ్రేష్ఠమైన ఉక్కుతో తయారు చేయబడి, వెంట్రుకను కూడా నిలువునా చీల్చగలిగేటంత వాడిగా ఉండాలని చెప్తాడు. చికిత్సకు వాడే శస్త్రాలకు చేయవలసిన సంస్కారం (స్టెరిలైజేషన్), శుచీ, శుభ్రతల గురించి తీసుకోవలసిన శ్రద్ధలు చక్కగా వివరించాడు. పెద్ద శస్త్రచికిత్సలు చేసేటప్పుడు మత్తుమందు (అనస్థీషియా) తప్పకుండా ఇవ్వాలని చెప్పాడు. ఆపరేషన్స్ సమయాల్లో రక్తం కారిపోకుండా నరాలను బంధించి ఉంచే విధానాన్ని వివరించాడు. శరీరంలోని చర్మానికి 7 పొరలున్నాయని నిరూపించాడు. యుద్ధసమయాల్లో శరీరాల్లో నాటుకుపోయిన శస్త్రాలను వెలికి తీయడం గురించి ఎన్నో విధానాలను చెప్పాడు. మొట్టమొదటగా ప్లాస్టిక్ సర్జరీని ప్రవేశపెట్టింది కూడా ఈయనే! ప్లాస్టిక్ సర్జరీని "త్వచారోపణం" అనేవారట. ఈ విధానం ద్వారా కృత్రిమ అవయవాలను అమర్చడం గూర్చి వివరించాడు. తెగిన ముక్కును అతికించడం, చెవికి బదులు క్రొత్తచెవి అమర్చడం చేసిచూపాడు. విరిగిపోయిన ఎముకలను అతికే పద్ధతులను కూడా ఈయన వివరించాడు. శరీరంలో ఏదొకచోట చర్మభాగం లేదా మాంసభాగం చెడిపోతుందనుకొండి. నేడు దానికోసం శరీరంలో మరోచోట చర్మాన్ని లేదా మాంసభాగాన్ని తీసి, చెడిపోయిన చోట వేసి కుడుతున్నారు. ఈ పద్ధతిని మొట్టమొదటసారిగా ప్రవేశపెట్టినది శుశ్రుతుడే! కంటికి కనిపించని క్రిములు రక్తంలో

పుడతాయనీ, అవి అనేక రోగాలకు కారణమౌతాయనీ కూడా చెప్పాడు. పిండోత్పత్తిని గురించీ, వికృత శిశుజననాలను గురించీ ఇతనికి తెలుసు. వ్రణం అంటే ఏమిటో శాస్త్రబద్ధంగా నిర్వచించిన తొలి విజ్ఞుడు శుశ్రుతుడే! మూలికా ఔషధాలను గురించీ, చెడురక్తాన్ని తొలగించడంలో జలగలను ఉపయోగించడం గురించీ ఈయనకు తెలుసు. మూత్రాశయంలోని రాళ్ళను తొలగించడం లోనూ, కంటి శుక్లాలను అతి సున్నితంగా తీసివేయడంలోనూ ఈయన బహు నేర్పరి. దేహంలో ఆత్మ అనేది ఉందని, అది మాములు కళ్ళకు కన్పించదనీ జ్ఞానమూ, తపస్సూగల వారికే అది కన్పిస్తుందనీ చెప్పాడు. అరితేరిన ఆధునిక వైద్యులు కూడా చెప్పలేక పోయిన విషయం ఇది!

## పతంజలి

శరీర ఆరోగ్యాన్ని కాపాడగల ఏకాగ్రత, నియమ నిష్ఠలతో కూడిన "యోగాసనాలను" రూపొందించాడు పతంజలి. "యోగదర్శనం" అనే యోగశాస్త్రాన్ని వ్రాశాడు. ఇందులో నాలుగు పాదాల్లో 195 సూత్రాలను వివరించాడు. పతంజలి యోగశాస్త్ర ప్రకారం యోగానికి 8 అంగాలున్నాయి. యమ, నియమ, ఆసన, ప్రాణయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనేవే ఆ 8 అంగాలూనూ! యమ, నియమాలు మాత్రం అందరూ అన్ని కాలాల్లో ఆచరించక తప్పదు. తక్కిన 6 అంగాలూ మాత్రం ఒక్కోమెట్టూ గురువు సాయంతో నేర్చుకోవాలని ఈయన చెప్పాడు. ఈ 8 అంగాల ఆచరణలో మనిషి ఒక అతీతమైన స్థాయిని పొందగలడని వివరించాడు. భగవంతుని తత్త్వాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోడానికి 'యోగాభ్యాసాలే' సులభ మార్గమని చెప్పాడు.

పతంజలి సిద్ధాంత ప్రకారం మన శరీరంలో కీలకమైన నాడీ స్థానాలు కొన్ని, ప్రధానమైన కేంద్రస్థానాలు కొన్ని ఉన్నాయి. ఈ కేంద్ర స్థానాలనే "చక్రస్థానాలని" కూడా పిలిచాడు. ఈ స్థానాలను ప్రేరేపించినప్పుడు మన శరీరంలోని అంతర్గత శక్తి మేలుకొంటుందని చెప్పాడు. ఇలా మేలుకొనే శక్తిని "కుండలిని" అని సంబోధించాడు. మానసిక, శారీరక స్థితులపై యోగాసనాల ప్రభావం ఎంతయినా ఉంటుందని ఆధునిక యోగశాస్త్ర నిపుణులు కూడా అంగీకరిస్తున్నారు. భారతీయ యోగాభ్యాసాల పట్ల విశ్వవ్యాప్తంగా ఎంతో ఆదరణ లభిస్తోంది ఈనాడు. యోగాభ్యాసాల ద్వారా ఎంతోమంది ఆయురారోగ్యాలను పెంచుకోగలుగుతున్నారు. కొంతమంది ఆహారం లేకుండా కూడా హెచ్చుకాలం ఉండగలుగుతున్నారు. కొందరైతే గాలికూడా పీల్చకుండా యోగాభ్యాసం ద్వారా రోజుల తరబడి ఉండగలరట.

## జీవకుడు

మన ప్రాచీన వైద్యులలో మరో మేధావి ఈయన. గౌతమ బుద్ధునకు సమకాలికుడు. గాంధార దేశానికి ఒకప్పటి రాజధానియైన తక్షశిల యందలి విశ్వవిద్యాలయంలో ఈయన విద్య నభ్యసించాడు. అనంతరం బిందుసారుడి ఆస్థాన వైద్యుడుగా ఉన్నాడు. ఈయనకు భూమిపై వైద్యానికి పనికిరాని మొక్కే కన్పించలేదట. అంటే ఎంతటి ఘనవైద్యుడో తెలుస్తూనే ఉంది కదా! మెదడుకి సంబంధించిన శస్త్రచికిత్స చేసిన వారిలో ప్రథముడు ఈయన. అంటే ప్రపంచాన మొట్టమొదటి "న్యూరోసర్జన్" అన్నమాట. (విదేశీ మేధావులంతా అంగీకరించిన విషయమే ఇది.)



శాస్త్రీయపరంగా మన ప్రాచీన మేధావులంటే కేవలం శాస్త్రజ్ఞులు, ఇంజనీర్లు, డాక్టర్లే కాదు. ఇంకా వివిధ రంగాల్లో శాస్త్రీయపరమైన మేధావులున్నారు. ఆయా రంగాలకు చెందిన కొంతమంది ప్రముఖుల్ని గురించి కూడా కొంచెం తెలుసుకుందాం.

దేవతల స్మృతిని రచించిన శాస్త్రకారుడు 'దేవలుడు'. అన్ని విధములైన అన్నములనూ, ఖనిజములనూ, రత్నములనూ భూమినుండి వెలికి తెచ్చినవాడు 'పృథువు'. 'పూర్వమీమాంస' అనే గ్రంథాన్ని వ్రాసిన మేధావి 'జైమిని'. 'వేదాంత దర్శనం' వ్రాసిన మహనీయుడు 'బాదరాయణుడు'. మొట్టమొదటగా న్యాయశాస్త్రాన్ని రూపొందించిన విజ్ఞాని 'గౌతముడు'. ఆయన వ్రాసిన శాస్త్రం పేరు "న్యాయదర్శనం". గౌతముడు గొప్ప తత్త్వ శాస్త్రవేత్త. ఇక, గణితశాస్త్ర కోవిదుడుగా భాస్కరాచార్యుని ఘనత ఇంతకుముందే తెలుసుకున్నాం కదా!

భరతుడు : లలిత కళల విజ్ఞానంపై ప్రాచీన మహాఋషులు సామవేదాన్ని వ్రాసిన కొంతకాలానికి 'భరతుడు' అనే మేధావి 'నాట్యము, నాటకాల'పై ఒక గ్రంథాన్ని వ్రాశాడు. ఈయన వ్రాసిన నాట్యశాస్త్రంలో 36 అధ్యాయాలున్నాయి. సంగీత లక్షణాలను చెప్పడమే కాక, రకరకాల వాయిద్యాలను ఎలా వాయించాలో శాస్త్రబద్ధం చేశాడు. నృత్య, సంగీత, నాటక కళలకు ఆదిగురువు 'భరతుడు'.

మనువు : లోకరీతిని, నీతిని శాసించిన మేధావి 'మనువు'. జనజీవనం సవ్యంగా సాగాలంటే ధర్మం, నీతి నియమాలు అవసరం. వీటిని రక్షించడంకోసం ఒక పరిపాలనా వ్యవస్థ, దానిచేతిలో న్యాయం, చట్టం, శిక్ష అనేవి ఉండాలి. ఈ విషయాలకు సంబంధించిన ధర్మసూత్రాలను ఈయన రూపొందించాడు. శ్లోకాల్లో ఉన్న ధర్మ సూత్రాలను 'స్మృతులు' అంటారు. మనువు వ్రాసిన ధర్మసూత్రాలను "మనుస్మృతి" అంటారు. ఇందులో 12 అధ్యాయాలున్నాయి. వీటిలో ప్రజలు అనుసరించవలసిన సామాజిక ధర్మాలు (వర్ణాశ్రమ ధర్మాలు మొదలైనవి), ఆచార వ్యవహారాలు,

నీతినియమాల గురించి వివరించబడింది. సమాజంలో స్త్రీలకు అత్యంత గౌరవప్రదమైన స్థానం ఇవ్వాలని చెప్పు, ఎక్కడ స్త్రీలు పూజించబడతారో అక్కడ దేవతలు ఆనంద నాట్యం చేస్తారన్నాడు.

పాణిని : సంస్కృత భాషకు చక్కని వ్యాకరణ సూత్రాలను వ్రాసిన మేధావి పాణిని. ఆయన వ్రాసిన వ్యాకరణ గ్రంథాన్ని "అష్టాధ్యాయి" అంటారు. ఇది 8 అధ్యాయాలతో, దాదాపు 4 వేల సూత్రాలతో ఉంది. వీటిలో అక్షరాల ఉచ్చారణకు కావలసిన నియమాలు చెప్పాడు. సంధులు మొదలగు వాటిని విపులీకరించాడు. అతి ప్రాచీన కాలంలోనే ఈయన వ్రాసిన ఈ వ్యాకరణ సూత్రాలు, నేటి కంప్యూటర్ భాషా ప్రాతిపదిక సూత్రాలను పోలి ఉన్నాయి. ఈ విషయాన్ని ఆధునిక కంప్యూటర్ శాస్త్రవేత్తలు నిర్ధారణ చేశారు కూడా! ప్రపంచంలో ప్రథమ మరియు అత్యుత్తమ భాషా శాస్త్రవేత్త 'పాణిని'.

చాణక్యుడు : మన చారిత్రిక కాలానికి చెందిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ శాస్త్రవేత్తగా 'చాణక్యుడు' సుప్రసిద్ధుడు. ఈయన "అర్థశాస్త్రం" అనే గ్రంథాన్ని రచించాడు. రాజ్యపరిపాలనా వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ, రక్షణవ్యవస్థ లపై వెలువడిన తొలి గ్రంథం ఇది. ఇందులో నీతిశాస్త్రం కూడా చర్చించబడింది. ఈ గ్రంథంలో 15 అధికరణాలు ఉన్నాయి. వాటిలో 150 అధ్యాయాలున్నాయి. సాంఘిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలపై అమూల్యమైన విజ్ఞానగ్రంథంగా ఇది పండితుల మెప్పు పొందింది. దేశ ప్రజలకు ఉండవలసిన ఆదర్శ లక్షణాలు చెప్పాడు చాణక్యుడు. దేశ సౌభాగ్యానికి రైతులు వెన్నెముకలని వర్ణించాడు. ప్రభుత్వపరంగా నడిపే వ్యవస్థలో పరిశ్రమలు, పాడిపంటలు, వర్తక వ్యాపారాలు ఉండేలా మొట్టమొదటసారిగా రూపకల్పన చేశాడు. రాజులు, ప్రజలు అనుసరించవలసిన విధానాలనూ, నియమాలనూ చెప్పాడు. శ్రేయోరాజ్య (Welfare State) స్థాపనకు కృషిచేశాడు. పోషణకోసం ప్రజలు స్వీకరించవలసిన వృత్తులు, వ్యాపారాలను గురించీ, కూలీలను ఆదరించే పద్ధతులను గురించీ వివరంగా చెప్పాడు. ప్రజల సుఖమే తన సుఖంగా రాజు బ్రతకాలని నిర్దేశించాడు. ఈనాటి ఆర్థికశాస్త్రం (Economics), రాజకీయ శాస్త్రం (Politics), నీతిశాస్త్రాల (Ethics) కు చాణక్యుని "అర్థశాస్త్రమే" మూలం.

ఈవిధంగా నేడున్న ప్రతి శాస్త్రానికీ మన ప్రాచీనకాలంలో ఒక మూల పురుషుడున్నాడు. శాస్త్రీయపరమైన ఎన్నో ప్రాచీన గ్రంథాలు, మన హైందవ ప్రతిభను చాటుతున్నాయి. అత్రి మహర్షి వ్రాసిన 'ఓషధీ కల్పం', అంగీరసుడు వ్రాసిన 'మేఘోత్పత్తి', నాగార్జునుడు వ్రాసిన 'రస సిద్ధాంతం' (Theories of Chemistry), భోజుడు వ్రాసిన 'సమరాంగణ సూత్రధార' (యుద్ధశాస్త్రం), భరద్వాజుని 'అంశుబోధిని'

(సూర్యకిరణాల ప్రభావాన్ని వివరించే గ్రంథం), 'అప్తత్వ ప్రకాశిక' (నీటితత్వాన్ని తెలిపే శాస్త్రం), బోధాయనుని 'ధాతుసర్వస్వం' (పదార్థ విజ్ఞానానికి సంబంధించినది), దీపవివేకం, నారదుడు వ్రాసిన 'ధూమప్రకరణం', శకటాయనుని 'లోహ సంగ్రహం', 'లోహతంత్రం', భరద్వాజుని 'రూపాకర్షణ తంత్రం' (ఫొటోగ్రఫీకి చెందిన శాస్త్రం).... ఇలా ఎన్నో వేలకొలదీ గ్రంథాలు మన ప్రాచీన విజ్ఞానాన్ని చాటుతున్నాయి. వీటిని ఆదరించి పరిశోధించే యదార్థ మేధావులెవరూ నేడు లేరు. అదే మన దుస్థితి!

చిట్టచివరగా మరో 'శాస్త్ర' విషయాన్ని కూడా క్లుప్తంగా చర్చిద్దాం.

కామశాస్త్రం : శృంగారానికి సంబంధించిన శాస్త్రం ఇది. ఇది కూడా సైన్సుకు చెందినదే! ప్రస్తుతం "సెక్స్‌సైన్స్, సెక్స్ ఎడ్యుకేషన్" అని రకరకాలుగా వింటున్నామే! అదే ఇది!! ఈ "సెక్స్‌సైన్స్" లో కూడా మన పూర్వీకులదే పైచేయి. సెక్స్‌సైన్స్‌పై వ్రాయబడిన మొట్టమొదటి ప్రామాణిక గ్రంథం "కామసూత్ర". దీనిని 'వాత్స్యాయనుడు' అనే ప్రాచీన హైందవ మేధావి వ్రాశాడు. ఈ గ్రంథాన్ని ఎందరో విదేశీయులు తమ భాషల్లోకి అనువదించుకున్నారు. "వాత్స్యాయన కామసూత్ర" ఆధారంగా విదేశీయులు శాస్త్రీయపరమైన వీడియో క్యాసెట్లను కూడా రూపొందించుకుంటున్నారు.

సెక్స్ విజ్ఞానం అనేది మనిషికి అత్యంత అవసరమైనది. సరియైన రీతిలో ఆ విజ్ఞానం లేకపోతే నిత్యజీవితాల్లో అనేక అనర్థాలు కలుగుతాయి. ఈ విషయాన్ని గమనించడం వల్లనే విదేశాల్లో సెక్స్‌సైన్సును పాఠశాలల్లో బోధనాంశంగా చేర్చుకున్నారు. మన దేశంలో సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశపెట్టడం గురించి ఆలోచనలు సాగుతున్నాయి. సెక్స్ ఎడ్యుకేషన్ విషయంలో మన జాతి వెనుకబడిందని మాత్రం అనుకోకండి. అందులోనూ ప్రాచీనకాలంనుండీ మనవారు ముందంజలోనే ఉన్నారు. "వాత్స్యాయన కామసూత్ర" గ్రంథం ప్రపంచ ప్రసిద్ధం. సెక్స్ సైన్స్‌లో హైందవుల పరిజ్ఞానానికి పరాకాష్ఠగా నిలిచివుంది ఆ గ్రంథం. వాత్స్యాయన మహర్షి అందులో వ్రాసిన కామసూత్రాల్లో 'వైద్యం' కూడా మిళితమై ఉన్నదని, ఈనాటి శాస్త్రవేత్తలు అంటున్నారు. వాత్స్యాయనుడు నిర్దేశించిన వివిధ శృంగార భంగిమలు 'శరీరంలోని వివిధ భాగాలను ఉత్తేజపరుస్తాయనీ, అలా ఉత్తేజం పొందిన భాగాల వల్ల శరీరం అనేక అనారోగ్యాల నుండి బయట పడుతుందనీ' వివిధ పరిశోధనల ద్వారా నేటి శాస్త్రవేత్తలు నిరూపిస్తున్నారు. సెక్స్ ఉత్తేజాల పరంగా మానవ శరీరాన్ని భాగాలు, ఉపభాగాలుగా వాత్స్యాయనుడు విభజించాడు. 'ప్రతి భాగం లేదా ఉపభాగం యొక్క 'మర్దన' తో శరీరం లోపలి అంగాలను ఉత్తేజ పరచవచ్చునని' ఆయన చెప్పాడు. 'శరీరం బయటి భాగాలను మర్దన చేయడం ద్వారా లోపలి అంగాల పనితీరును మార్చవచ్చునని' ఆధునిక విజ్ఞానులు కూడా ఒప్పుకుంటున్నారు. "కామాన్ని" ఆరోగ్య స్థితిగతులతో అన్వయిస్తూ, గ్రంథ రూపంలోకి మలచిన వాత్స్యాయనుల వారికి మనం సర్వదా

కృతజ్ఞులం. (మన ప్రాచీన దేవాలయ గోపురాలపై మలచబడిన శృంగార భంగిమలు, 'మానవ శరీర ఫిజియో థెరపీ' ని బోధించేందుకు రూపొందించిన మోడల్స్ అనీ, పూర్వకాలంలో దేవాలయాలు వివిధ విద్యలకు ఆలవాలంగా ఉండడం వల్ల 'వైద్యవిద్యకు' అనుగుణంగా ఆ 'భంగిమలు' దేవాలయాలపై చోటు చేసుకుని ఉండవచ్చుననీ ఆధునిక విజ్ఞానవేత్తలు భావిస్తున్నారు.)

శాస్త్రీయపరంగా మన ప్రాచీన మేధావులను గురించి ఇంతవరకూ చర్చించు కున్నాం. ఇంతమంది ప్రాచీన మేధావులున్న దేశం, మరొకటి లేదు. ప్రపంచానికి ఈ విషయం తెలుసు. సకల శాస్త్రాలకూ మూల పురుషుల్ని కన్న దేశం మనది. అందుకే భారతదేశానికి ప్రపంచంలో ఎప్పటికీ ఒక ప్రత్యేక స్థానం ఉంటుంది. (నిజానికి ఇంకా ఎందరో మేధావుల్ని తలచుకోవలసి ఉంది. అయితే మచ్చుకోసం కొద్దిమందిని మాత్రమే ప్రస్తుతం స్మరించుకోవడం జరిగింది. మొత్తం అందరికీ కూడా కృతజ్ఞతలూ, అభివందనాలూ తెలుపుకుంటూ ముందుకు వెళ్దాం.)

★ ★ ★

## 34. మన ప్రాచీన అణువిజ్ఞానం

సృష్టిలో ఉన్నవి రెండే రెండు. 1) శక్తి, 2) పదార్థము. 'శక్తి' విషయం కాస్త ప్రక్కకు పెట్టి, ఇప్పుడు 'పదార్థం' సంగతి చూద్దాం. 'పదార్థం' రెండు రకాలు. (1) జీవ పదార్థం, (2) జడపదార్థం (అనగా జీవంలేనిది); ఏదిఏమైనా మొత్తం పదార్థాలన్నీ మాత్రం పరమాణువుల మయం. ఒక పదార్థాన్ని బాగా చిన్నభాగంగా విభజించుకుంటూ పోతే, చివరకు అది కంటికి కనిపించనంత సూక్ష్మరేణువుగా మిగులుతుంది. అదే ఆ పదార్థానికి చెందిన 'పరమాణువు'. కోట్లకొలదీ పరమాణువులు కూడడంవల్ల పదార్థాలు ఏర్పడుతున్నాయి. జీవులూ, నిర్జీవులూ.... మొత్తం అన్నీ కూడా పరమాణు నిర్మితాలే! అంటే మనుషులు, పశుపక్ష్యాదులు, సరీసృపాలు, కీటకాలు, సూక్ష్మక్రిములు, వృక్షజాతులూ, పాడిపంటలూ మొదలైనవే కాకుండా గాలి, అగ్ని, మొత్తం భూమీ, నీరూ ఇత్యాదులు కూడా పరమాణువులతోనే నిండి ఉన్నాయి. చివరకు నక్షత్రాలు, గ్రహాలు, ఉపగ్రహాలు, ఏస్టెరాయిడ్స్, తోకచుక్కలు మొదలైనవి కూడా పరమాణు సముదాయాలే! పరమాణువు లేనిది 'సృష్టి' లేదని చెప్పవచ్చు.

మనిషికీ, విశ్వానికీ, విశ్వకర్తకూ ఉన్న సంబంధ బాంధవ్యం ఎలాంటిదో తెలుసుకోడానికి చిరకాలంగా ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నాయి. పురాణకాలం

నుండీ ఎందరో దార్శనికులు విశ్వరహస్యాల గురించి తృప్తికరమైన సమాధానాల్ని ఇవ్వడానికి త్రికరణ శుద్ధిగా ప్రయత్నాలు చేశారు. అట్టి ప్రయత్నాలలో కొంతవరకూ సఫలీకృతులైన వారిలో 'కణాద మహర్షి' ఒకరు.

కణాదుడు : అణు విజ్ఞానాన్ని ప్రపంచంలో మొట్టమొదట గ్రంథస్థం చేసిన మహా విజ్ఞాని 'కణాద మహర్షి'. ఈయన అసలుపేరు 'కాశ్యపుడు'. కణాల (అణువుల) గురించి వివరించిన మేధావి కాబట్టి ఈయనకు "కణాదుడు" అనే పేరు వచ్చింది. అణువులు, పరమాణువుల గురించి "వైశేషిక సూత్రం" అనే గ్రంథాన్ని ఈయన వ్రాశాడు. వైశేషిక సూత్ర గ్రంథంలో ఆయన చేసిన ప్రతిపాదనలు సమగ్రవంతంగా ఇప్పటికీ ఆమోదయోగ్యమై ఉండడం ఎంతో విశేషం. ఈయన తొలిసారిగా వాడిన 'పరమాణు పదం' ఈనాటికీ తిరుగులేకుండా ఉంది. గ్రీకు దార్శనికులైన 'లూసీప్పస్, డెమోక్రిటస్' ల సిద్ధాంతాలు, కణాదుని పరమాణు తత్త్వ విజ్ఞానం ముందు వెలవెలపోతున్నాయి.

'పదార్థాన్ని విడగొడితే అణువులు, అణువులను విడగొడితే పరమాణువులు ఏర్పడతాయని'కణాదుడు స్పష్టంగా చెప్పాడు. విభిన్నమైన పరమాణువులు ఎన్నో ఉన్నాయని, వాటి విలక్షణమైన కలయికవల్లనే భూమ్యాకాశాలు, అగ్ని, గాలి, నీరు మొదలైనవన్నీ రూపొందాయని వివరించాడు. పదార్థాలు పరమాణువుల స్థాయికి వచ్చినప్పుడు, ఆ పరమాణువులు తమ విశిష్ట లక్షణాలతో అలరారుతాయని చెప్పాడు. పదార్థాలుగా రూపొందేటప్పుడు రకరకాల పరమాణువులు కలియడం వల్ల వాటికి ప్రత్యేకమైన ధర్మాలు ప్రాప్తిస్తాయనే సత్యాన్ని ఈ శాస్త్రవేత్త అనాడే ప్రకటించడం మనకు ఆశ్చర్యాన్ని కల్గిస్తుంది. రెండు పరమాణువులు కలిస్తే 'ద్వణుకం' అవుతుందనీ, మూడు పరమాణువులు కలిస్తే 'త్రణుకం' అవుతుందనీ ఈయన వివరించి చెప్పాడు. ఈ సిద్ధాంత ప్రకారమే వైశేషిక దర్శన అనుయాయులైన శాస్త్రవేత్తలు లోహవిజ్ఞానాన్ని పరిపుష్టం చేశారు. సృష్టిలో పదార్థాలన్నీ భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సుల కలయికతో ఏర్పడుతున్నాయని వివరించాడు. పదార్థాలన్నింటికీ మూలమైన పరమాణువులు, సృష్టి నిర్మాణంలో ఆధారం అయినందున అవి నిత్యములై ఉంటాయనీ, వాటికి నాశనం లేదనీ చెప్పాడు. తన గ్రంథంలో ఆత్మ-మనుస్సుల గురించి కూడా కణాదుడు వివరణ ఇచ్చాడు. మొత్తంమీద ఈయన "పరమాణువాదము, పరమాణు నిత్యత్వ వాదము, షట్పదార్థవాదము, సృష్టివాదము మొదలయిన వాదాలను ప్రతిపాదించాడు.

(భగవద్గీతలో కృష్ణపరమాత్మ చెప్పిన కొన్ని మాటలు. పరమాణు విజ్ఞానానికి సంబంధించినవే! "అనంతమైన తన 'శక్తి' విశ్వంలోని ప్రతి అణువునా దాగి ఉన్నదనీ,

అనూహ్యమైన రూపంగల తాను అణువుకన్నా అణువుననీ" ఆయన చెప్పడం జరిగింది. అణువుల్లో, పరమాణువుల్లో 'శక్తి' దాగిఉన్న విషయాన్ని ఆధునిక శాస్త్రవేత్తల కంటే ముందుగా శ్రీకృష్ణుల వారు చెప్పారు. పరమాణువులను విచ్ఛిన్నం చేస్తే అందులో నుండి బ్రహ్మాండమైన శక్తి విడుదలవుతుంది. ఆటంబాంబు ప్రయోగప్రక్రియ ఇదే మరి! ఆటంబాంబు కనుగొనని క్రితమే, పరమాణువులో అంతటి బృహత్తరమైన (తన) శక్తి ఉన్నదని శ్రీకృష్ణులవారు చెప్పడం గమనించదగిన విషయం.)

నేడు పరమాణు విజ్ఞానం అనేక విధాల వికసించి మానవాళికి సేవ చేస్తున్నది. శాస్త్రప్రయోజనం సమాజశ్రేయస్సే కావాలని నిర్దేశించిన ఎంతోమంది భారతీయ శాస్త్రవేత్తల్లో కణాద మహర్షి ఒకరు. ప్రళయాన్ని కూడా సృష్టించగల పరమాణువుల విషయంలో మనిషికి ఎంతయినా సంయమనం అవసరం. పరమాణు విజ్ఞానాన్ని మానవాళి అభివృద్ధికి వినియోగించాలి గాని, వినాశనానికి వాడుకోకూడదు. ఇది ప్రపంచం గుర్తించవలసిన సత్యం.

★ ★ ★

## 35. శరీర నిర్మాణ పరిజ్ఞానంలో మన ప్రాచీనత

'శరీర విజ్ఞానము' అంటే కేవలము శరీరశాస్త్రమే కాదు, శరీరంలో ఉన్న మనసునూ, ప్రాణశక్తినీ కూడా లెక్కలోకి తీసుకోవాలి. నేడు మనం శరీరశాస్త్రాన్ని, మానసిక శాస్త్రాన్నీ కూడా అధ్యయనం చేస్తున్నాం. అయితే అంతమాత్రాన మనం సంపూర్ణంగా శరీర విజ్ఞానాన్ని తెలుసుకుంటున్నట్లు కాదు. శరీర విజ్ఞానంలో శరీరశాస్త్రం, మానసిక శాస్త్రాలతో పాటూ 'అంతర్గత శక్తుల విజ్ఞానం' కూడా ఉంది. శరీరమందలి అంతర్గత శక్తుల విజ్ఞానం తెలియాలంటే "ఆధ్యాత్మిక విద్య" అవసరం. ఈ ఆధ్యాత్మిక విజ్ఞానం, నేటి మన విద్యావ్యవస్థలో శూన్యం. అందువల్లనే అంతర్గత శక్తులంటే ఏమిటో, మనకు తెలియకుండా పోతోంది. అంతర్గత శక్తులలో ప్రముఖమైనది 'ప్రాణశక్తి'. ఈ ప్రాణశక్తిని గురించి మన ఆధునిక సైన్సు ఎలాంటి నిర్వచనం కూడా చెప్పలేకపోతోంది. 'జీవిలోనికి ప్రాణశక్తి ఎలా వస్తుంది? ఎలా పోతోంది? ఎక్కడకు పోతోంది?' ఇలాంటి ప్రశ్నలకు ఆధునిక సైన్సు సమాధానం ఇవ్వలేకపోతోంది. వీటికి సమాధానాలు దొరకాలంటే, మన పురాణ పరిజ్ఞానమే శరణ్యం.

శరీర నిర్మాణ విజ్ఞానం అనేది ఈ ఆధునిక కాలంలో అంతంతమాత్రంగానే ఉంది. పురాణకాలంలో అయితే ఆ విజ్ఞానం అనంతంగా వెల్లివిరిసింది. శరీరం అనేది రక్త, మాంసాల, ఎముకల నిర్మాణమని పురాణకాలం వారికి తెలుసు.

శరీరంలోని మనసు యొక్క తత్వాలను కూడా వారు అధ్యయనం చేశారు. శరీరంలోని షట్చక్రముల (మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రముల) గురించీ, వాటిని ఉత్తేజపరచుట ద్వారా పొందగల దివ్యశక్తుల గురించీ కూడా వారికి తెలుసు. నాడీ మండలము, రక్తప్రసరణ మండలము, జీర్ణమండలము, కండర మండలము, వాయు మండలముల గురించి వారికి చక్కటి అవగాహన ఉంది. ఈ మండలము లన్నింటినీ చక్కగా పనిచేయించుకొనుటకు మన పూర్వీకులు యోగాసనాలను రూపొందించుకున్నారు.

యోగాసనాలు, సూర్యనమస్కారాలూ, నిష్ఠ, ఏకాగ్రత, తపస్సు మొదలగు ప్రక్రియల ద్వారా మనిషి ఎంతో శక్తినీ, తేజస్సునూ, ఆరోగ్యాన్నీ, ఆయువునూ పొందవచ్చునని మన పురాణకాల ఋషులు నిరూపించారు. శరీరం అనేది పంచభూతాల సమ్మేళనం అనే విషయాన్ని వారు స్పష్టంగా చెప్పారు. ఈ విషయం ఆధునిక శాస్త్రవేత్తలకు సరిగా తెలీదు.

శరీర నిర్మాణం, పోషణ, రక్షణ ఇవన్నీ వేదాల్లో చర్చించబడ్డాయి. శరీరానికి వచ్చే రోగాలు, వాటి కారణాలు, చికిత్సలూ కూడా చాలా వివరంగా ఉన్నాయి. శరీర విజ్ఞానం, ఆరోగ్యాలపై వేదకాలంలో రూపొందింది 'ఆయుర్వేదం'. శరీరం లోపల ఏయే అవయవాలున్నదీ, అవి ఎలా పనిచేస్తున్నదీ వేదాల్లో వివరించబడింది. శరీరంలోని వివిధ నాడుల గురించి కూడా తెలుపబడింది. మానవ దేహంలోని ఎముకల సంఖ్యా వివరం కూడా చెప్పబడింది. మానవ శరీరంలో ఎముకల సంఖ్య 360 అని వేదాల్లో చెప్పబడింది. అయితే ఆధునికులు మాత్రం మానవుని ఎముకల సంఖ్య 206 మాత్రమే అని చెప్తారు. ఈ తేడాకు కారణం ఉంది. వేదకాలంలో 'ఎముకల లెక్కింపు' ఒక ప్రత్యేక పద్ధతిలో ఉండేది. కొన్నికొన్ని ఎముకలను 'పూర్వభాగం, ఉత్తరభాగం' అని లెక్కించేవారు. అంటే ఒక తొడ ఎముక ఉందనుకోండి. ఆధునికులు దాన్ని ఒకే ఎముకగా చెప్తారు. వేదఋషులు మాత్రం ఆ ఎముక పై సగభాగాన్నీ 'పూర్వభాగం' అనీ, క్రింది సగభాగాన్నీ 'ఉత్తరభాగం' అనీ (వారి సౌలభ్యం కోసం) లెక్కించుకునేవారట. అనగా ఒకే తొడ ఎముకను రెండు ఎముకలుగా (పూర్వ తొడఎముక, ఉత్తర తొడఎముకలుగా) లెక్కవేసేవారన్నమాట. ఈ పద్ధతి వల్ల ప్రాచీన కాలానికీ, ఇప్పటికీ ఎముకల సంఖ్యలో తేడా కన్పిస్తుంది. (ఇంతేకాదు, మరో విషయం కూడా ఉంది. చిన్నతనంలో ఎముకల సంఖ్య ఎక్కువగా ఉంటుంది. మనం ఎదిగే కొలదీ శరీరంలో కొన్ని చోట్ల రెండుగా ఉన్న ఎముకలు కలిసిపోయి 'ఒకే ఎముకగా' రూపొందడం జరుగుతూ ఉంటుంది. ఈ రూపాంతర కారణంగా కూడా ఎముకల లెక్కలో తేడా సంభవించవచ్చు.)

విరిగిన ఎముకలు అతకడం, కట్లు, కుట్లు, ఆపరేషన్లు అన్నీకూడా

వేదకాలంనుండీ ఉన్నాయి. కృత్రిమ అవయవాల్ని ఏర్పాటు చేయడం కూడా మన పూర్వీకులకు తెలుసు. పురాణకాలంలో యుద్ధంలో కాలు కోల్పోయిన ఒక స్త్రీకి, అశ్వనీదేవతలు ఒక ఇనుపకాలు చేయించి అతికారట. మనవారికి ప్రాచీన కాలంలోనే "ప్లాస్టిక్ సర్జరీ" కూడా తెలుసు. మన అయుర్వేదంలో ఈ ప్లాస్టిక్ సర్జరీని "త్వచారాపణం" అనేవారు. శుశ్రుతుడు అనే ప్రాచీన ఆయుర్వేద వైద్యుడు ప్రపంచంలో మొట్టమొదటి "సర్జన్". ఆపరేషన్లు చేయడంలోనూ, ప్లాస్టిక్ సర్జరీ (త్వచారాపణం) యందునూ, కంటి శుక్లాలు తొలగించే వైద్య ప్రక్రియ (Cataract Operation) లందునూ, ఆయన బహు నేర్పరి.

వంశ పారంపర్య రోగాలను గురించీ, వాటి నివారణ గురించీ వేదాల్లో వివరంగా ఉంది. మూత్రం సరిగా కానప్పుడు ఒక గొట్టంతో మూత్రాన్ని బయల్పరచు విధానం కూడా (అధర్వణ వేదం 1-3-7 లో) వివరించబడి ఉంది. గర్భస్రావ నివారణకూ, సంతాన ప్రాప్తికీ, సుఖప్రసవానికీ వైద్యం చెప్పబడింది. గర్భస్థ శిశువు యొక్క నెలవారీ వర్ణన కూడా విపులంగా ఇవ్వబడింది. శరీర ఆరోగ్యానికి ఆయుర్వేద వైద్యం, మూలికా వైద్యం, ప్రకృతి వైద్యాలను గురించి (సూర్యరశ్మితో వైద్యం, యోగాసనాల ద్వారా వైద్యం మొ॥) మహాఋషులు చెప్పారు. ఋగ్వేదానికి ఉపవేదమైన ఆయుర్వేద సంహితలో మానవ శరీర విజ్ఞానం చక్కగా పొందుపరచ బడింది. "శరీరం పంచ భూతాత్మకం. శరీర ఆరోగ్యాన్ని నడిపించేవి వాత, పిత్త, కఫాలు. వాటిలో తేడా వస్తే, అనారోగ్యం కలిగినట్లు లెక్క. ఈ త్రిదోషాలు శారీరకమైనవి. త్రిగుణాలైన సత్వ, రజో, తమో గుణాలలో రజోగుణం, తమో గుణాలను మానసిక దోషాలన్నారు. శరీరంలో 'రస, రక్త, మాంస, మేధస్సు, అస్థికలు (ఎముకలు), మజ్జ (ఎముక మధ్యలో ఉండే పదార్థం), శుక్రము' అనే సప్తధాతువు లున్నాయి. త్రిదోషాలు, ఈ ధాతువులను ప్రకోపింప జేస్తాయి. ప్రకోపించగా కలిగిన 'దోషాలే' వ్యాధులు. ఆ దోషాలను పోగొట్టి, సమస్థితి తేవడమే 'చికిత్స'. ఆయుర్వేదంలో అష్టాంగ చికిత్స లున్నాయి. (1) కాయ చికిత్స (2) బాల చికిత్స (3) గ్రహచికిత్స (4) ఊర్ధ్వాంగ చికిత్స (5) శల్య చికిత్స (6) విష చికిత్స (7) రసాయన చికిత్స (8) వాజీకరణ చికిత్స; ఆయుర్వేద చికిత్స సాంప్రదాయాలు రెండు. 1) బ్రాహ్మ చికిత్స, 2) శైవ చికిత్స.

రక్త ప్రసరణ విధానం (Blood Circulation) గురించి అతిప్రాచీన కాలంలోనే అగ్నివేశ సంహిత యందు 'సంవర్తమానం హృదయం సమా విశతి యత్పు(నః)రా' (చ.సూ.30 అధ్యా. 10 శ్లో, పుట 185), 'సంతత్య భోజ్య ధాతూనాం పరివృత్తిస్తు చక్రవత్' (చ.చి. 15 అధ్యా. 21 శ్లో, పుట 517) అని వివరించబడి ఉంది. ఈ విషయం మనం పట్టించుకోకుండా, క్రీ.శ. 16౨౦లో 'విలియం హార్వే' అనే విదేశీయుడు రక్తప్రసరణ విధానాన్ని కనుగొన్నాడని భ్రమపడుతున్నాం. (శ్రీ వేటూరి శంకరశాస్త్రి.

శ్రీ ముదిగొండ గోపాలరావుల "వైద్యక శరీర శబ్దకోశం" అనే గ్రంథంలో ఈ వివరం ఇవ్వబడింది.)

మానవ శరీరంలో అతిముఖ్య భాగమైన మెదడు యొక్క నిర్మాణాన్నీ, పనితనాన్నీ ఆధునికులు ఇప్పటికీ సరిగా అర్థం చేసుకోలేకపోతున్నారు. మన ప్రాచీన ఋషులు మాత్రం మెదడును సంపూర్ణంగా తమ అధీనంలోకి తెచ్చుకుని దివ్యత్వాన్ని (దివ్యదృష్టి మొదలగు శక్తులను) పొందగలిగారు.

శరీరానికీ, మనసుకూ చాలా దగ్గర సంబంధం ఉంది. మనసు పరిపూర్ణమైన నిశ్చలతతో ఉంటేనే శరీర ఆరోగ్యం సాధ్యమౌతుంది. అంటే మనిషికి ముందుగా మానసిక ప్రశాంతత ముఖ్యమన్నమాట. ఆధునిక కాలంలో శరీర ఆరోగ్యానికి మాత్రమే మందులున్నాయి. నేటి సైన్సు మానసిక ప్రశాంతతను కల్గించలేకపోతోంది. మానసిక ప్రశాంతతకు సరైన మందు 'ఆధ్యాత్మికత' ఒక్కటే! దీని ద్వారా సకల ఆరోగ్య సిద్ధీ కలుగుతుంది. ఈ 'విషయ విజ్ఞానాన్ని' మన ప్రాచీన ఋషులు తెలుసుకుని, అనుభవించి, గ్రంథాల ద్వారా మనకు అందించడం కూడా జరిగింది. దాన్ని సరిగా అర్థం చేసుకోలేక మనం ఇంకా అజ్ఞానంలోనే ఉన్నాం.

పుట్టినప్పటినుండీ చనిపోయేవరకూ శరీరాన్ని సుఖప్రదంగా, ఆరోగ్యవంతంగా ఎలా ఉంచుకోవచ్చునో మన ప్రాచీన మేధావులకు బాగా తెలుసు.

## సాధారణ మరణావస్థలో నోట్లో తులసి తీర్థం ఎందుకు పోస్తారు?

వాత, పిత్త, కఫాలలో తేడాలు రాకుండా చూసుకోవడం ద్వారా ఆరోగ్యాన్ని చాలావరకూ రక్షించుకోవచ్చునని ఆనాటివారికి తెలుసు. సాధారణంగా సహజమైన మరణావస్థలో కఫం యొక్క ప్రభావం ఎక్కువౌతుంది. అందువల్ల గొంతులోని, ఊపిరితిత్తులలోని కఫం, దేహాన్ని విడిచి పోవాలనుకుంటున్న ప్రాణశక్తికి ఇబ్బంది కల్గిస్తూ ఉంటుంది. దీనివల్ల మరణావస్థలో ఉన్న జీవుడికి విపరీతమైన ఆయాసం కలుగుతుంది. సులువుగా ప్రాణం పోయే వీలులేక అతను చాలా ఇబ్బందికి లోనౌతూ ఉంటాడు. మరణావస్థలో ఈ బాధను తొలగించేందుకే, అతని నోట్లో తులసి తీర్థం పోయాలనే ఆచారాన్ని మన పూర్వీకులు పెట్టారు. తులసిరసం కఫ దోషాన్ని నివారిస్తుంది. ఈ కారణంగా అతని శరీరంలోని 'ప్రాణశక్తి' ఏ ఇబ్బందినీ ఎదుర్కోకుండా బయటకు రాగలుగుతుంది. ఏ ఇబ్బందీ లేని సహజ మరణాన్ని పొందుతుంది జీవి. ఈ విధంగా మన పూర్వీకులు చివరకు చావులో కూడా శరీర సుఖాన్ని కల్పించే ఆచారాన్ని ఏర్పరచారు.

★ ★ ★

# 36. పాదరసం నుండి బంగారం తయారీ

'పరమాణువులచే "మూలకాలు" ఏర్పడ్డాయనీ, ఆ మూలకాల సంయోగాల వల్ల ఇతర పదార్థాలు ఏర్పడతాయనీ' ఆధునిక విదేశీ శాస్త్రవేత్తలు కనుగొన్నట్లుగా మనం పాఠాల్లో చదువుకున్నాం. మూలకాల యొక్క పరమాణు నిర్మాణాలనూ, వాటి ధర్మాలనూ కూడా విదేశీయులే కనిపెట్టినట్లు మన పాఠ్యగ్రంథాల్లో ఉంది.

'మెండలీఫ్' అనే రష్యన్ శాస్త్రవేత్త "మూలకాల ఆవర్తన పట్టిక"ను తయారు చేశాడు. దగ్గరి లక్షణాలు, ధర్మాలూ కలిగిన మూలకాలు ఈ పట్టికలో ఒక క్రమ పద్ధతిగా అమర్చబడ్డాయి. ఆవిధంగా దగ్గరి లక్షణాలున్న 'పాదరసం (Hg), బంగారం (Au)' మెండలీఫ్ ఆవర్తన పట్టికలో ప్రక్కప్రక్కగా వస్తాయి.

| | ఎలక్ట్రాన్లు | ప్రోటాన్లు | న్యూట్రాన్లు |
|---|---|---|---|
| పాదరస పరమాణువులో | 80 | 80 | 121 |
| బంగారం పరమాణువులో | 79 | 79 | 118 |

| | పరమాణు సంఖ్య | పరమాణు భారం |
|---|---|---|
| పాదరసం | 80 | 200.59 |
| బంగారం | 79 | 196.97 |

పాదరస పరమాణువులో నుండి 1 ప్రోటానును తీసివేస్తే 'బంగారం ఐసోటోపు' వస్తుంది. ఆ బంగారం ఐసోటోపు నుండి 1 ఎలక్ట్రాన్‌ను, 3 న్యూట్రాన్లనూ తీసివేస్తే 'అసలు సిసలు బంగారం పరమాణువు' వస్తుంది. ఈ విధంగా పాదరసాన్ని 'బంగారంగా' మార్చివేయవచ్చు. ఒక మూలకాన్ని దాని దగ్గరి ధర్మాలున్న 'మరో మూలకంగా' ఇలా మార్చవచ్చునని ఆధునిక శాస్త్రవేత్తలు కనుగొన్నారు. (ఆధునిక కాలంలో పరమాణు విజ్ఞానం బాగా అభివృద్ధి చెందిన మీదట పాదరసాన్ని 'బంగారం' గా మార్చవచ్చని తెలుసుకున్నారు.)

## ఈ ప్రక్రియ మనకు పాతదే!

వేదకాలంలో మన ఋషీశ్వరులు, పాదరసంనుండి బంగారాన్ని తయారు చేసేవారు. ఈ పద్ధతిలో బంగారాన్ని తయారు చేసేవారిని 'రసవాదులు' అనేవారు.

బంగారం తయారీకి మన మహర్షులు 'పాదరసాన్నే' ఎందుకు ఎన్నుకున్నారో ఒకసారి ఆలోచించండి. ఆ రెండు మూలకాల పరమాణు ధర్మాలూ దగ్గరలో

ఉన్నాయని వారికి తెలుసన్నమాట! అంతేకాదు. 'దగ్గరి ధర్మాలుంటేనే ఒక మూలకాన్ని మరో మూలకంగా మార్చడం తేలిక' అనికూడా వారికి తెలుసని అర్థమౌతోంది. అందువల్లనే బంగారం తయారీకి, దాని దగ్గరి ధర్మాలున్న పాదరసాన్ని ఎన్నుకున్నారు. దీన్నిబట్టి ప్రాచీన ఋషులకు "మూలకాలను గురించీ (వాటి లక్షణాలు, ధర్మాలు గురించి), పరమాణు నిర్మాణాలను గురించీ, ఎలక్ట్రాన్ విన్యాసాలను గురించీ, ప్రోటాన్, న్యూట్రాన్‌ల అమరికలను గురించీ" తెలుసునని అర్థమౌతోంది.

మెండలీఫ్ "ఆవర్తన పట్టిక"ను తయారుచేసే వరకూ పాదరసం, బంగారాల పరమాణువులకు దగ్గరి లక్షణాలున్నాయని ఆధునికులకు తెలీదు. మెండలీఫ్ కంటే కొన్ని వేల సంవత్సరాల క్రితమే మన ఋషులకు ఈ విషయాలన్నీ తెలుసు. ఎంత విచిత్రమో చూడండి మరి!

అనంతర చారిత్రిక కాలంలో వేమన (యోగి) కూడా పాదరసం నుండి బంగారాన్ని తయారు చేయడం నేర్చుకున్నాడని చెప్తారు.

మూలకాలను గురించిన పరిజ్ఞానం పాతదేనని ఇందుమూలంగా తెలుస్తోంది.

★ ★ ★

## 37. మహాత్ముల తేజస్సు - కిర్లియన్ ఫొటోగ్రఫీ

సృష్టియందలి ప్రతి పరమాణువులోనూ (దైవ) శక్తి ఉందనేది "ప్రాచీన హైందవ విజ్ఞాన సిద్ధాంతం". నిర్జీవులకంటే 'జీవుల్లో' ఆ శక్తి హెచ్చు స్థాయిలో ఉంటుంది. అందువల్లనే వాటి సామర్థ్యం కూడా హెచ్చు. జీవుల్లోనూ.... అందునా మానవునిలో ఉన్న శక్తి, మరీ అపారం. మానవుని తయారీ అనేది సృష్టిలోనే ఒక అద్భుతం.

హెచ్చుగా (దైవ) శక్తి ఉన్న కారణాన, మానవునికి ఒక దివ్య తేజస్సు ఉంది. అది అతని "ప్రాణశక్తి". ఆ శక్తి అతని శరీరాన్ని కూడా దాటి, కొంతవరకూ గాలిలో ప్రసరిస్తూ ఉంటుంది. తల దగ్గరయితే ఆ శక్తి మరింత హెచ్చుగా ఉంటుంది. అయితే మనిషి చుట్టూ ఉండే ఈ శక్తిక్షేత్రం మన కళ్ళకు మామూలుగా కనపడదు. ఈ విషయాలన్నీ ఆధునిక శాస్త్రవేత్తలు కూడా నిర్ధారణ చేశారు. ఈ శక్తిక్షేత్రం బలంగా ఉన్నవారు ఇతరులను హెచ్చుగా ఆకట్టుకోగలుగుతారని శాస్త్రవేత్తలు తేల్చారు.

### కిర్లియన్ ఫొటోగ్రఫీ

'కిర్లియన్ ఫొటోగ్రఫీ' పేరిట ఒక ప్రత్యేకమైన ఆధునిక ఫొటోగ్రఫీ విధానం ఉంది. ఈ ఫొటోగ్రఫీ ద్వారా మనిషికి సంబంధించిన 'తేజస్సును' అనగా 'శక్తిక్షేత్రాన్ని'

ఫొటో తీయడం సాధ్యం. ఈ శక్తిక్షేత్రం తలవద్ద మరింత బలంగా ఉంటుందని చెప్పుకున్నాం కదా! ఈ ఫొటోగ్రఫీ ద్వారా మనిషిలోని తేజస్సును అతని తలవద్ద స్పష్టమైన "కాంతివలయం" గా చూడవచ్చు. ఈ కాంతివలయం యొక్క స్పష్టత, అతనిలోని తేజస్సును బట్టి ఉంటుంది. హెచ్చు తేజస్సు కలిగివున్న వ్యక్తికి, చాలా ప్రకాశవంతమైన కాంతివలయం ఏర్పడి ఉంటుంది. వ్యక్తులలోని అంతర్గత శక్తుల హెచ్చుతగ్గుల్ని బట్టి వివిధ రంగుల్లో వ్యక్తుల తేజస్సులు, ఈ ఫొటోగ్రఫీలో గోచరమౌతాయి. వ్యక్తిలోని 'తేజస్సును' (లేదా ప్రాణశక్తిని, లేదా జీవశక్తిని) చూపగలిగే ఈ విధమైన ఫొటోగ్రఫీనే "కిర్లియన్ ఫొటోగ్రఫీ" అంటారు. దీన్ని విదేశాల్లో ఆధునిక కాలంలో కనుగొనడం జరిగింది. అయితే ఈ కిర్లియన్ ఫొటోగ్రఫీ లాంటివి లేకుండానే, మనిషిలోని తేజస్సును గురించి మన ప్రాచీన హైందవులకు తెలుసు. 'మామూలు కళ్ళకు కనిపించని విధంగా జీవులనుండి తేజస్సు వెలువడుతుందని, ఆ తేజస్సు తలభాగంలో ఎక్కువగా ఉంటుందనీ' వారికి తెలుసు. తపశ్శక్తితోనూ, ధార్మిక జీవనంతోనూ మానవులలోని ఈ తేజస్సు పెరుగుతుంది. అందువల్లనే మహాత్ములకు ఈ తేజస్సు యొక్క ప్రకాశం "మరీ హెచ్చు" అని మన పూర్వీకులు గ్రహించగలిగారు. ఈ కారణంగానే మహావ్యక్తుల చిత్రపటాల్లో శిరస్సుల వద్ద "కాంతి వలయాన్ని" చిత్రీకరించేవారు. వ్యక్తుల కంటే ఘనమైనవాడు కనుక భగవంతుని చిత్రపటానికి కూడా ఈ కాంతివలయాల్ని శిరస్సువద్ద సూచిస్తూ వచ్చారు. దేవీదేవతా విగ్రహాలన్నింటికీ కూడా ఈవిధంగా చిత్రీకరించడం పూర్వంనుండీ మన సాంప్రదాయం.

ఏ స్కోపులూ, ఏ ఫొటోగ్రఫీలూ అవసరం లేకుండానే మనిషిలోని తేజస్సును గ్రహించగలిగిన మన ప్రాచీన హైందవులు, మహా మేధావులే మరి!

★ ★ ★

## 38. హిప్నాటిజం - వశీకరణ

హిప్నాటిజం అనేమాట ఈమధ్య తరచుగా వింటున్నాం. హిప్నాటిజం అంటే ఏమిటో ముందుగా తెలుసుకుందాం. తన మాటల ప్రభావం చేత ఎదుటివ్యక్తిని లోబరుచుకోవడమే హిప్నాటిజం ప్రక్రియ. ఎదుటివాళ్ళను హిప్నటైజ్ చేసేవారిని 'హిప్నాటిస్ట్' అంటారు. ప్రాథమిక దశలో తనకు సహకరించిన వ్యక్తుల్ని అతను 'హిప్నటైజ్' చేయగలుగుతాడు. హిప్నాసిస్‌కు లోనైన తర్వాత వారంతా హిప్నాటిస్ట్ మాటలకు అనుగుణంగా ప్రవర్తిస్తారు.

తనకు సహకరించే వ్యక్తిని హిప్నాటిస్ట్ వశం చేసుకోగలుగుతాడు. అలాకాకుండా ఎదుటివ్యక్తి సహకారం లేకపోయినా సరే, అతన్ని వశపరచుకునే విధానం ఉంది. అదే "వశీకరణం". ఈ 'వశీకరణ' ప్రస్తావన మన ప్రాచీన గ్రంథాల్లో ఉంది. అధర్వణ వేదంలో వశీకరణ మంత్రాలున్నాయి.

ఎదుటివ్యక్తిని వశపరచుకోవడంలో హిప్నాటిజం అనేది 'చిన్నమెట్టు' అయితే, వశీకరణం అనేది 'పెద్దమెట్టు'. హిప్నాటిజానికి ప్రాథమిక దశలో ఎదుటి వ్యక్తి సహకారం అవసరం. వశీకరణకయితే ఏదశలోనూ కూడా ఎదుటివ్యక్తి సహకారం అక్కర్లేదు. కేవలం 'దృష్టి శక్తితోనూ, శబ్దతరంగాల (మంత్ర) శక్తితోనూ, భావప్రసార బలంతోనూ వశపరచుకోవడం జరుగుతుంది. వశీకరణ ప్రక్రియలో మరో విశేషం కూడా ఉంది. వ్యక్తి దూరంలో ఎక్కడో ఉన్నా కూడా, ఆవాహన ప్రక్రియ ద్వారా అతన్ని వశపరచుకోవచ్చు. వశీకరణ మంత్రాలను ప్రయోగించే వ్యక్తియొక్క అంతర్గత శక్తి వల్ల 'భావప్రసార బలంతో' ఇది నెరవేరుతుంది. (మానసికశక్తి వల్ల 'మన భావం' వాతావరణంలో వ్యాపిస్తుందని ఇంతకుముందు తెలుసుకున్నాం. మంత్రాలకున్న శక్తిని గురించి కూడా ఇంతకు ముందు చర్చించుకున్నాం.) 'అయినా ఇదంతా జరిగే పనేనా?' అని కొంతమంది అనుకోవచ్చు. ఏదయినా అనుభవంలో లేనంతవరకూ వింతగా ఉంటుంది. ఆ తర్వాత, అది సహజంగా అనిపిస్తుంది. హిప్నాటిజం కూడా ఒకవిధమైన వశీకరణమే కదా! చెప్పాలంటే, హిప్నాటిజం కూడా నమ్మశక్యంగా ఉండదు మరి. కానీ అది మన కళ్ళముందు జరుగుతోంది. ఒక వ్యక్తి, మరోవ్యక్తికి వశం కాబడి మనకళ్ళముందే కట్టుబానిసలా వ్యవహరిస్తున్నాడు. హిప్నాటిజానికి లోనైన వ్యక్తి, హిప్నాటిస్ట్ ఏంచెప్తే అది చేస్తున్నాడు. హిప్నాటిస్ట్ మాట తప్పించి ఇతరములేవీ అతని చెవికెక్కవు. హిప్నాటిస్ట్ అతనిచేత పచ్చిమిరపకాయలు తినిపించి, వాటి రుచి తియ్యగా ఉందని చెప్పించగలుగుతున్నాడు. హిప్నాటిజం ద్వారా 'లేని ఆకలిని పుట్టించవచ్చు. ఉన్న ఆకలిని పోగొట్టవచ్చు. నిద్ర పట్టించవచ్చు. నిద్ర వదిలించవచ్చు. అలాగే, లేని భయాన్ని పుట్టించవచ్చు. ఉన్నటువంటి భయాన్ని పోగొట్టవచ్చు. ఈవిధంగా హిప్నాటిజం ద్వారా అనేక అసాధ్యాలను సాధ్యం చేయవచ్చు. అయితే చాలావరకూ హిప్నాటిజం అనేది శాశ్వతప్రక్రియ మాత్రం కాదు. హిప్నాసిస్ (హిప్నటైజ్ కాబడిన పరిస్థితి) ని మనసూ, శరీరమూ రెండూ కూడా చిరకాలం ఒప్పుకోగలిగితే, అటువంటి హిప్నాసిస్ కొంతవరకూ శాశ్వతం కావచ్చు. హిప్నాటిజంలో వలెనే వ్యక్తులను కృత్రిమ నిద్రలోనికి పంపించగల పద్ధతి వేదాల్లో ఉంది. 'సహస్రశృంగ' అనే సూక్తంతో ఎవరికైనా సరే గాఢనిద్ర వచ్చేలా చేయవచ్చునని అధర్వణ వేదం చెప్తోంది.

సాధారణ స్థితిలో తనకు సాధ్యంకాని కార్యాన్ని కూడా, హిప్నటైజ్ కాబడిన వ్యక్తి చేయగలుగుతున్నాడు. అంటే మనిషి లోపల చాలా అంతర్గత శక్తి ఉందని తెలుస్తోంది. హిప్నటైజ్ చేయబడినప్పుడు ఆ అంతర్గత శక్తి బయటపడుతుంది. అంటే ఆ వ్యక్తిలోని అంతర్గత శక్తిని, హిప్నాటిస్ట్ లేపగలుగుతున్నాడన్నమాట. ఆధునిక కాలంలో ఈ హిప్నాటిజం వింతలన్నీ మనం స్వయంగా చూడగలుగుతున్నాం. దీన్నిబట్టి వశీకరణం అనేది వింతేమీ కాదని అనిపిస్తుంది.

ఈ హిప్నాటిజం, వశీకరణం అనే ప్రక్రియల ద్వారా సమాజానికి మంచీ చేయవచ్చు, చెడూ చేయవచ్చు. అయితే మంచిని పెంపొందించడానికే ఇలాంటి వాటిని మనం ఉపయోగించుకోగలగాలి. అలాంటి కృషి నేడు కొంతవరకూ సాగుతోంది. హిప్నాటిజం ద్వారా కొంతమంది మేధావులు ఎన్నో మానసిక, శారీరక రుగ్మతలకు చికిత్సచేసి విజయం సాధిస్తున్నారు. సాధారణంగా మానసిక రోగాలకు 'బలహీనమైన మనస్సే' కారణం. అటువంటి బలహీన మనస్కులు త్వరగా హిప్నాసిస్‌కు లోనౌతారు. తద్వారా హిప్నాటిస్ట్ ఇచ్చే (ఆదేశాల, సలహాల) చికిత్స ద్వారా వారు మానసిక ఆరోగ్యాన్ని పొందుతారు. మానసిక ఆరోగ్యాన్ని సరిచేయడం ద్వారా కొన్ని శారీరక రుగ్మతల్ని కూడా హిప్నాటిస్ట్‌లు నయం చేస్తున్నారు. ఈ దిశగా హిప్నాటిజాన్ని, ఒక చక్కటి వైద్యప్రక్రియగా చెప్పుకోవచ్చు. అయితే హిప్నాటిజానికి లోబడని వ్యక్తులు కూడా ఎంతోమంది ఉంటారు. ఎంత గొప్ప హిప్నాటిస్ట్ అయినా సరే, అందరినీ వశపరచుకోలేడు. దృఢ మనస్కులు హిప్నాటిజానికి లొంగరు. సరిగ్గా పురాణకాలపు వశీకరణంలో కూడా ఇటువంటి పరిస్థితి ఉండేది. శక్తిసంపన్నులయిన మహాత్ములను వశపరచుకోవడం అసాధ్యమని పురాణగాథలను బట్టి తెలుస్తోంది.

ఈ కలికాలంలో కళ్ళముందు కనపడే అతి విచిత్రాల్లో ఈ హిప్నాటిజం ఒకటి! నమ్మజాలని హిప్నాటిజాన్ని నమ్మినప్పుడు 'పురాణకాల వశీకరణ విద్య'ను కూడా నమ్మవలసి ఉంటుంది. హిప్నాటిజం అనే 'చిన్న' మహిమ, ఆధునిక కాలంలో కూడా సాధ్యమౌతోంది. వశీకరణం అనే 'పెద్ద' మహిమ, పురాణకాలానికి సాధ్యమే మరి! హిప్నాటిజానికి చెప్పే సైంటిఫిక్ రీజనింగ్, పురాణకాల వశీకరణకూ సరిపోతుంది. కంటికి కన్పించని చిత్రాలెన్నో సైన్స్ ద్వారా జరుగుతున్నాయి. ఆధునిక వైర్లెస్ సిస్టం, రిమోట్ కంట్రోల్ సిస్టం మొదలైనవాటిని ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు. ఇలాంటి వాటినిబట్టి ఆలోచిస్తే, పురాణకాలపు వశీకరణ ప్రక్రియ అసాధ్యమైనది కాదని అనిపిస్తుంది.

★ ★ ★

# 39. తపస్సు - శాస్త్రీయత

పై అంశంలో హిప్నాటిజాన్ని గూర్చి తెలుసుకున్నాం. ఆశ్చర్యాన్ని కల్గించే విచిత్రమైన సైన్స్ ప్రక్రియ అది! ఒక వ్యక్తిని నిద్రాహారాలకు దూరం చేయగల శక్తి హిప్నాటిజానికి ఉంది. అయితే శాశ్వతంగా ఆ స్థితి సాధ్యంకాదని గుర్తుంచుకోండి. హిప్నాటిజానికి (ఈ సందర్భంలో) మరీ అంత శక్తిలేదు. హిప్నాటిజం ప్రక్రియను ఎదుటివ్యక్తిపై ప్రయోగించడమే కాకుండా, తనపై తానుకూడా ప్రయోగించుకోవచ్చు. దాన్ని "సెల్ఫ్ హిప్నాటిజం" అంటారు. పూర్వకాలంలోని ఋషీశ్వరుల తపస్సుకు ఈ సెల్ఫ్ హిప్నాటిజం అనేది ఉపకరించి ఉంటుంది. నిద్రాహారాల్ని వదిలివేయగల శక్తిని తపస్సు యొక్క "ప్రథమ దశలో" ఈ సెల్ఫ్ హిప్నాటిజం ద్వారా పొందవచ్చు. అనంతర దశలలో కాలక్రమేణా యోగసాధనల ద్వారా సర్వజీవ వ్యాపారాలనుండీ ఋషీశ్వరులు విముక్తులు కాగలుగుతారు. తద్వారా వారికి ఆకలిదప్పులూ, నిద్రా లేని "ఏకాగ్రత-నిష్ఠ" కలుగుతాయి. అప్పుడు తమ ఉనికి కూడా మరచిపోయి, దైవంపై మనోకేంద్రీకరణ చేస్తారు. అదే తపస్సు. శరీరాన్ని వేడెక్కించి ఇంద్రియాలను అదుపులో ఉంచుకోడానికి చేసే సాధనే "తపస్సు" అని వేదాలు చెప్తున్నాయి. ఈ తపస్సు యొక్క ఏకాగ్రత ద్వారా ఋషీశ్వరులు, తమ అంతర్గత శక్తులను వృద్ధి చేసుకోగలిగి 'దివ్యశక్తులను' సంపాదిస్తారు. అదే తపశ్శక్తి! ఈ తపశ్శక్తితో మహర్షులు అనేకానేక అద్భుత కార్యాలను చేయగలిగేవారు.

## ఘోర తపస్సు ప్రకృతి శక్తుల్ని కల్లోలపరచగలదా?

"ఘోరమైన తపస్సు ముల్లోకాలనూ వణికించిందనీ, ప్రకృతిని తలక్రిందులు చేసే ఉత్పాతాలను సృష్టించిందనీ" పురాణాల్లో అనేకచోట్ల కన్పిస్తుంది. అదంతా అతిశయోక్తి కాదు. యథార్థమే! విశ్వాన్ని కదిలించగల శక్తి 'ఘోరతపస్సుకు' ఉంది. అదెలాగో పరిశీలిద్దాం. ప్రతి మనిషి చుట్టూ ఒక 'శక్తిక్షేత్రం' ఉంటుందనీ, 'దాన్ని కిర్లియన్ ఫొటోగ్రఫీ ద్వారా మాత్రమే చూడగలమనీ, మహాత్ములకు ఈ శక్తిక్షేత్రం చాలా బలంగా స్థిరంగా ఉంటుందనీ' ఇంతకుముందు చెప్పుకున్నాం. తపస్సు అనే ప్రక్రియ ద్వారా ఈ శక్తిక్షేత్రం యొక్క తేజం మరింత ప్రకాశవంతమై, విశ్వంలోని అనంత శక్తులవైపు దూసుకుపోతుంది. తపస్సు ఘోరంగా పరిణితి చెందేకొలదీ అతని తేజం బ్రహ్మాండంగా ప్రజ్వరిల్లుతూ భూమండలాన్నీ, వాతావరణాన్నీ, గ్రహాలనూ, నక్షత్ర కుటుంబాలనూ దాటి, విశ్వశక్తుల జనస్థానం వైపు సాగిపోతుంది. తత్కారణంగా విశ్వంలోని అద్వితీయమైన అదృశ్యశక్తులన్నీ (అతని తపశ్శక్తివల్ల) కల్లోలితమౌతాయి.

మహర్షుల ఘోర తపస్సుకు విశ్వంలోని లోకాలు తల్లడిల్లడం అంటే ఇదే మరి!

'ఏకాగ్రతతో చేసే యోగసాధన ద్వారా చక్కటి ఆరోగ్యాన్ని పొందవచ్చుననీ, మనలోని సర్వశక్తులనూ పెంపొందించుకోవచ్చుననీ' శాస్త్రీయంగా నిరూపణ అయింది. శ్వాసక్రియను నియంత్రించడం ద్వారా ఆయువును పెంచుకోవచ్చుననే విషయాన్ని కూడా ఆధునిక శాస్త్రవేత్తలు అంగీకరిస్తున్నారు.

ఆకలి దప్పులు లేకుండా, కంటికి కునుకు రాకుండా అనేక సంవత్సరాల పాటు తపస్సులు చేయడం పురాణాల్లో చాలాచోట్ల కన్పిస్తుంది. అయితే ఇదేం అసాధ్యం కాదు. మనిషిలోని అంతర్గత శక్తులను మేల్కొలపడం ద్వారానూ, కొన్ని నియమ నిబంధనలను ఆచరించడం ద్వారానూ తపస్సులు నిరాటంకంగా కొనసాగించవచ్చు. తపస్సు అనేది పూర్తిగా శాస్త్రీయమైన ప్రక్రియ.

## తపస్సు దీర్ఘాయువును కల్గిస్తుందా?

వేలవేల సంవత్సరాల పాటు తపస్సులు చేసిన శక్తివంతులు, మనకు పురాణాల్లో కన్పిస్తారు. మృత్యువును దూరానికి నెడుతూ, దీర్ఘాయువును పొందగల శక్తి వారికెలా వచ్చిందో తెలుసుకుందాం.

మహాభారతంలోని ఉద్యోగపర్వంలో ధృతరాష్ట్ర మహారాజు, సనత్సుజాత మహర్షితో సంభాషిస్తూ మృత్యువును గురించి వివరణ అడుగుతాడు. ఆ మహర్షి దానికి జవాబిస్తూ 'ధృతరాష్ట్రా! కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ క్రియాకలాపాల వలన జీవులలో నిర్మాణాత్మక, విచ్ఛేదనాత్మక క్రియలు అవిశ్రాంతంగా సాగిపోతూనే ఉంటాయి. అనియంత్రితమైన ఈ జీవక్రియను నియంత్రించగల యోగులు దీర్ఘాయుష్మంతులవుతున్నారు. అలాకాకుండా సుఖభోగాలను అదేపనిగా అనుభవించే వారు, తమంత తాముగా మృత్యువుకు చేరువౌతున్నారు. ఇదే జీవన్మరణాల కథ" అని చెప్తాడు.

యోగులు తపస్సు ద్వారా పైవిధంగా దీర్ఘాయువును పొందుతున్నారని, ఇందుమూలంగా తెలుస్తోంది.

ఇహలోక విషయాల్లో మునిగితేలే ఈనాటి మానవులకు 'తపస్సు' అనేది అసాధ్యంగానే కన్పిస్తుంది. ఏకాగ్రత, నిష్ఠ అనేది నేటి నాగరిక మానవునికి దుర్లభం. ఈ కారణంగానే అత్యంత శక్తివంతమైన శరీరాన్ని ఉపయోగంలోకి తెచ్చుకోలేక, యాంత్రికంగా యంత్రాలపై ఆధారపడి నరక బాధల దిశగా సాగిపోతున్నాడు.

★ ★ ★

# 40. రాడార్‌లు - దివ్యదృష్టి

కంటి ముందు ఉన్నది కనబడడాన్ని 'దృష్టి" అంటారు. కంటిముందు కాకుండా ఎక్కడో మరోచోట ఉన్న దానిని మనోనేత్రంతో తెలుసుకోవడాన్ని "దివ్యదృష్టి" అంటారు. పురాణాల్లో అనేకచోట్ల మనకు ఈ దివ్యదృష్టి ప్రసక్తి కన్పిస్తుంది. అమిత దైవభక్తి, తపశ్శక్తి గలవారికి ఈ దివ్యదృష్టి ఉన్నట్లు పురాణాల్లో కన్పిస్తుంది. ఎక్కడో ఉన్నదాన్ని ఇక్కణ్ణుంచే గమనించి తెలుసుకోగలగడం చాలా ఆశ్చర్యకరం. మామూలుగా ఆలోచిస్తే ఇది నమ్మశక్యంగా కూడా కనపడదు. అయితే మంత్రాలూ, తపస్సులూ, దివ్యశక్తులూ ఇవన్నీ శాస్త్రీయపరంగా ఎలా యథార్థమో, ఈ దివ్యదృష్టి కూడా అలాగే యథార్థం. దివ్యదృష్టి కలగాలంటే దైవభక్తీ, తపశ్శక్తీ అవసరం. ఇది నేటి (ఆధునిక) మానవాళికి అసాధ్యమే! పురాణకాలంలోని మహనీయులకు మాత్రం అది సుసాధ్యం.

శారీరికంగా, మానసికంగా మనం సాధించుకోలేని అభివృద్ధిని ఈనాడు కొంతవరకూ యంత్రపరంగా సాధించుకుంటున్నాం. కొంతవరకూ దివ్యదృష్టిని పోలిన యంత్రపరిజ్ఞానాన్ని కూడా పొందగలిగాం. నేటి మానవుడు "రాడార్" అనే పరికరాన్ని తయారు చేశాడు. 'రాడార్' అనేది ఆధునిక యాంత్రిక దివ్యదృష్టి కలిగిన పరికరం. దీని గురించి తెలుసుకుంటే, దివ్యదృష్టిని గురించి ఒక అవగాహన వస్తుంది మనకు.

## రాడార్

కంటికి సరిగా తెలియకుండా ఆకాశంలో వెళ్తున్న వస్తువులను గురించి తెలుసుకోడానికి, రేడియో తరంగాలను పంపే యంత్రాన్ని "రాడార్" అంటారు. రాడార్ పంపే తరంగాలు ఆకాశంలోని ఏదయినా వస్తువును తాకితే, అవి తిరిగి వెనక్కి మళ్ళిపోయి 'రాడార్'ను చేరతాయి. అలా చేరడానికి పట్టే సమయాన్ని బట్టి, ఆ వస్తువు ఎంత దూరంలో ఉందో తెలుసుకోగలుగుతారు. ఆకాశంలో ఆ వస్తువు ఉందీ అని నిర్ధారణ కాగానే, రాడార్ నుండి పంపే రేడియో తరంగాలు విస్తృతి (Range)ని పెంచుతారు. దాని ద్వారా ఆ వస్తువు యొక్క 'ఆకారాన్ని' (Shapeను) తెలుసుకోగలుగుతారు. అంతేకాదు. ఆ వస్తువు యొక్క దిశ, వేగం, త్వరణం (Acceleration) కూడా తెలుసుకుంటారు. (యుద్ధంలో శత్రు విమానాల్ని రాడార్‌ల ద్వారా గమనించే పద్ధతి ఇదే!)

రాడార్ మాదిరిగానే 'సోనార్' అనే మరో పరికరం ఉంది.

## సోనార్

ఈ పరికరం ద్వారా అల్ట్రాసోనిక్ శబ్ద తరంగాలను పంపించి, నీటిలో అట్టడుగున ఉన్న వస్తువుల వివరాలు సేకరిస్తూ ఉంటారు. సముద్రాల్లో (శత్రు) జలాంతర్గాములు మొదలగు వాటి ఆచూకీ ఈ విధంగానే తీస్తారు.

## దివ్యదృష్టి నిరూపణ

రాడార్, సోనార్‌ల గురించి ఒకసారి ఆలోచించండి. ఎక్కడో కంటికి అందనంత దూరంలో ఉన్న వస్తువుల యొక్క ఆకారాన్నీ, వేగాన్నీ, దిశనూ స్పష్టంగా ఈ పరికరాలు మనకు అందిస్తున్నాయి. అంటే అనంత దూరంలో ఉన్న దృశ్యాన్ని, క్షణాల్లో మన కళ్ళముందుకు తీసుకువస్తున్నాయన్న మాట. ఋషీశ్వరుల దివ్యదృష్టి కూడా ఇటువంటిదే! వారి యొక్క దివ్యశక్తికి సంబంధించిన కిరణ ప్రసారాలు వారు కోరిన చోటకు ప్రయాణించి, అక్కడి దృశ్యాన్ని వారికి తెలియజేస్తాయి. 'మనుషులనుండి కిరణాలూ, తరంగాలూ వెలువడతాయా?' అని మీకు సందేహం రావచ్చు. ఇది సాధ్యమే! ప్రతి మనిషి చుట్టూ అతని జీవశక్తికి సంబంధించిన తరంగాలుంటాయనీ, వాటి బలం ఆయా వ్యక్తుల మనోశక్తిపై ఆధారపడి ఉంటుందనీ ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఈ శక్తితరంగాల తేజస్సు మహాత్ములకు హెచ్చుగా ఉంటుంది. అది మన కళ్ళకు కన్పించేది కాదు. ('మహాత్ముల తేజస్సు' అనే వ్యాసంలో ఇందుకు సంబంధించిన వివరాల్ని చర్చించుకున్నాం కదా!) తరచి చూస్తే మన కంటికి కన్పించని, ఇంకా ఆధునిక సైన్సు కనిపెట్టని 'అనేక విచిత్రాలు' సృష్టిలో ఉన్నాయి.

దివ్యదృష్టి విషయంలో ఋషీశ్వరుల మేధస్సునుండి వెలువడే కిరణాలు, రాడార్ కిరణాలకంటే అత్యంత శక్తివంతమైనవి. ఆ కిరణాల్ని ఋషీశ్వరులు తాము కోరిన చోటకు పంపించి, వాటిద్వారా అక్కడి దృశ్యాలను తెలుసుకోగలిగేవారు. కోరుకున్నంతనే ఎక్కడెక్కడి దృశ్యాలయినా సరే, వారి మనోఫలకంపై స్పష్టంగా కదలాడేవి. అదే దివ్యదృష్టి.

శాస్త్రీయపరంగా దివ్యదృష్టి అనేది సమ్మతమే! కానీ కనీస త్రికరణ శుద్ధిలేని నేటి మానవులకు మాత్రం అది దుర్లభం.

నిత్య జీవితంలో మన చూస్తున్న టి.వి. ఏంటెన్నాల సంగతి కూడా విచిత్రమైనదే! ఇవి కూడా ఒక విధమైన 'తరంగ దివ్యదృష్టి'ని కలిగి ఉన్నవే! ఎక్కడో ప్రసారమవుతూ గాలిలో వస్తున్న చిత్రాన్ని (Pictureను) గ్రహించగలుగుతున్నాయి. మనం టి.వి. ఛానల్స్ మార్చే కొలదీ, ఆ ఛానల్స్‌కు తగిన తరంగ చిత్రాల్ని పట్టుకుని మన టి.వి.కి అందిస్తున్నాయి.

నేడు మనం ఎన్నిరకాల 'యాంత్రిక దివ్యదృష్టులను' కనిపెట్టినా కూడా, పురాణకాల ఋషీశ్వరుల దివ్యదృష్టి ముందు అవి దిగదుడుపే!

## టెలివిజన్ వంటి చాక్షుషి విద్య

ఉన్నచోటనే కదలకుండా ఉండి, ముల్లోకాల్లో ఎక్కడ ఏం జరుగుతుందో చూడగలిగే విద్య ఒకటి 'మహాభారతంలో' ప్రస్తావించ బడింది. ఆ విద్య పేరు "చాక్షుషి". ఒక విధంగా ఇది దివ్యదృష్టి వంటిదే!

మనం స్థిరంగా ఇంట్లో కూర్చుని టెలివిజన్ ఛానల్స్ మార్చుకుంటూ ప్రపంచ విశేషాలను చూస్తుంటాం. అలాంటి టెలివిజన్ కంటే శక్తివంతమైనది "చాక్షుషి విద్య."

ఈ విద్య, మహాభారతంలో ఎక్కడ ఏ విధంగా ప్రస్తావించబడినదీ తెలుసు కుందాం. లక్క ఇంటినుండి సురక్షితంగా బయటపడ్డ పాండవులు, అడవుల్లో తిరుగుతూ ఉంటారు. ఒక అడవిలో 'అంగారపర్ణుడు' అనే గంధర్వుడు, అర్జునుడిపై కయ్యానికి కాలు దువ్వుతాడు. అర్జునుడు ఆగ్నేయాస్త్రం వేసి, అంగారపర్ణుడి పొగరు అణుస్తాడు. దాంతో అతను అర్జునుడితో స్నేహం చేసి, ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించడం నేర్పమని అడుగుతాడు. అందుకు ప్రతిగా, తనకు తెలిసిన 'చాక్షుషి' అనే విద్యను అర్జునుడికి ఇస్తానంటాడు. ఆ విద్యను పూర్వం 'మనువు', చంద్రుడికి ఇచ్చాడట. చంద్రుడి దగ్గర గంధర్వరాజు విశ్వావసుడు సంపాదించాడట. విశ్వావసుని నుండి తాను ఆ విద్యను పొందినట్లుగా అంగారపర్ణుడు వివరిస్తాడు. చాక్షుషి విద్యవల్ల 'ముల్లోకాల్లోనూ జరిగేది ఏది చూడాలంటే అది చూడవచ్చునట!' ఈ విద్యను పొందేటప్పుడు "షాణ్మాసిక వ్రతం" ఆచరించాలట. అంటే 6 మాసాల పాటు ఒంటికాలిపై తపస్సు చెయ్యాలన్నమాట.. అటువంటి వ్రతం ఆచరించిన శక్తివంతునికే చాక్షుషి విద్య అబ్బుతుందట. ఆ విద్యను గ్రహించి, ఫలింపజేసుకునే శక్తి అర్జునుడికి ఉన్నదని అంగారపర్ణుడు అంటాడు. కానీ అర్జునుడు చాక్షుషి విద్యను తీసుకోకుండానే అంగారపర్ణుడికి ఆగ్నేయాస్త్ర ప్రయోగం నేర్పిస్తాడు.

**దివ్యదృష్టికీ, చాక్షుషి విద్యకూ తేడా :** దివ్యదృష్టి ద్వారా భూత, వర్తమాన, భవిష్యత్ కాలాల విషయాల్ని తెలుసుకోవచ్చు. కానీ చాక్షుషి విద్య ద్వారా, కేవలం వర్తమాన విషయాల్ని మాత్రమే చూడగలగడం సాధ్యం.

చాక్షుషి విద్య గురించి తెలుసుకున్న అనంతరం దివ్యదృష్టి అంశానికి ముగింపు పలుకుతూ, "మన ప్రాచీన ఖగోళ పరిజ్ఞానం"లోకి అడుగుపెడదాం రండి.

★ ★ ★

# మన ప్రాచీన ఖగోళ పరిజ్ఞానం

ఒక విధంగా ఖగోళ విజ్ఞానమే సైన్సుకు పరాకాష్ఠ. ఖగోళ విజ్ఞానంలో ఆధునికుల కంటే పురాణకాలం వారే మిన్న.

ఖగోళ పరిజ్ఞానంలో మన హైందవదేశం ఆదినుండీ ప్రథమ స్థానంలో ఉంది. అయితే మన చరిత్రను వ్రాసిపెట్టిన ఆంగ్లేయ చరిత్రకారులు మాత్రం ఆ విషయాన్ని సరిగా గ్రహించలేకపోయారు. గ్రీకుల కంటే, ఈజిప్ట్ వారి కంటే ఖగోళశాస్త్రంలో హైందవులు వెనుకబడి ఉన్నట్లుగా భ్రమపడ్డారు. నిజానికి ఎన్నో ఖగోళ రహస్యాలను ముందుగా ఆకళింపు చేసుకున్నది మన ప్రాచీనులే! మిగిలిన దేశాల ఖగోళ శాస్త్ర పరిజ్ఞానం కేవలం సూర్యుని గతిమీదనో లేదా చంద్రుని గతిమీదనో ఆధారపడింది. హైందవ ఖగోళ పరిజ్ఞానం మాత్రం సూర్యచంద్ర గతుల సమన్వయ కాలజ్ఞానంపై ఆధారపడి ఉంటుంది.

సృష్టిలో మొట్టమొదటగా ఖగోళాన్ని పరిశీలించిన వారు వేదఋషులు. వారు కనుగొన్న అనేక ఖగోళ విషయాలు ఋగ్వేదంలో గ్రంథస్థం చేయబడ్డాయి. జర్మనీ దేశ ప్రఖ్యాత చరిత్రకారుడు 'మాక్స్ ముల్లర్', మన ఋగ్వేదంలోని ఖగోళ విజ్ఞానాన్ని చూసి చాలా ఆశ్చర్యపోయాడు. 'మానవ పుస్తక భండారంలో మొట్టమొదటి గ్రంథం ఋగ్వేదమేనని' ఆయన ప్రస్తుతించాడు. ఇతర జాతులేవీ కూడా కళ్ళైనా తెరవకముందే, మన ఋగ్వేదం రూపొందింది. మన విజ్ఞాన ప్రాచీనతకు ఇంతకంటే నిదర్శనం ఇంకేం కావాలి?

## భూగోళం - ఖగోళం

'భూగోళం - ఖగోళం' అనే అంశం క్రింద మన ప్రాచీన ఖగోళ విజ్ఞానంలోని కొన్ని విషయాల్ని గురించి క్లుప్తంగా తెలుసుకుందాం. (మా ప్రచురణ సంస్థ నుండి

"ప్రాచీన హైందవ ఖగోళ పరిజ్ఞానం" అనే గ్రంథం వెలువడనున్నది. అందులో అనేక విశేషాలు సవిస్తరంగా మీకు అందించగలం.

# A. భూగోళం

భూమి గోళాకారంలో ఉందని మన పూర్వీకులకు తెలుసు. ఈ విషయాన్ని నిరూపించాలంటే పురాణాల్లో చెప్పబడిన మేరుపర్వత ప్రాంతం, ఉత్తర ధ్రువంలో ఉన్నదని నిర్ధారణ కావలసి ఉన్నది. ఆ విషయం ఇప్పుడు చూద్దాం.

## ★ మేరుపర్వతం అనేది ఎక్కడుంది?

భూగోళం గురించి ఆధునిక శాస్త్రవేత్తలకు, చరిత్రకారులకు తెలియని యథార్థ విషయాలు నేటికీ ఉన్నాయి. మన పురాణాల్లో వర్ణించబడిన మేరుపర్వతం, భూమిపై ఎక్కడ వుందో తెలియక నేటికీ తికమకలు పడుతూనే ఉన్నారు. చాలా సంవత్సరాల క్రితం విదేశీయులు కూడా ఈ విషయమై పరిశోధించి, ఏం తెలియక ఊరుకున్నారు. హైందవులు చెప్పే స్వర్గమూ, మేరువూ ఒకటేనని, కొంతమంది విదేశీయులు సరిపెట్టుకున్నారు. పురాణాల్లో, వేదాల్లో ఘనంగా కీర్తించబడిన ఈ మేరుపర్వతం నిజానికి ఎక్కడుంది? ఆ విషయాన్ని ఇప్పుడు తెలుసుకుందాం.

# I. ఉత్తర ధ్రువంలో మేరుపర్వత ప్రాంతం

ఉత్తర ధ్రువంలోని నిర్ణీత ప్రదేశాన్నే 'మేరుపర్వత ప్రాంతంగా' వర్ణించారు ఋషీశ్వరులు. అయితే అక్కడ ప్రత్యేకించి ఒక పర్వత ప్రాంతం ఏమీలేదు. దాన్ని 'మేరుపర్వతం' అని ఎలా అన్నారని ఆశ్చర్యపోతున్నారా? ఎత్తైన నేల ప్రదేశాన్ని 'కొండలనీ, పర్వతాలనీ' మనం అంటాం కదా! ఒకసారి గ్లోబును గుర్తుకు తెచ్చుకోండి. మన భూగోళానికి ఇరుసుగా ఉన్న ఉత్తరధ్రువ ప్రాంతం భూమికి 'పై భాగంగా' భాసిస్తోంది. భూగోళానికి పై భాగంగా అనిపిస్తున్న ఈ ఉత్తరధ్రువాన్ని, భూమికి ఎత్తైన భాగంగా పోల్చారు ఋషీశ్వరులు. అందువల్ల ఉత్తర ధ్రువంలోని నిర్ణీతప్రాంతాన్ని 'మేరుపర్వతంగా' వర్ణించారు. ఈ విషయానికి ఇంకా కొన్ని నిరూపణలున్నాయి. వాటి సంగతి చూద్దాం. దేవీ భాగవతంలో మేరుపర్వతం గురించి స్పష్టమైన వర్ణన ఇవ్వబడింది. ఆ వర్ణన ఖచ్చితంగా మన ఉత్తర ధ్రువ ప్రాంతానికి సరిపోతుంది.

## మేరు పర్వత వర్ణన - దాని వివరణ :

| పురాణ వచనం | వివరణ |
|---|---|
| 1. లోకంలో అన్ని ప్రాంతాలకూ మేరుపర్వతం ఉత్తరదిక్కుగానే ఉంది. భూమిపై ఏ ఇతర భాగం నుండి ఉత్తరదిశకు ప్రయాణిస్తూ వెళ్ళినా, మేరువును చేరగలం. | 1. నిజమే మరి! భూమిపై ఎక్కడ నుండి చూసినా ఉత్తరధ్రువం ఉత్తరదిక్కుగానే ఉంటుంది. భూమిపై ఉత్తర దిక్కుగా ఎలా ప్రయాణించినా కూడా ఉత్తర ధ్రువాన్నే చేరతాం. |
| 2. సమస్త తారలూ, గ్రహాలూ మేరు పర్వతానికి ప్రదక్షిణలు చేస్తుంటాయట. | 2. ఉత్తరధ్రువాన్ని ఇరుసుగా చేసుకుని భూగోళం ఆత్మప్రదక్షిణలు చేస్తుంది కదా! ఆ ఇరుసు ప్రాంతం నుండి గమనిస్తే గ్రహతారకలన్నీ ఉత్తరధ్రువం చుట్టూ తిరుగుతున్నట్లే ఉంటుంది. |
| 3. మేరువును 'అచలాచలం' అని చెప్తారు. అంటే చలిస్తుంది గాని, అక్కడే ఉంటుందని భావం. | 3. ఉత్తర ధ్రువం సంగతి అంతేకదా మరి! భూమి ఎల్లవ్వుడూ తిరగుతూ ఉంటుంది. దానితో పాటూ ఎలాగూ ఉత్తర ధ్రువప్రాంతం కూడా తిరుగుతుంది. భూమికి ఇరుసుగా ఉన్న ప్రాంతం కనుక, ఎంత తిరిగినా కూడా ఉత్తర ధ్రువ స్థానం మాత్రం మారదు. కదులుతుంది గాని, కదలదు అంటే అర్థం ఇదే! |
| 4. మేరు పర్వతం నుండి మానస సరోవరం వరకూ అద్దంలా మెరిసే భూమి ఏర్పడిందట. అందులో మొక్కలు మొలవడం మానేశాయట. | 4. ఉత్తర ధ్రువం నుడి మానస సరోవరం వరకూ హెచ్చు ప్రాంతంలో కాల క్రమేణా ఏర్పడిన మంచు భూములనే, ఇలా మెరిసే అద్దం వంటి భూమిగా వర్ణించడం జరిగింది. ఈ మంచు భూముల వల్ల పాడిపంటలకు ఆటంకం ఏర్పడింది. (ఉత్తర ధ్రువం |

లోని భూభాగమంతా మంచుగా మారడంతో, అక్కడ నివసించే మన పూర్వీకులు ఆర్యావర్తానికి చేరు కున్నారు.

5. బంగారుకొండగా పేరు పడిన మేరువు ఒకప్పుడు శివుని నివాసమట. దాన్ని శివుడు, కుబేరునకు దానం చేసి వెండి కొండకు వచ్చేశాడట. ప్రస్తుతం కుబేరుడు ఉండే దిక్కు 'ఉత్తర దిక్కు'.

5. వేదకాలంలో జరిగిన చరిత్రను వివ రించడం కోసం ఈ శివుడి కథను మన పూర్వీకులే అల్లారు. వారి పూర్వ నివాసం ఉత్తరధ్రువమే! (అక్కడ ఉన్నప్పుడే వేదాల రచన ప్రారంభ మయింది.) ఉత్తర ధ్రువ ప్రాంతం కాలక్రమేణా మంచుభూమిగా మారు తూండడంతో వారు 'బంగారు నేల' వంటి ఆ ప్రాంతాన్ని వదలి 'వెండి కొండ' వంటి హిమాలయ ప్రాంతాల వద్ద ఆర్యవర్తానికి చేరు కున్నారు. వస్తూవస్తూ అంతవరకూ గ్రంథస్థం చేసిన వేద విజ్ఞానాన్ని తమ కూడా తెచ్చుకున్నారు. ఈ విధంగా ఉత్తర ధ్రువం నుండి హిమాలయ ప్రాంతాలకు వలన వచ్చినవాడు 'శివుడు' కాదు. మన వేదమార్గీయులే వలస వచ్చారు. శివుణ్ణి ఈ విషయంలో ఇరికించి చమత్కరించారు మన పూర్వీకులు.

ఈసారి కుబేరుని సంగతి చూద్దాం. పురాణాల్లో కుబేరుని స్థానం 'మేరువు' గా చెప్పబడింది. అంటే అది ఉత్తర ధ్రువ ప్రాంతమని మనం చెప్పుకుంటు న్నాం. మన ఇతరితర గ్రంథాల్లో కూడా కుబేరుని స్థానం ఉత్తరదిశగానే సూచించబడుతోంది.

| | |
|---|---|
| 6. చీకటి లోకాలకూ, వెలుగు లోకాలకూ మధ్యలో ఉంటూ చీకటి, వెలుగులను విడదీసే పర్వతం ఇది. (అందుకే దీన్ని 'లోకాలోక పర్వతం' అన్నారు.) | 6. భూమి పూర్వార్ధగోళంపై పగలయితే, పశ్చిమార్ధగోళంపై రాత్రి అవుతుంది. (ఉత్తరధ్రువ కేంద్రం నుండి భూమధ్య రేఖ దిశగా 22 1/2°ల ప్రాంతాన్ని మన పూర్వీకులు ఉత్తర ధ్రువ ప్రాంతంగా తీసుకున్నారు. భూమి 'పైభాగాన' కొంత ప్రాంతం పగలుగానూ, మరి కొంత ప్రాంతం రాత్రిగానూ విడిపోయే స్థానంలో ఈ ఉత్తరధ్రువం ఉంది. అనగా ఉత్తర ధ్రువ ప్రాంతలో చీకటి వెలుగులు వేరవుతాయన్నమాట. సంవత్సరం పొడవునా ఎప్పుడు ఏ సమయంలో చూసినా సరే ఉత్తర ధ్రువ ప్రాంతంలో కొంత భాగం చీకటి లోనూ, మిగిలిన భాగం వెలుతురు లోనూ ఉంటుంది. అందువల్లనే ఉత్తరధ్రువ ప్రాంతాన్ని చీకటి వెలుగులను విడదీసే 'మేరుపర్వత ప్రాంతం' గా వర్ణించారు. |

పురాణకాలపు మేరుపర్వత ప్రాంతం, నేటి మన ఉత్తరధ్రువం లోనిదని పై వివరణ ద్వారా తెలుస్తోంది. ఇది మనమంతా గమనించవలసిన ఒక ముఖ్య విషయం. మేరుపర్వత ప్రాంతం, ఉత్తరధ్రువం లోనిదనే వాదాన్ని శ్రీ బాలగంగాధర తిలక్ (ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు) దాదాపు 100 సంవత్సరాల క్రితమే ఎలుగెత్తి చాటారు. విషయం ఇంతవరకూ వచ్చింది కనుక, మన దేశ చరిత్రలోని 'ఆర్యుల విషయం" గురించి కూడా క్లుప్తంగా ఇక్కడే చర్చించుకుందాం.

## ఆర్యులు ఎవరు? ఎక్కడివారు?

ప్రాచీన కాలంలో ఆర్యులనబడే మేధావులుండే వారనీ, వేదాలు వారి రచనలేననీ విదేశీ చరిత్రకారులు నిర్ణయించారు. అయి తే ఆ ఆర్యులే 'ప్రాచీన హైందవులని' ఒప్పుకోడానికి వారికి మన సొప్పలేదు. "పూర్వ హైందవులు 'ద్రావిడులు' అనే పేరుతో

వ్యవహరించబడేవారనీ, మధ్య ఆసియా నుండి వచ్చిన 'ఆర్యజాతి' వారిపై దండయాత్ర చేసిందనీ, ఆ తర్వాత ఆర్య, ద్రావిడ సమ్మేళనంగా భారత ప్రజలు ఏర్పడ్డారనీ" ఆంగ్లేయ చరిత్రకారులు ఒక తప్పుడు చరిత్ర పాఠాన్ని వ్రాసి పెట్టారు మనకు. ఇప్పటికీ అదే నిజమని భావిస్తూ, దాన్నే బట్టీ పడుతున్నాం మనం.

ఆర్యుల దండయాత్ర అనేది "శుద్ధ అబద్ధం" అని ఆధునిక పరిశోధనల వల్ల తెలుస్తోందట. ప్రజలు ఇప్పుడిప్పుడే యథార్థాలను తెలుసుకుంటున్నారు. (అయితే మన దేశచరిత్రను యథార్థమైన రీతిలోకి మళ్ళించుకునే ధైర్యం మనకింకా రాలేదు.) ఆర్యులు రాకముందు భారతీయులకు ఏమీ తెలియదని, ఆర్యులనుండే వారు నాగరికత నేర్చుకున్నారనీ ఆంగ్లేయులు కల్లబొల్లి కథలు అల్లారు. ఆర్యులు జర్మనీ దేశానికి చెందినవారని మరోవాదం కూడా ఉంది. (మన హైందవ ప్రాచీనతను గురించీ, మన చరిత్రకు జరిగిన ద్రోహాలను గురించీ పూర్తి వివరాలు, మా ద్వారా త్వరలో విడుదల కానున్న "హైందవ ప్రాచీనత", "భారతదేశ చరిత్రకు జరిగిన ద్రోహాలు" అనే పుస్తకాల్లో చూడవచ్చు.) ప్రాచీన భారతీయుల మేధస్సును చూసి ఓర్వలేని పాశ్చాత్యులు 'ఆర్యులను విదేశీజాతిగా చిత్రీకరించేందుకు' చాలా తంటాలు పడ్డారు. వారు వ్రాసిన తప్పుడు చరిత్ర సంగతి అలా ఉండగా, అసలు విషయం తెలుసుకుందాం ఇప్పుడు.

యథార్థానికి ఆర్యులు, మొదట్లో ఉత్తరధ్రువ నివాసులు. పూర్వం ఎప్పుడో ఉండేదని చెప్పబడుతున్న ఆర్కిటిక్ ఖండం ఇదే! ఈ ఖండ నివాసులే "పూర్వ భారతీయులు". మన పురాణకాలం, వేదకాలంలో చాలాభాగం ఉత్తరధ్రువ ప్రాంతాల్లోనే గడిచాయి. (వేదాల రూపకల్పన ఆర్య ఋషులచే ఇక్కడే ఆరంభమయింది.)

మొదట్లో భూగోళంపై భూమధ్యరేఖ ప్రాంతంలో (కర్కట, మకర రేఖల మధ్యప్రాంతంలో) ఉష్ణవాతావరణం బాగా అధికంగా ఉండేది. ఆ రోజుల్లో ఉత్తర, దక్షిణ ధ్రువాల వాతావరణాలు కొంతవరకూ సమశీతోష్ణంగా ఉండేవి. ఒకచోట జీవరాశి పుట్టాలంటే, ఆ ప్రాంతానికి సూర్యుని ఉష్ణోగ్రత సరిపోవాలి. ధ్రువ ప్రాంతాలకు ఆవిధంగా సరిపోవడంతో మొట్టమొదటగా ప్రకృతీ, జీవులూ అక్కడే పుట్టాయి. అయితే సూర్యుని ఉష్ణోగ్రత అంతకంతకూ తగ్గుతోందట. ఈ విషయం ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నదే! ఈకారణంగా మొదట్లో సమశీతోష్ణంగా ఉన్న ధ్రువప్రాంతాలు మెల్లగా శీతల మండలాలు (మంచుభూములు)గా మారిపోసాగాయి. కర్కట, మకర రేఖల మధ్యప్రాంతంలో అధిక ఉష్ణం తగ్గసాగింది. సరిగా ఆ సమయంలో ఉత్తర

ధ్రువవాసులు కర్కటరేఖ దిశగా ఉన్న భూప్రాంతాల వైపుకు దిగివచ్చారు. అలాగే దక్షిణ ధ్రువవాసులు మకరరేఖ దిశగా ఉన్న భూప్రాంతాల వైపు, పైకి ప్రయాణిస్తూ వచ్చి స్థిరపడ్డారు.

ఉత్తరధ్రువ ప్రాంతంనుండి క్రిందకు దిగివచ్చిన ఆర్యులు, మధ్య ఆసియా గుండా ప్రయాణించి సింధునదిని దాటి హిమాలయాల ద్వారా ప్రస్తుత మన దేశ ప్రాంతాలకు చేరుకుని, 'హైందవులు' గా స్థిరపడ్డారు. అప్పటికే అక్కడేమైనా కొద్దిపాటి మానవజాతులున్నా, వారు అనాడే ఆర్యులతో సంపూర్ణంగా లీనమయ్యారు. వారంతా కలసి 'పూర్వ భారతీయులయ్యారు'. వారి నివాసప్రాంతమే భరతఖండంగా ప్రసిద్ధికెక్కింది. ఇదీ భారతజాతి అసలుకథ!

ఆర్యుల సంస్కృతీ ప్రాచీనత, ఆర్ష సంప్రదాయాల ఉత్కృష్టతా చూసి అసూయపడిన ఆంగ్లేయులు, ఆర్యులను మననుండి దూరం చెయ్యాలని సంకల్పించుకున్నారు. అందుకు ఆర్యజాతి మనకు పరాయిదనే తప్పుడు కూతతో, మన చరిత్రకు నాంది పలికారు. కానీ నిజం ఎంతకాలమో దాగదు. అయినా ఈ తగాదాలన్నీ అనవసరం. ఆర్యులు మనవారా? కాదా? అనే సమస్య అలా ఉంచండి. ప్రపంచం మొత్తంమీద ఇప్పటికీ ఆర్యసంస్కృతినీ, ఆర్ష సాంప్రదాయాలనూ అనుసరిస్తున్న ఏకైక జాతి మనదే! ఈ విషయమే మన ప్రాచీన వారసత్వానికీ, ఉత్కృష్టతకూ ఎదురులేని సాక్ష్యం. ఇక ఎవరెన్ని కట్టుకథలు కల్పించుకున్నా మనకు అనవసరం.

మన పూర్వ భారతీయులు ఒకనాడు ఉత్తర ధ్రువవాసులనే సిద్ధాంతాన్ని శ్రీ బాలగంగాధర తిలక్ దృఢంగా నొక్కి చెప్పారు. శ్రీ తిలక్ మన సంస్కృతీ ప్రాచీనతను లెక్కిస్తూ, చాలా పరిశోధనలు చేశారు. మనలో చాలామందికి ఆ సంగతే తెలీదు. కేవలం స్వాతంత్ర్యోద్యమ నాయకునిగా మాత్రమే ఆయన గురించి తెలుసు. మనవాళ్ళ గురించి మనకు ఎంత తెలుసో, దీన్నిబట్టే తెలుస్తోంది.

## ఉత్తరధ్రువంలో పరిశోధనలు సాగాలి

మన సంస్కృతీ ప్రాచీనతకు ఆధారాలు కావాలంటే, చరిత్రకారులు ఉత్తర ధ్రువంలో పరిశోధనలు జరపాలి. మన వేదకాలం హెచ్చుభాగం, ఉత్తరధ్రువంలోనే గడిచింది. అక్కడ త్రవ్వకాలు సాగిస్తే, ఆధారాలు వెలికి వస్తాయి. అయితే ఉత్తరధ్రువంలో పరిశోధనలు చేయగల శక్తి సామర్థ్యాలు నేటి మానవాళికి లేవనే చెప్పాలి. ఆ ప్రదేశం దారుణమైన శీతల భూములుగా మారిపోయి ఉండడమే, దానికి కారణం.

విదేశీ చారిత్రిక పరిశోధకుల దుస్థితి : వీరు తమకు వీలున్న చోటల్లా త్రవ్వకాలు సాగించి, రోజుకో సంగతిని పరస్పర విరుద్ధంగా చెప్తూ ఉంటారు. అయితే భూమిపై మానవ సంస్కృతి ప్రాచీనతను ఇప్పటివరకూ ఎవరూ కూడా సరిగా తేల్చి చెప్పలేక పోతున్నారు. ఉత్తరధ్రువంలోని మన వేదకాలానికి ఎంతోకాలం తర్వాత ఇతరితర దేశాల భూభాగాల్లో ఎన్నో అనాగరిక జాతులు పుట్టుకొచ్చాయి. ఆ అనాగరికులకు చెందిన నాటి ఆధారాలే, నేటి త్రవ్వకాల్లో దొరుకుతున్నాయి. ఆ ఆధారాల్ని చూసి, అవే అన్నింటా ప్రాచీనమని విదేశీ చరిత్రకారులు భ్రమపడుతున్నారు. మన వేదకాల ఆధారాల్ని తెలుసుకోగల శక్తి వారికింకా రాలేదు. విదేశీ చారిత్రిక పరిశోధకులు తమకు వీలున్నచోట త్రవ్వకున్న గోతుల్లో దొరికినవే, ప్రాచీనతకు అసలైన ఆధారాలుగా చెప్పుకొస్తున్నారు. మనం తలలూపుతున్నాం.

మన పరిస్థితి : మన ప్రాచీనతను చెప్పుకోవడంలో, ప్రస్తుతం మన దేశస్థులకు బిడియం మరీ ఎక్కువ. మన ప్రాచీన సంస్కృతి ఆధారంగా ఒక మంచి విషయాన్ని నలుగురితో చెప్పుకోవాలన్నా కూడా విపరీతంగా సిగ్గుపడుతుంటారు పాపం! ఎవరైనా విదేశీయుడు ఖాయపరచి చెప్పేవరకూ మన సంగతే మనకు తెలీదు. మనదేశ చరిత్ర పరిశోధకులు, మరీ ప్రాచీన ఆధారాల్ని కనుక్కోలేకపోయినా, ద్వాపరయుగంనాటి ఒక గొప్ప ఆధారాన్ని తెలుసుకోగలిగారు. ప్రముఖ చారిత్రిక పరిశోధకుడైన శ్రీ యస్. ఆర్. రావు గారి ఆధ్వర్యంలో సాగిన పరిశోధనల్లో ద్వాపరయుగం నాటి 'ద్వారకానగరం' కన్పించింది. ప్రస్తుతం ఈ నగరం గుజరాత్ రాష్ట్రం వద్ద సముద్రంలో మునిగి ఉంది. ద్వాపరయుగం చివరికాలంలో ద్వారకానగరాన్ని సముద్రం ముంచివేసినట్లుగా మహాభారతం చెప్తోంది. మహాభారతం చెప్పిన విషయాలకు ఖచ్చితమైన ఆధారంగా నేడు సముద్రగర్భంలో దర్శనం ఇస్తోంది "శ్రీకృష్ణుని ద్వారక!" ఇటువంటి మహత్తర విషయాన్ని అధికారికంగా వెల్లడిచేసి, మన చరిత్రకు సోపానాలు నిర్మించుకోగల సత్తా మనకు లేదు. అదీ ప్రస్తుత దుస్థితి!!

వేదాల సంగతి : ఆర్య ఋషీశ్వరులు చాలా వేదభాగాల్ని ఉత్తరధ్రువ ప్రాంతాల్లో ఉండగానే వ్రాశారు. (ఖగోళ విషయాలను స్పష్టంగా పరిశీలించడానికి ఉత్తరధ్రువ ప్రాంతం అనుకూలమైనది. అందువల్లనే వారికి చక్కటి వీలు చిక్కింది.) అనంతరం భరతఖండానికి దిగివచ్చిన తర్వాతకూడా వేదాల రచన కొనసాగింది. వేదాలన్నీ ఒకే కాలంలో వ్రాసినవి కావు. విజ్ఞులైన ఋషీశ్వరులు తమ విజ్ఞానాన్ని గ్రంథస్థం చేస్తూండగా, వేదాలు క్రమంగా రూపొందుతూ వచ్చాయి. అనంతమైన వేదవిజ్ఞాన సంపద వారసత్వంగా మనకు సంక్రమించింది.

వేదాల్లో ఉన్న విజ్ఞానం సరిగా తెలియనంత కాలం ఇతర దేశాలు ఉపేక్షించి

ఊరుకున్నాయి. ఆ విజ్ఞానం నిరూపణలోకి వస్తూండగా "వేదాలు మావే" అంటూ కొన్ని దేశాలు ప్రచారం ప్రారంభిస్తున్నాయి. కొన్ని మతాలవారు తమ సిద్ధాంతాలను వేదాల ఆధారంగా నిరూపించుకోవాలని తంటాలు పడుతున్నారు. ఎవరు ఏం చేసినా, ఎవరు ఏం అనుకున్నా, అనుకోక పోయినా "వేదాలు మన స్వంత వారసత్వానికి ప్రతీకలు". వేదాల్లో ఏం ఉన్నా, లేకపోయినా కూడా వాటిని సంరక్షించి, ఆదరించి, ఆచరించేది మాత్రం అప్పటికీ, ఇప్పటికీ మనమే! మన హైందవ దేశానికి ఆత్మ వంటివి "వేదాలు". ఈ వేద భూమినుండి వేదాల్నీ, ఆర్ష సంస్కృతినీ వేరుచెయ్యడం ఎవరితరమూ కాదు.

★ ★ ★

## 2. భూమి గోళాకారం గురించి...

భూమి గుండ్రంగా ఉందన్న విషయాన్ని ముందుగా విదేశీయులు కనుగొన్నట్లుగా చరిత్రలో వ్రాయబడింది. అయితే అది సంపూర్ణంగా 'అసత్యం'. భూమి గోళాకారం గురించి మనవారికి అతి ప్రాచీన కాలంనుండీ తెలుసు. ఆ విషయం తెలుసుకనుకే పురాణకాలంనుండీ భూమిని 'భూగోళం' అని వ్యవహరిస్తూ వచ్చారు. బ్రహ్మాండమైన ఖగోళ విజ్ఞానాంశాల్ని పురాణేతిహాసాల్లోనూ, వేదాల్లోనూ చెప్పుకొచ్చిన మన పూర్వీకులకు 'భూమి గోళాకారం గురించి' తెలియదనుకోవడం చాలా హాస్యాస్పదం. నక్షత్ర సమూహాల గురించీ, గ్రహాల గురించీ, గ్రహశకలాలను గురించీ ఎన్నో విషయాల్ని మన పూర్వీకులు స్పష్టంగా వివరించుకొచ్చారు. ఏటవాలుగా ఉన్న భూమి ఇరుసును గురించీ, భూమియొక్క విషువత్ చలనం (Equinox) గురించీ, ధ్రువతారా మార్పులను గురించీ కూడా వారికి తెలుసు. భూమి గోళాకారంగా ఉండి తిరుగుతోందని తెలిస్తే తప్ప, ఈ అంశాలన్నీ తెలిసిరావు. (ఇంతటి ఖగోళ పరిజ్ఞానం ఉన్న మన ప్రాచీనులకు భూమి గోళాకారం గురించి తెలియదని అనుకోవడం నిజంగా 'భ్రమ'.)

మన పూర్వుల వివరణల్ని సరిగా అర్థం చేసుకోలేని విదేశీయులు, మనవారికి భూమి గోళాకారం గురించి తెలియదనుకున్నారు. భూమి ఆకారాన్ని గురించి మన పూర్వులు చెప్పిన విషయాల్నీ, వాటి అర్థాల్నీ తెలుసుకుందాం ఇప్పుడు.

### భూమి ఆకారాన్ని గురించి మన పూర్వీకుల వర్ణన

"భూమిపై మేరుపర్వతం ఉంది. దానిని ఆవరించి ఉన్నట్లుగా సప్తలోకాలు

..... అనగా 'అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళ లోకాలు' ఉన్నాయి. అవికూడా పరస్పరం ఆవరించుకుంటూ, భూమిని ఉంగరాలవలె చుట్టి ఉండి, ఒకదానికొకటి 'అధోలోకాలు' గా ఉన్నాయి. (చివరిదైన పాతాళలోకం, 'దక్షిణధ్రువం' అవుతుందన్నమాట.) సప్త సముద్రాలు మాత్రం ఒక వరుసలో కాకుండా భూగోళమంతటా అల్లిబిల్లిగా వ్యాపించి ఉన్నాయి."

మన పూర్వీకులు చేసిన పై వర్ణనను మనదేశ చరిత్రకారులు పట్టించుకోలేదు. విదేశీ చరిత్రకారులు పట్టించుకున్నారుగాని, పొరబాటుగా అర్థం చేసుకున్నారు. ఆ పొరబాటువల్లనే పై వర్ణనకు ఒక తప్పుడు ఊహాచిత్రాన్ని గీశారు. 'అనతోలీ తామీలిన్' అనే రష్యన్ రచయిత తాను వ్రాసిన "భూమి ఇలా ఉందని ఎలా కనిపెట్టారు?" అనే పుస్తకంలో పై వర్ణనను ఉదహరిస్తూ, దాన్నిబట్టి ఈక్రింది విధమైన తప్పుడు ఊహాచిత్రాన్ని గీశాడు.




**A. మేరుపర్వతం**

1. అతల లోకం; 2. వితల లోకం; 3. సుతల లోకం; 4. తలాతల లోకం; 5. మహాతల లోకం; 6. రసాతల లోకం; 7. పాతాళ లోకం.

పై బొమ్మను గమనించండి. సమతలంగా ఉన్న ఒక ప్రదేశంపై మధ్యలో 'మేరుపర్వతం' అంటూ ఒక పర్వతాన్ని గుర్తించి, దాని చుట్టూ వలయాలు మాదిరిగా కొంతకొంత దూరాల్లో గీతలు గీస్తూ 'ఏడు లోకాలనూ, వాటి మధ్య సముద్రాలనూ' సూచించుకుంటూ వచ్చాడు అనతోలీ తామీలిన్. ఈ రష్యన్ రచయితకు పూర్వ భారతీయులు చేసిన భూగోళ వర్ణన ఏమాత్రం సరిగా అర్థం కాలేదు. అందువల్లనే

ఇంతగా పొరబడ్డాడు. తనకు అర్థమైనంత మేరకు ఒక తప్పుడు ఊహాచిత్రాన్ని గీసేసి "భారతీయుల ఉద్దేశ్యంలో భూమి ఆకారం బల్లపరుపు" అని తేల్చి చెప్పేశాడు. ఎందరో ప్రపంచ మేధావులు కూడా ఇదే భ్రమలో ఉండిపోయారు.

అయితే మన పూర్వీకులు ఇచ్చిన వర్ణనకు సరైన విశ్లేషణ చేసి, యథార్థాన్ని తెలుసుకుందాం ఇప్పుడు.

మన పూర్వులు మేరుపర్వతంగా చెప్పిన స్థలం, నేటి మన ఉత్తరధ్రువ ప్రాంతంలోనిదని ఇంతకుముందే చెప్పుకున్నాం. దాన్నిబట్టి మన పూర్వుల దృష్టిలో భూమి ఆకారం విషయాన్ని తెలుసుకుందాం.

ఉత్తరధ్రువ ప్రాంతంలో మేరుపర్వతం ఉంది. అక్కడనుండి క్రిందకు దిగుతూ అక్షాంశరేఖల మాదిరిగా ఏడు గీతలను మొత్తం భూమి చుట్టూ వలయాలుగా ఊహించుకోవాలి. అప్పుడు ఉత్తరధ్రువం కాకుండా దానిక్రిందుగా ఏర్పడిన ఏడు భాగాలనూ 'ఏడులోకాలు' గా తీసుకోవలసి ఉంటుంది. అంటే ఇప్పుడు భూమధ్యరేఖకు సమాంతరంగా మొత్తం భూమిని 8 భాగాలు చేసినట్లయింది. ఒక్కొక్కభాగం 22 1/2 ీల (ఇరవై రెండున్నర డిగ్రీల) ప్రాంతాన్ని ఆక్రమించి ఉంటుంది. మన పూర్వులు ఇచ్చిన వర్ణన ప్రకారం భూమియొక్క యదార్థ ఊహాచిత్రాన్ని ఈక్రింద ఇస్తున్నాం చూడండి.




1. అతల లోకం; 2. వితల లోకం; 3. సుతల లోకం; 4. తలాతల లోకం; 5. మహాతల లోకం; 6. రసాతల లోకం; 7. పాతాళ లోకం (దక్షిణ ధ్రువం)

ఉత్తరధ్రువం పైనుండే ఆకాశభాగం నుంచి చూస్తే, పైన తెలిపిన ఏడు లోకాలూ ఉత్తరధ్రువాన్ని (అంటే మేరుపర్వతాన్ని) ఆవరించి ఉన్నట్లూ, లోకాలు కూడా పరస్పరం ఆవరించుకుని ఉన్నట్లూ, అవి భూమిచుట్టూ ఉంగరాల వలె చుట్టి ఉన్నట్లూ, ఒక లోకానికి మరోలోకం అధోలోకంగా ఉన్నట్లూ కన్పిస్తుంది. ఈ సందర్భంలో అధోలోకాలంటే భూగర్భంలో ఉన్నాయనుకుని భ్రమపడితే మాత్రం, పూర్వీకుల వర్ణన దానికి ఏవిధంగానూ సరిపోదు. ఒక లోకాన్ని మరోలోకం ఆవరించినట్లుగా ఉండాలి. అప్పుడే వారి వర్ణన సరిపోతుంది. ఆవిధంగా సప్తలోకాలూ భూగోళం చుట్టూ ఆవరించుకుని, ఒకదానికొకటి అధోలోకాలుగా ఉండాలంటే, భూమి 'గోళాకారంగానే' ఉండితీరాలి. మరోలా ఉంటే అది అసాధ్యం. పై బొమ్మలో చూపిన విధంగా భూగోళ ఉపరితలంపై (అక్షాంశాల మాదిరిగా గీతల్ని ఊహించుకుని, వాటిమధ్యలో) లోకాలను గుర్తిస్తేనే, పూర్వీకుల వర్ణన నూటికి నూరుపాళ్ళూ సరిపోతుంది. (సప్త సముద్రాలు మాత్రం భూగోళమంతటా అల్లిబిల్లిగా వ్యాపించి ఉంటాయి.)

పై చర్చను బట్టి చూస్తే, భూమి గోళాకారం గురించి మన పూర్వీకులు గ్రహించినట్లుగా తెలుస్తోంది. అంతేకాదు. పాతాళలోకం వరకూ (అంటే దక్షిణధ్రువం వరకూ) అన్నిప్రాంతాలనూ చెప్పుకొచ్చారు కనుక, భూగోళంపై వివిధ ప్రదేశాలను గురించికూడా వారికి తెలుసునన్నమాట.

భూగోళం గురించి పైన ఇచ్చిన యదార్థ ఊహాచిత్రాన్ని చరిత్రకారులు వేసుకుని ఉంటే, వారికి అసలు విషయాలన్నీ తెలిసేవి. వారు పొరబాటుగా తప్పుడు ఊహాచిత్రాన్ని గీసుకుని, మన ప్రాచీనుల విజ్ఞానాన్ని అర్థం చేసుకోలేకపోయారు. ఇప్పటికీ ఇటువంటి పొరబాట్లు ఎన్నో సరిదిద్దుకోవడం జరగడం లేదు. నేటి మన చరిత్రకొచ్చిన గ్రహచారం అదే!

భూమి గోళాకారం గురించి మన ప్రాచీనులకు తెలుసునని, ఋగ్వేదంలోని ఒక వర్ణన ద్వారా కూడా అర్థమౌతోంది. ఋగ్వేదంలోని 10-37 సూక్తంలో "సూర్యుడు చీకటిని తరిమివేస్తాడనీ", 7-63 సూక్తంలో "చీకటిని చుట్టచుట్టి సముద్రంలో పడేస్తాడనీ" ఉంది. సూర్యుడు చీకటిని చుట్టచుట్టి సముద్రంలో పడేస్తాడనే మాటను క్షుణ్ణంగా పరిశీలించండి. భూమి బల్లపరుపుగా ఉంటే, ఇది ఎలా సాధ్యం అవుతుంది? బల్లపరుపుగా ఉండే భూమి మీద కనుక సూర్యుడు ఉదయిస్తే, నేలప్రాంతం మీదా, సముద్రాల మీదా కూడా మొత్తం చీకటి తరిమివేయబడుతుంది. ఇక సముద్రంలోకి చీకటిని తోసెయ్యడం ఎలా సాధ్యం? 'ఈవలివైపు, ఆవలివైపు' అంటూ

భూమి రెండు వైపుల్ని కలిగిఉంటేనే ఇది సాధ్యం. భూమియొక్క పూర్వార్థగోళంలో సూర్యోదయమైతే, అక్కడుండే చీకటి 'పశ్చిమార్థగోళానికి' నెట్టివేయబడుతుంది. ఇలా జరగడాన్నే 'సూర్యుడు చీకటిని చుట్టచుట్టి సముద్రంలో పడేయడంగా' ఋగ్వేదంలో వర్ణించారు. భరతఖండ నివాసులుగా ఉన్నకాలంలో ఋగ్వేద ఋషులు, ఈ వర్ణన చేశారు. భరతఖండం ఉన్న భూగోళ అర్థభాగానికి (పూర్వార్థగోళానికి) సూర్యుడు ఉదయిస్తే, అట్లాంటిక్ మరియు పసిఫిక్ సముద్రాలున్న ఆవలివైపు అర్థభాగంపై (పశ్చిమార్థ గోళంపై) చీకటి పరచుకుంటుంది. ఈ విషయాన్నే పూర్వార్థగోళపు చీకటిని, పశ్చిమార్థగోళ సముద్రాల్లో పడేయడంగా వర్ణించడం జరిగింది. (అయితే ఈ వర్ణనలో 'చీకటిని' భూమికి ఆవలివైపు పడేశాడని చెప్పకుండా, సముద్రాల్లో పడేసినట్లుగా చెప్పబడింది. కారణం తెలుసుకుందాం. మనకు ఆవలివైపుగా ఉన్న భూగోళ భాగంపై (పశ్చిమార్థ గోళంపై) నేలప్రాంతంకంటే సముద్రప్రాంతం 'బాగా' ఎక్కువ. ఆ విషయాన్ని గమనించిన ఋషీశ్వరులు, 'సూర్యుడు చీకటిని సముద్రాల్లోకి త్రోసివేసినట్లుగా' వర్ణించారు. అమెరికా వైపున్న భూగోళ సగభాగాన్నీ గ్లోబులో పరిశీలించి చూడండి, మీకు బాగా అర్థమౌతుంది.)

భూమి గోళాకారం గురించి వేదాల్లోని ఉత్తర బ్రాహ్మణంలో కూడా ఉంది. 'భూమి గోళాకారంగా ఉండి తిరుగుతోందనీ, సూర్యుడు భూమికి ఎప్పుడూ చాటుకాడనీ, తిరుగుతూ ఉండే భూమి అంచున సూర్యకాంతి పడుతూ ఉంటుందనీ' అందులో చెప్పబడింది. భూమికి సూర్యుడు ఎప్పుడూ చాటుకాడనే అంశాన్ని బాగా పరిశీలించండి. భూమికి ఈవలి అర్థభాగంలో రాత్రి అయితే, ఆవలి అర్థభాగంలో పగలు అవుతుంది. మళ్ళీ ఆవలి అర్థభాగంలో రాత్రి అయితే, ఈవలి అర్థభాగంలో పగలు అవుతుంది. మొత్తంమీద ఇటో అటో ఏదొక వైపు భూమికి ఎదురుగా ఉంటాడు సూర్యుడు. భూమికి సూర్యుడు 'ఎప్పుడూ చాటుకాడని' చెప్పడంలోని అంతరార్థం ఇదే! (భూమి గోళాకారం గురించి ఆర్యభట్టు యొక్క ఆర్యభటీయ గ్రంథంలోనూ, వరాహమిహిరుని పంచసిద్ధాంతిక గ్రంథంలోనూ కూడా వివరణ ఉంది. వివరాల్ని 33వ వ్యాసంలో చూడవచ్చు.)

మొత్తంమీద పై చర్చ ద్వారా మన పూర్వీకులకు భూమి గోళాకారం గురించి తెలుసునని స్పష్టమౌతోంది.

## చివరిగా ఒక ముఖ్య విషయం

'భూమి గోళాకారం గురించీ, భూమి మరియూ ఇతర గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయనే విషయాన్ని గురించీ, భూమి యొక్క చలనాలను గురించీ'

మన మహర్షులకు పురాణకాలంనుండీ తెలుసు. ఆ కాలానికి అవి గొప్ప పరిశోధనాత్మక విషయాలేమీ కావు. అందరికీ తెలిసిన ప్రాథమిక అంశాలవి. వాద ప్రతివాదాలు లేని ఖచ్చితమైన ప్రాథమిక అంశాలు కనుక, ఋషీశ్వరులు తమ గ్రంథాల్లో ఈ విషయాల్ని గురించి ప్రత్యేకించి పలుమార్లు ప్రస్తావించలేదు. వాటికి వేరే నిరూపణలు చూపాలనే తంటాలు కూడా పడలేదు. ఘనమైన ఖగోళ రహస్యాల వైపు మాత్రమే వారు తమ దృష్టిని సారించారు. అనంతర కాలంలోని ఆర్యభట్టు, వరాహమిహిరులు మాత్రం తమ గ్రంథాల్లో పై విషయాలను గురించి సూటిగా చెప్పడం జరిగింది. ఆర్యభట్టు తన గ్రంథమైన "ఆర్యభటీయం" లో "భూమికి చలనం ఉన్నదనీ, అది తన అక్షంపై తిరుగుతోందనీ, భూమితో సహా కొన్ని ఇతర గ్రహాలు సూర్యునిచుట్టూ తిరుగుతున్నాయనీ" వివరించాడు. వరాహమిహిరుడు తన గ్రంథమైన 'పంచ సిద్ధాంతిక' లోని 13 అధ్యాయమైన 'త్రైలోక్య సంస్థానం'లో భూగోళాన్ని గురించి చెప్తూ "పంచభూతాల్లో ఒకటైన భూమి గోళాకారంగా ఉంది. ఆకాశంలోని తారాగణం అనే పంజరంలో అది ఉంది. రెండు అయస్కాంతాలమధ్య సమాన దూరాల్లో లోహం ఉన్నట్లు, ఏ ఆధారం లేకుండా భూమి నిలచి ఉందని" వివరించాడు. (రెడ్డి రాఘవయ్యగారి "జ్ఞానులు-విజ్ఞానులు" అనే గ్రంథం నుండి సేకరించిన విషయం ఇది.) ఈ విజ్ఞాన అంశాలన్నీ ఋషీశ్వరుల దృష్టిలో ప్రాథమిక విషయాలుగా లెక్క.

నక్షత్రాల, గ్రహాల, ఉపగ్రహాల వలె భూమికూడా గోళాకారంలోనే ఉండడాన్ని ఋషీశ్వరులు పెద్ద విశేషంగా భావించలేదు. దాన్ని అతి సాధారణ విషయంగా తలచారు. అందుకే గొప్పగా పలుమార్లు ఆ విషయాన్ని చెప్పడం జరగలేదు. ప్రస్తుతకాలంలో మనం 'బంతి' (Ball) అనే ఆటవస్తువు గురించి ఏదైనా చెప్తున్నా మనుకోండి. 'బంతిని గోడకేసికొడితే తిరిగి వెనక్కి వస్తుందనీ, నేలమీద కొడితే పైకి లేస్తుందనీ .....' ఇలా చెప్పుకుంటూ పోతాం తప్ప 'బంతి గోళాకారంలో ఉంటుందనీ, బంతి ఒక గుండ్రని వస్తువనీ' ప్రత్యేకించి చెప్పం కదా! ఈ విధంగానే భూమి గోళాకారం గురించి ప్రత్యేకించి వివరించే ప్రయత్నం ఋషీశ్వరులు చేయలేదు. పురాణాల్లోగాని, వేదాల్లోగాని ఎక్కడైనా సరే, భూమి గుండ్రంగా ఉందని చెప్పడానికి తగిన ఆధారాలు మాత్రమే ఉన్నాయి. అంతేగాని భూమి బల్లపరుపుగా ఉన్నట్లు తెలిపే మాటలు ఎక్కడా కన్పించవు. భూమి మరియూ ఇతరగ్రహాలూ, సూర్యుని చుట్టూ తిరుగుతున్నాయని చెప్పడాన్ని 'సూర్యకేంద్ర సిద్ధాంతం' అంటారు. ఇది కూడా మహర్షులకు తెలిసిన అతి సాధారణ విషయమే! అందువల్లనే ప్రత్యేకించి ఈ సిద్ధాంతం గురించి చెప్పడానికి, ఎలాంటి అధ్యాయాన్నీ కేటాయించలేదు. ఇక భూమికి గల చలనాల సంగతి! 'భూభ్రమణం, భూపరిభ్రమణం' అనేవి నేడు సాధారణంగా

అందరికీ తెలిసిన 'భూ చలనాలు'. అయితే "విషువత్ చలనం" అనబడే భూమి యొక్క 3వ చలనం గురించి, ఈనాటికీ చాలామందికి తెలీదు. (విషువత్ చలనం గురించి వివరంగా ఇదే పుస్తకంలో తర్వాత పేజీల్లో చూడవచ్చు.) విషువత్ చలనం గురించి ఋగ్వేదంలో స్పష్టంగా ఉంది. భూమియొక్క విషువత్ చలనాన్ని కూడా గమనించిన ఋషీశ్వరులకు 'భూభ్రమణం, భూపరిభ్రమణం' గురించి తెలియదను కోవడం హాస్యాస్పదం. (వేద ఋషుల అనంతర కాలంలో కాలక్రమేణా విదేశీయులు, విషువత్ చలనాన్ని గురించి తెలుసుకున్నారు.)

మన ఋషీశ్వరులు అతి సామాన్య విషయాలుగా భావించిన పై అంశాలను, తాము క్రొత్తగా కనుగొన్న 'గొప్ప ఖగోళ రహస్యాలుగా' భ్రమపడ్డారు విదేశీయులు. చాలా ఆలస్యంగా (ఆధునిక కాలంలో) విజ్ఞానాన్ని పొందిన అతి సామాన్యులు వాళ్ళు. ఆదిలో ఖగోళ విషయాల్లో ఏమాత్రం పరిజ్ఞానం లేదు వారికి. 'భూమి బల్లపరుపుగా ఉందనే తప్పుడు ఊహతోనూ, భూమిచుట్టూ సూర్యుడు తిరుగు తున్నాడనే పిచ్చి ఊహతోనూ, భూమికి చలనాలున్నాయని తెలియని అయోమయావస్థ లోనూ వారు ఉండేవారు. కాలక్రమేణా మెల్లగా యథార్థాల్ని గ్రహించి, ఆ తప్పుడు ఊహల్లోంచి బయటపడ్డారు. తాము తెలుసుకున్న ఆ ప్రాథమిక అంశాలనే 'బృహత్తరమైన ఖగోళ రహస్యాలుగా' భావించి, సంబరపడిపోయారు. పైగా భారతీయులకు ఈ విషయాలేవీ తెలియవని తప్పుడు ప్రకటనలు కూడా చేశారు. 'మన ప్రాచీన విజ్ఞానం' మనకే తెలియని దురవస్థలో ఉన్నాం కనుక, విదేశీ ప్రకటనలకు తలలు ఊపేశాం. ఇప్పటికైనా మించిపోయింది లేదు. కళ్ళుతెరచి మన ప్రాచీన విజ్ఞానాన్ని తెలుసుకోడానికి నడుంకట్టండి. పూర్వ భారతీయ విజ్ఞానాన్ని ప్రపంచమంతటా ఎలుగెత్తి చాటండి.

★

# B. ఖగోళం

భూగోళం గురించి కొన్ని విషయాలను తెలుసుకున్న అనంతరం, ముందుగా సూర్యభగవానుణ్ణి తలచుకుంటూ ఖగోళ విషయాల్లోకి వెళ్దాం.

## I. సూర్యుని గురించి...

భూగోళం మనుగడ సూర్యునిపై ఆధారపడి ఉన్నదని ప్రస్తుతం మనకు తెలుసు. అయితే మన పూర్వీకులకు ఈ విషయం తెలియనిదేమీ కాదు. ప్రకృతికీ, దాని

మనుగడకూ మూలకారణం 'సూర్యభగవానుడని' మన పురాణాల్లోనూ, వేదాల్లోనూ మహర్షులు స్పష్టంగా చెప్పారు.

అహోరాత్రాలూ, పక్షాలూ, మాసాలూ, ఋతువులూ, అయనాలూ, సంవత్సరాలు.... వీటి విభాగం మొదలైనవన్నీ కూడా సూర్యుణ్ణి బట్టే నిర్ణయించ బడుతున్నాయి. ఇందుకు సంబంధించిన సమస్త విషయాల్లో మన పూర్వీకులు నిష్ణాతులు.

ఋగ్వేదంలోని 10 సూక్తాల్లో సూర్యుని వర్ణన ఉంది. ఈయన 'విశ్వానికి గూఢచారి' అని చెప్పబడింది. (ఋగ్వే 4-13) (భూగోళం మొత్తం అటూ ఇటూ ఎప్పుడూ ఈయన కంటపడుతూనే ఉంటుంది కదా! అందువల్లనే 'గూఢచారి' గా వర్ణించారు.) చరాచర ప్రపంచానికి సూర్యుడు రక్షకుడు (1-115, 7-60), చీకటిని పోగొడతాడు (10-37), చీకటిని చుట్టచుట్టి సముద్రాల్లో పడేస్తాడు (7-63), రోగాలనూ, దుస్స్వప్నాలనూ పారద్రోలుతాడు (10-37). (ఇందులో అంతరార్థం చూడండి. సూర్యరశ్మి మనకు ఆరోగ్యప్రదాయిని కదా! సూర్యరశ్మితో ఎన్నో వైద్య ప్రక్రియలున్న కారణంగా, సూర్యుడు మన రోగాలను పారద్రోలుతాడని చెప్పారు. ఇక స్వప్నాల సంగతి! సూర్యోదయం కాగానే స్వప్నాలు చెదరి మనం మేలుకొంటాం కదా! అందువల్లనే దుస్స్వప్నాలను పారద్రోలుతాడని వర్ణించబడింది.) ప్రాణులన్నీ సూర్యునిపై ఆధారపడి ఉంటాయి (1-164). (ఈ విషయం కూడా అక్షర సత్యమే! సూర్యుడు లేకపోతే వాతావరణమూ లేదు. ప్రకృతీ లేదు. జీవరాశీ లేదు. ఈ విషయాలన్నీ మన పూర్వీకులకు క్షుణ్ణంగా తెలుసు. కనుకే ఇలా చెప్పడం జరిగింది.) కృష్ణయజుస్సంహిత లో సూర్యుణ్ణి గురించి 15 అధ్యాయాల్లో చెప్పబడింది. స్వయంప్రకాశకుడైన ఇతడు ప్రాతఃకాలంలో సమస్త వస్తువులనూ ప్రకాశింపజేస్తున్నాడు. (యజుర్వేదం 3-10). వర్షాలద్వారా అన్నాదులను ఇస్తూ అందరి జీవనాలనూ చూస్తున్నాడు. (యజు 31-20, 33-30). (సూర్యునివల్ల వర్షాలు కురుస్తున్నాయనే విషయం ప్రాచీన హైందవులకు తెలుసుననన్నమాట.) సూర్యుడు సర్వవ్యాపకుడై తిరిగే ప్రాణులలోనూ, స్థావర పదార్థాలలోనూ ఆత్మగా ఉండి, భూమ్యాకాశాల్లోనూ, అంతరిక్షంలోనూ వ్యాపించి ఉన్నాడు (యజు 7-42). సామసంహితలో కూడా సూర్యుని గురించి కొంత వివరణ ఇవ్వబడింది. సూర్యుణ్ణి ఉపాసించడం వల్ల మానవులు ఆరోగ్యవంతమైన ఇంద్రియాలతో వందసంవత్సరాలకంటే హెచ్చుకాలం జీవించవచ్చుననీ, సూర్యుడు జీవులకు ఆరోగ్యాన్నీ, తేజస్సునూ, బలాన్నీ ఇస్తాడనీ అందులో చెప్పబడింది.

**సూర్యుని స్థితి :** మన కళ్ళకు కన్పిస్తున్న విధంగా సూర్యుడేమీ ప్రయాణించడం

లేదని, మన పూర్వులు గమనించారు. "కదాచ నాస్తమేతి, నోదేతి" (3-44) అంటూ ఐతరేయ బ్రాహ్మణం "సూర్యునికి ఉదయించడం, అస్తమించడం అనేవి లేవని" చెప్తోంది.

విష్ణుపురాణం ఈవిధంగా చెప్తున్నది :

"నైవాస్తమన మర్కస్య నోదయ స్సర్వ దాసతః
ఉదయాస్తమానాఖ్యం హి దర్శనా దర్శనం రవేః'
(విష్ణుపురాణం 2-9-16)

ఈ శ్లోకం అర్థం ఏమంటే "ఎప్పుడూ ఉండేవాడికి ఉదయం లేదు. అస్తమయం లేదు. సూర్యుడు కనపడడం, కనపడకపోవడం 'ఉదయాస్తమయాలు' గా మనం భావించుకోవాలంతే!"

ఉషస్సు : సూర్యబింబం మనకు దర్శనం ఇచ్చే ముందు వెలువడే వెలుగురేఖల్ని 'ఉషస్సు' గా చెప్పారు మహర్షులు. ఈ ఉషఃకాంతులనే మనం 'ఉషోదయం' అంటాం. ఈ ఉషోదయ కాంతిపుంజాలు అత్యంత మనోహరంగా ఉంటాయి కనుక ఉషస్సును 'ఒక అందమైన స్త్రీగా' వర్ణించారు. (ఉష అనే నామధేయం, ఈ కారణంగానే వాడుకలోకి వచ్చింది.) ఋగ్వేదంలోని 20 సూక్తాల్లో ఉషస్సుకు సంబంధించిన వర్ణన ఉంది. ఈమె ప్రతిరోజూ నియమిత కాలంలో, నియమిత స్థలంలో ఉదయిస్తూ, దేవతలు నిర్ణయించిన మార్గంలో ప్రయాణం చేస్తుంది. (ఋగ్వే 1-92, 1-123, 1-124, 7-76) ఈమె అందానికి దాసుడైన సూర్యుడు ఆమె వెంటే వస్తూ, ఉదయిస్తాడు (ఋగ్వే 7-77). ఈమె సూర్యుని ప్రియురాలు. సూర్యకాంతితో ఈమె ప్రకాశిస్తుంది (1-92). ఈమె 'రాత్రి' (Night) అనబడే ఆమెకు సోదరిగానూ (1-124), స్వర్గానికి పుత్రికగానూ (1-30) చెప్పబడింది.

మహర్షులు ఋగ్వేదంలో చేసిన పై వర్ణనలన్నీ చమత్కారంతో తెలియజేస్తున్న సైన్సు విషయాలని అర్థమౌతోంది. ఉషోదయం వెంట సూర్యుడు ఉదయించడాన్ని, 'ప్రియురాలు వెంట ప్రియుడు రావడంగా' చెప్పారు. ఉషస్సు, రాత్రి అనేవి ఒకదాని వెంట ఒకటి కాలగమనంలో అలా కలుగుతూనే ఉంటాయి. అందువల్లనే ఉషస్సును, రాత్రి అనబడే ఆమెకు 'సోదరి' అన్నారు. అనంతమైన ఆకాశాన్ని స్వర్గంతో పోలుస్తూ, అక్కణ్నుంచి ఉద్భవించిన ఉషస్సును 'స్వర్గానికి కుమార్తె'గా చెప్పారు.

## తెలుపు (సూర్యకాంతి)లో సప్తవర్ణాల గూర్చి...

తెలుపురంగులో 'ఏడు వర్ణాలు' (VIBGYOR) ఉన్నట్లుగా తాను తయారు

చేసిన వర్ణచక్రం ద్వారా 'న్యూటన్' (అనే విదేశీ శాస్త్రవేత్త) నిరూపించాడని మన పాఠ్యాంశాల్లో ఉంది. తెల్లని సూర్యకాంతి కిరణాన్ని ఏడురంగులుగా విడదీస్తున్న 'పట్టకం (Prism) ప్రయోగం' కూడా మనకు తెలుసు. మొత్తంమీద ఏడురంగుల సంగమమే 'తెలుపురంగు' అని ఆధునిక సైన్సు తేల్చింది. అయితే ఈ సంగతి పురాణకాలానికి తెలియనిది కాదు. "సప్త సూర్యస్య రశ్మయః" అని అధర్వణ వేదం చెప్తోంది. అంటే సూర్యకిరణాలు 7 రకాలని అర్థం. ఈ 7 రకాల రంగుల కలయికే 'తెల్లని సూర్యరశ్మి' అని మన ప్రాచీనులకు క్షుణ్ణంగా తెలుసు. దీనికి నిర్ధారణగా మరిన్ని విషయాలు తెలుసుకుందాం.

అతి ప్రాచీన కాలంలో మన పూర్వీకులు ఉత్తర ధ్రువ నివాసులని చెప్పుకున్నాం కదా! ఆ రోజుల్లో వారికి సూర్యోదయాన్ని అత్యంత నిశితంగా పరిశీలించగల అవకాశం ఉండేది. ఎందువల్లనంటే ఉత్తర ధ్రువప్రాంతంలో సూర్యోదయానికి కొన్నిరోజుల సమయం పడుతుందట. (ఇక్కడ మనకు సూర్యోదయ కాలం సుమారు 1/2 గంట లోపులో ఉంటుంది.) రోజుల తరబడి సూర్యోదయాన్ని పరిశీలించడంలో మన పూర్వీకులకు అనేక సూక్ష్మవిషయాలు తెలిసివచ్చాయి. తెల్లని సూర్యకాంతిలో 7 రంగులు ఇమిడి ఉన్నట్లుగా వారు అప్పుడే గ్రహించి ఉంటారు. సూర్యోదయం రోజుల తరబడి మెల్లగా జరగడం వల్ల, వాతావరణంలోకి చొచ్చుకుని వచ్చే సూర్యకాంతిని వారు సమగ్రంగా పరిశీలించారు. ఉదయిస్తున్న సూర్యుని వాలుకిరణాల కాంతి, ఉత్తరధ్రువ మంచుకొండలపై పడి "సప్తవర్ణాలు" (VIBGYOR - ఊదారంగు, ముదురునీలిరంగు, లేత నీలిరంగు, ఆకుపచ్చ రంగు, పసుపురంగు, నారింజ రంగు, ఎరుపు రంగులు) గా విడిపోయి కన్పించడం వారు గమనించారు. (ఇక్కడ మనకయితే సూర్యోదయకాలం తక్కువసేపు కనుక, సప్తవర్ణాలను విడివిడిగా స్పష్టంగా గుర్తించడం కుదరదు.)

పైవిధంగా మన పూర్వీకులు సూర్యుని కాంతిలోని సప్తవర్ణాలను గమనించారు. ఈ విషయాన్ని వారు ఇతర విధాలుగా కూడా గుర్తించి ఉండవచ్చు. ఏది ఏమైనా వారికి, సూర్యకాంతిలోని సప్తవర్ణాల గురించి తెలుసుననే మాట మాత్రం నిశ్చయం. అందువల్లనే రథంతో సహా సూర్యుని బొమ్మను చిత్రిస్తూ, ఆ రథాన్ని 7 గుర్రాలు లాగుతున్నట్లుగా సూచించారు మన పూర్వులు. సూర్యకాంతిలోని సప్తవర్ణాలకూ ప్రతీకలుగా, ఆ 7 గుర్రాలనూ వేశారని మనం తేలికగా గ్రహించవచ్చు. (VIBGYOR అనబడే ఏడురంగుల్లోనూ ఆ ఏడుగుర్రాలూ చిత్రీకరించబడి ఉంటాయి.) తెలుపురంగులోని సప్తవర్ణాలనూ న్యూటన్‌కంటే ఎంతోకాలం ముందుగానే, మన హైందవ ఋషులు గుర్తించారని దీన్నిబట్టి అర్థమౌతోంది.

ఈ సందర్భంలో మరో అంశాన్ని కూడా మనం చెప్పుకోవచ్చు. అధర్వణ వేదానికి భాష్యం వ్రాసిన సాయణ మాధవాచార్యులవారు సూర్యుని సప్తాశ్వాలను గురించి వివరిస్తూ 'అశ్వం' అనే మాటకు 'వేగం, వర్ణం' అనే అర్థాలున్నాయని చెప్పారు. 'సూర్యకాంతి యొక్క వేగానికీ, ఆ కాంతిలోని సప్త వర్ణాలకూ ఈ 7 అశ్వాలూ ప్రతీకలని దీనివల్ల' తెలియవస్తుంది.

అరుణుడు : సూర్యుడు ఉదయించడానికి ముందు ఆకాశమంతా అరుణవర్ణం (ఒకలాంటి ఎరుపు) లో కన్పిస్తుంది. ఆ అరుణ వర్ణాన్నే సూర్యుని రథసారథి "అరుణుడు" అన్నారు ఋషులు. (కొందరు అరుణుని 'అనూరుడు' అనికూడా అంటారు.)

సూర్యోదయంలోని విశేషాలను ఆనాడే మన ఋషీశ్వరులు చక్కగా గమనించారు. అందువల్లనే సప్తవర్ణాలను గురించీ, ఉషస్సును గురించీ, అరుణుడి గురించీ సరైన అవగాహన కలిగి ఉన్నారు.

## సూర్యకాంతి నడక

సూర్యకాంతి భూమిని చేరేటప్పుడు, వాతావరణంలో వంకరలు తిరుగుతూ ప్రయాణిస్తుంది. వాతావరణం యొక్క వివిధ తలాల్లోని గాలి సాంద్రతల తేడాలు ఇందుకు కారణం. సూర్యకిరణాలు ఇలా వంకరలుపోతూ భూమిని చేరుతూండడం మన పూర్వీకులకు తెలుసు. అందువల్లనే వారు సూర్యకిరణాల్ని పాములతో పోలుస్తూ "భుజగ నమితుస్సప్త తురగాః" అని చెప్పారు. "సూర్యరథాన్ని 7 గుర్రాలు లాగుతున్నాయనీ, అవి పాములనే త్రాళ్ళతో కట్టబడి ఉన్నాయనీ" దీని భావం. (పాములు నిదానంగా ప్రాకవు కదా! వంకరలుగానే ప్రయాణిస్తాయి. అందువల్లనే సూర్యకిరణాలను పాములతో పోల్చారు ఋషీశ్వరులు. సూర్యకాంతిలోని సప్తవర్ణాలనే, 7 గుర్రాలుగా వర్ణించారని ముందే తెలుసుకున్నాం కదా!)

## అనేక సూర్యులు

సూర్యుడు కూడా ఒక నక్షత్రమే! విశ్వంలోని అనంతకోటి నక్షత్రాల్లో సూర్యుడు ఒకడు.

మన భూగోళానికి దగ్గరలో ఉన్న నక్షత్రానికి 'సూర్యుడు' అని పేరు పెట్టుకున్నాం మనం. ఇటువంటి సూర్యులు..... అనగా నక్షత్రాలు, విశ్వంలో కోట్లకొలదీ ఉన్నాయి. ఈ విషయం పురాణకాలంలోనే మనవారికి తెలుసు. అందువల్లనే "సప్తదిశో నానా సూర్యాః" అని అరుణమంత్రంలో చెప్పారు.

## విష్ణువు యొక్క ప్రథమాంశ 'సూర్యుడు'

విష్ణువును సకల జీవరాశి పోషణకర్తగా ఇంతకుముందు చెప్పుకున్నాం. అయితే మనకు ప్రత్యక్షంగా కన్పిస్తున్న పోషణకర్త 'సూర్యుడు.' (ఎందువల్లనంటే ప్రకృతి, జీవరాశుల మనుగడకు పూర్తిగా సూర్యుడే ఆధారం.) సూర్యుడు విష్ణువులోని ఒక అంశయే! ఒక్క సూర్యుడేకాదు. విశ్వంలోని కోటానుకోట్ల నక్షత్రాలన్నీ అనంతుడైన విష్ణువులోని అంశలే! ఈ విశ్వ(స్వ)రూపమంతా ఆయనదే కదా! ఆయన యొక్క ప్రచండ తేజోరూపంలోని అంశగా 'సూర్యుడు' నిత్యం మనకు దర్శనమిస్తున్నాడు. అనగా శ్రీమహావిష్ణువు, సూర్యభగవానుని రూపంలో ప్రత్యక్షంగా మన కళ్ళముందు నిలచి మనల్ని పెంచి పోషిస్తున్నాడన్నమాట. ఈ కారణంగానే సూర్యుణ్ణి 'విష్ణువు యొక్క ప్రథమాంశగా' భావిస్తారు హైందవులు. సృష్టిలో తమ మనుగడకు కారణమైన ప్రతి శక్తియెడలా భక్తిభావాన్ని కలిగి ఉండడం, మన హైందవ సాంప్రదాయం. తరతరాల విజ్ఞతకు అది నిదర్శనం.

★ ★ ★

# 2. పురాణంలో చంద్ర జనన సిద్ధాంతం

చంద్రుడు ఎలా జన్మించాడనే విషయంలో ఇప్పటికీ బేధాభిప్రాయాలున్నాయి. భూగ్రహాన్నించి విడిపోయిన భూభాగపు ముక్క "చంద్రుడు"గా ఏర్పడి ఉంటుందనే సిద్ధాంతాన్ని జార్జ్ డార్విన్ అనే విదేశీ శాస్త్రవేత్త ప్రతిపాదించాడు. సూర్యుని ఆకర్షణ వల్ల అలా జరిగి ఉంటుందని ఆయన చెప్పాడు. W.H. పికరింగ్ అనే అమెరికా శాస్త్రవేత్త ఈ డార్విన్ సిద్ధాంతాన్ని మరికొంత పొడిగించాడు. "భూమినుండి విడివడిన శకలమే చంద్రుడయితే, భూమి పైపొరనుండి చంద్రుడు విడిపోయిన చోట పెద్ద అగాధం ఏర్పడి ఉండాలి. ఆ అగాధమే, పసిఫిక్ మహాసముద్రం అయిఉండాలని" చెప్పి, అందుకు కొన్ని నిదర్శనాలను కూడా చూపించాడట. (జార్జ్ డార్విన్ సిద్ధాంతం హేతుయుక్తం అనడానికి ఆధారాలున్నట్లుగా ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఉదాహరణకు .... భూమి, చంద్రుడు ఎంతకాలం క్రిందట విడిపోయి ఉండాలని జార్జ్ డార్విన్ లెక్కవేశాడో, దాదాపు అంతకాలం క్రిందనే 'భూమి, చంద్రుడు' జన్మించినట్లుగా ఇతర శాస్త్రవేత్తల పరిశోధనలు కూడా చెప్తున్నాయి. చంద్రజనన సిద్ధాంతాల్లో ఒక ప్రముఖ సిద్ధాంతం ఇది. భూమినుండి చంద్రుడు విడిపోయిన స్థలభాగంలో నేటి పసిఫిక్ మహాసముద్రం ఉన్నట్లుగా ఈ సిద్ధాంతం చెప్తోంది. ఇదంతా శాస్త్రీయపరమైన విషయం.

ఇక చంద్రజననం గురించి పురాణాల్లో ఏముందో చూద్దాం. 'మందరగిరిని' కవ్వంగానూ, 'వాసుకి' అనే పామును త్రాడుగానూ చేసుకుని దేవదానవులు పాలసముద్రాన్ని చిలుకుతూండగా, ఆ సముద్రంలోంచి చంద్రుడు పుట్టి, ఆకాశానికి ఎగసినట్లుగా పురాణాలు చెప్తున్నాయి. సముద్రంలోనుండి చంద్రుడు పుట్టి పైకెగసినట్లుగా ఇందులో చెప్పబడుతోంది. ఈ పురాణప్రవచనానికీ, పైన తెలిపిన సైన్సు సిద్ధాంతానికీ ఉన్న సమన్వయాన్ని గురించి ఒకసారి ఆలోచించండి. చంద్రుడు విడివడిన స్థలభాగంలో లోతైన సముద్రం ఏర్పడినట్లుగా "సైన్సు" చెప్తోంది. సముద్రంలో నుండీ చంద్రుడు వచ్చి ఆకాశానికెగసినట్లుగా "పురాణం" చెప్తోంది. పురాణపరంగా ఋషీశ్వరులు చేసిన చమత్కార వర్ణన తప్ప, రెండు సిద్ధాంతాలూ ఒకటే! ప్రాచీన మహర్షులకు చంద్రజననం ఎలా జరిగిందో తెలుసు. అయితే వారు ఆ విషయాన్ని సూటిగా చెప్పకుండా 'క్షీరసాగర మథనం' అనే పురాణకథగా చెప్పుకొచ్చారు. తాము కనుగొన్న సైన్సు విషయాలను పురాణపరమైన కథలుగా రూపొందించి చెప్పడం ఋషీశ్వరులకు అలవాటే కదా! అయితే ఆ పురాణకథలను మనం "కథలుగానే" చూస్తున్నాం తప్ప, అందులోని విజ్ఞాన విషయాల్ని గుర్తించలేక పోతున్నాం. వాటిని గుర్తించగలిగితే, మన పూర్వీకుల విజ్ఞానం మొత్తం మనకు అర్థమౌతుంది.

★ ★ ★

# 3. సూర్యకుటుంబంలోని ఇతర గ్రహాలలో జీవరాశి పుట్టుక

మన సూర్యకుటుంబంలోని ఇతర గ్రహాలలో జీవరాశి పుట్టుకను గురించి తెలుసుకుందాం. సూర్యుని ఉష్ణోగ్రత సరిపడినప్పుడే ఏ ప్రాంతంలోనైనా ప్రకృతీ, జీవరాశులు పుట్టడం జరుగుతుంది. సూర్యుని ఉష్ణోగ్రత అంతకంతకూ తగ్గుతోందని ఆధునిక శాస్త్రవేత్తలు నిర్ధారణ చేశారు. దీనివల్ల ప్రకృతీ, జీవరాశుల పుట్టుక ఒకగ్రహం నుండి మరో గ్రహానికి మారుతూ వస్తూండడం సాధ్యం. అంటే ముందుగా ప్రకృతీ, జీవరాశులు కుజగ్రహంపై ఉన్నాయనుకోండి. కొన్ని కోట్ల సంవత్సరాల తర్వాత సూర్యుని ఉష్ణోగ్రత కుజునిపై తగ్గి, మన భూమికి అనుకూలంగా మారుతుంది. అందువల్ల ప్రకృతీ, జీవరాశులు కుజునిపై నశించి - భూగోళంపై ఉద్భవించడం జరుగుతుంది. ఇలా జరగడం వల్లనే, జీవరాశి ప్రస్తుతం 'భూమిపై' ఉంది. సూర్యుని ఉష్ణోగ్రత అంతకంతకూ తగ్గుతోందనే శాస్త్రీయసత్యం వల్ల మరికొన్ని కోట్ల సంవత్సరాల

తర్వాత ప్రకృతి, జీవరాశులు భూమిపై నశించి, శుక్రగ్రహానికి బదిలీ అవుతాయి.

సూర్యుని ఉష్ణోగ్రత క్రమంగా తగ్గి, మన భూమి కొన్ని కోట్ల సంవత్సరాల తర్వాత 'మంచుగోళం'గా మారబోతోంది. అందుకు నిదర్శనాలు కన్పిస్తున్నాయి కూడా! (ధ్రువప్రాంతాల నుండి, భూగోళం మంచుముద్దగా మారడం మొదలయింది.) మొట్ట మొదట్లో భూగోళం, అధిక ఉష్ణంతో ఉండేది. ముందుగా ఉత్తర, దక్షిణ ధ్రువాల వద్ద ఉష్ణం తగ్గింది. (భూగోళంలో ధ్రువప్రాంతాలు సూర్యుడికి కాస్త దూర ప్రాంతాలు కావున, మొదట్లో అక్కడి ఉష్ణం తగ్గడానికి అవకాశం కలిగింది.) సూర్యుని ఉష్ణోగ్రత సరైన పాళ్ళలో సరిపోవడంతో ఇటు ఉత్తరధ్రువం లోనూ, అటు దక్షిణ ధ్రువంలోనూ ప్రకృతీ, జీవరాశులు పుట్టుకొచ్చాయి. అప్పుడు మిగిలిన భూప్రాంతంలో అధిక ఉష్ణోగ్రత ఉండేది. కొంతకాలం తర్వాత అక్కడ సరీసృపాలు (డైనోసారస్, సెరటోసారస్ వంటి జీవులు) పుట్టుకొచ్చాయి. ఆ సరీసృపాల జాతి అంతరించిన అనంతరం అక్కడ ఉష్ణోగ్రత క్రమంగా తగ్గుతూ, సకల జీవరాశికీ అనుకూలమైన వాతావరణం ఏర్పడసాగింది. ఈలోగా ఉత్తర, దక్షిణ ధ్రువ ప్రాంతాలు 'మంచు ప్రాంతాలుగా' మారడం ప్రారంభించాయి. (సూర్యుని ఉష్ణోగ్రత క్రమంగా తగ్గుతూండడమే దీనంతకూ కారణం.) నివాసయోగ్యం కాకుండా పోతున్న మంచు ప్రాంతాలను వదలి 'ఉత్తర ధ్రువవాసులు' భూమధ్యరేఖ దిశగా దిగువ ఖండాలకూ, 'దక్షిణ ధ్రువవాసులు' ఎగువ ఖండాలకూ వలస వెళ్ళారు. ధ్రువాలు రెండూ పూర్తిగా మంచుభూములుగా మారడంతో, ఆ ప్రజలంతా వివిధ ఖండాలలో ఎక్కడివారక్కడ స్థిరపడి పోయారు. అప్పటికీ భూమధ్యరేఖాప్రాంతం మాత్రం కాస్త హెచ్చు ఉష్ణోగ్రతలో ఉండడంతో, ఆ ప్రాంతాల జోలికి ఎవరూ వెళ్ళలేదు. రామాయణగాథ ఆధారంగా ఈ విషయాన్ని నిరూపించవచ్చు. శ్రీరాముని పూర్వులు ఉత్తరధ్రువం నుండి వలసగా క్రిందకు దిగివచ్చి, భరత ఖండంలో స్థిరపడగా; దక్షిణధ్రువ నివాసులైన రాక్షసజాతి (రావణాసురుని పూర్వులు) పై ప్రాంతాలకు వలస వెళ్ళి, లంక ప్రాంతాలలో స్థిరపడ్డారు. (రావణాసురుని లంక అంటే నేటి శ్రీలంక కానేకాదు. రామాయణంలో వాల్మీకి మహర్షి ఇచ్చిన లెక్కప్రకారం రావణాసురుని లంక, భరతఖండం నుండి సుమారు 9 వందల కిలోమీటర్ల దూరంలో (భూమధ్యరేఖకు క్రిందుగా) ఉంది. నేటి శ్రీలంక మాత్రం, భారతదేశానికి చాలా దగ్గరగా.... అంటే సుమారు 100 కిలోమీటర్ల దూరంలో (భూమధ్యరేఖకు పై ప్రాంతంలో) ఉంది. రావణాసురుని లంక, ప్రస్తుతం సముద్రగర్భంలో మునిగిఉంది. కాలక్రమేణా ఖండాల ఉనికీ, స్వరూపాలూ మారుతున్నాయనేది శాస్త్రీయ సత్యమే కదా!) అనంతరకాలంలో భూమధ్య రేఖా ప్రాంతంలోని అత్యుష్ణం మెల్లగా తగ్గుతూ రావడంతో అక్కడకూడా జీవరాశి

పుట్టుక మొదలయింది. అలా పుడుతూ వచ్చిన జీవరాశి, పరిణామ క్రమానికి లోనౌతూ కాలం గడుస్తోంది. శ్రీరాముడు, రావణాసురుల కాలం వచ్చేనాటికి భూమధ్యరేఖాప్రాంతంలో (కర్కటరేఖకు కొద్ది క్రిందుగా) జీవపరిణామం "వానరజాతి" వరకూ వచ్చింది. (మానవజాతికి ముందు దశ వానరమే కదా! ఆ ప్రదేశంలో అప్పుడు అంతవరకే పరిణామం జరిగిందన్నమాట.) వాలి, సుగ్రీవుడు, హనుమంతుడు మొదలగు వానరజాతి అదే! (అప్పుడు ఆ ప్రాంతంలో నాలుగు దంతాలున్న ఏనుగులు మరియు సింహాలూ, పెద్దపులులూ, ఎలుగుబంట్లూ మొదలగు జంతువులూ, వివిధరకాలైన పెద్దపెద్ద పక్షులూ ఉన్నట్లుగా రామాయణం ద్వారా తెలుస్తోంది.) సీతను వెదుక్కుంటూ రామలక్ష్మణులు భరతఖండం క్రింది ప్రాంతాలలోని అరణ్యాలను దాటుకుని వస్తూ, అక్కడి వానరజాతితో చెలిమిచేసి, లంకపై దండెత్తడం జరిగింది. ఆ తర్వాత గాథ మనకు తెలిసిందే!

పైన చర్చించిన సిద్ధాంతం ద్వారా రామాయణం జరిగిన కాలాన్ని లెక్కించగలం. ఆర్యుల పూర్వనివాసం ఉత్తర ధ్రువమనీ, అక్కడినుండే వారు ఆర్యావర్తానికి (భరత ఖండానికి) వలసవచ్చారనీ నిర్ధరణగా చెప్పగలం. (పూర్వనివాసం ఉత్తరధ్రువం కావడం వల్లనే ఆర్యులకు సృష్టివిజ్ఞానాన్ని బాగా అవగాహన చేసుకునే అవకాశం కలిగింది. ఖగోళ అంశాల పరిశీలన ధ్రువప్రాంతాలనుండి చక్కగా సాధ్యపడుతుంది. ఆ అవకాశం వల్లనే నాటి మహర్షులు అనేక ఖగోళపరమైన అంశాలను కనుగొని ఋగ్వేదంలో పొందుపరుస్తూ వచ్చారు.)

సూర్యుని ఉష్ణోగ్రత సరిపడిన చోట ప్రకృతీ, జీవరాశులు పుట్టడం, కోట్ల సంవత్సరాల తర్వాత ఉష్ణోగ్రతా లోపం వల్ల అవి క్రమంగా నశించడం, అనంతరం మళ్ళీ ఎక్కడయితే సూర్యుని ఉష్ణోగ్రత సరిపడుతుందో అక్కడ ప్రకృతీ జీవరాశులు ఉద్భవించడం .... ఇదంతా కాలగమనంలో అతి సహజం. సూర్యుని ఉష్ణోగ్రత మరికొన్ని కోట్ల సంవత్సరాలకు ఇంకా తగ్గడం ద్వారా ధ్రువప్రాంతాలవలే మొత్తం భూమి అంతా మంచుగోళంగా మారి, ప్రాణికోటి అంతరిస్తుంది. ప్రకృతి నశిస్తుంది. [1] కల్పకం ముగియడమంటే అదే! అనంతరం అనేక కోట్ల సంవత్సరాల (బ్రహ్మదేవుని నిద్ర) తర్వాత, సూర్యుని ఉష్ణోగ్రత శుక్రగ్రహానికి అనుకూలంగా మారుతుంది. అప్పుడు శుక్రునిపై ప్రకృతీ, జీవరాశీ ఉద్భవిస్తాయి. అలా శుక్రునిపై మరో కల్పకం ప్రారంభమౌతుంది. 'పురాణపరంగా సాగుతున్న ఈ కల్పకాల సిద్ధాంతం నిజమేనా?' అని మీకు సందేహం రావచ్చు. అయితే ఆధునిక శాస్త్రవేత్తల అభిప్రాయాలు కూడా దీన్నే బలపరుస్తున్నాయి.

ప్రాణికోటి ముందుగా కుజగ్రహంపై ఉండేదనీ, ఆ తర్వాత భూమి మీదకు మారిందనీ, అనంతరం శుక్రునిమీదకు బదిలీ చెందుతుందనీ మనం చెప్పుకున్నాం. నేటి ప్రఖ్యాత ఖగోళ శాస్త్రవేత్తల అభిప్రాయాలు, ఇందుకు అనుకూలంగానే ఉన్నాయి. వాటిని గూర్చి తెలుసుకుందాం.

కుజ, శుక్ర గ్రహాల పరిశీలన : వివిధ అంతరిక్ష నౌకల ద్వారా అమెరికా, రష్యా దేశాలకు చెందిన ఖగోళశాస్త్రవేత్తలు ఇటు శుక్రుడి మీదా, అటు కుజుడిమీదా అనేక పరిశోధనలు జరిపారు. వాటి ఫలితాలు ఇలా ఉన్నాయి.

కుజ గ్రహంపై ఇప్పటికీ స్వల్ప వాతావరణం ఉందట. ఆ గ్రహంపై కొంత నీటి ఆవిరి, మంచు, నాచుజాతి మొక్కలు ఉన్నట్లు కనుగొనబడింది. కుజగ్రహ వాతావరణంలో మెథేన్, అమ్మోనియా వాయువులున్నాయని అమెరికా అంతరిక్షనౌక 'మారినర్-7' తెలిపింది. ఈ రెండు వాయువులూ జీవోత్పత్తికి ముఖ్యమైన మూలపదార్థాలట. ఒకనాడు వాతావరణం, ప్రకృతీ,జీవిరాశీ విలసిల్లి - తిరిగి అంతమౌతున్న దశలో కుజుని పరిస్థితి ఉన్నట్లుగా శాస్త్రవేత్తలు తేల్చి చెప్తున్నారు.

ఇక శుక్రుని పరిస్థితిని తెలుసుకుందాం. వ్యాసం, ద్రవ్యరాశీ, పరిమాణం, గురుత్వాకర్షణశక్తి, పలాయన వేగం - వీటన్నింటిలో శుక్రుడు, సుమారుగా భూమిని పోలి ఉన్నాడు. శుక్రుని పై దట్టమైన వాతావరణం ఉంది. అయితే ప్రకృతీ, జీవరాశీ ఏర్పడగల పరిస్థితులు మాత్రం ఇంకా కలగలేదట. ప్రకృతి ఏర్పడక ముందు కొన్ని కోట్ల సంవత్సరాల క్రితం మన భూమి ఎలా ఉండేదో, ప్రస్తుత శుక్రగ్రహం ఆ దశలో ఉందట. అంటే మరిన్ని కోట్ల సంవత్సరాలకు... ప్రకృతీ, జీవరాశులు భూమిపై నశించే సమయానికి, శుక్రగ్రహం ప్రకృతికి అనుకూలంగా మారుతుందన్నమాట.

మన పురాణాలు చెప్తున్న కల్పకాల సిద్ధాంతాన్ని, "ఆధునిక సైన్సు" పై విధంగా సమర్థిస్తోంది.

★ ★ ★

# 4. రాశిచక్రం

రాశి చక్రానికి ఖగోళశాస్త్రంలో చాలా ప్రముఖస్థానం ఉంది. ఈ రాశి చక్రాన్ని ప్రపంచంలో మొట్టమొదటిసారిగా కనుగొన్నవారు హైందవ ప్రాచీనులే! కాలమానానికీ, జ్యోతిష శాస్త్రానికీ ఈ రాశిచక్రం ఉపయోగం ఎంతో ఉంది. ఇంతకూ రాశిచక్రం అంటే ఏమిటో తెలుసుకుందాం.

సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే మార్గంలో స్పష్టంగా కనిపించే27 అతిపెద్ద నక్షత్రాలను (అశ్వని మొదలు రేవతీ నక్షత్రం వరకూ) యుగయుగాల క్రితమే మనవారు గుర్తించారు. సూర్యుని చుట్టూ గ్రహాలు తిరిగే బాటను 12 రాశులుగా విభజించారు. ఒక్కొక్క రాశిలోని నక్షత్ర సముదాయాన్ని ఒక్కొక్క రూపంలో ఉన్నట్లు ఊహించి, ఆ రాశులకు 'ఆయా రూపాల పేర్లను' పెట్టారు. 'మేక' ఆకారంలో అమరియున్న నక్షత్రరాశికి 'మేషరాశి' అనీ, అలాగే 'ఎద్దు' ఆకారంలో అమరియున్న నక్షత్రరాశికి 'వృషభరాశి' అనీ..... ఇలా మొత్తం 12 రాశులకూ, పేర్లను ఏర్పరచారు. సూర్యకుటుంబంలోని గ్రహాలు, ఈ 12 రాశుల మీదుగానే సంచారం చేస్తుంటాయి. అందువల్లనే ఈ 12 రాశులను బట్టీ, భూమిపై ఉన్న మనకు 'జ్యోతిషాలు' గణించబడతాయి. అందువల్లనే రాశిచక్రాన్ని 'జ్యోతిష చక్రం' అని కూడా అంటారు. మన భూమి ఈ 12 రాశులనూ చుట్టిరావాలంటే, 1 సంవత్సరకాలం పడుతుంది. భూమి సూర్యుని చుట్టూ తిరుగుతూండడం వల్ల మన దృష్టికి, సూర్యుడు కూడా వరుసగా ఒక్కొక్కరాశి మీదుగా సంచారం చేస్తున్నట్లు కన్పిస్తాడు. (దీన్నే సూర్యుడు ఒక్కొక్కసారి ఒక్కొక్కరాశిలో ఉన్నట్లు మనం భావిస్తూంటాం.) సూర్యుడు ఒక్కొక్క నక్షత్రరాశిలో సుమారు నెలరోజులు ఉండునట్లు కన్పించుననీ, అదే విధంగా మొత్తం సంవత్సర కాలంలో 12 రాశుల్లోనూ ఉన్నట్లుగా కన్పించడం జరుగుతుందనీ మన పూర్వీకులు లెక్కించారు. సూర్యుడు ఏ క్షణంలో ఏ నక్షత్రరాశిలో ప్రవేశించినట్లు కన్పించేదీ వారు లెక్కించి, ఆ విషయాన్ని పంచాంగాల్లోనూ, జ్యోతిష శాస్త్రాలలోనూ పొందుపరిచారు. సూర్యుణ్ణి ఆధారం చేసుకుని లెక్కలు కట్టడం మన ప్రాచీనులకు బాగా తెలుసు. ఆనాటి కాలానికి పాశ్చాత్యులింకా ఆది మానవదశలో ఉన్నారు. అటువంటి వారి సంతతి అయిన నేటి పాశ్చాత్యులు, మన హైందవ ప్రాచీనతను లెక్కించి చెప్పబోవడం హాస్యాస్పదం. భారతీయుల ఖగోళ పాండిత్యం యుగయుగాల నాటిది. ఆ పాండిత్యాన్ని తర్వాత తర్వాత చాల్డియన్లు, బాబిలోనియన్లు, ఈజిప్టువారు, గ్రీకులు, రోమనులు వరుసగా గ్రహించారు. రాశిచక్రం గురించి భారతీయులు గ్రీకులనుండి నేర్చుకున్నారంటూ, పాశ్చాత్యులు చేసిన తప్పుడు ప్రచారం ఎంతగా ఖండించదగినదో మీరే ఆలోచించండి.

★ ★ ★

# 5. విషువత్ చలనం

భూగోళానికి రెండు చలనాలున్నాయని సాధారణంగా మనందరకూ తెలుసు. భూమి తనచుట్టూ తాను తిరగడాన్ని 'భూభ్రమణం' అనీ, భూమి సూర్యుని చుట్టూ

తిరగడాన్ని 'భూపరిభ్రమణం' అనీ అంటారని చదువుకున్నాం. అయితే మన భూమికి విషువత్ (Equinox) చలనం" అనబడే 3వ చలనం కూడా ఉంది. అయితే ఈ విషవత్ చలనం అంటే ఏమిటి? ఆ చలనం ఎలా ఉంటుందనే విషయాన్ని ఇప్పుడు తెలుసుకుందాం. భూమి తాను తిరుగుతున్న కక్ష్యలో నిటారుగా లేదు. 23 1/2° ఏటవాలుగా ఉండి తిరుగుతోంది. అందువల్ల భూమి అక్షం కూడా ఏటవాలుగానే ఉంటుంది. గ్లోబును పరిశీలించండి, తెలుస్తుంది. భూమి పై భాగపు అక్షం, ఉత్తర ధ్రువంలో ఉంది. ఈ అక్షం యొక్క దిశ అతి మెల్లగా మారుతూ ఉండేలా కూడా, భూమి తిరుగుతోంది. దీన్నే "విషువత్ చలనం" అంటారు. భూమికి గల 3వ చలనం ఇదే! వేగంగా తిరుగుతున్న బొంగరంలో ఈ విధమైన చలనాన్ని మనం గమనించగలం. వేగంగా తిరుగుతున్న బొంగరం - తన చుట్టూతాను తిరుగుతూనే (భూగోళంవలే) కొన్త ఏటవాలుగా కూడా వంగుతూ తిరుగుతుంది, గమనించండి. ఆ తిరుగుడులో బొంగరపు అక్షం యొక్క పై బిందువు మెల్లగా వలయాలు చుడుతూ తిరుగుతూండడం మనం చూడవచ్చు. ఇటువంటిదే భూమి 'విషువత్ చలనం' కూడా! ఈ విషువత్ చలనం వల్ల ఉత్తర ధ్రువ భాగంలో ఉన్న భూమి అక్షం కూడా తిరుగుతూ, వలయాలు చుడుతూ ఉంటుంది. వీటిని "ధ్రువక్షితి వలయాలు" అంటాం మనం. ఈ వలయాలు తిరిగే వేగం అతి తక్కువగా ఉంటుంది. అంటే విషువత్ చలన వేగం చాలా తక్కువన్నమాట. భూమి అక్షం ఒక డిగ్రీ (1°) ప్రక్కకు జరగడానికి 72 సంవత్సరాలు పడుతుంది. ఇలా భూమి అక్షం ఒక వలయం పూర్తి చేయడానికి దాదాపు 26,000 సంవత్సరాలు పడుతుందని ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు.

భూమి విషువత్ చలనాన్ని క్రీ.పూ. 125వ సంవత్సరంలో 'హిప్పార్చస్' అనే గ్రీకు ఖగోళశాస్త్రవేత్త కనుగొన్నట్లుగా "తప్పుడు సమాచారం" ప్రచారంలో ఉంది. నిజానికి ఈ విషువత్ చలనాన్ని కనుగొన్నది హైందవ ఋషీశ్వరులు.

**పురాణాల్లో విషువత్ చలనం గురించి :** హైందవ ఋషీశ్వరులు ఉత్తర ధ్రువ నివాసులుగా ఉన్నప్పుడే ఈ విషువత్ చలనాన్ని గురించి తెలుసుకున్నారు. ఇందుకు నిరూపణలుగా అనేక కథలు పురాణాల్లో ఉన్నాయి. వాటిలో అగస్త్య మహామునికి సంబంధించిన ఒక పురాణ కథను ఇప్పుడు తెలుసుకుందాం.

**అగస్త్యధారం :** సమస్త తారలూ, గ్రహాలూ మేరుపర్వతానికి ప్రదక్షిణలు చేస్తున్నాయని వింధ్యపర్వతానికి ఒకసారి ఈర్ష్య కలిగిందట. అందువల్ల మేరువు కంటే గొప్పదాన్ని కావాలనుకుంటూ వింధ్యపర్వతం అనంతంగా ఆకాశంలోకి ఎదిగిపోయి, గ్రహతారకల

చలనానికి అడ్డుపడిందట. ఆ అడ్డును తొలగించమని, అందరూ అగస్త్య మహామునిని కోరారు. అగస్త్యుడు అందుకు అంగీకరించి- ఉత్తర భారతంనుండి దక్షిణ భారతానికి ప్రయాణం చేస్తూ, అడ్డుగా ఉన్న వింధ్య పర్వతాన్ని 'దారి ఇమ్మని ' అడిగాడట. వింధ్య పర్వతం వినయంగా వంగిపోయి, ఆయనకు దారి ఇచ్చిందట. తాను తిరిగి ఉత్తరాదికి వెళ్ళే వరకు, అలాగే వంగి ఉండవలసిందిగా వింధ్యను ఆదేశించాడట అగస్త్యుడు. అంగీకరించింది వింధ్య. దక్షిణాదికి వచ్చిన అగస్త్యుడు తిరిగి ఉత్తరాదికి వెళ్ళనూ లేదు. వింధ్య పర్వతం ఇక పైకి లేవనూ లేదు. ఇదీ పురాణ కథ! అయితే ఇందులో చాలా అంతరార్థం ఉంది. విషువత్ చలనాన్ని గురించి తెలియజేస్తున్న కథ ఇది! (మేరు పర్వతం అంటే ఉత్తర ధ్రువప్రాంతం అనే విషయం కూడా ఇందులో తెలియవస్తుంది చూడండి.) 'అగస్త్యుడు అనబడే ఒక నక్షత్రం ఒకప్పుడు తూర్పు దిశగా ఉదయించేదనీ, భూమి విషువత్ చలనం వలన ఆ నక్షత్రం దక్షిణ దిశ ఆకాశంలోకి జరిగినట్లు కనిపిస్తుందనీ, ఒకప్పుడు ఉత్తర భారతవాసులకు కనిపించే అగస్త్య తార ప్రస్తుతం, వింధ్య పర్వతాలకు ఈవల మాత్రమే కన్పిస్తున్నదనీ' - పై కథలోని అంతరార్థం. మన పూర్వీకులు తమ విషువత్ చలన విజ్ఞానాన్ని, ఇలా ఒక పురాణ కథ రూపంలో మనకు అందించారు.

పురాణకాలం నాటి ధ్రువుని చరిత్ర కూడా ఈ విషువత్ చలనాన్ని గురించి తెలియజేస్తుంది.

**ధ్రువచరిత్ర :** పురాణకాలంలో ఉత్తానపాదుడనే ఒక మహారాజు ఉండేవాడు. ఆయన కుమారుడే ధ్రువుడు. ధ్రువుడు చిన్నతనంలోనే మహావిష్ణువును గురించి ఘోరతపస్సు చేసి, ఆయన అనుగ్రహాన్ని పొంది, స్థిరమైన నక్షత్ర స్థానాన్ని వరంగా సంపాదించాడు. అదే "ధ్రువనక్షత్రం". సప్తఋషులతో సహా అనేక నక్షత్రాలూ, గ్రహాలూ ధ్రువనక్షత్రానికి 26వేల సంవత్సరాల కొక విడతగా ప్రదక్షిణలు చేయుననే వరాన్ని కూడా మహావిష్ణువు (ధ్రువుడికి) ఇచ్చాడు.

పైన తెలిపిన పురాణ అంశంలోని అంతరార్థాన్ని తెలుసుకుందాం ఇప్పుడు.

**ధ్రువనక్షత్రం గురించి :** భూగోళపు ఉత్తర ధ్రువ అక్షానికి సూటిగా సుదూర ఆకాశంలో ఉన్న నక్షత్రాన్ని మనం "ధ్రువ నక్షత్రం" అంటాం. ధ్రువనక్షత్రం ఎల్లప్పుడూ స్థిరంగా ఒకే చోట ఉన్నట్లుగా మనకు కన్పిస్తుంది. భూమి యొక్క ఉత్తర ధ్రువ అక్షానికి సూటిగా ఈ నక్షత్రం ఉన్నందువల్ల అలా కన్పిస్తూ ఉంటుంది. విషువత్ చలన వేగం అతి తక్కువ కాబట్టి, భూమి అక్షం యొక్క చలనం మామూలుగా మన కంట పడదు. అందువల్లనే ధ్రువనక్షత్రం ఎప్పుడూ స్థిరంగా ఒకేచోట ఉన్నట్లు కన్పిస్తుంది. విష్ణువు

ధ్రువునకు "స్థిరమైన నక్షత్ర స్థానాన్ని" ప్రసాదించడం అంటే ఇదే! భూభ్రమణం వలన "సప్త ఋషులనబడే 7 నక్షత్రాలతో పాటూ ఎన్నో నక్షత్రాలూ, గ్రహాలూ" ఈ ధ్రువ నక్షత్రానికి ప్రదక్షిణలు చేస్తున్నట్లుగా కన్పిస్తుంది. ఈ వరంకూడా ధ్రువునకు ప్రసాదించబడిందని పైన చెప్పుకున్నాం. విషువత్ చలనంలో భూమి అక్షం, ఒక వలయాన్ని పూర్తి చేయడానికి 26,000 సంవత్సరాలు పడుతుందని ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు కదా! అంటే ఒకసారి ధ్రువతారగా వచ్చిన నక్షత్రం, మళ్ళీ ధ్రువతారగా అదే స్థానంలోకి రావడానికి సుమారు 26,000 సంవత్సరాలు పడుతుందన్నమాట. ఈ విషయాన్ని మన మహర్షులు ఏనాడో కనుగొన్నారు. కనుకనే ధ్రువునికి శ్రీమహావిష్ణువు ఇచ్చిన వరంలో "26,000 సంవత్సరాల కొక విడతగా సకల గ్రహతారలూ నీ చుట్టూ ప్రదక్షిణం చేస్తాయని చెప్పినట్లుగా" మహర్షులు పురాణాల్లో వ్రాశారు. ( దీనికి సంబంధించిన ఇతర వివరాలు మా భవిష్య ప్రచురణ 'ఇంద్రుడు - ఇంద్రపదవి' లో వివరంగా ఇవ్వగలం.)

## విషువత్ రేఖ

విషువత్ చలనాన్ని లెక్కించేందుకు మన పూర్వీకులు ఊహించుకున్న రేఖయే "విషువత్ రేఖ". భూమి ఉత్తర ధ్రువ అక్షానికి సూటిగా ఆకాశంలో ఉన్న ధ్రువ నక్షత్రాన్ని ఆధారంగా చేసికొని, ఆకాశాన్ని తూర్పుపడమరలుగా విడదీస్తున్నట్లు ఊహారేఖ గీసుకుంటూ వెళ్తే, ఆ రేఖ తిరిగి 'ధ్రువతారను' చేరుతుంది. ఈ వృత్తాకారపు ఊహారేఖనే 'విషువత్ రేఖ' అంటారు. ఇది ఊహాజనితమైన "ఖగోళమధ్యరేఖ". ఈ విషువత్ రేఖ గురించి మన పూర్వీకులకు చక్కని అవగాహన ఉంది. ఈ రేఖయే మన పురాణాల్లోని "ఇంద్రుడు". ఇంద్రునికి సంబంధించిన పురాణ కథలన్నీ, ఈ విషువత్ రేఖకు చెందిన ఖగోళ విజ్ఞానాన్ని తెలియజేస్తాయి. (వివరాలు: 'ఇంద్రుడు - ఇంద్రపదవి' పుస్తకంలో తరువాత ఇవ్వగలం.)

విషువత్ రేఖ ఉత్తర దక్షిణ దిశలకు మధ్య ఉండే ఊహారేఖ. రాశిచక్రం దానికి వ్యతిరేకంగా తూర్పు పడమరలుగా ఉంటుంది. రాశిచక్రాన్ని ఈ విషువత్ రేఖ ఖండించే రెండు స్థానాలనూ "వసంత విషువత్, శరత్ విషువత్" అని అంటారు. వసంత విషువత్ వద్ద సూర్యుడు ఉదయించే రోజున "సంవత్సరం ఆరంభం" అవుతుంది. (అంటే మన ఉగాది అన్న మాట!)

కాలగమనంలో విషువత్ చలనంవల్ల 'ధ్రువతార' మారుతుంది. దానిని బట్టి 'విషువత్ రేఖ' మారుతుంది. దానిని బట్టి 'వసంత విషువత్' మారుతుంది. దానిని బట్టి 'సంవత్సరఆరంభం' మారుతుంది.దానిని బట్టి'పంచాంగాలు' మారుతూ ఉంటాయి. ఈ విషయాలన్నీ మన ఋగ్వేదంలో స్పష్టంగా తెలియజేయబడ్డాయి. (ప్రస్తుత మన

పంచాంగాన్ని కొద్దిగా సవరించుకోవలసిన అవసరం ఇప్పటికే ఉందని గమనించండి.)

ఋతువులు మారడం గమనించిన హైందవ ఋషులు ఖచ్చితమైన పరిశోధనలు జరిపి, భూపరిభ్రమణం గురించి తెలుసుకున్నారు. ఋతువులు మొదలయ్యే కాలాన కలిగే మార్పులకు విషువత్ చలనం కారణమని కనుగొన్నారు. ఆ విజ్ఞానాన్ని ఋగ్వేదంలోని అనేక సూక్తాల్లో మనకు అందించారు.

మన హైందవుల పండుగలు చాలావరకూ 'సూర్యసహోదయం' అనే అంశంపై ఆధారపడినవి. ఈ సూర్య సహోదయాన్ని తెలుసుకోవాలంటే విషువత్ చలనం, విషువత్ రేఖల గురించి తెలిసి తీరాలి. వాటిగురించి తెలియకుండా సూర్యసహోదయం కనుక్కోవడం సాధ్యం కాదు. ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా తెలిసినందువల్లనే మన హైందవ ఋషీశ్వరులు వివిధ పండుగలను ఖగోళపరంగా నిర్ణయించగలిగారు.

పై ఖగోళ విజ్ఞానమంతా పాశ్చాత్యులనుండి మనం నేర్చుకున్నామనే అసత్య ప్రచారాలను ఖండించడం మన కర్తవ్యమని గ్రహించండి.



# 6. సూర్య సహోదయం

ఏదైనా ఒక నక్షత్రం లేదా కొన్ని నక్షత్రాలు సూర్యునితో జతగా కలిసి ఉదయించడాన్ని "ఆ నక్షత్రం యొక్క లేదా ఆ నక్షత్రాలయొక్క సూర్యసహోదయం" అంటారు. ఈ నక్షత్రాల సూర్యసహోదయాన్ని ముందుగా ఈజిప్ట్‌వారు గమనించినట్లు ఒక అబద్ధపు చరిత్ర ప్రచారంలో ఉంది. నిజానికి ఈ నక్షత్రాల సూర్యసహోదయాన్ని మన ఋగ్వేద ఋషులు ముందుగా గమనించారు. హైందవ పండుగలు ఇంచుమించుగా చాలావరకూ ఈ నక్షత్ర సూర్యసహోదయాన్ని అనుసరించే నిర్ణయించబడ్డాయి. అనంతర కాలంలో పాశ్చాత్యులకు 'సిరియస్' అనే నక్షత్రం సూర్యునితో కలిసి ఉదయించడం ఒక్కటే తెలుసు. మన హైందవులకు పురాణకాలంనుండీ వివిధ నక్షత్రాలు ఎప్పుడెప్పుడు ఎలా సూర్యునితో కలిసి ఉదయిస్తున్నాయో స్పష్టంగా తెలుసు. అందువల్లనే ఆయా నక్షత్రాల సూర్యసహోదయాల ఆధారంగా వివిధ హైందవ పండుగల్ని అతిప్రాచీన కాలంలోనే నిర్ణయించారు. ఉగాది, శ్రీరామనవమి, వినాయక చవితి, ఋషిపంచమి, విజయదశమి, దీపావళి, సుబ్రహ్మణ్య షష్ఠి, ధనుర్మాస ప్రవేశం, మకర సంక్రాంతి, రథసప్తమి, శివరాత్రి, శని త్రయోదశి, క్షీరాబ్ధి ద్వాదశి మొదలగు పండుగలన్నీ కూడా

ఈవిధంగా నిర్ణయించబడినవే! (వీటి వివరాలు "పండుగలు - అంతరార్థాలు" అనే మా తర్వాత ప్రచురణలో చూడగలరు.)

ఖచ్చితమైన చక్కటి ఖగోళ పరిజ్ఞానంతో పండుగలను ఏర్పరచుకున్న మరోజాతి ప్రపంచంలో లేదు. అదే భరతజాతి ఘనత!

★ ★ ★

# 7. గ్రహణాలు

సాధారణంగా మనకు రెండు గ్రహణాలు కన్పిస్తుంటాయి. 1. సూర్యగ్రహణం, 2. చంద్రగ్రహణం. పాములు మ్రింగడం వల్ల గ్రహణాలు కలుగుతున్నట్లుగా పురాణాల్లో ఉన్నదనీ, అది దారుణమైన మూఢనమ్మకమనీ, నేడు మనవాళ్ళు కొంతమంది హేళనగా మాట్లాడుతుంటారు. ఋషీశ్వరులు తాము కనుగొన్న విజ్ఞాన విషయాల్ని ఆసక్తికరమైన, చిత్రమైన కథలుగా మార్చి పురాణాల్లో ఇరికించిన విషయాన్ని-వారంతా గుర్తుకు తెచ్చుకోవాలి. పైకిచూస్తే, పురాణకథల అర్థం ఒకవిధంగా ఉంటుంది. అందులోని అంతరార్థం తెలుసుకుంటే, విషయం వేరేగా ఉంటుంది. పురాణ విజ్ఞానం అర్థం కావాలంటే, స్వయంగా మేధావి అయినా అయిఉండాలి. లేదా విడమరచి చెప్పే మేధావి ద్వారానైనా తెలుసుకోవాలి.

ఋగ్వేదంలో అనంతమైన ఖగోళ విజ్ఞానాన్ని అందించిన మహర్షులకు గ్రహణాల గురించి సరిగా తెలియదనుకోవడం అవివేకం. గ్రహణాలకు రాహుకేతువులు కారణాలని వారు చెప్పారు. పురాణపరిభాషగా రాహుకేతువుల్ని "పాములుగా" చమత్కరిస్తూనే, అవి "ఛాయాగ్రహాలని" కూడా చెప్పుకొచ్చారు. ఆ విషయం గమనించండి. వాతావరణాన్ని గురించీ, జీవుల గురించీ విస్తారమైన పరిజ్ఞానం ఉన్న మన మహర్షులు - వాతావరణమూ, ప్రకృతీ లేని అంతరిక్షంలో పాములు ఉంటాయనుకునే మూర్ఖులేం కాదు. ఖచ్చితంగా రాహుకేతువుల్ని ఛాయాగ్రహాలని చెప్పారు అందుకే!

## గ్రహణాల గురించి విదేశీ పూర్వీకుల అభిప్రాయాలు

భారతీయులకే మూఢనమ్మకాలుంటాయని మనలో చాలామందికి ఒక మూఢనమ్మకం. ఆ మాటకొస్తే "మన నమ్మకాల్లో" చాలావాటికి ఒక అర్థం, పరమార్థం ఉంటాయి. అవి తెలుసుకోలేక పోవడం మన పొరబాటు. ఇక విదేశీయుల సంగతి! అర్థం పర్థం లేని మూఢనమ్మకాలు వారికి అనేకం ఉన్నాయి. (కొన్ని విదేశీ

మూఢనమ్మకాలను గురించి ఈ పుస్తకంలోనే తర్వాత పేజీల్లో ఇచ్చాం చూడండి.) గ్రహణాల విషయంలో విదేశీ పూర్వీకుల మూఢనమ్మకాలను గురించి ఇప్పుడు తెలుసుకుందాం. డ్రాగన్ అనే వింతజీవి సూర్యచంద్రులను మ్రింగడంవల్ల గ్రహణాలు ఏర్పడతాయని ప్రాచీన చైనీయుల నమ్మకం. గ్రహణాలకు కారణం - "సూర్యచంద్రుల్ని మొసలి మ్రింగడమని ఈజిప్ట్ వారూ, ఎలుగుబంటి మ్రింగడమని అమెరికా వారూ, బోదురుకప్ప మ్రింగడమని అమెరికాలోని కాలిఫోర్నియా ప్రాంతంవారూ) పూర్వకాలంలో నమ్మేవారట. ఈవిధంగా వివిధ రకాలైన జీవులు సూర్యచంద్రుల్ని మ్రింగుతున్నట్లుగా ఆనాడు వివిధ దేశాల వారు భావించేవారు. ఇతర శాస్త్రీయ విషయం దేన్నీ కూడా ఏ దేశం వారూ చెప్పలేదు. మన ఋషీశ్వరులు మాత్రం అలా కాదు. రాహుకేతువులను 'రాక్షస దేహాల ఖండాలుగానూ, పాములుగానూ' పురాణపరంగా వర్ణిస్తూనే, అవి 'ఛాయాగ్రహాలని' కూడా చెప్పుకొచ్చారు. ఇలా చెప్పగల శాస్త్రీయ పరిజ్ఞానం హైందవ మహర్షులకే ఉంది.

## మహర్షుల పరిజ్ఞానం

సూర్యుని వల్ల మన భూమి నీడ, చంద్రునిపై పడి 'చంద్రగ్రహణం' ఏర్పడుతోంది. చంద్రునిపై పడే భూమి నీడను 'ఛాయాగ్రహం' అన్నారు మహర్షులు.

ఇక సూర్యగ్రహణం సంగతి చూద్దాం. సూర్యుణ్ణి మూసివేస్తున్నట్లుగా సూర్యునిపై నుండి చంద్రుడు దాటుకుంటూ వెళ్ళడమే, మనకు 'సూర్యగ్రహణం' గా కనిపిస్తుంది. ఇందులో సూర్యుణ్ణి మూసివేసేది చంద్రుని నీడకాదు. సాక్షాత్తూ చంద్రుడే అడ్డుగా ప్రయాణించడం వల్ల, సూర్యుడు మనకు కనపడడు. ఈ గ్రహణంలో ఏ గ్రహంయొక్క ఛాయా లేదు. అయినాసరే మహర్షులు, ఛాయాగ్రహం అనే ప్రస్తావన సూర్యగ్రహణంలో ఎందుకు తీసుకొచ్చారో తెలుసుకుందాం. సూర్యుని వెలుగు పడని చంద్రుడు (అనగా అమావాస్య చంద్రుడు) నల్లగా "నీడవలె" ఉంటాడు. కానీ నిజానికి అది నీడ కాదు మరి. ఇలా నీడకాని నీడలా ఉన్న చంద్రుడు, సూర్యునకు అడ్డుగా రావడం వల్ల 'సూర్యగ్రహణం' సంభవిస్తుంది. ఈవిధంగా సూర్యగ్రహణానికి కారణమైన నీడగాని నీడనూ, మరియూ చంద్రగ్రహణాన్ని ఏర్పరచే భూమి నీడనూ 'రాహువు-కేతువు' అనే ఛాయాగ్రహాలుగా మహర్షులు వర్ణించారు. వీటిపై పురాణపరంగా ఒక కథను కూడా సృష్టించి గ్రంథస్థం చేశారు మళ్ళీ. అదే వారి చమత్కారం. (అనంతర కాలాన భాస్కరాచార్యుడు తన గ్రహగణితంలో "భూమి నీడవల్లనే చంద్రగ్రహణం ఏర్పడుతుందని" శాస్త్రబద్ధంగా వివరించాడు. "తూర్పువైపు వెళ్తున్న చంద్రుడు భూమి నీడలో ప్రవేశిస్తాడు. అందుచేత చంద్రగ్రహణంలో స్పర్శ తూర్పున అవుతుంది.

గ్రహణం విడవడం పశ్చిమాన అవుతుంది" అని చెప్పాడాయన. చారిత్రిక కాలాన మన ప్రాచీనుల గ్రహణ పరిజ్ఞానానికి ఇదొక మచ్చుతునక.)

రాహుకేతువుల గురించి క్లుప్తంగా, సూటిగా రెండు మాటల్లో చెప్పుకుందాం. భూభ్రమణంవల్ల సూర్యుడు సంచరిస్తున్నట్లుగా కనిపించే మార్గమూ, చంద్రుడు పయనించే మార్గమూ ఒకదానినొకటి రెండుచోట్ల ఖండించుకుంటాయి. ఆ ఖండన బిందువులనే ఒకదానిని "రాహువు" అనీ, మరోదానిని "కేతువు" అనీ-మన మహర్షులు గుర్తించారు.ఇందువల్లనే సూర్య, చంద్ర గ్రహణాలకు 'రెండు కారణాలను" (రాహువునూ, కేతువునూ) చెప్పుకొచ్చారు. విదేశీయులు మాత్రం ఏదో ఒక జీవిని గ్రహణాలకు కారణంగా చెప్పి ఊరుకుని, పొరబాటుగా వ్యవహరించారు.

## వేదాల్లో సూర్యగ్రహణం గూర్చి

ప్రపంచ చరిత్ర ప్రస్తుతపు రికార్ధు ప్రకారం మొట్టమొదటగా సూర్యగ్రహణం గురించి వ్రాసినది చైనా వారట. వారు క్రీ.పూ. 2137లో కలిగిన గ్రహణం గురించి వ్రాశారట. అంతకంటే చాలాకాలం క్రితమే మన హైందవ ఋషీశ్వరులకు 'గ్రహణ పరిజ్ఞానం' ఉంది.

అత్రిమహాముని 'తురీయబ్రహ్మ' (Quadrant) అనే తన టెలిస్కోపుతో సంపూర్ణ సూర్యగ్రహణాన్ని ప్రప్రథమంగా పరిశీలించాడు. ఈ విషయాన్ని 'ఋగ్వేదం' (5వ మండలంలోని 40-6 మంత్రం) తెలియజేస్తుంది. పూర్వకాల గణిత, ఖగోళ శాస్త్రజ్ఞుడైన భాస్కరాచార్యుని యొక్క రచనల్లో (సిద్ధాంత శిరోమణి అనే గ్రంథంలో గోళాధ్యాయంలోనూ, యంత్రాధ్యాయంలోనూ కూడా) ఈ 'తురీయం' అనే టెలిస్కోపు గురించి వర్ణించడం కనపడుతోంది.

అత్రిమహర్షి గమనించిన సంపూర్ణ సూర్యగ్రహణ విషయాన్ని గురించి సాంఖ్యాయనం 24-3 లోనూ, తాండ్యబ్రాహ్మణం 4వ మండలంలో 5-2-6-14 ఋక్కులలోనూ వ్రాయబడి ఉన్నట్లు శ్రీ బాలగంగాధర తిలక్ కనుగొన్నారు. ఋగ్వేదంలోని 2వ మండలం 2-7 మంత్రంలోనూ, 4వ మండలంలోని 6వ మంత్రంలోనూ అత్రి మహర్షి వాడిన "తురీయబ్రహ్మ" అనే టెలిస్కోపు ప్రస్తావన ఉంది. మొట్టమొదటి టెలిస్కోపు నిర్మాత "అత్రిమహర్షి" కావచ్చు.

## సంపూర్ణ సూర్యగ్రహణం - ఒక పురాణకథ

**తారాశశాంకం :** సంపూర్ణ సూర్యగ్రహణాన్ని గురించీ మరియూ బుధగ్రహ పరిశీలన

గురించి మర్మగర్భంగా వివరిస్తున్న పురాణ కథ 'తారాశశాంకం'. సంపూర్ణ సూర్య గ్రహణాన్ని పరిశీలించడంలో మొట్టమొదటసారిగా 'బుధగ్రహాన్ని' చూసిన కాలంనాటి (కల్పిత) కథ ఇది. మహర్షులు తాము కనుగొన్న ఖగోళ విషయాలను పురాణపరంగా వివరించడంకోసం ఈ కథను కల్పించి, గ్రంథస్థం చేశారు.

తార, బృహస్పతులు భార్యాభర్తలు. బృహస్పతి వద్ద విద్య నేర్చుకోడానికి వచ్చిన చంద్రుణ్ణి కామించింది తార. తనతో సంగమానికి చంద్రుణ్ణి ఎలాగయితే ఒప్పించింది. తారతో రమించాడు చంద్రుడు. బృహస్పతికి ఇదేం తెలియదు. తారకు 'బుధుడు' అనే కొడుకు పుట్టాడు. బుధుడు 'నా కొడుకంటే నా కొడుకని' బృహస్పతి, చంద్రుడు వాదులాడుకున్నారు. అప్పుడు బ్రహ్మదేవుడు కల్పించుకుని చంద్రుడు, బృహస్పతులలో ఎవరి పోలికలు బుధునకు ఉన్నవో పరిశీలించాడు. బుధుని పోలికలు చంద్రునిలో కన్పించడంతో పుట్టిన బిడ్డ చంద్రుని కొడుకేనని నిర్ధారణ చేశాడు. తారాశశాంకం అనబడే పురాణ కథయొక్క సారాంశం ఇది. ఈ కథలో దాగి ఉన్న ఖగోళ విషయాలను ఇప్పుడు తెలుసుకుందాం.

సూర్యుణ్ణి ఒక నక్షత్రంగా (అంటే తారగా) తెలుసుకోవడం, సంపూర్ణ సూర్యగ్రహణాన్ని పరిశీలించడం, బుధుడు అనే గ్రహాన్ని కనుగొనడం, బుధ గ్రహానికీ చంద్రునికీ పోలికలున్నాయని గ్రహించడం..... ఇత్యాది విషయాలన్నీ ఈ కథలో అంతర్లీనంగా ఉన్నాయి.

తార అనగా నక్షత్రం కదా! మనకు దగ్గరలో ఉన్న తార 'సూర్యుడు'. పై పురాణ కథలో 'తార' అంటే సూర్యుడన్న మాట! సూర్యుణ్ణి తారగా గమనించి, దాన్ని ఒక స్త్రీ పాత్రగా చిత్రీకరించారు మహర్షులు. నవగ్రహాలలో అతి పెద్దదైన బృహస్పతి గ్రహాన్ని (అనగా గురుగ్రహాన్ని) తారకు భర్తగా వర్ణించారు. బృహస్పతి ఉన్న నక్షత్రరాశి లోనికి సూర్యుడు ప్రవేశించిన నాటి కథ ఇది. ఒకే రాశిలో ఉన్న వీటిని భార్యాభర్తలుగా వర్ణించారు. ఆ తర్వాత చంద్రుడు కూడా అదే రాశిలోకి ప్రవేశించడం జరిగింది. బృహస్పతి వద్దకు చంద్రుడు విద్యార్థిగా రావడం అంటే ఇదే! సంపూర్ణ సూర్య గ్రహణ సమయంలో చంద్రుడు సూర్యుని మీదుగా ప్రయాణిస్తాడు. సూర్యుని మీదుగా చంద్రుడు అలా దాటుకుంటూ వెళ్ళడాన్నే "తారతో చంద్రుడు రమించినట్లుగా" వర్ణించారు మహర్షులు. ఈసారి బుధుడి సంగతి చూద్దాం. బుధుడు సూర్యునకు అతి దగ్గరగా ఉన్న మొట్టమొదటి గ్రహం. సాధారణంగా సూర్యకాంతిలో అది మనకు కన్పించదు. తారాశశాంకం అనే కథ వ్రాయబడిన కాలానికి బుధుడనే గ్రహం కనుగొనబడలేదు. సంపూర్ణ సూర్యగ్రహణం కలగబోతోందని

గమనించిన మహర్షులు, ఆ గ్రహాన్ని పరిశీలించడానికి పూనుకున్నారు. చంద్రుడు సూర్యుడికి అడ్డుగా వచ్చిన సమయాన, సూర్యకాంతి మసకబారడంతో ప్రప్రథమంగా వారు బుధగ్రహాన్ని చూడగలిగారు. ఈ విషయాన్నే పురాణపరంగా 'తారా చంద్రుల కలయిక వల్ల బుధుడు ఉద్భవించినట్లుగా' చెప్పుకొచ్చారు వారు. బుధుడి తల్లి 'తార' అని చెప్పడంలోని అంతరార్థం 'బుధుడు కూడా సూర్యుని నుండి ఉద్భవించాడని నిర్ధారణ చేయడమే!' బుధుని తండ్రి చంద్రుడేనని బ్రహ్మదేవుడు తేల్చినట్లుగా పైన తెలుసుకున్నాం. మహర్షులు అలా ఎందుకు వ్రాశారో చూద్దాం. ఆకారంలోనూ, లక్షణాలలోనూ 'చంద్రుడు-బుధుడు' ఒకే పోలికలు కలిగి ఉన్నట్లుగా ఆధునిక శాస్త్రవేత్తలు చెప్తున్నారు. వారు చెప్తున్న పోలికలు వరుసగా ఇలా ఉన్నాయి.

(1) బుధుని ఉపరితలం, చంద్రుని ఉపరితలం వలెనే క్రేటర్స్‌తోనూ, పర్వతాలతోనూ నిండి ఉందట. (1973 లో అమెరికా వారు పంపిన 'మారినర్-10' అనే రోదశినౌక పంపించిన ఫొటోల వల్ల ఈ విషయం తెలిసింది.)

(2) ఈ రెండింటి గ్రహ పరిమాణం ఇంచుమించు సమానం. చంద్రుని వ్యాసం 2,160 మైళ్ళుకాగా, బుధుని వ్యాసం 2,900 మైళ్ళు.

(3) చంద్రునిలో వలెనే బుధునిలో కూడా వాతావరణం లేదు.

(4) చంద్రునిలోవలె బుధునకు పగటి భాగంలో అతి వేడి, రాత్రి భాగంలో అతి చలి ఉంటుంది. (వాతావరణం లేకపోవడమే దీనికి కారణం.)

(5) చంద్రుని వలె బుధునకు గురుత్వాకర్షణ శక్తి తక్కువ.

(6) చంద్రుడు తనపై పడే సూర్యరశ్మిలో నూటికి 7 వంతులనే ప్రతిఫలిస్తాడు. సరిగ్గా బుధుడు కూడా అంతే!

ఈ రెండు గోళాలూ కూడా ఒకే విధమైన మసిబారిన అద్దాల వంటివి.

ఆకారంలోనూ, లక్షణాలలోనూ ఇన్నివిధాల ఒకేవిధంగా ఉన్నందువల్లనే బుధుణ్ణి, చంద్రుని కొడుకుగా బ్రహ్మదేవుడు చెప్పాడన్నారు. నిజానికి ఈ పోలికలన్నింటినీ గమనించినది బ్రహ్మదేవుడు కానేకాదు. ఆనాటి మహర్షులే ఇవన్నీ తెలుసుకున్నారు. బుధుడు సూర్యుని నుండి ఉద్భవించాడని చెప్తూనే, అతని పోలికలు - చంద్రుని పోలి ఉన్నాయనే విషయాన్ని కూడా విశదీకరించారు మహర్షులు. (గ్రీకుల పురాణాల ప్రకారం బుధుడు, బృహస్పతి కొడుకే! రోమన్ల అభిప్రాయం కూడా అంతే! బృహస్పతిని గ్రీకులు 'జూస్' అనీ, రోమన్లు 'జూపిటర్' అనీ అనేవారు.

బుధుడిని గ్రీకులు 'హెర్మీస్' అనీ, రోమన్లు 'మెర్క్యూరీ' అనీ అనేవారు. జూస్ (జూపిటర్) కొడుకే హెర్మీస్ (మెర్క్యూరీ) అనేది వారి పురాణభావన. దీన్నిబట్టి హైందవ మహర్షుల సిద్ధాంతమే సరైనదని తెలుస్తోంది చూడండి.)

తారాశశాంక కథలో ఇంద్రుని ప్రస్తావన, శుక్రుని ప్రస్తావన కూడా వస్తుంది. ఇంద్రుడంటే 'విషువత్ రేఖయే!' శుక్రుడంటే శుక్రగ్రహమే! విషువత్ రేఖ దగ్గరలో (అనగా సంవత్సరాది సమయంలో) 'సూర్యుడు, చంద్రుడు, బృహస్పతి, బుధుడు, శుక్రుడు, రాహువు లేదా కేతువు అనే ఛాయాగ్రహం'ల కూటమి ఏర్పడిన సందర్భంలో సంపూర్ణ సూర్యగ్రహణం ఎప్పుడు వచ్చిందీ తెలుసుకుంటే, బుధగ్రహాన్ని కనుగొన్నకాలం ఖచ్చితంగా తెలుస్తుంది. (సూర్యకుటుంబంలో ఇతర గ్రహాలు అంతకుముందే కనుగొన బడ్డాయి.) తారాశశాంక కథ, బుధగ్రహాన్ని కనుగొన్న కాలానిది. ఖగోళపరమైన ఆధారాలతో వెనక్కి లెక్కలు వేసుకుంటూ వెళ్తే, మన ఖగోళ విజ్ఞాన ప్రాచీనత తెలిసివస్తుంది. పురాణ కథల్ని అర్థం చేసుకోగల ఓపిక లేకపోతే, నోరు మూసుకుని కూర్చోవాలి. అంతేగాని ప్రతిదాన్నీ పుక్కిట పురాణమంటూ తీసి పారెయ్యడం మేధావుల లక్షణం కాదు. ఒక శృంగార పురాణ కథగా మలచబడిన తారాశశాంకంలో ఎంతో ఖగోళ పరిజ్ఞానం ఉంది. దాన్ని అర్థం చేసుకోలేని అమాయకులకు, కేవలం అదొక బూతు కథ మాత్రమే! ఈ కథలో దాగిఉన్న ఖగోళ అంతరార్థాలను వరుసగా ఓసారి చెప్పుకుందాం.

(1) సూర్యుడు కూడా ఒక నక్షత్రం అని తెలుసుకోవడం.

(2) గ్రహాలన్నింటిలో పెద్దదిగా గమనించిన బృహస్పతిని, గురు(వు) గ్రహంగా భావించడం.

(3) గ్రహణ సమయాన్ని లెక్కించి, ఖగోళ పరిశోధనలకు వాటిని అనుకూల సమయాలుగా వాడుకోవడం. (సంపూర్ణ గ్రహణ సమయాల్ని ఇప్పటి ఖగోళ పరిశోధకులు కూడా చాలా మంచి అవకాశాలుగా వాడుకుంటూ ఉంటారు.)

(4) సంపూర్ణ సూర్యగ్రహణాన్ని క్షుణ్ణంగా పరిశోధించడం.

(5) బుధగ్రహాన్ని కనుగొనడం.

(6) బుధగ్రహం, సూర్యుని నుండి ఏర్పడినదేనని నిర్ధారణ చేయడం.

(7) విషువత్ రేఖ వద్ద సూర్యునితో పాటూ జరిగిన గ్రహకూటమిని గమనించడం.

(8) బుధగ్రహ ఆకారాన్ని, లక్షణాలనూ పరిశీలించడం.

(9) అంతకు ముందుగానే కనుగొన్న చంద్రుని రూప, లక్షణాలను బుధునితో పోల్చి చెప్పడం.

మొత్తంమీద ఇవన్నీ పై కథలోని ఖగోళ అంశాలే! ప్రాచీన హైందవులకు గల గ్రహణాల విజ్ఞానాన్ని ఈ తారాశశాంకం కథ నిరూపిస్తోంది.

పురాణ కథల్లోని అంతరార్థాల్ని వెలికి తియ్యడం ద్వారా మనదేశ కీర్తి ప్రతిష్ఠల్ని మరింత పెంచవచ్చు. ఆధునిక మేధావినని అనుకునే వ్యక్తి, పురాణాల్ని సమర్థించే సాహసం చేయలేకపోతున్నాడు. అలా చేస్తే తనను ఛాందసుడుగా లెక్కిస్తారేమోనని అతని భయం. పురాణాల్లో దాగిఉన్న అనంతమైన విజ్ఞానాన్ని బయటకు తీయగలిగిన వారు కూడా నిజమైన మేధావులని గ్రహించేకాలం రావాలి. అప్పుడే మన ప్రాచీన విజ్ఞానానికీ, చరిత్రకూ సార్థకత కలుగుతుంది.

★ ★ ★

# 8. గ్రహ శకలాలను గురించి...

గ్రహశకలాలు అంటే గ్రహానికి చెందిన ముక్కలని అర్థం. ఇటువంటి ముక్కలు అసంఖ్యాకంగా మన సూర్యకుటుంబంలోని కుజ, గురు గ్రహాల మధ్యగా తిరుగుతున్నాయి. ఈ గ్రహశకలాలను "గ్రహ శకలాల మండలం" (యాస్టెరాయిడ్స్ బెల్ట్) అంటారు. అయితే సూర్యకుటుంబంలోని గ్రహశకలాలు మొత్తం అన్నీ ఈ మండలంలోనే లేవు. కొన్ని గ్రహ శకలాలు ఇతరితర గ్రహాల కక్ష్యల దగ్గర్లోకి వస్తూ కూడా తిరుగుతుంటాయి. వాటిలో ఏదైనా ఎప్పుడైనా భూమిపై పడుతుందేమోనని ఆధునిక శాస్త్రవేత్తలు ఇప్పటికీ అదిరిపడుతూనే ఉన్నారు. ఈ గ్రహశకలాలు ఎలా ఏర్పడ్డాయనే విషయాన్ని మన శాస్త్రవేత్తలు సరిగా చెప్పలేకపోతున్నారు. భిన్నాభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. గ్రహ శకలాల సైజుల్లో తేడాలుంటాయి. కొన్ని రాతి బండల సైజులోనూ, మరికొన్ని పెద్దపెద్ద పర్వతాల సైజులోనూ ఉంటాయి. ఈవిధంగా ఇవి, అతి చిన్న పరిమాణం నుండీ అతిపెద్ద పరిమాణం వరకూ ఉంటాయి. పెద్ద గ్రహశకలం అంటే మైళ్ళకొలదీ పొడవు, వెడల్పులను కలిగి ఉంటుంది. భూమి కక్ష్యకు దగ్గరగా తిరుగుతూ ఉండే గ్రహశకలాలు అప్పుడప్పుడూ భూమి ఆకర్షణకు లోనై భూమిపై పడుతుండేవి. ఇది కృతయుగం నాటి మాట. వీటిని "రెక్కల పర్వతాలు" గా పురాణాల్లో వర్ణించారు. ఈ రెక్కల పర్వతాల వల్ల నగరాలు, పట్టణాలు

నాశనమౌతుండడంతో, ఇంద్రుడు వాటి రెక్కల్ని నరికివేశాడట. అక్కడితో భూమికి రెక్కల పర్వతాల బాధ తప్పిందట. పురాణకాల ఋషులు తమకుగల గ్రహశకలాల పరిజ్ఞానాన్ని బట్టి ఈవిధమైన వర్ణన చేశారన్నమాట. మన భూమికి గ్రహశకలాల బాధ, పురాణకాలంలోనే అంతమయింది.

ఈ గ్రహశకలాలను గురించిన ప్రస్తావన మనకు రామాయణంలో కూడా కన్పిస్తుంది. సీతాన్వేషణలో హనుమంతుడు గాలిలో ఎగురుతూ సముద్రాన్ని దాటుతూ ఉంటాడు. అప్పుడు సముద్రంలో నుండి 'మైనాకుడు' అనే పర్వతం పైకి లేచివచ్చి, హనుమంతుణ్ణి తనపై కాస్త విశ్రాంతి తీసుకోమంటాడు. మైనాకుడు అనే ఈ పర్వతం, ఒక గ్రహశకలమే! ఈ విషయాన్ని మైనాకుని మాటలవల్ల మనం గ్రహించవచ్చు. "ఓ హనుమా! కాస్సేపు నా శిఖరంపై నిలచి, నా ఆతిథ్యం స్వీకరించు. నేను నీ హితుణ్ణి. ఎలాగంటే చెప్తాను, విను. కృతయుగంలో పర్వతాలకు రెక్కలుండేవని వినేవుంటావు. అవి ఆకాశంలో ఎగురుతూ ఉండేవి. ఏ సమయంలో ఎక్కడ వాలి, అవి ప్రాణికోటిని పిండి చేస్తాయోనని అందరికీ భయంగా ఉండేది. అప్పుడు సర్వ దేవత, మానవ, ఋషిగణాలు ప్రార్థించగా ఇంద్రుడు ఆ పర్వతాల రెక్కలు నరికేశాడు. ఆ రెక్కల పర్వతాల్లో నేనూ ఒకణ్ణి. నా రెక్కలు నరికివేయబడ్డ సమయంలో నీ తండ్రి వాయుదేవుని సహాయంతో నేనీ లవణ సముద్రంలో సురక్షితంగా పడ్డాను. నీ తండ్రి చేసిన సహాయానికి ప్రత్యుపకారం నన్ను చెయ్యనీ!" అంటాడు మైనాకుడు.

పై సంఘటన ఆధునిక గ్రహశకలాల పరిజ్ఞానానికి అనుకూలంగానే కన్పిస్తుంది చూడండి. రామాయణ రచయిత అయిన వాల్మీకి తనకుగల గ్రహశకలాల పరిజ్ఞానాన్ని పైవిధంగా మనకు అందించాడు. నిజ విజ్ఞానాన్ని సూటిగా చెప్పకుండా, ఒక అందమైన కథగా అల్లి చెప్పడం మన మహర్షులకు అలవాటే కదా! మైనాకుడు అంటే భూమికి దగ్గరగా తిరిగే ఒక గ్రహశకలం అన్నమాట. అది ఎప్పుడో భూమి ఆకర్షణకు లోనై వచ్చి, సముద్రంలో పడిఉంటుంది. భూమి పైకి చేరుకునే లోపులో గాలి ఒరిపిడికి గ్రహశకలాలు మాడిమసికావచ్చు. అయితే మైనాకుడు మాత్రం క్షేమంగా వచ్చి, సముద్రంలో పడడం జరిగింది. దారిలో వాయుదేవుడు దయచూపడం వల్లనే, తాను మాడిమసికాకుండా ఉండడం జరిగిందని మైనాకుని భావన. పూర్వం భూమిపై పడుతుండే గ్రహశకలాల్లో ఇంచుమించుగా చివరి గ్రహశకలం ఇదే కావచ్చు. వాల్మీకి దానికి 'మైనాకుడు' అని ఒక ముద్దుపేరు పెట్టాడు. స్వేచ్ఛగా తిరుగుతూ అప్పుడప్పుడు భూమిపై రాలిపడే గ్రహశకలాలను 'రెక్కలున్న పర్వతాలుగా" మన మహర్షులు వర్ణించడం సమంజసంగానే కన్పిస్తుంది. భూమి ఆకర్షణకు అవి రాలిపడడాన్నే, ఇంద్రుడు వాటి రెక్కలు నరికితే కూలిపోవడంగా వారు వర్ణించారు. ఇటువంటి

పురాణ విశేషాలను అర్థం చేసుకోగలిగితే, అవన్నీ విజ్ఞాన గుళికలే!

(ఇప్పటికీ మనకు టెలిస్కోపుల్లో కన్పిస్తూ తిరుగుతున్న గ్రహశకలాలు అనేకం ఉన్నాయి. వాటిలో కొన్నింటికి "సెరిస్, ఇరాస్, ఇకారస్, జూనో, అపోలో, హెర్మిస్, వెస్టా, ఎడోనిస్, ఎమర్, యాస్ట్రీ" అంటూ రకరకాల పేర్లుకూడా పెట్టడం జరిగింది. ఇవి గ్రహాల వలె తమచుట్టూ తాము తిరుగుతూ ఉంటాయి. 'ఇకారస్, అపోలో, ఎడోనిస్, హెర్మిస్, ఇరాస్, ఎమర్' అనే గ్రహశకలాలు అప్పుడప్పుడూ మన భూమికి దగ్గరగా వచ్చి వెళ్తూ, మనల్ని భయపెడుతూ ఉంటాయి. రెక్కల పర్వతాలనబడే ఈ గ్రహశకలాలను గురించి పురాణ కాలంలోనూ ఇలాగే భయపడుతూ ఉండేవారు. 'ప్రస్తుతం ఏ గ్రహశకలం మన భూమిని ఢీకొట్టినా, వెయ్యి హైడ్రోజన్ బాంబులు పేల్చినంత విధ్వంసం జరుగుతుందని' ఆధునిక శాస్త్రవేత్తల అంచనా. అయితే ఇప్పుడప్పుడే ఏ గ్రహశకలమూ కూడా భూమిని ఢీకొట్టే ప్రసక్తి లేదని వారు చెప్తున్నారు. కాబట్టి మీరేం భయపడకండి.)

★ ★ ★

# 9. పురాణంలో కాంతివేగ ప్రయాణం

ఇంతవరకూ కనుగొన్న ప్రకారం విశ్వంలో అన్నింటికంటే వేగంగా ప్రయాణించగల శక్తి 'కాంతి' (Light) కి ఉంది. (కాంతికంటే వేగంగా పయనించే 'వాయు వాహినులను' విశ్వంలో కనుగొన్నామని ఇటీవల కొంతమంది శాస్త్రవేత్తలు చెప్తున్నారు. ఆ విషయం గురించి ఇంకా చాలా పరిశోధనలు జరుగవలసి ఉన్నది. నిర్ధారణగా చెప్పాలంటే, ప్రస్తుతానికి మాత్రం అన్నింటికంటే వేగంగా పయనించేది కాంతియే!) ఈ విషయం మన పూర్వులకు తెలియనిది కాదు. అన్నింటికంటే వేగంగా పయనించేది 'కాంతి' అని ప్రస్కణ్వ మహర్షి, ఋగ్వేదంలో చెప్పాడు. కాంతి 1 సెకను కాలానికి సుమారుగా 1,87,000 మైళ్ళదూరం ప్రయాణించగలదని ఆధునిక శాస్త్రవేత్తలు తేల్చారు. దీనిప్రకారం కాంతి 1 సంవత్సర కాలంలో దాదాపుగా 6 లక్షల కోట్లమైళ్ళ దూరం ప్రయాణిస్తుంది. ఈ 6 లక్షల కోట్ల మైళ్ళ దూరాన్నే నేటి శాస్త్రవేత్తలు "కాంతి సంవత్సరం" (Light Year) అంటారు. భూమినుండి నక్షత్రాల దూరాలను మామూలు దూరమానంలో కాకుండా, కాంతి సంవత్సరాలలో లెక్కిస్తారు. కోటానుకోట్ల మైళ్ళ దూరాల్లో ఉండే నక్షత్రాలకు ఇటువంటి లెక్క అవసరం. (సుమారు 26 లక్షల కోట్ల మైళ్ళ దూరంలో ఉన్న 'ఆల్ఫా సెంటారై' అనే నక్షత్రం నుండి బయలుదేరిన కాంతి, మన దగ్గరకు రావడానికి 4 సంవత్సరాలకు పైగా (4.3 సం॥) సమయం పడుతుంది.

అందుచేత ఆల్ఫాసెంటారై అనే నక్షత్రం మనకు 4.3 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నట్లుగా శాస్త్రవేత్తలు చెప్తారు. ఈ ప్రకారంగా రోహిణీ అనే నక్షత్రం మనకు 57 కాంతి సంవత్సరాల దూరంలో ఉందట.)

కాంతివేగాన్ని పురాణకాలంలోనే మనవారు చక్కగా గణించారు. వారి లెక్కతో ఆధునిక పాశ్చాత్యుల లెక్క సరిగ్గా సరిపోయింది. వాటి వివరాలు ఈ క్రింద ఇస్తున్నాం చూడండి.

## కాంతివేగం గురించి మన పూర్వీకుల లెక్క

కాంతివేగం గురించి మన పూర్వీకులు, శ్లోకరూపంలో ఇలా చెప్పారు :

శ్లో॥ యోజనానాం సహస్రేద్వే ద్వేశతే ద్వేచయోజనే
ఏకేన నిమిషార్ధేన క్రమమాణ నమోస్తుతే॥

ఋగ్వేదంలోని 1-50-4 సూక్తానికి వ్యాఖ్యానం వ్రాస్తూ విద్యారణ్యులు, భాస్కర రామాయణమును తెనిగిస్తూ మల్లికార్జున భట్టు, మహాభారతంలో ఆదిపర్వం నందలి తపతి సంవరణోపాఖ్యానమున నన్నయభట్టారకుడు, కాశీఖండ గ్రంథాన్ని వ్రాస్తూ (III - 176 లో) శ్రీనాథుడు "పై శ్లోక ప్రమాణమును బట్టి" కాంతివేగం అర్థ నిమేషాన 2,202 యోజనాలని చెప్పుకొచ్చారు. అంటే అర (1/2) నిమేషంలో కాంతి 2,202 యోజనాల దూరం ప్రయాణిస్తుందని భావం. ఈ సందర్భంలో 'నిమేషము' అనగా ఆంగ్లేయులు వాడే 'నిముషం' (Minute) అనే పదం కాదు. మన హైందవ కాలమానానికి చెందిన 'నిమేషం' అనే మరో పదం ఇది. ఈ సందర్భానికి చెందిన హైందవ కాలమానం ఇలా ఉంటుంది చూడండి :

15 నిమేషములు = 1 కాష్ఠ; 30 కాష్ఠలు = 1 కళ;
30 కళలు = 1 ముహూర్తం; 30 ముహూర్తాలు = 1 రోజు.

అనగా 1 రోజుకు = 15 × 30 × 30 × 30 = 4,05,000 నిమేషాలు.

1 రోజుకు 4,05,000 నిమేషాలు. (పూర్వ హైందవ కాలమాన ప్రకారం.)

ఈసారి ఆంగ్ల కాలమానాన్ని చూద్దాం.

60 సెకనులు = 1 నిముషం; 60 నిముషాలు = 1 గంట;
24 గంటలు = 1 రోజు.

అనగా 1 రోజుకు = 60 × 60 × 24 = 86,400 సెకన్లు.

1 రోజుకు 86,400 సెకన్లు (ఆంగ్ల కాలమాన ప్రకారం)

పూర్వహైందవ కాలమానమును, ఆంగ్లేయ కాలమానముతో పోల్చిచూడగా 4,05,000 నిమేషాలు = 86,400 సెకన్లు.

అనగా 75 నిమేషముల కాలం, 16 సెకన్లకు సరిపోతుంది.

∴ 1 నిమేషము = 16/75 సెకన్లు.

అర్థ (1/2) నిమేషమునకు 8/75 సెకన్లు.

ఈ లెక్కన, మన పూర్వీకులు ఇచ్చిన వివరణ ప్రకారం 8/75 సెకన్ల కాలంలో కాంతి 2,202 యోజనాల దూరం వెళ్తుంది. 1 యోజనం అనగా ఇంచుమించుగా "9 మైళ్ళు". అనగా 8/75 సెకన్లలో కాంతిపోవు దూరం సుమారుగా 20,000 మైళ్ళు. దాని ప్రకారం 1 సెకనులో కాంతివేగం 1,87,500 మైళ్ళు అవుతుంది.

మొత్తంమీద తేలినదేమంటే - అర్ధనిమేషాన (అనగా 8/75 సెకన్ల కాలంలో) కాంతి, 2202 యోజనాలు పోవుననే లెక్కననుసరించి చూడగా కాంతివేగం నేటి ఒక సెకనుకూ 1,87,500 మైళ్ళు అని తెలియవచ్చింది. ఆధునిక పాశ్చాత్యుల లెక్క ప్రకారం కూడా కాంతివేగం సెకనుకూ (దాదాపుగా) అంతే కదా!

పై వివరాల్ని బట్టి మన పూర్వీకులకు కాంతివేగం గురించి స్పష్టమైన అవగాహన ఉన్నదని తెలియవస్తుంది. (కాంతివేగాన్ని గురించి మన పూర్వీకుల పరిజ్ఞానం అనే అంశాన్ని శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావు గారి "నక్షత్రాలు" అనే గ్రంథం (1954 నాటి ప్రచురణ) నుండి సేకరించడం జరిగింది.)

## ఇతర నక్షత్ర కుటుంబాల వద్దకు ప్రయాణాల్ని గూర్చి

ఇతర నక్షత్ర కుటుంబాల వద్దకు వెళ్ళాలంటే, మనం కాంతి వేగంతో ప్రయాణం చేయగలగాలి. లేకుంటే ఆటువంటి అంతరిక్షయానాలకు తరతరాల జీవితకాలాలు కూడా సరిపోవు. అయితే కాంతివేగంతో ప్రయాణంచేయడం మనకు అసాధ్యమైన పని. కాంతి వేగంతో మన అంతరిక్షనౌకలు ప్రయాణిస్తే, అవి మన భూవాతావరణం దాటేలోపుగానే భగ్గున మండి, మసి అవుతాయి. కాంతి వేగంతో ప్రయాణించగల అంతరిక్ష నౌకల్ని తయారుచేయడం ప్రస్తుతానికి మన వల్ల కాదు. కనీసం సూర్య కుటుంబం అంతా తిరిగొచ్చే ఓపికే మనకు లేదు. ఇక ఇతర నక్షత్రకుటుంబాల సంగతి దేవుడెరుగు.

కాంతి వేగంతో ప్రయాణిస్తే 'ఏం జరుగుతుంది? ఎలా ఉంటుంది?' అనే విషయాలను మాత్రం కొన్నింటిని ఆధునిక శాస్త్రవేత్తలు తెలుసుకున్నారు. కాంతివేగంతో ప్రయాణించే వారి వయస్సు పెరగదట. కాంతివేగంతో ప్రయాణించే వారి చేతి గడియారాల ముళ్ళు కూడా తిరగవట. వారికి సంబంధించినంతవరకూ కాలం స్తంభిస్తుందన్నమాట. కాంతివేగ ప్రయాణం వల్ల వయసు పెరగదు అనేమాట, ఆధునిక సైన్సు చెప్తున్న యథార్థం. అయితే పురాణకాలంలోనే మనవాళ్ళకు ఈ విషయం తెలుసు. అలనాటి దేవీ భాగవతంలో దీనికి సంబంధించిన ప్రస్తావన కన్పిస్తుంది. (శ్రీకృష్ణుని అన్నగారైన బలరాముని వివాహ సందర్భంలో ఈ ప్రస్తావన వస్తుంది.)

**బలరాముని వివాహ సందర్భం :** పూర్వకాలంలో రేవతుడు అనే మహారాజు ఉండేవాడు. ఆయనకు రేవతి అనే అందాల కుమార్తె ఉండేది. రేవతికి పెళ్ళీడు వచ్చింది. ఆమెకు తగిన వరుడికోసం, భూమండలంలోని దేశాలన్నీ గాలించాడు రేవతుడు. అయితే తగిన వరుడు ఆయనకు ఎక్కడా కన్పించలేదు. తన కుమార్తెకు తగిన వరుడు ఎక్కడున్నాడో, బ్రహ్మదేవుణ్ణి అడిగి తెలుసుకుందామనుకున్నాడు. తనకు గల పుణ్యశక్తితో కుమార్తెతో పాటూ అంతరిక్షయానం చేసి, బ్రహ్మలోకం చేరుకున్నాడు. (భూమిపై ప్రకృతి రూపంలో ఉన్నది బ్రహ్మదేవుని అంశ మాత్రమే! అసలు బ్రహ్మదేవుడు అంతరిక్షాన సత్యలోకంలో ఉన్నాడని పురాణ భావంగా గ్రహించాలి మనం.) అక్కడ బ్రహ్మదేవుని దర్శించుకున్న రేవతుడు "విధాతా! మా అమ్మాయికి తగిన వరుణ్ణి నిర్ణయించడం నావల్ల కాలేదు. నాకు తగిన అల్లుడు ఎక్కడున్నాడో దయచేసి తెలుపండి" అని కోరాడు. అతని మాటలకు బ్రహ్మదేవుడు చిరునవ్వు నవ్వి, "రేవతా! నువ్వూ, నీ కుమార్తె భూలోకం వదిలిపెట్టి, దివ్యలోకాల పరిధిలోకి వచ్చేశారు. మీరు చేసిన ఈ దివ్య ప్రయాణంవల్ల మీ ఇద్దరి వయసులూ ఏమాత్రం పెరగలేదు. అవతల భూలోకంలో మాత్రం తరాలు మారిపోయాయి. ఈ సత్యలోకంలోని ఒక్క క్షణం, భూలోకంలోని వంద సంవత్సరాలకు సమానం. ఇప్పుడు భూలోకంలో ఎన్నో మార్పులు జరిగాయి. కొన్నివేల సంవత్సరాలు గడచిపోయి, యుగమే మారిపోయింది. ఇప్పుడు 28వ ద్వాపరయుగం నడుస్తున్నది. నువ్వు పరిపాలించిన ఆనర్తదేశమూ, కుశస్థవ రైవతగిరి ప్రాంతమూ అన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. అనాటి రాజులూ, రాజకుమారులూ ఎవరూ లేరక్కడ. అక్కడ ఇప్పుడున్నది మరో ప్రపంచం. మీరు తిరిగి భూలోకం వెళ్ళండి. అక్కడ నీకు అల్లుడు కాదగినవాడు ద్వారకా నగర నివాసి అయిన బలరాముడు. కృష్ణపరమాత్మకు అన్నగారైన బలరాముడు మీ అమ్మాయికి తగిన జోడీ. వారి వివాహం జరిపించి, నువ్వు బదరికా వనానికి వెళ్ళి తపస్సు చేసుకో" అన్నాడు. రేవతుడు తన కుమార్తెతో సహా భూలోకానికి

తిరిగివచ్చి బ్రహ్మదేవుని ఆనతి ప్రకారం, వివాహాన్ని జరిపించాడు. (ముందుతరాల యువతి కనుక రేవతి, బలరాముని కంటే పొడవుగా ఉందట. బలరాముడు తన హలాయుధ శక్తిచే ఆమెను తనకు తగిన ఎత్తులోకి మలచుకున్నాడట.)

పై పురాణగాథలో మనకు అనేక సైన్సు విషయాలు గోచరిస్తున్నాయి. ఎక్కడో అంతరిక్షంలో ఉన్న బ్రహ్మలోకానికి వెళ్ళాలంటే, కాంతివేగంతో ప్రయాణం తప్పనిసరి! రేవతుడు తనకున్న యోగబలంతో కుమార్తెతో సహా ఆ విధంగా ప్రయాణించగలిగాడు. ఇది కల్పితమేమీ కాదు. ఎందువల్లనంటే కాంతివేగ ప్రయాణంవల్ల ఏర్పడే యథార్థ పరిణామాలు ఈ గాథలో స్పష్టంగా వివరించబడ్డాయి. రేవతునికి, అతని కుమార్తెకూ వయసులు పెరగకపోవడం, ఈలోగా భూమిపై తరతరాలు మారి యుగమార్పు సంభవించడం ..... ఇందుకు నిదర్శనాలు. ఇలాంటి దివ్యలోక, దేవలోక ప్రయాణాలు పురాణాల్లో సహజం. నాటి మహనీయుల తపోశక్తి, యోగశక్తి, పుణ్యఫలాల వల్ల అసాధ్యాలన్నీ సుసాధ్యాలయ్యేవి. ఈనాడు మానసికంగా భ్రష్టుడైన మనిషి అటువంటి దివ్యశక్తులను సాధించలేడు. కనీసం వాటిని నమ్మలేడు కూడా!

కుమార్తెతో సహా రేవతుడు కాంతివేగంతో ప్రయాణం చేయడం అసాధ్యమంటూ ఎవరైనా వితండవాదం చేయవచ్చు. ఆ ప్రయాణం సంగతి ఎలావున్నా, మన పురాణకాలం వారికి 'కాంతి వేగ ప్రయాణం గురించీ, దాని ఫలితాలను గురించీ' మాత్రం స్పష్టంగా తెలుసునని నిరూపణ అవుతోంది. అది చాలా ఘనమైన విషయం. ఆ విషయాన్ని కాదనేందుకు మాత్రం ఎవరికీ అవకాశం లేదు.

★ ★ ★

# 10. ఇతర నక్షత్ర కుటుంబాల్లో ప్రకృతి, జీవరాశి గురించి...

సూర్యుణ్ణీ, దానిచుట్టూ తిరుగుతున్న గ్రహాలనూ, ఉపగ్రహాలనూ, గ్రహ శకలాలనూ కలిపి "సూర్యకుటుంబం" అంటున్నాం. ఈ సూర్యకుటుంబంలో ప్రకృతీ, జీవరాశీ ఒక్క భూగోళం మీదనే ఉందని తెలుసుకున్నాం. విశ్వంలోని ఒకానొక నక్షత్రం సూర్యుడు. సూర్యునికంటే పెద్దా, చిన్నా అయిన నక్షత్రాలు విశ్వంలో కోటానుకోట్లున్నాయి. సూర్యునికి నవగ్రహ కుటుంబం ఉన్నట్లే విశ్వంలోని ప్రతి నక్షత్రానికీ, ఒక గ్రహ కుటుంబం ఉండే అవకాశం ఉంది. సూర్యకుటుంబంలో భూగ్రహంపై ప్రకృతి, జీవరాశి ఉన్నట్లే "ప్రతి నక్షత్ర కుటుంబంలోనూ ఏదొక గ్రహంపై

ప్రకృతి, జీవరాశీ ఉండవచ్చు." ఒక నక్షత్ర కుటుంబంలోని గ్రహాల్లో, ఆ నక్షత్రం యొక్క ఉష్ణోగ్రత సరిపడిన గ్రహంపై ప్రకృతీ జీవరాశులు పుడతాయనేది శాస్త్రీయ సత్యం! దీనిప్రకారం చూడగా ఇతర నక్షత్ర కుటుంబాల్లో వివిధ గ్రహాలపై వివిధ రకాల జీవరాశులుండవచ్చునని ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తలు కూడా భావిస్తున్నారు.

## పురాణాలు ఇస్తున్న సాక్ష్యాలు

ఇతర నక్షత్ర కుటుంబాల్లో ప్రకృతీ జీవరాశులున్నాయనే విషయాన్ని మన పురాణాలు బలపరుస్తున్నాయి. పురాణాల్లో వివిధ సందర్భాల్లో పేర్కొనబడిన వివిధ లోకాలూ, దేవతా జాతులూ మొదలైనవన్నీ ఇతర నక్షత్ర కుటుంబాలకు చెందినవే! పురాణకాలంలో మంత్రయుక్తంగానూ, యంత్రయుక్తంగానూ కూడా భూగోళం నుండి ఇతర నక్షత్ర కుటుంబాలకు ప్రయాణాలు సాగిన దాఖలాలు కన్పిస్తున్నాయి. రానురాను ఈనాటికి మానవజాతి శక్తిహీనం కావడంతో "చంద్రలోక ప్రయాణమే అతి గొప్ప ప్రయాణంగా" తలచి మురిసిపోయే పరిస్థితి ఏర్పడింది.

ఇతర నక్షత్ర కుటుంబాల్లో వివిధ చోట్ల ప్రకృతి ఉన్నట్లుగా కూర్మ పురాణం ద్వారా తెలుస్తోంది. ఆ విషయాన్ని పరిశీలిద్దాం.

**బ్రహ్మదేవుని గర్వభంగం కథ :** భూగోళంపై జీవసృష్టికి తానే మూలమని, తాను ఏకైక సృష్టికర్తననీ బ్రహ్మదేవుడు గర్వించాడట ఒకసారి. ఆ విషయం తెలుసుకున్న శ్రీమహావిష్ణువు బ్రహ్మను తనకూడా తీసుకువెళ్ళి, విశ్వంలో అనేకచోట్ల ఉన్న చాలామంది బ్రహ్మల్ని చూపించాడట. తనవంటి బ్రహ్మలు విశ్వమంతటా అనేకచోట్ల ఉండడంతో ఈ బ్రహ్మగారి గర్వం అణిగిపోయిందట. ఇదంతా పురాణ విషయం. అయితే ఇందులో చాలా అంతరార్థం వుంది. బ్రహ్మదేవుడు అనగా ప్రకృతి అని ఇంతకుముందే మనం తెలుసుకున్నాం. విశ్వంలో అనేకచోట్ల బ్రహ్మలు ఉండడం అంటే, విశ్వమంతటా ఇతర నక్షత్రకుటుంబాల్లో అనేకచోట్ల 'ప్రకృతి' ఉన్నదని భావం. నిజానికి భూగోళపు బ్రహ్మగారికి గర్వమూ రాలేదు. విష్ణువు ఆయన్ని విశ్వమంతా త్రిప్పి, గర్వభంగం చేయనూలేదు. అదంతా మన ఋషీశ్వరులు చేసిన చమత్కార వర్ణన. విశ్వంలోని ఇతర నక్షత్రకుటుంబాల్లో అనేకచోట్ల ప్రకృతి ఉన్నదని తెలిసిన హైందవ ఋషీశ్వరులు ఆ విషయాన్ని "బ్రహ్మదేవుని గర్వభంగం" కథగా కూర్మపురాణంలో గ్రంథస్థం చేశారు. అదీ అసలు సంగతి! (ప్రకృతి ఉన్నచోట జీవరాశి ఎలాగూ ఉద్భవించి తీరుతుంది. ఆ విషయం మన పురాణకాలం వారికీ తెలుసు.) (ఈ సందర్భంగా మరో విషయం కూడా తెలుసుకుందాం. భూగోళాన్ని 'మహేశ్వరునిగా'

ఇంతకుముందు చెప్పుకున్నాం కదా! భూమిపై ఉండే సర్వభూతాలకూ అనగా సకల జీవరాశికీ అధినాథుడు ఆయన. అందువల్లనే ఆయన్ని 'భూతనాథుడు' అనికూడా అంటారు. సర్వభూతాలూ నివసిస్తున్న గ్రహాన్ని ఈ కారణంగా 'మహేశ్వర గ్రహం' అనవచ్చు. మన భూమి ఒక మహేశ్వర గ్రహమే! ఇటువంటి మహేశ్వర గ్రహాలు, ఇతర నక్షత్ర కుటుంబాల్లో కూడా ఉండి ఉంటాయి. మహేశ్వరునకు 'రుద్రుడు' అనే పేరుకూడా ఉంది. విశ్వంలో అనేకమంది రుద్రులు ఉన్నట్లుగా పురాణాలు చెప్తున్నాయి. అంటే విశ్వంలో జీవరాశిగల గ్రహాలు ఇంకా అనేకం ఉన్నట్లు చెప్తున్నాయన్నమాట. ఈ విషయాన్ని కూడా మనం శ్రద్ధగా గమనించాలి.)

ఇంతవరకూ పురాణపరంగా చర్చించుకున్నాం సరే! ఈసారి ఆధునిక శాస్త్రీయ అంశాల ద్వారా పరిశీలిద్దాం. ఒక గ్రహంపై ప్రకృతి, జీవరాశులు ఉద్భవించాలంటే దానికి తగినంత 'నక్షత్ర ఉష్ణోగ్రత' అందవలసి ఉంటుందని ఆధునిక సైన్సు చెప్తోంది. సూర్యుడనే నక్షత్రపు ఉష్ణోగ్రత ప్రస్తుతం మన భూమికి సరిపోయి ఉండడంతో, మన భూగోళంపై ప్రకృతీ జీవరాశులు ఉద్భవించాయి. సూర్యకుటుంబంలోని గ్రహాల్లో ప్రస్తుతం ఒక్క భూగోళానికి మాత్రమే ఈ అవకాశం లభించింది.

**ఆధునిక శాస్త్రవేత్తల భావన :** సూర్యునికి ఒక గ్రహకుటుంబం ఉన్నట్లుగానే విశ్వంలోని మిగిలిన నక్షత్రాలకు కూడా గ్రహకుటుంబాలు ఉంటాయని ఆధునిక ఖగోళ శాస్త్రవేత్తల భావన. ఆ గ్రహకుటుంబాల్లో ఆయా నక్షత్రాల ఉష్ణోగ్రతలు సరిపడిన గ్రహాలు "ప్రకృతీ జీవరాశుల్ని" కలిగి ఉండవచ్చునని కూడా నేటి శాస్త్రవేత్తలు భావిస్తున్నారు.

ఇతర నక్షత్ర కుటుంబాల్లో ప్రకృతీ జీవరాశులున్నాయని చెప్తున్న పురాణ విషయాలకు, ఆధునిక శాస్త్రవేత్తల భావనలు అనుకూలంగానే ఉన్నాయి. ఈ విధంగా పురాణమూ, ఆధునిక సైన్సూ ఒకే దిశలో ఉన్నాయి, గమనించండి.

ఇతర నక్షత్ర కుటుంబాల్లో జీవరాశి ఉండవచ్చునని ఊహిస్తున్న ఆధునిక శాస్త్రవేత్తలు, ఆ విషయాన్ని నిర్ధారణ చేసుకునేందుకు కొన్ని చర్యల్ని చేపడుతున్నారు. ఆ చర్యల్లో భాగంగా అమెరికా లోని "నాసా పరిశోధనా సంస్థ" 1972 మార్చి 3వ తేదీన "పయొనీర్-10" అనే రోదశి నౌకను అంతరిక్షంలోకి ప్రయోగించింది.

**పయొనీర్-10 విశేషాలు :** మన సూర్యకుటుంబాన్ని దాటుకుని ఇతరితర నక్షత్ర కుటుంబాల్లోకి అలా దూసుకుంటూ పోయేలా ఈ రోదశినౌకను ప్రయోగించారు. ఇతర నక్షత్ర కుటుంబాల్లో ఎక్కడైనా బుద్ధి జీవులుంటే, వారికి మన గురించి తెలిపేందుకు ఆ నౌకలో ఒక ఫలకాన్ని ఉంచారు. "విశ్వంలో ఫలానాచోట ఉన్న

భూగోళం నుంచి, ఫలానా రూపంలో ఉన్న మానవుల నుంచి ఆ రోదశినౌక వచ్చినట్లుగా తెలియజేసే బొమ్మలతో, సంకేతాలతో నిండి ఉంది ఆ ఫలకం. (బ్రహ్మాండం విచ్ఛిన్నం కావడం, సూర్యకుటుంబం ఏర్పడి ఉన్న విధానం, భూగ్రహం నుండి ఆ రోదశినౌక వచ్చినట్లు తెలియజేయడం .... మొదలగు విషయాలు బొమ్మల రూపంలో ఆ ఫలకంపై చిత్రీకరించబడి ఉన్నాయి. ఫలకంపై ఒక ప్రక్కగా స్త్రీపురుష నగ్నచిత్రాల్ని కూడా వేశారు.) ఇతర నక్షత్ర కుటుంబాలవారు ఎవరైనా 'విజ్ఞాన వంతులయితే' పయొనీర్-10 ని దింపుకోగలిగి, మన ఫలకాన్ని చూస్తారు. లేదా పయొనీర్-10 వెలువరించే తరంగాలను పసిగట్టి, వాటికి అనుగుణంగా స్పందిస్తారు. ఏది ఏమయినా పయొనీర్-10 మాత్రం వారి దృష్టిలో పడితే, మనతో సంబంధాలను ఏర్పరచుకునేందుకు 'వారు' (అనగా అన్యలోకాల వారు) ఏవిధంగానైనా సరే తప్పక ప్రయత్నిస్తారని మన ఆశ!









ఎంతయినా ఆధునిక విజ్ఞానం కంటే, పురాణ విజ్ఞానం మెరుగైనదని చెప్పవచ్చు. ఎందువల్లనంటే ఆధునిక విజ్ఞానం ఒకవిధంగా సుఖాలను అందిస్తూనే, మరోవిధంగా కాలుష్యం వైపూ, వినాశనం వైపూ లాక్కుపోతోంది. పురాణ విజ్ఞానం మాత్రం చాలావరకూ అభివృద్ధి పథం వైపే సాగేది. నాటి సైన్సును నేటి సైన్సుతో పోల్చి చూస్తూ, కొన్ని యథార్థాలను తెలుసుకునేందుకు ముందు పేజీల్లోకి వెళ్దాం నడవండి.



## నాటి సైన్సు - నేటి సైన్సు

చివరిగా "నాటి సైన్సు - నేటి సైన్సు" అనే అంశాన్ని విశ్లేషించి చూద్దాం. సైన్సును కేవలం ఆధునిక కాలానికి చెందిన అంశంగా చాలామంది భావిస్తుంటారు. అయితే ఇంతవరకూ చర్చించబడిన విషయాలను చదివిన తర్వాత, ఆ భావం పొరబాటని వారంతా గ్రహించే ఉంటారు. కొన్ని విషయాల్లో ఇప్పటికంటే హెచ్చు పరిజ్ఞానం, మన పూర్వీకుల్లో కన్పిస్తుంది.

సైన్సు అనగా 'విజ్ఞానం' అని వ్యవహారిక భావన. ఈ విజ్ఞానం రెండుదారుల్లో పయనించగలదు. 1. సంక్షేమం వైపు, 2. వినాశనం వైపు.

పూర్వకాలపు విజ్ఞానం చాలావరకూ సంక్షేమం వైపు కొనసాగేది. మన ఆధునిక విజ్ఞానం మాత్రం హెచ్చుశాతం వినాశనం వైపుకే మొగ్గు చూపుతోంది. ఇది చాలా దురదృష్టకర పరిణామం. సైన్సు అభివృద్ధి పేరుతో మానవుని సంక్షేమం కోసం నేడు చేపడుతున్న చాలా కార్యక్రమాల వెనుక వినాశనం, కాలుష్యం ఉంటున్నాయి. ఇది అక్షర సత్యం!! నేటి మానవుడికి తక్షణ సుఖాల ఆరాటమే తప్ప, అనంతరం వచ్చే కష్టనష్టాల సంగతి అక్కర్లేదు. ఉదాహరణకు చూడండి. ప్రస్తుతం మానవజాతి అనుభవిస్తున్న ఫ్రిజ్, ఎ.సి. మొదలగు కొన్ని సౌకర్యాల కారణంగా రాబోయే తరాలకు ఎంతో ప్రమాదం పొంచి ఉంది. అదేమిటో తెలుసుకుందాం. ఫ్రిజ్‌లూ, ఎ.సి. (ఎయిర్ కండిషన్) సామగ్రి, ఫోంబెడ్‌లూ, కాస్మిటిక్ స్ప్రేలు... ఇత్యాదులకు సంబంధించిన కొన్ని పరిశ్రమల నుండి "క్లోరోఫ్లూరో కార్బన్ వాయువులు" గాలిలోకి వదలబడుతున్నాయి.ఈ వాయువులు నేరుగా పైకి వెళ్ళి, భూమికి 20 కిలోమీటర్ల ఎత్తులో భూమిచుట్టూ రక్షణ పొరగా వ్యాపించి ఉన్న "ఓజోన్ పొర" ను దెబ్బతీస్తున్నాయి. సూర్యుని నుండి వచ్చే ప్రమాదకరమైన "అల్ట్రావయొలెట్ కిరణాలను" ఈ ఓజోన్ పొర నిరోధిస్తుంది. ఆ కిరణాలు నేరుగా భూమి మీదకు ప్రసరిస్తే, మానవజాతికి

కేన్సర్ మరియు దాన్ని పోలిన ఇతర భయంకర వ్యాధులు వచ్చే అవకాశం ఉంది. మన తక్షణ సుఖాల కోసం ఏర్పాటు చేసుకున్న పరిశ్రమల ద్వారా, భూమండలానికి రక్షణ కవచం అయిన ఓజోన్ పొరను చేతులారా నాశనం చేసుకుంటున్నాం. అంటార్కిటికా ప్రాంతానికి పైనున్న ఓజోన్ పొరలో ఇప్పటికే పెద్ద రంధ్రం ఏర్పడింది. ఓజోన్ పొర కరిగిపోవడం మిగిలిన ప్రాంతాలకు కూడా వ్యాపించబోతోంది. ప్రపంచ శాస్త్రవేత్తలంతా ఈ ప్రమాదాన్ని గుర్తించారు. క్లోరోఫ్లూరో కార్బన్స్, మిథైల్ బ్రోమైడ్‌ల ఉత్పత్తి వల్లా, పెట్రోల్‌లోని సీసం వల్లా, ఓజోన్ పొరకు నష్టం కలుగుతున్నదని తెలుసుకున్నారు. అయితే ప్రమాదకరమైన ఆ రసాయనిక పదార్థాల ఉత్పత్తులను అంతమొందించడం ఎవరివల్లా కుదరడం లేదు. తక్షణ లాభాలూ, సుఖాలూ... ఇవే నేటి మానవాళికి ముఖ్యం. రాబోయే ప్రమాదం గురించి పట్టించుకునే స్థితిలో ఎవరూ లేరు. అందరూ స్వలాభాల, సుఖాల మత్తులో మునిగిపోయి ఉన్నారు. నేటి సైన్స్ ప్రగతి కల్గిస్తున్న వినాశనానికి మచ్చుతునకగా ఈ ఓజోన్ పొర నాశనాన్ని చెప్పుకోవచ్చు.

ఈనాడు ప్రపంచం అణ్వాయుధాల భీతితో వణికి పోతుందంటే, అది కూడా నేటి సైన్సు ప్రగతి చలువే! అయితే పురాణకాలంలో వీటిని మించిన అస్త్రాలుండేవి. కానీ వాటిని అన్నివేళలా ఉపయోగించకూడదనే ఆంక్షలూ, ఒకవేళ ప్రయోగించినా తిరిగి ఉపసంహరించగల లేదా మళ్ళించగల లేదా వాటి శక్తిని పరిమితం చేయగల సామర్థ్యం నాడు ఉండేది. సంపూర్ణంగా అంతటి సామర్థ్యం నేడు లేదు మరి!

నేటి సైన్సు ప్రగతికి కలిగిన అక్రమ సంతానం 'కాలుష్యం'. దీనివల్ల భూమండలం ఎదుర్కొంటున్న కష్టాలు ఇన్నీ అన్నీ కావు. పురాణకాలపు సైన్సు అభివృద్ధి కాలుష్యరహితంగా జరిగేది. కాలుష్యం ఉద్భవించే అవకాశం ఉందని తెలిస్తే, ఎంత సదుపాయం కలిగించే దానినైనా సరే మన పూర్వీకులు విసర్జించేవారు. (పెట్రోలియం, నేలబొగ్గుల వాడకాన్ని ఈ విధంగానే వదిలేసి ఉంటారని ఇంతకు ముందు వ్యాసాల్లో చెప్పుకున్నాం కదా!) మన పూర్వీకులు ఎప్పుడూ కూడా భవిష్యతరాలవారి సుఖసౌఖ్యాలను దృష్టిలో ఉంచుకుని కాలుష్యం ఉద్భవించని దిశగా, తమ విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకునే వారు. వారికి చక్కటి దూరాలోచన ఉండేది. నేటి మనుషులకు దురాలోచనే గాని, దూరాలోచన ఎంతమాత్రమూ లేదు. అందువల్లనే మిడిమిడి సైన్సు పరిజ్ఞానంతో తక్షణ సుఖాలకోసం అర్రులు చాస్తూ - 'వాయు కాలుష్యాన్నీ, శబ్ద కాలుష్యాన్నీ, ఆహార కాలుష్యాన్నీ, నీటి కాలుష్యాన్నీ, భూ కాలుష్యాన్నీ కొని తెచ్చుకుంటున్నాం. క్రొత్తక్రొత్త వ్యాధులు బాధలతో అఘోరిస్తున్నాం. ఈ కాలుష్య కారణంగా వాతావరణ పరిస్థితులన్నీ మారిపోతున్నాయి. ఏ కాలానికి ఉండవలసిన వాతావరణం, ఆ కాలానికి సరిగా కన్పించడం లేదు. అతివృష్టి, అనావృష్టి పరిస్థితులు ఎక్కువయ్యాయి. ప్రకృతి ఉత్పాతాలు పెరిగాయి. ఆరోగ్యకర వాతావరణం నశించి, అకాల మృత్యువులు

అధికమయ్యాయి. కరువుకాటకాలు విలయతాండవం చేస్తున్నాయి. ఇలా కాలుష్యం కారణంగా ప్రకృతి సమతౌల్యం దెబ్బతింటోంది. కాలుష్యం వల్ల ఇన్నివిధాల కష్టనష్టాలుంటాయని మన ప్రాచీనులకు తెలుసు. ఏనాడో వారు ఇలా చెప్పారు.

" విరాట్ ధాతు వికారేణ విషమస్పంద నాదినా
తదంగ అవయవ స్యాస్యజన జాలస్యవైషమం
దుర్భిక్షావ గ్రహోత్పాత పాత మానయతి".

- 'విరాట్ స్వరూపమైన విశ్వంలో తత్వ వికారాల వల్ల, ధాతువికారాల వల్ల, ప్రాణశక్తి యొక్క విషమ స్పందన వల్లా దుర్భిక్ష పరిస్థితులు సంభవిస్తాయనీ, జీవులు దారుణమైన రోగాలకు గురికావడం జరుగుతుందనీ' దీని అర్థం.

బయటి కాలుష్యం చాలదన్నట్లుగా ఈనాడు మానవునిలో స్వార్థం పెచ్చు పెరిగి, అతని బుద్ధికూడా కలుషితమయింది. అభివృద్ధి చెందుతున్న సైన్సును మానవ కళ్యాణాని కంటే ఎక్కువగా, మానవ వినాశనానికే వాడుతున్నాడు.

అక్కడక్కడా కృత్రిమ వర్షాలను కురింపించినంత మాత్రన, దైవదత్తమైన స్త్రీ గర్భాశయ సహకారంతో టెస్టట్యూబ్ బేబీలను తయారు చేసినంత మాత్రాన, చిన్నచిన్న గ్రహాంతర యాత్రలు చేసినంత మాత్రాన - సృష్టిలో తామెంతో అధికుల మనుకోవడం నేటి మనుషుల అవివేకం. మనిషి వశంలో లేని ఎన్నో ప్రకృతి శక్తులు అనేకవిధాల మనిషికి తోడ్పడుతున్నాయి. మనిషికి కళ్ళు నెత్తికెక్కకుండా, ఆ శక్తులు అప్పుడప్పుడూ తిప్పలు కూడా పెడుతున్నాయి. ప్రకృతి పరమైన స్వయం శక్తులముందు, నేటి మన సైన్సు ఏ పాటిది? గట్టిగా వరదలూ, తుఫానులొస్తే తట్టుకోలేం. అగ్ని పర్వతాలు బ్రద్దలైతే భరించలేం. భూకంపాలు వస్తే నిలద్రొక్కుకోలేం. ఈ ఉత్పాతాలను ముందుగానే పసిగట్టగల పరికరాల్ని తయారుచేసుకున్నాం. కానీ ఏం లాభం? తిప్పలు మాత్రం తప్పడంలేదు. మరి నేటి సైన్సును చూసుకుని ఎందుకీ విరగబాటు? నేటి మన సైన్సు తాత్కాలిక సుఖాలను కల్పించగలదు, నిజమే! దానివల్ల ప్రకృతిలో శాశ్వత దుష్ఫలితాలు సంభవిస్తున్నాయి. భవిష్యతరాల ఆరోగ్యాల్ని తాకట్టు పెట్టి, మనం ఈ తాత్కాలిక సుఖాల్ని పొందుతున్నామనే విషయం భయంకరమైన నిజం!

నేటి సైన్సు ప్రగతితో వైద్యరంగంలో ఎన్నో ఇంగ్లీషు మందులు కనిపెట్టబడ్డాయి. ఆ మందులన్నీ 'సైడ్ ఎఫెక్ట్స్' ఉన్నవే! మన ప్రాచీన ఆయుర్వేదంలోని ఏ మందుకూ సైడ్ ఎఫెక్ట్ అనేది ఉండదు. ఆయుర్వేద మందులు వెంటనే పనిచేయవనే అభిప్రాయంతో, తక్షణ చర్య చూపే ఇంగ్లీషు మందులనే మనం వాడుతుంటాం.

నిజానికి మన అయుర్వేద మందులు కూడా శక్తివంతమైనవే! కానీ నేడు మనం తింటున్న ఎరువుల తిండివల్ల, మన శరీరం విషపూరితంగా బండబారిపోయింది. అందువల్ల ప్రస్తుత శరీరాలకు విషపూరితమైన ఇంగ్లీషు మందులే శరణ్యంగా మారింది. పూర్వ కాలం వారి ఆరోగ్యాలతో, మన ఆరోగ్యాలు ఏమాత్రం సాటిరావు. ఆధునిక సైన్సు పేరుతో కాలుష్యాన్నీ, అనారోగ్య పరిస్థితులనూ పెంచుకుంటూ, క్రొత్తక్రొత్త రోగాలకు లోనౌతూ - వాటికి మళ్ళీ ఏవో మందులు కనిపెట్టుకుంటూ మురిసిపోవడం ఏ మాత్రం ప్రగతి కాదని మనం గ్రహించాలి. (ఆధునిక దారుణ రోగమైన 'కేన్సర్'ను ఇంకా అరికట్టలేకపోయాం. ఈలోగా 'ఎయిడ్స్' రోగం దిగుమతి అయింది. ఇదండీ నేటి ప్రగతి!) సమస్యలు సృష్టించుకుని, వాటిని పరిష్కరించుకోడానికి తంటాలు పడుతూ, అది ఒక సైన్సు ప్రగతిగా ఫీలవడం, నిజంగా అమాయకత్వమే! రకరకాల రసాయన ఎరువులు కనిపెట్టి, అధిక దిగుబడులు సాధించాం అన్నారు. ఈ ఎరువుల తిండితో రోగాలు పెరగడంతో రసాయన ఎరువుల్ని తగ్గించి, సేంద్రియ ఎరువులు (పెంటా, పేడా మొదలైనవి) వాడమంటూ ఈమధ్య ప్రచారం ప్రారంభించారు. క్రొత్తదారులన్నీ మళ్ళీ పాతదారికే కలుస్తున్నాయనడానికి ఇదొక ఉదాహరణ.

నేటి సైన్సుకు పరాకాష్టగా అంతరిక్ష విజ్ఞానాన్ని చెప్పుకుంటాం మనం. ఆ అంతరిక్ష విజ్ఞానంలోకూడా ఇప్పటికంటే పురాణ కాలానిదే పైచేయి. (దాదాపు ఋగ్వేదంలో ఉన్నది ఖగోళ పరిజ్ఞానమే కదా!)

ఆధునిక విజ్ఞానం కంటే మిన్నగా పురాణ పరిజ్ఞానాన్ని అనేక విషయాల్లో మనం చూడగలం. సృష్టి విజ్ఞానాన్ని అర్థం చేసుకోవడం లోనూ, దైవతత్వాన్ని తెలుసు కోవడంలోనూ, పంచభూతాల పుట్టుకను అవగాహన చేసుకోవడంలోనూ, టెస్ట్‌ట్యూబ్ బేబీల తయారీలోనూ, వీర్యదాన ప్రక్రియల్లోనూ, అంతరిక్ష విహారాల్లోనూ, భూమిలోపలి వివిధ లోహాలను వినియోగించుకోవడంలోనూ, చిత్ర విచిత్ర అస్త్రాల ప్రయోగాల్లోనూ, అద్భుత కట్టడాలను నిర్మించడంలోనూ, అంతరార్థాలతో కూడిన ఆచార వ్యవహారాల్ని ఏర్పరచడం లోనూ, శారీరిక విజ్ఞానంలోనూ, ఖగోళం, వైద్యం, నాట్యం, గానం, సంగీతం, శిల్పం, చిత్రలేఖనం, జ్యోతిషం, గణితం, వాస్తు మొదలగు ఎన్నో శాస్త్రాల పరిజ్ఞానంలోనూ - నేటికంటే 'పురాణ విజ్ఞానమే మిన్న'. భూమి ఆకారం గుండ్రమని రాత్రింబవళ్ళు ఒకదాని వెంట ఒకటి నిర్ణీత పద్ధతిలో జరుగుతున్నాయనీ, చంద్రుడు ఒకనాడు భూగోళంలోని భాగమేననీ, సూర్యకాంతిలో ఏడు రంగులున్నాయనీ, కాంతివేగంతో ప్రయాణిస్తే జీవులకు వయసు పెరగదనీ, మనిషికి అంతర్గతంగా మానసిక శక్తి ఉంటుందనీ, సాధనతో దాన్ని వెలికితీసి, మనిషి 'మహాత్ముడు' కావచ్చుననీ... ఇలా

ఎన్నో, ఎన్నెన్నో అద్భుత విషయాలు, పురాణ కాలం వారికి తెలుసు.

మన వేద, పురాణేతిహాసాల్లో ఎన్నో అసాధారణ శాస్త్రీయ విషయాలున్నాయి. అన్నింటికీ కాకపోయినా కనీసం కొన్నింటికయినా నేటికీ నిరూపణలు కన్పిస్తున్నాయి. వాటిని బట్టి అయినా పురాణ విజ్ఞానంపై పరిశోధనలు సాగించాలనే ఆకాంక్ష మన మేధావులకు కలగాలి. దురదృష్టవశాత్తూ వారికి ఆ ఆలోచన ఏ మాత్రమూ లేదు. "అక్బరు మీసం పొడవెంత? రాబర్ట్ క్లైవ్ గారికి ఎంత మంది భార్యలు? ఇటువంటి పనికిమాలిన విషయాలపై పరిశోధనలు చేసి - Ph.D. లు సంపాదిస్తున్నారే తప్ప, మన ప్రాచీన విజ్ఞానంపై ఎవరూ సరిగా దృష్టి మరల్చడం లేదు. సాధారణంగా ప్రతీవాడికీ పురాణాల్ని విమర్శించాలనే తేలికబుద్ధే గాని, వాటిని పరిశీలించి విజ్ఞానాన్ని సేకరిద్దామనే సద్బుద్ధి లేదు. మనప్రాచీన హైందవ విజ్ఞానాన్ని గురించి మాట్లాడినా, సమర్థించినా తమను "ఛాందసులుగా' జమకడతారేమోనని నేటి మేధావుల భయం. విదేశీ భజన చేస్తే, 'విజ్ఞాని' అనిపించుకోవచ్చునని వారి తాపత్రయం. మన ప్రాచీన విజ్ఞానం గొప్పదనాన్ని గురించి విదేశీయులచే చెప్పించుకోవడం మనకు అలవాటయి పోయింది. మన పురాణాలు బూటకాలనీ, మనవన్నీ మూఢనమ్మకాలనీ సాధారణంగా మనవాళ్ళు అపోహ పడుతుంటారు. సైన్సు మొత్తం విదేశీయుల సొత్తు అనీ, వారు మూఢ నమ్మకాలు లేని 'విజ్ఞాన సంపన్నులనీ' మనవారి ఉద్దేశం. విదేశీయులకున్న మూఢ నమ్మకాలను గురించి మనలో చాలామందికి తెలియదు. తెలుసుకుంటే ఆశ్చర్యపోతారు.

## కొన్ని విదేశీ మూఢనమ్మకాలు

జూన్ 6వ తేదీన దయ్యాలు విచ్చలవిడిగా తిరుగుతాయనీ, 13 అనే అంకె చాలా దురదృష్టకరమైనదనీ, భయంకరమైనదనీ, సూర్యగ్రహణానికి కారణం సూర్యుణ్ణి 'డ్రేగన్' అనే జంతువు మ్రింగడం అనీ, ఎలుగుబంటి మ్రింగడం అనీ... ఇలా రకరకాల నమ్మకాలు ఇప్పటికీ విదేశాల్లో ఉన్నాయి. ఇవేకాదు. రొట్టె, ద్రాక్షసారాలను ఆరగించి - వాటిని రక్త, మాంసాలుగా భావించడం, కేవలం క్రీ.పూ. 4004 లో సృష్టి మొదలయిందని నమ్మడం లాంటి ఎన్నో విదేశీ మూఢనమ్మకాల్ని మనం చెప్పుకోవచ్చు. రష్యా దేశంలో తొలిసారిగా ట్రాక్టర్లను ప్రవేశపెట్టినప్పుడు, ఒక వర్గానికి చెందిన వారు, వాటిని 'దయ్యాలుగా' ప్రచారం చేసి, ఆ ట్రాక్టర్లను రాళ్ళతో కొట్టించేవారట. నీగ్రోలు బానిస జీవితాలు గడపడానికే పుడతారని అమెరికాలో ఒక నమ్మిక. నీగ్రోలను బానిసత్వం నుండి తప్పించినవారు, తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలని వారు నమ్మేవారు.

మూఢత్వంతో శాస్త్రవేత్తల్ని చంపడం లేదా వారికి శిక్షలు విధించడం వంటి పిచ్చిపనులు చేసింది విదేశీయులే! రాబోయే గ్రహణాల్ని ముందుగా చెప్పలేక పోయినందుకు పూర్వపు చైనా శాస్త్రవేత్తలు, రాజాజ్ఞచే వధించబడడం ఇందుకు ఒక ఉదాహరణ. భూమి గుండ్రంగా ఉందని చెప్పినందుకూ, సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని చెప్పినందుకు .... ఇలా ఎన్నో కారణాల వల్ల అనేకమంది విదేశీ శాస్త్రవేత్తలు, విదేశీ మూర్ఖులచే దారుణంగా చంపబడ్డారు. తోకచుక్కల వల్ల వచ్చే దోషాలను పోగొట్టుకోడానికి విదేశీ రాజులు కొంతమంది తమ తల్లులనూ, భార్యలనూ బలి ఇచ్చేవారట. (ఇటువంటి మూర్ఖపు పనులేవీ కూడా హైందవ చరిత్రలో మచ్చుకయినా కనపడవు.) గ్రహ, తారల గురించి ఈజిప్ట్, గ్రీస్, బాబిలోనియా, చైనా, రోమన్ మొదలగు వివిధ ప్రాంతాల్లో ఎన్నో 'కాకమ్మ కథలు' ప్రచారంలో ఉన్నాయి. బహిష్టు అయిన స్త్రీలను గురించీ, కొన్ని రోగాలను గురించీ, 'శని' గురించీ అనేక దేశాల్లో ఎన్నో అపోహలున్నాయి. శవాలు తిరిగి మళ్ళీ ప్రాణం పోసుకుంటాయనే గ్రుడ్డి నమ్మకంతో ఈజిప్ట్‌లో శవాలను 'మమ్మీలు'గా భద్రపరచేవారు.

జాతి విబేధాల కారణంగా హత్యలు చేసే విదేశీ మూర్ఖులు నాడూ, నేడూ కూడా ఎందరో ఉన్నారు. సాంకేతికంగా ఎంతగానో అభివృద్ధి సాధించిన జపాన్‌లో కూడా నేటికీ ఎన్నో మూఢనమ్మకాలున్నాయి. జపాన్‌లోని హోటళ్ళు, ఆసుపత్రుల గదులకు 4 మరియు 9 నంబర్లు ఉండవట. ఎందుకంటే వాటి తాలూకు పదాలు 'చావు, బాధ' అనే అర్థాలను ఇచ్చే పదాల్లాగ ధ్వనిస్తాయట.

ఈ విధంగా చెప్పుకుంటే ప్రతిదేశంలోనూ ఇటువంటి మూఢనమ్మకాలు, తప్పుడు అభిప్రాయాలూ కన్పిస్తాయి. ఇవి ఏదో ఒక దేశానికే పరిమితం కాదు. సమాజంలోని దుష్ట శక్తులవల్లా, మూఢుల వల్లా ఇటువంటి అవాంఛితాలు పుట్టుకొస్తూ ఉంటాయి. అంతమాత్రాన వ్యవస్థను తప్పుపట్టకూడదు. ఆ అవాంఛితాలను తప్పించి, వ్యవస్థను చక్కబరచుకోవాలి. ఆ బాధ్యత అందరిదీనూ!!

ఆధునిక సైన్సు కల్పిస్తున్న సౌకర్యాలకూ, సుఖాలకూ లొంగిపోయి, మనం బద్ధకస్తులుగా మారుతున్నాం. ఆధునిక సౌకర్యాల పేరిట మన ఇంద్రియాలకున్న శక్తులను క్షీణింపజేసుకుంటున్నాం. మన పూర్వీకులకున్న ఆరోగ్యం, నేడు మనకు లేదు. (దృష్టి, వినికిడి శక్తి, జీర్ణశక్తి... ఇలా ఎందులో చూసినా మన పూర్వీకులతో మనం సరిపోము. పురాణకాలంలోని వృద్ధ మహారాజులకు అవసరం లేని కళ్ళజోళ్ళు, నేడు చిన్నారి పాపలకు అవసరమౌతున్నాయి. ఆకాశంలో అతి చిన్నగా కనిపించే అరుంధతీ నక్షత్రాన్ని చూడలేని దశను 'అంత్యకాలంగా' భావించే వారు ఆనాడు.

తాటికాయంత అక్షరాలు మన కళ్ళముందున్నా కూడా కనిపించడం లేదు ఈనాడు. అందుకు ఒక కళ్ళజోడు కావాలి మళ్ళీ.)

విజ్ఞానం అనేది కేవలం పురాణకాలానిదే అని మేము చెప్పడం లేదు. నాటికాలంలో ఉన్న విజ్ఞానాన్ని గమనించమని కోరుతున్నాం అంతే! (ప్రస్తుత కాలంలోనూ విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి చెందింది. పురాణకాలంలో లేనివిధంగా ఆశ్చర్యకరమైన అభివృద్ధి నేడు వివిధ రంగాల్లో జరిగింది. ఇంకా జరుగుతోంది. నేటి యుగం 'కంప్యూటర్ యుగం'గా మారింది. కంప్యూటర్లతో చాలా అసాధ్యాలు సుసాధ్యాలు అవుతున్నాయి. చిత్ర విచిత్ర ఆధునిక వైద్య ప్రక్రియలెన్నో అమలులోకి వచ్చాయి. వార్తాప్రసార, ప్రచురణ సౌకర్యాలు, ప్రయాణ రవాణా సౌకర్యాలు అంతకంతకూ మెరుగౌతున్నాయి. మొత్తంమీద అనేక రంగాల్లో అనేక విధాలైన అభివృద్ధులు కొనసాగుతున్నాయి. ప్రాచీన కాలంలో లేని అనేక వస్తువులు, సౌకర్యాలు ఆధునిక కాలంలో వచ్చాయి. మనిషి జీవనం "ఒక విధమైన" సుఖప్రదంగా మారింది. ఇదంతా అక్షరాలా యథార్థమే!! అయితే ఈ ఆధునిక సుఖమయ జీవితంలో "డబ్బు ప్రాధాన్యత" విపరీతంగా పెరిగింది. దాంతో నైతిక విలువలు పడిపోయాయి. స్వార్థం పెరిగింది. ప్రస్తుత సుఖాల కోసం రాబోయే తరాలవారి ఆరోగ్యాన్ని నాశనం చేసే చర్యలకు దిగుతున్నాం. అయినా ఎంత పొందినా శారీరిక సుఖమేగాని, నేడెవరికీ మానసిక ప్రశాంతత లేదు. ఎక్కడ చూసినా స్వార్థంతో కూడిన ఉరుకులూ, పరుగులే కన్పిస్తున్నాయి. ఈ కారణాలవల్లనే ఆధునిక సైన్సుకు "మాయని మచ్చ" ఏర్పడింది. పురాణ విజ్ఞానం సంగతి అలా కాదు. శారీరికంగానూ, మానసికంగా గానూ కూడా అది సహాయకారిగా ఉంటుంది.

'దైవశక్తి' అనేది లేదని సైన్సు చెప్తున్నట్లుగా భ్రమ పడతారు చాలామంది. వారి తెలివితక్కువ తనానికి జాలిపడాలి మనం.

దైవశక్తిలోని కొన్ని అంశాల్ని చదివేదే 'సైన్స్' అంటే!
(Science is nothing but the study of some facts about God's Power.)

దైవశక్తిని గురించి తెలుసుకోడానికి సైన్సు కూడా ఒక మార్గం.
(Science is also a Path to know the almighty's power)

సైన్సు యొక్క అంతిమ గమ్యం "భగవంతుడే!"
(The ultimate destination of Science is "God" only).

నాటి సైన్సుకూ, నేటి సైన్సుకూ కూడా ఆధారమైనవాడు "భగవంతుడే!" ఏ సైన్సు ద్వారా నైనాసరే ముందు ముందుకు ప్రయాణించి చూస్తే - చివరకు "భగవంతుడు" అనే కేంద్రాన్నే చేరుకుంటాం. ఆధునిక సైన్సు, భగవంతునికి చాలా దూరంలో ఉంది. ఎందువల్లనంటే అది ఏ మాత్రమూ మానసిక సంబంధమైనది కాదు. భగవంతుని దగ్గరకు మన 'ఆధునిక సైన్సు' ప్రయాణించాలంటే, ఇంకా విజ్ఞానం పెరగాలి. అప్పుడుగాని, మన అజ్ఞానం తొలగదు. మిడిమిడి సైన్సు పరిజ్ఞానంతో ఆధునికులు ఎంతోమంది "దేవుడే లేడనీ, ఉన్నదంతా సైన్సేననీ" అంటుంటారు. అటువంటి మిడిసిపాటు కూడదు. ఆధునిక సైన్సు బదులు చెప్పలేని ఎన్నో ప్రశ్నలు నేటికీ ఉన్నాయి.

'ఈ విశ్వం ఆవిర్భావానికి మూలశక్తి ఏమిటి? దాని ఆది అంతాలెక్కడ? జీవిలో ప్రాణశక్తి ఎక్కడుంది? కంటికి కనిపించని ప్రాణశక్తికి అంతటి చైతన్యం ఎలా వచ్చింది? జీవి మరణానంతరం ప్రాణశక్తి ఏమౌతుంది? ప్రకృతిలో ఆడ, మగ పుట్టుకలు ఇంచుమించు సరి సమానంగా ఎలా కొనసాగుతున్నాయి...' ఇలా ఎన్నెన్నో ప్రశ్నలకు "ఆధునిక సైన్సు" జవాబులు చెప్పలేకపోతోంది. "ఆధ్యాత్మిక విజ్ఞానం" మాత్రమే ఇటువంటి సందేహాలన్నీ తీర్చగలదు. నేటి సైన్సుకు కేవలం "బంధం" (అణువులు బంధించబడి ఉండటం) మాత్రమే తెలుసు "అనుబంధం" (మానసిక ఆప్యాయత, ప్రేమ) సంగతి దానికి తెలియదు. నేటి సైన్సు పూర్తిగా యాంత్రికమైనది. అందుకే శరీరానికే హాయినిస్తుంది గాని, మానసికంగా సేదదీర్చ లేకపోతోంది. మానసిక ప్రశాంతత కోసం "ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని" ఆశ్రయించి తీరవలసిందే! ఈ మానసిక ప్రశాంతత డబ్బుతో దొరికేది కాదు. ప్రస్తుతం ఎన్నో ప్రపంచ దేశాలు, మనదేశం కంటే ఆర్థికంగా ముందంజలో ఉన్నాయి. అయితే ఆ దేశాల వారెవరికీ మనశ్శాంతి మాత్రం లేదు. వారు ప్రోగుచేసుకున్న సంపదలు, వారికి గుప్పెడు ప్రశాంతతను కల్పించ లేకపోతున్నాయి. వారు తమ ఆస్థిపాస్తులను వదలి, మనశ్శాంతి కోసం మన దేశం వైపు పరుగులు తీస్తూ వస్తున్నారు. ప్రపంచ ప్రజలకు మానసిక ప్రశాంతిని అందించగల ఆధ్యాత్మిక కేంద్రం "భారతదేశమే!" ఈ వేదభూమి యొక్క ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని మరింత వెలుగులోకి తేవలసిన ప్రయత్నం మనమంతా చెయ్యాలి.

ఆధునిక సైన్సుకు అసాధ్యం లేదంటూ మనం విర్రవీగుతున్నాం గానీ, నిజానికి సాధించింది 'తక్కువ', సాధించవలసింది 'ఎక్కువ'. నేటి సైన్సు ప్రగతి కూడా నిజానికి భగవంతుని చలువే! మనిషి ఎంత గొప్ప కంప్యూటర్ కనిపెట్టినా కూడా, అది భగవంతుడిచ్చిన మెదడు యొక్క ఆలోచనా ఫలితమే కదా! భగవంతుడు ప్రసాదించిన మేధస్సుతోనూ, ప్రకృతి వనరులతోనూ 'సైన్సు ప్రగతి' సాధ్యమౌతోంది. మనిషి కేవలం భగవంతుని సృష్టిలోని అంశాలనే వాడుకుంటూ ఎదుగుతున్నాడు. ఈ విషయాన్ని

మనం బాగా గుర్తుంచుకోవాలి. (అన్నీ అమర్చివున్న వంటగదిలో కూర్చుని, వంటలు చేసుకోవడంతో దీన్ని పోల్చవచ్చు. భగవంతుడు అన్నీ అమర్చగా, వాటిని ఉపయోగించుకుంటూ వివిధ రకాలు తయారు చేసుకోవడంలో పెద్ద విశేషమేమీ లేదు. సృష్టిలోని కొన్ని శక్తులను రూపాంతరం చెందించడం మాత్రం, మనిషి నేర్చుకున్నాడు. క్రొత్తగా ఎటువంటి శక్తినీ సృష్టించలేడు. నశింపజేయనూలేడు. అదీ సంగతి!)

"నాటి సైన్సు, నేటి సైన్సు" ఏ మాత్రం వేర్వేరు కావు. రెండూ ఒకటే! నాటి సైన్సు 'ఆధ్యాత్మిక వాదాన్నీ, నేటి సైన్సు 'హేతువాదాన్నీ' బలపరుస్తున్నాయని చాలా మంది తప్పుగా అభిప్రాయ పడుతుంటారు. అయితే శాస్త్రీయ విజ్ఞానం ఉన్న వారెవరూ ఇలా అభిప్రాయపడరు. (నిజానికి 'హేతువాదం' అనేది దండగ సిద్ధాంతం. మిడిమిడి సైన్సు పరిజ్ఞానం గలవారి 'ఊహాలోకం' అది!)

పురాణకాలపు సైన్సు కేవలం మంత్రయుక్తమే కాదు, యంత్రయుక్తం కూడా! పైగా ఆధ్యాత్మికతను కలబోసుకుని ఉంది. మనిషిలోని అంతర్గత శక్తుల వినియోగం ద్వారా నాటి సైన్సు, భగవంతునికి చేరువదశలో ఉండేది. నేటి సైన్సు కేవలం యంత్రయుక్తమైనది మాత్రమే! మనిషిలోని అంతర్గత శక్తులను అంగీకరించని ఆధునిక కాలం ఇది. ఈ కారణంగానే నేటి సైన్సు, భగవంతునికి అతి దూరమైన స్థితిలో ప్రయాణిస్తోంది.

చర్చ ఇంతవరకూ వచ్చింది కనుక "సైన్సుకూ, ఆధ్మాత్మికత"కూ ఉన్న సంబంధాన్ని గురించి కూడా తెలుసుకుందాం. (ఒక విధంగా సైన్సుకు పరాకాష్ఠయే "ఆధ్యాత్మికత" అని చెప్పవచ్చు.)



## సైన్సు - ఆధ్యాత్మికత

ఈ రెండు అంశాలకూ సంబంధమే లేదనీ, రెండూ పరస్పర విరుద్ధాలనీ అనుకుంటారు చాలామంది. కానీ అది నిజం కాదు. రెండింటికీ చాలా దగ్గరి సంబంధం ఉంది. ఒకే గమ్యాన్ని చేరుకునే రెండు మార్గాలవి. వాటి చివరి మజిలీ "భగవంతుడే!"

ఈ క్రింద ఇచ్చిన త్రికోణాన్ని పరిశీలిస్తే "సైన్స్ - అధ్యాత్మికత" ల విషయం మనకు సరిగా అర్థమౌతుంది.




భగవంతుణ్ణి చేరడానికి "సైన్సుదారి" ఏటవాలుగానూ, "ఆధ్యాత్మిక దారి" నిటారుగానూ కనపడుతోంది. ఆధ్యాత్మిక దారి, భగవంతునికి దగ్గరగా ఉంటుంది. కానీ అటువైపు ప్రయాణం చాలా కష్టం. అనగా అత్యంత నియమ నిష్ఠలతో ధర్మబద్ధంగా జీవితాన్ని గడపాలి. రెండవదైన సైన్సుదారి బహుదూరమైనది. కానీ ఏటవాలు మార్గం కాబట్టి, ప్రయాణం మరీ అంత కష్టమేమీ కాదు. అయితే ఈ దారిలో 'ఇహలోక సౌఖ్యాలు, సైన్సును వక్రమార్గాన ఉపయోగించడం వల్ల వచ్చే కష్టనష్టాలు, రోగాలు' మొదలైన అవరోధాలున్నాయి. ఈ అవరోధాల గోతుల్లో పడిపోతోంది మానవాళి. వాటినన్నింటినీ తప్పించుకుని, సరైన సైన్సు దారిన సూటిగా పోగలిగితే, మనిషిలో ఆధ్యాత్మిక విజ్ఞానం కలుగుతుంది. ఆ విజ్ఞానమార్గం ద్వారా భగవంతుని (శక్తిని) తెలుసుకోవచ్చు. అయితే ఈ పని అత్యంత క్లిష్టతరమైనది. ఇహలోక సౌఖ్యాల మత్తులోనూ, స్వార్థంలోనూ, దురాశలోనూ, కాలుష్యాల్లోనూ మునిగిపోతున్న నేటి జనాభా తిరిగి పైకి లేవడం అసాధ్యం. ఆ అవరోధాల గోతుల్లోనే సమాధులై పోతున్నారంతా. అందువల్ల సైన్సు మార్గానికంటే ఎంతోఅంత ఆధ్యాత్మిక మార్గమే నయం. తపస్సు వంటి కఠిన ప్రక్రియల్ని అనుసరించలేకపోయినా, కనీసం ధార్మిక జీవనాన్ని అలవరచుకోవడం ద్వారా మానవజన్మకు కాస్తయినా సార్థకత తీసుకురావచ్చు.

"ఆధ్యాత్మిక విజ్ఞానం" అనేది అన్ని వయసుల వారికీ అతి ముఖ్యమని అందరూ (ముఖ్యంగా యువతరం) గ్రహించాలి. అప్పుడే ప్రపంచ శాంతి సాధ్యం అవుతుంది.



# ✿ హైందవ ధర్మాన్ని వీడితే మీకే నష్టం ✿

విశ్వవిఖ్యాతి గాంచినది హైందవ ధర్మం. భూగోళంపై మొట్టమొదటిదీ, ఎన్ని ఒడుదుడుకులొచ్చినా చెక్కుచెదరనిదీ, చిట్టచివరకు మిగిలేదీ కూడా హైందవ ధర్మమే! అటువంటి హైందవ ధర్మ వారసత్వం అయాచితంగా మనకు లభించడం, మన పూర్వజన్మల పుణ్యఫలం. సనాతనమైన హైందవ ధర్మం విశ్వజనీనమైనది. దానికి ప్రాదేశిక సరిహద్దులు లేవు. ఇప్పటివరకూ జన్మించినవారూ, ఇంకా జన్మలనెత్త వలసినవారూ ..... చివరకు మొత్తం ప్రాణులన్నీ కూడా దీనికి చెందినవే! "అగ్ని" మండుతుందనే శాశ్వత సత్యం యొక్క నిరూపణ, మనం దాన్ని అంగీకరించడంపై ఆధారపడి లేదు. ఆ సత్యాన్ని అంగీకరిస్తే ప్రయోజనాన్ని పొందగలం. లేకుంటే నష్టపోతాం. మన సనాతన హైందవ ధర్మం సంగతి కూడా ఇటువంటిదే! ప్రపంచ జనావళి మొత్తం అంతా, వారు కాదన్నా ఔనన్నా కూడా 'హైందవ ధర్మానికి' చెందినదే! అది తెలుసుకోగలిగితే వారి అదృష్టం. లేకుంటే లేదు. నేడు విదేశీయులెంతో మంది యదార్థాన్ని తెలుసుకుంటూ, హైందవ ధర్మంవైపు పరుగులెడుతూ వస్తున్నారు. ఇది చాలా శుభపరిణామం. అయితే ఇక్కడో అనర్థం జరుగుతోంది. మనవాళ్ళు కొంతమంది, పాశ్చాత్యులు ఛీ కొట్టి వదలివేస్తున్న సంస్కృతీ వ్యవహారాలను చేపడుతూ అధః పాతాళంలోకి జారిపోతున్నారు. "బుద్ధీ కర్మానుసారిణీ!" అన్నారు కదా!

ఏనాటికైనా ప్రపంచానికి ఆధ్మాత్మిక కేంద్రం మన భారతదేశమే! ఇటువంటి పుణ్యభూమిలో పుట్టినందుకు మనమెంతో గర్వించాలి. హైందవ సంస్కృతీ సంప్రదాయాల వల్లనే ప్రపంచంలో భారతదేశానికి 'ఒక ఆధ్యాత్మిక గౌరవస్థానం' ఉన్నదనేమాట మనం మరువకూడదు. మనకు లభిస్తున్న ఇటువంటి గౌరవానికి, మనం దూరం కాకూడదు. ఒక గౌరవ స్థానంలోంచి దిగజారే పరిస్థితులకు లోనైతే, మనపని ఇక అధోగతే! దీనికి ఉదాహరణలు చెప్తాం చూడండి.

మన శిరోజాలను మనమెంతో ముద్దుగా, అభిమానంగా, అలంకార ప్రాయంగా చూసుకుంటూ ఉంటాం. అటువంటి శిరోజాలనుండి ఒక వెంట్రుక ఊడి, నేలపై పడిందనుకోండి. దాన్ని చీత్కారభావంతో తీసి అవతల పారేస్తాం. తలపై జుత్తు రూపంలో ఉన్న వెంట్రుకలకూ, క్షౌరశాలలో కత్తిరించగా వేరుపడిన వెంట్రుకలకూ ఎంతతేడా ఉంటుందో మీకే తెలుసు. హిందూధర్మంలో ఉన్నంతవరకూ జుత్తులోని వెంట్రుకలకు ఉన్నట్లు, మనకు గౌరవస్థానం ఉంటుంది. అందులోంచి వేరుపడితే మాత్రం క్రిందపడిన వెంట్రుక ముక్కల్లా హీనంగా మారిపోవడం జరుగుతుంది.

ఈసారి మరో ఉదాహరణ చూద్దాం. జీవి మనుగడకు ఆహారమే కదా ఆధారం. అందుకే "అన్నం పరబ్రహ్మ స్వరూపం" అన్నారు. మెతుకులన్నీ కలిసి ఉన్న అన్నాన్ని 'పరబ్రహ్మ స్వరూపం'గా ఎంచి, కళ్ళకు అద్దుకుని ఆరగిస్తాం. అదే అన్నంలోని కొన్ని మెతుకులు జారి, క్రింద పడ్డాయనుకోండి. వాటిని "ఎంగిలి మెతుకులు" గా భావిస్తాం తప్ప, తిరిగి తీసుకుని నోట్లో వేసుకోలేం. హిందూధర్మంలో ఉన్నంతవరకూ అన్నంలోని మెతుకులవలె 'పరబ్రహ్మ స్వరూపం' గా మనకు విలువ ఉంటుంది. ఆ అన్నంనుండి విడిపోతే 'ఎంగిలి మెతుకులు' గా మారిపోతాం. తస్మాత్ జాగ్రత్త!!

## హైందవ ధర్మం తల్లివంటిది

"హైందవధర్మం" అనేది సృష్టితోపాటూ ఏర్పడిన (ఆది) ధర్మం. అందువల్లనే అది ప్రపంచ జనావళికి తల్లివంటిది. ఎవరైనా తమను వేరుగా భావించుకున్నా కూడా, నిజానికి వారు హైందవ ధర్మానికి లోబడి ఉన్నవారే! వారు గ్రహించనంతలో నిజం అనేది, నిజం కాకుండా పోదుకదా! 'మన ధర్మం' లోకానికి అంతటికీ సంబంధించినది. కాబట్టే "లోకాస్సమస్తా సుఖినోభవంతు" అనీ, "సర్వేజనా సుఖినోభవంతు" అనీ అందరి సుఖాన్నీ కోరుతుంది. "అహింసా పరమో ధర్మః" అంటూ విశ్వశాంతిని ప్రబోధిస్తుంది. ఇంతటి విస్తృతమైన, ఆదరణీయ, శాంతియుత దృష్టి "మరేజాతికి లేదని" ప్రపంచానికీ తెలుసు. అందువల్లనే హైందవ దేశం, ప్రపంచాన ఒక ప్రతిష్ఠాత్మకమైన స్థానంలో నిలచి ఉంది.

అయితే కాలక్రమేణా ప్రపంచదేశాల్లో క్రొత్తక్రొత్త మార్గాలేవో పుట్టుకొస్తూనే ఉంటాయి. అది సృష్టి సహజం. ఏ మార్గం ఎలా పుట్టుకొచ్చినా కూడా, అది హైందవ ధర్మంలోని అంతర్భాగమే! ఎక్కడ ఎవరు ఏ సూక్తులూ, సుభాషితాలూ చెప్పినా కూడా "అవి హైందవ ధర్మంలోని ప్రాథమిక అంశాలే!" హైందవ ధర్మంలో ఉన్నంత ఆధ్యాత్మికత, ధార్మికత, విజ్ఞానం, మానసిక ప్రశాంతత, నీతినియమాలూ మరెక్కడా లేవు. ఇవన్నీ తెలుసుకోకుండా - దేనికోసమో, ఎందుకో, ఎక్కడికో పరుగులు తీయకండి. నిలకడగా నిలబడి నిజాన్ని తెలుసుకోండి. ప్రపంచమందలి అన్ని ధర్మాలకూ మూలం హైందవ ధర్మమే! అందువల్లనే ఇది దేన్నీ విమర్శించదు. వేర్పాటుభావం చూపించదు. తనలోని అంతర్భాగాలను తానే ఎలా ఈసడించు కొంటుంది? ఏ తల్లి అయినా కన్నబిడ్డల్ని అసహ్యించుకుంటుందా? అటువంటి పరిస్థితే ఇదీనూ! తరతరాలుగా ఎన్నోజాతులు, హైందవ ధర్మాన్ని ఎన్నో కష్టనష్టాలకు లోనుచేశాయి. ధ్వంసంచేసే ప్రయత్నాలు చేశాయి. అయినా కూడా మన ధర్మం అన్నింటినీ ఓర్పుగా సహిస్తూ నిలబడింది. బిడ్డలు అనాలోచితంగా బాధించినా, దూషించినా కూడా తల్లి సహనంతో భరిస్తుంది, క్షమిస్తుంది. ఆ విధంగానే ప్రపంచాన ఏజాతి తనపై కాలు దువ్వినా కూడా హైందవ ధర్మం

తొందరపడదు. దాని నిదానతత్వమే దానికి శ్రీరామరక్ష. ఎదుటివారి దుడుకుతనాన్నే మనమూ ఆచరిస్తే, ఇక తేడా ఏముంది? భయపెట్టీ, బెదిరించీ, ఏవేవో ఆశలు చూపించీ 'ప్రచారాలు చేస్తూ' ఎదుటివారి బలహీనతను వాడుకోవలసిన దుర్దశ, మన హైందవానికి లేదు. "ధర్మోరక్షతి రక్షితః" అనే సిద్ధాంతం మనది. అంతకూ ధర్మానికి హానికలిగే పరిస్థితులు ఏర్పడితే, "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అని భగవద్గీతలో చెప్పబడినట్లుగా ఆ భగవంతుడే ఏదోరీతిన "ధర్మస్థాపన" చేస్తాడు.

"లోకాస్సమస్తా సుఖినోభవంతు"

ఓం శాంతి శాంతి శాంతిః



# ✿ ముగింపు ✿

ఈ పుస్తకం ద్వారా మీరంతా మన వేద, పురాణేతిహాసాల్లోని కొన్ని సైన్సు విషయాలను తెలుసుకున్నారు. వీటిలో కనీసం ఏ ఒక్క అంశమైనా మీ మేధస్సును కదిలిస్తే, మా కృషి ఫలించినట్లే!

పురాణాల్లోని సైన్సు మొత్తం ప్రాచీనుల ఊహాగానమనుకునే ప్రబుద్ధులు కూడా కొంతమంది ఉండవచ్చు. వారికిదే మా సమాధానం - "యథార్థానికీ, ఊహలకూ తేడా ఎప్పుడూ తెలుస్తూనే ఉంటుంది. కేవలం ఊహలతో ఇన్ని విజ్ఞాన విషయాల్ని చెప్పడం, ఎవరికైనా సరే అసాధ్యం. తాము కనిపెట్టి, అనుభవించిన విజ్ఞానాన్ని మహాఋషులు తమ శక్తి మేరకు మనకందించారు. అనంతమైన ఆ విజ్ఞాన పరిజ్ఞానాన్ని, గ్రంథసహితమైన ఆధారాలతో అందించిన ప్రాచీన ఋషులకు, తమ ఊహలతో భవిష్య తరాలను మభ్యపరచవలసిన అగత్యం ఏమాత్రం లేదు. ఋషీశ్వరులు చెప్పిన విజ్ఞాన విషయాలు నేడు ఒక్కొక్కటీ నిరూపణలోకి వస్తుండడం గమనించండి. ఆధునిక సైన్సు ముసుగులో ముఖం దాచుకుంటున్న వాళ్ళే, నిజమైన ఛాందసులు. వారు ఛాందసాన్ని వీడి, తమ ముసుగునుండి బయటకు చూస్తే కోటి సూర్యుల వెలుగుతో కన్పిస్తుంది మన ప్రాచీన విజ్ఞానం.

మన పురాణాల్లోని సైన్సు పాయింటు, మచ్చుకు ఒకటికూడా నేటి మన పాఠ్యాంశాల్లో కన్పించదు. అదే మన దురదృష్టం. ఈ కారణంగానే ఇటు విద్యార్థిలోకానికీ, అటు యువతరానికీ కూడా మనదేశ ప్రాచీన ఔన్నత్యం గురించి తెలియకుండా పోతోంది. ఇందుమూలంగా మన ప్రాచీన ఘనతను ఒప్పుకోగల గుండె ధైర్యం ఎవరికీ లేకుండా ఉంది. మన ప్రాచీన విజ్ఞానం వల్ల మనలో చైతన్యం వస్తే - ఏం జరిగి పోతుందోననుకునే భయస్థులూ, స్వార్థపరులూ, విద్రోహులూ, అవకాశవాదులూ నేడు మన దేశంలో కోకొల్లలుగా ఉన్నారు. ఇక మనదేశ భవిష్యత్తు గురించి, విజ్ఞతగల ప్రజలే నడుంకట్టాలి. వారే మనదేశ కీర్తిప్రతిష్ఠల్ని నలుదిశలా వ్యాపింపజేయాలి. వారికి స్ఫూర్తినిచ్చేందుకే "పురాణాల్లో సైన్స్" అనే ఈ పుస్తకం ప్రచురించబడింది.

మన ప్రాచీన విజ్ఞానంపై పుస్తకం వ్రాయడం నిజంగా దుస్సాహసమే! ఇటు పండితులనూ, అటు మేధావులనూ, మరోవైపు సామాన్యులనూ ఒప్పించే విధంగా - అటు ప్రాచీన పరిజ్ఞానాన్నీ, ఇటు ఆధునిక విజ్ఞానాన్నీ మథించి, వాటిలోని సమన్వయ విషయాల్ని ఆధార సహితంగా ఇస్తూ, 'గ్రంథరచన' చేయడమంటే సాధారణ విషయం కాదుమరి! కేవలం భగవంతుని ఆశీర్వాదంతో గ్రంథాన్ని పూర్తిచేసి, మీ ముందుకు తీసుకొచ్చాం.

యథార్థం చెప్పాలంటే, ఈ పుస్తకానికి ముగింపు అనేది ఉండదు. మన పురాణ విజ్ఞానం గురించి చెప్పుకుంటూ పోతుంటే, అందుకు మన జీవితకాలాలు సరిపోవు. అంతటి విస్తారమైన విజ్ఞానాన్ని మీకు రవ్వంత రుచి చూపించాలని మాకు ఆశ కలిగింది. అందుకే ఈ చిన్న (పుస్తక) ప్రయత్నం చేశాం. దీనితో రచయితలుగా ఒక సార్థకత పొందిన తృప్తి కలిగింది మాకు. మానవజన్మ ఎత్తినందుకు, మావంతు కృషి కాస్తయినా చేయగలిగామనే సంతోషం మిగిలింది. 'ప్రాచీన విజ్ఞానం' అనే అమృత సాగరంలోని ఒక్క బిందువును మీ నోట్లో వేస్తున్నాం. రుచి మరిగిన మీరు, ఆ అమృత సాగరంకోసం పరుగులు తీస్తారని మాకు తెలుసు. మీనుండి అటువంటి విజ్ఞాన జిజ్ఞాసనే మేము కోరుకుంటున్నాం.

భారతదేశ బంగారు భవిష్యత్తుకై
కలిసి కృషి చేద్దాం, రండి.



# "ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు"



"పురాణాల్లో సైన్స్" పుస్తకం మీ అందరి ఆదరాభిమానాలతో విజయ పథంలో పయనిస్తోంది. మళ్ళీ మళ్ళీ పునర్ముద్రణలు పొందుతూ, మన దేశ ప్రాచీన ఔన్నత్యాన్ని నలుదిశలా చాటుతోంది.

మరుగున పడుతున్న మన ప్రాచీన హిందూవిజ్ఞానం గురించి పుస్తకాన్ని ముద్రిస్తే, పాఠకులు ఎంతవరకూ ఆదరిస్తారో...! అనుకున్నాం. ఇప్పుడా సందేహం పూర్తిగా తొలగిపోయింది. తేటతెల్లంగా యదార్థాన్ని విప్పి చెప్పేవారుంటే, ఆదరణకు లోటులేదని రుజువయింది. ఆధునిక సైన్స్‌కు దీటుగానూ, కొన్నింట మిన్నగానూ కూడా వెలుగొందిన మన పురాణాల్లోని సైన్సును గురించి వివిధ రంగాలకు చెందిన ఎందరో ప్రముఖులు ఎంతో ఆసక్తిని చూపిస్తున్నారు. మేము పూరిస్తున్న భారతీయ శంఖారావానికి ఆకర్షితులౌతున్నారు.

అనేక విధాలైన ప్రశంసలతో పాఠక మహాశయులనుండి వందలకొలదీ ఉత్తరాలు వచ్చాయి... ఇంకా వస్తూనే ఉన్నాయి. కొంతమంది పాఠకులు ముఖాముఖీగా తమ అభినందనల్నీ తెలుపుతున్నారు. కొందరు సుదూర ప్రాంతాలనుండి (విదేశాలనుండి) కూడా ఫోన్ల ద్వారా తమ శుభాభినందనలు అందిస్తున్నారు. మరికొందరు మా స్నేహితుల ద్వారా తమ సందేశాల్ని పంపిస్తున్నారు. మొత్తం మీద "పురాణాల్లో సైన్స్" వివిధ రంగాలకు చెందిన వారందరి మన్ననలూ పొందుతోంది. ఈ అదృష్టాన్ని మా పూర్వ జన్మ సుకృతంగా భావిస్తున్నాం.

మీ అందరి అభిమానానికీ కృతజ్ఞులం!!

రాబోయే మా ఇతర ప్రచురణల గురించి ఎందరో మరీ మరీ అడుగుతున్నారు. లెటర్స్ వ్రాస్తున్నారు. ఆ పుస్తకాల కోసం కొంతమంది మనియార్డర్స్ కూడా చేసేస్తున్నారు. మీ అభిమాన ఆశీర్వాదాల బలంతో మా తర్వాత ప్రచురణలు త్వరలోనే వస్తాయి.

ప్రస్తుతం మేము "పురాణాల్లో సైన్స్"ను పాఠక లోకానికి మరింత చేరువ చేయడంలో నిమగ్నులమై ఉన్నాం. ఇటీవలనే ఈ పుస్తక వివరాలను "ఇంటర్‌నెట్"లో ప్రవేశపెట్టాం. దీనితో ప్రపంచవ్యాప్తంగా మేధావులదృష్టికి "మన భారతీయ పురాణ విజ్ఞానాన్ని" తీసుకువెళ్ళడం జరిగింది.

ఇతర రాష్ట్రాలకు చెందిన పబ్లిషర్స్ కొంతమంది "పురాణాల్లో సైన్స్" ను తమ ప్రాంతీయ భాషల్లోకి అనువదించుకుని ప్రచురించుకునేందుకు ఉత్సాహం చూపిస్తున్నారు. (ప్రస్తుతం మరాఠీ భాషలోకి అనువాదం కొనసాగుతుంది. షోలాపూర్‌కు చెందిన శ్రీ గాయత్రీ పబ్లికేషన్స్ వారు త్వరలోనే మహారాష్ట్రలో "పురాణాల్లో సైన్స్" మరాఠీ ప్రతులను విడుదల చేస్తారు.)

అనంతమైన హైందవ ప్రాచీన విజ్ఞానాన్ని సులభశైలిలో మీకు అందించాలనే మా ఆకాంక్ష, భగవంతుని కృపతో మరింతగా నెరవేరాలని ఆశిస్తూ -

మీ సహోదరులు

**పోలిశెట్టి బ్రదర్స్.**



# "పురాణాల్లో సైన్స్"పై
# అభినందనల చిరుజల్లు



వివిధ రంగాలకు చెందిన మేధావులూ, ప్రముఖులూ - ఉత్తరాల ద్వారానూ, ముఖాముఖీగానూ మాకు అందిస్తున్న అభినందనలు, ఆశీస్సులూ ఎంతో స్ఫూర్తి నిస్తున్నాయి. హైందవ ప్రాచీన విజ్ఞానపు వెలుగుల్ని ప్రపంచమంతటా వ్యాప్తి చేయాలనే మా తలంపుకు బలాన్ని చేకూరుస్తున్నాయి. మమ్మల్ని ఉత్తేజపరచిన అభిప్రాయాల్లో కొన్నింటిని (మచ్చుతునకలుగా) ఈ క్రింద ప్రచురిస్తున్నాం. చిత్తగించండి.

  

1. పురాణాల్లో సైన్స్ పుస్తకం బావుంది. హిందూ సంస్కృతీ ప్రచారార్థం చక్కటి కృషి ఇది.
   - శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ చినజీయర్ స్వామివారు.
2. హైందవ ప్రాచీన విజ్ఞానంపై మంచి రచన.
   - నాదబ్రహ్మ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు.
3. "వేదాల్లోనే అన్నీ ఉన్నాయష" అంటూ వేళాకోళం పట్టించే వారిని ఆపి, ఆలోచింపజేసే అంశాలు ఈ పుస్తకంలో కన్పిస్తాయి.
   - "ఇండియా టుడే" (సుప్రసిద్ధ పక్షపత్రిక)
4. వేదవేదాంగాల్లో ఉన్న ఎన్నో సైన్స్‌పరమైన విశేషాలను విశ్లేషించి విశదీకరించిన శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ అభినందనీయులు.
   - "వండర్‌వరల్డ్" (సుప్రసిద్ధ విజ్ఞాన మాసపత్రిక)
5. ఇది చాలా మంచి ప్రయత్నం.
   - డాక్టర్ మర్రి చెన్నారెడ్డి, గవర్నరు, తమిళనాడు.
6. పురాణాల్లో సైన్స్ చాలా బావుంది. మీ కృషి అభినందనీయం.
   - యండమూరి వీరేంద్రనాథ్.
   (ప్రముఖ రచయిత), హైదరాబాద్.
7. పుస్తకం ఆసక్తికరంగా ఉంది. ఆధునిక జీవనంలోని విజ్ఞానం, ఆనాటి ఋషుల మనసుల్లో స్ఫూర్తిని సంతరించుకుందని మనం గర్వపడేలా వుంది. మంచి కృషి. అభినందనలు.
   - గొల్లపూడి మారుతీరావు.
   (ప్రముఖ సినీ నటులు, రచయిత) మద్రాసు.
8. వేద పురాణేతిహాసాల్లో దాగివున్న సైన్స్ అంశాలను విశదీకరించిన ఈ గ్రంథం అపూర్వమైనది. హర్షించదగ్గ ప్రయత్నం ఇది.
   - "వనిత" (ప్రముఖ మాసపత్రిక)
9. ఇప్పటి విమానాలు, టెలీపతీ వంటివి పురాణకాలంలోనూ ఉన్నాయని తెలియజేస్తూ వ్రాసిన పరిశోధనాత్మక గ్రంథం ఇది. ఇటువంటి కృషిని మనమంతా ప్రోత్సహించాలి.
   - సుమన్, (ప్రముఖ సినీ నటులు) మద్రాసు.

10. హిందూ పురాణాలూ, వేదాలూ కేవలం 'పుక్కిట పురాణాలు' అని కొట్టిపారేసే మూర్ఖ జనానికి, హిందూ సాంప్రదాయాలు కేవలం ఛాందసమనే అసందర్భ, అజ్ఞాన ప్రలాపాలకు - కనువిప్పుకలిగించే విజ్ఞాన దీపిక "పురాణాల్లో సైన్స్". పాశ్చాత్య అజ్ఞానానికి పట్టం కట్టే మన ప్రబుద్ధులకు ఈ గ్రంథం కొరడాలాంటిది.

- వంకాయల సత్యనారాయణ, (ప్రముఖ సినీ నటులు) మద్రాసు.

11. ప్రాచీన హైందవ పరిజ్ఞానాన్ని సామాన్య పరిభాషలో పాఠకులకు అందించిన చక్కని విజ్ఞాన గ్రంథం ఇది!

- డాక్టర్ డి.వి.ఆర్. పూషా, M.Sc., Ph.D
ఎడిటర్, అభిసారిక మాసపత్రిక, సామర్లకోట.

12. పురాణాల్లో సైన్స్ రచన చాలా బావుంది. ప్రాచీన భారతీయ సంస్కృతిని ఆధునిక కాలానికి వినూత్న రీతిలో పరిచయం చేస్తున్న రచయితలు అభినందనీయులు. ఈ పుస్తకాల్ని మా ఆశ్రమ సేల్స్ డివిజన్‌లో ఉంచేందుకు అభిలాష వ్యక్తం చేస్తున్నాం.

- స్వామినీ శీలానంద, M.Sc., చిన్మయారణ్య ఆశ్రమం,
యల్లాయపల్లి, కడపజిల్లా.

13. పురాణాల్లో సైన్స్ పుస్తకం అద్భుతంగా ఉంది. మీ పరిశోధనా కృషి ప్రశంసనీయం.

- డాక్టర్ బి.వి. పట్టాభిరామ్,
(ప్రముఖ హిప్నాటిస్ట్ మరియు ఇంద్రజాలికులు) హైదరాబాద్.

14. "పురాణాల్లో సైన్స్" పుస్తకాన్ని మా ఇంటర్నేషనల్ లైబ్రరీ, కాంచీపురంలో ఉంచేందుకు నిర్ణయించడమైనది. ధన్యవాదాలతో -

బి.ఎస్. మూర్తి, ఛీఫ్ ఆర్కిటెక్ట్, ఇంటర్నేషనల్ లైబ్రరీ, కాంచీపురం.
(కంచికామకోటి పీఠాధిపతుల వ్యవస్థాపన)

15. కాంచీపురంలోని ఇంటర్నేషనల్ లైబ్రరీలో మీ "పురాణాల్లో సైన్స్" పుస్తకం చూశాను. నేటి తరానికి అవసరమైన అమూల్య రచన ఇది! ఈ పుస్తకాల కొరకు త్వరలో భారీ ఆర్డరు పంపిస్తున్నాం.

- యం.వి. శేషగిరి, ఎడిటర్, "శంకర కృప" మాసపత్రిక.
(శృంగేరీ శారదా పీఠం వారి యాజమాన్యాన
వెలువడే ఆధ్యాత్మిక పత్రిక)

16. దేశంలో ఎంతోమంది సంస్కృత పండితులున్నారు. వారికి సైన్స్ సరిగా తెలియదు. సైన్స్ తెలిసిన ఎందరో శాస్త్రవేత్తలున్నారు. వారికి సంస్కృతం రాదు. మన దేశ ప్రాచీన విజ్ఞానాన్ని నిరూపించేందుకు ఈ పరిస్థితి అవరోధంగా ఉంది. శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ "పురాణాల్లో సైన్స్" గ్రంథాన్ని వ్రాసి, ఆ అవరోధాన్ని అధిగమించే ప్రయత్నం చేశారు, సఫలీకృతులయ్యారు.

- టి.హెచ్. చౌదరి, ఛైర్మన్, ప్రజ్ఞాభారతి, ఆంధ్రప్రదేశ్,
ఛైర్మన్, భారతీయ విద్యాభవన్, హైదరాబాద్ కేంద్ర,
గవర్నర్, INTELSAT, వాషింగ్టన్ (యు.ఎస్.ఎ)
ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్, INMARSAT, లండన్.

17. ఈ మధ్యకాలంలో ఒక మంచి ప్రచురణ ఇది.

- ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం,
(ప్రముఖ సినీ ప్లేబాక్ గాయకుడు) మద్రాసు.

18. ప్రాచీన హైందవ విజ్ఞానానికి కరదీపిక ఈ గ్రంథం. ఆధునిక సమాజానికి ఉపయుక్తం.

- ఎ. కోదండరామిరెడ్డి, (ప్రముఖ సినీ దర్శకులు) మద్రాసు.

19. ప్రతి భారతీయుడూ గర్వించదగ్గ అత్యద్భుత గ్రంథం ఇది. ఇంతటి గొప్ప గ్రంథాన్ని గురించి కళాశాలల స్థాయిలోనూ, లెక్చరర్స్ కమ్యూనిటీలోనూ విస్తృత ప్రచారాన్ని చేయడానికి నేను సిద్ధపడుతున్నాను. శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ యొక్క శక్తిని విద్యార్థి లోకానికి తెలియజేయడం నా బాధ్యతగా భావిస్తున్నాను.

K.G వేణు, M.Sc., M.Phil., D.C.S. లెక్చరర్, విశాఖపట్టణం.

20. 'మొత్తం పురాణాలే సైన్సా? సైన్సే పురాణాలా?' అనే విధంగా మేధావుల్ని ఆలోచింపజేసే అద్భుతమైన పుస్తకం ఇది. ఇప్పటి గొప్ప గొప్ప సైన్స్ ప్రయోగాలన్నీ మన హిందూ దేశంలో కొన్ని వేల సంవత్సరాల క్రిందట జరిగిన దాఖలాలు చూసి ఎంతటివారయినా ఆశ్చర్యపడవలసిందే!

- శ్రీమతి కె. అరుణాదేవి, శ్రీసాయి త్రిశక్తి పీఠం, విజయవాడ.

21. అనంతమైన శాస్త్రీయ పరిజ్ఞానాన్ని అతి సాధారణ పాఠకుడికి కూడా అర్థమయ్యే రీతిలో వివరించిన శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ ఎంతయినా అభినందనీయులు.

- కె. శ్యామసుందరరావు, అసిస్టెంట్ మేనేజర్ (టి),
గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ప్రెస్, ఫరీదాబాద్. (హర్యానా)

22. సైన్సు అనేది కేవలం ఆధునికుల సొత్తు అనుకునే అజ్ఞాన యువతరానికి కళ్ళు తెరిపిస్తుంది ఈ పుస్తకం. ఇట్టి ప్రచురణ మాకొక అమూల్యవరం. నా స్నేహితునికి వివాహ కానుకగా "పురాణాల్లో సైన్స్" రెండు ప్రతులను బహూకరించాను.

- యమ్. శేఖర్, M.Sc., Ph.D. సూరత్. (గుజరాత్)

23. ప్రాచీన భారతీయ సంస్కృతి అన్నింటా గొప్పదని చెప్తూంటాం మనం. ఏవిధంగా గొప్పదని ఎవరైనా అడిగితే, మనలో చాలా మంది సరిగా చెప్పలేరు. అటువంటి వారు "పురాణాల్లో సైన్సు" పుస్తకంద్వారా తమ విజ్ఞానాన్ని పెంచుకోగలుగుతారు. మన ప్రాచీన వైభవమే మన ఉజ్జ్వల భవిష్యత్తుకు స్ఫూర్తి. ఆ స్ఫూర్తిని పాఠకులకు కలిగిస్తున్న రచయితలకు నా అభినందనలు.

- సాయిప్రతాప్, పార్లమెంట్ సభ్యులు, రాజంపేట.(కడప జిల్లా)

24. మీ "పురాణాల్లో సైన్స్" చదివాను. మీ పరిశోధనా కృషి శ్లాఘనీయం. సామాన్యులకు అందుబాటులో లేని ప్రాచీన భారతీయ విజ్ఞానాన్ని సులభశైలిలో శాస్త్రీయంగా అందించడంలో కృతకృత్యులయ్యారు మీరు.

- డాక్టర్ పాటిల్ నారాయణరెడ్డి, ప్రముఖ గ్రంథకర్త, అనంతపురం.

25. తీరికలేని పెద్దలు తమ పిల్లలకు అందించలేకపోతున్న మన ప్రాచీన విజ్ఞానాన్ని, ఈ పుస్తకం అందిస్తుంది.

- డాక్టర్ కె.వి. రామభద్రరావు, M.B.B.S., D.O., సికింద్రాబాద్.

26. "పురాణాల్లో సైన్సు" పుస్తకంలోని 'ఏ ఒక్క అంశమైనా పాఠకుల్ని ఆలోచింపజేస్తే చాలునని' మీరు అన్నారు. ఒక్క అంశమేమిటి? అన్ని అంశాలూ విజ్ఞులైన వారిని మేల్కొలుపుతాయి. ఇది అక్షర సత్యం. ఈ రచనవల్ల మీ తల్లి దండ్రులు కూడా ధన్యులయ్యారు. మీ సమకాలీన ఆంధ్రజాతి ధన్యమైంది. మీ పరిచయం నా పూర్వజన్మ సుకృతం.

- భాషా ప్రవీణ దివి శ్రీనివాసమూర్తి, ప్రముఖ జ్యోతిష శాస్త్రవేత్త
నరసాయపాలెం.(గుంటూరు జిల్లా)

27. పాశ్చాత్య నాగరికతా వ్యామోహ దాసోహంతో "క్రొత్త ఒక వింత, పాత ఒక రోత" గా భావించే నేటి యువత, మన ప్రాచీన శాస్త్రీయ సంస్కృతిని గురించి తెలుసు కోవలసిన అవసరాన్ని మీరు నొక్కి చెప్పారు. అభినందనీయులు.

- మాకినీడి సూర్య భాస్కర్, క్రిటిక్ & రైటర్, కాకినాడ.

28. నేటి అస్తవ్యస్త సామాజిక పరిస్థితులకు గుణపాఠంగా నిలుస్తుంది ఈ రచన. రీసెర్చ్ వర్క్ చేసే యువతరానికి కనువిప్పు కలిగేలా చేస్తుంది కూడా!

-డాక్టర్ జి. లక్ష్మీ నారాయణ, ఆయుర్వేద వైద్యులు, కిషన్ రావుపేట. (కరీంనగర్ జిల్లా)

29. అట్టహాసంగా వేద సదస్సులు నిర్వహిస్తుంటారు మన పండితులు. వేదమంత్రాల అంతరార్థాలు వారిలో చాలామందికి తెలియవు. కొద్ది మందికి తెలిసినా, వాటిని వివరించే శక్తి ఉండదు. ఆ శక్తి ఉన్నవారు, వాటిని వివరించేందుకు ఇష్టపడరు. ఇలాంటి దుస్థితిలో శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ తమ "పురాణాల్లో సైన్స్" పుస్తకంద్వారా అతి సామాన్యుని స్థాయికి వేద విజ్ఞానాన్ని సులభశైలిలో అందించి, మన ప్రాచీన విజ్ఞానం పై ఒక అవగాహన కల్పించారు. ఈ పుస్తకం చదివి ఒక భారతీయునిగా, ఒక హిందువుగా ఎంతో గర్వపడ్డాను. అత్యంత మేధాశక్తి కలిగిన మాటల పొందికతో మన భారతీయులు, అందునా ఆంధ్రులు ఇంతటి గ్రంథాన్ని రచించడం మనకు గర్వకారణం.

- సిహెచ్. ఉపేందర్ శర్మ,M.A., L.L.B., కరీంనగర్.

30. "పురాణాల్లో సైన్స్" ఒక చక్కని ప్రయోగం. విశ్వరూప సందర్శనానికి అవగాహన కల్గించారు. సనాతన విజ్ఞానాన్ని పంచతంత్రం వలే పాఠకులకు అందించారు రచయితలు.

- ఉప్పలపాటి నారాయణరావు, (సినీ దర్శకులు) మద్రాసు.

31. పరమ పూజ్యమైన రామాయణ మహాభారతాల్ని మరచిపోయే స్థితిలో ఉంది మన జాతి. "పురాణాల్లో సైన్స్" పుస్తకం చదివితే - పురాణ ఇతిహాసాలపై నేటి తరానికి ఆసక్తి కలిగి తీరుతుంది.

- డాక్టర్ డి.వి. గణేశ్వర్ రెడ్డి,M.B.B.S., నల్గొండ.

32. నాకు పురాణాలపై నమ్మకం లేకున్నాసరే, పరిశీలన కోసం "పురాణాల్లో సైన్స్" పుస్తకం కొని చదివాను. మీకు నా ధన్యవాదాలు. నేను పంపిస్తున్న ఈ సొమ్ము అందుకుని, నేను తెలియపరచిన నా నలుగురు స్నేహితులకూ "పురాణాల్లో సైన్స్" కాపీలను దయచేసి పంపించండి.

- యస్.హజరత్ ఆలీ, M.A., M.Ed., రిటైర్డ్ లెక్చరర్, నెల్లూరు.

33. వేదాల్లో విజ్ఞానం ఉందని విన్నాం గానీ, ఇంతటి విజ్ఞాన సంపద ఉన్నదని ఈ పుస్తకం చదివిన తర్వాతనే తెలిసింది. వర్తమాన మరియు భవిష్యతరాలకు ఈ పుస్తకం ఎంతో ఉపయుక్తం. నేటి అజ్ఞాన యువతరాన్ని మేల్కొలిపేటందుకు త్వరలోనే ఈ పుస్తకం పై ఒక సెమినార్ నిర్వహిస్తాం.

- టి. శ్రీనివాస్,M.Sc., చైతన్య యువజన సంఘం, హైదరాబాద్.

34. నేటి ఆధునిక సైన్స్‌లోని అత్యద్భుతాలన్నీ మన పురాణాల్లో కన్పించడం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. ప్రతి ఒక్కరూ ఈ పుస్తకం చదవ వలసిందే!

- డాక్టర్ కె. నాగబసవరాజు,M.B.B.S., విశాఖ పట్టణం.

35. నాయందు దయతో మీరు ఉచితంగా పంపించిన "పురాణాల్లో సైన్స్" గ్రంథం అందుకుని,

చాలా సంతోషించాను. కృతజ్ఞతలు. నేనింతవరకూ ఎన్నో పురాణ, ఆధ్యాత్మిక మరియూ సైన్స్ గ్రంథాల్ని చదివాను. కానీ ఇంతటి విలువైన అంశాల్ని ఏ గ్రంథంలోనూ చూడలేదు. ఎంతో పరిశోధన చేసి, ప్రాచీన భారతీయ విజ్ఞానాన్ని వెలుగులోకి తెస్తున్న మిమ్మల్ని ఎంత అభినందించినా సరిపోదు.

- పి. శివశంకర్,B.A., జీవిత ఖైదీ, ఓపెన్ జైల్, హైదరాబాద్.

36. మీ "పురాణాల్లో సైన్స్" పుస్తకం చదివాను. చాలా బావుంది. మీ కృషి సర్వదా ప్రశంసనీయం. మా తెలుగు యూనివర్సిటీ విద్యార్థులకు గాను 30 కాపీలను పంపించే ఏర్పాటు చేయండి.

- డాక్టర్ సి.వి.బి. సుబ్రహ్మణ్యం,M.A (Tel), M.A(Skt), Ph.D., ప్రొఫెసర్,తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాద్. (విజిటింగ్ ప్రొఫెసర్, మహర్షి వేదిక్ యూనివర్సిటీ, హాలెండ్ & అమెరికా)

37. నేటి సైన్స్‌ను నాటి సైన్స్‌తో పోల్చి వివరించిన పుస్తకం ఇదే ప్రథమం. వెర్రితలలు వేస్తున్న నేటి యువతరానికి ఈ గ్రంథం ఓ టానిక్!

- దైవజ్ఞ గోరస వీరభద్రాచార్యులు,M.A., వాస్తు శాస్త్ర విశారదులు, లెక్చరర్, తెలుగు విశ్వ విద్యాలయం, హైదరాబాదు.

38. గ్రంథకర్తల ఉద్దేశం ఉత్తమమైనది. అదే ఈ గ్రంథ విజయానికి కారణమయింది.

- జి. గోపాలకృష్ణ, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ (ఎండోమెంట్స్), కృష్ణాశ్రమం, గుడివాడ.

39. పురాణాల్లో, వేదాల్లో ఉన్న విజ్ఞాన సంపదను వెలికి తీసి పాఠకులకందించిన పరిశోధనాత్మక కృషి శ్లాఘనీయం. చిన్న వయసులోనే ఒక వినూత్న ఉద్యమానికి శ్రీకారం చుట్టిన గ్రంథకర్తలు అభినందనీయులు.

- ఎల్.బి. నాగేశ్వరరావు, అరకులోయ అభివృద్ధి కమిటీ ఛైర్మన్, అరకులోయ.(విశాఖజిల్లా)

40. పన్నెండు సంవత్సరాల శ్రమ ఫలితమైన మీ "పురాణాల్లో సైన్స్" గ్రంథ విశేషాలను పరిశీలించాను. హిందూ వాఙ్మయప్రచారంలో మీ కృషికి నా ధన్యవాదాలు.

- వాస్తుజ్యోతిష ఆగమయంత్ర విద్యావిశారద, వాఙ్మయబ్రహ్మ డాక్టర్ చింతాడ విశ్వనాథ శాస్త్రి, విజయవాడ.

41. భగవంతుని స్వరూపాల్ని గురించీ, విశ్వసృష్టి గురించీ ఇంతవరకూ కనీవినీ ఎరుగని రీతిలో వివరించిన శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ చిరస్మరణీయులు. హిందూత్వం అంటే "మంత్రాలు, శ్లోకాలు, పుక్కిట పురాణాలూ, మూఢనమ్మకాలూ... " ఇవి తప్ప ఏమీ లేవనే భావన నేడు నెలకొని వుంది. మన పత్రికలు, వివిధ యంత్రాంగాలూ కూడా ఈ రకంగానే ప్రచారం చేస్తున్నాయి. మేధావులం అనుకునే అజ్ఞానులకు, పత్రికలకు మీరు వ్రాసిన పుస్తకం 'మిస్సైల్' వంటి సమాధానం.

- డాక్టర్ డి. రాజేంద్ర, యం.డి., బొంబాయి.

42. వేషభాషల్లోనే కాక ప్రతిదానిలోనూ పాశ్చాత్యులను అనుసరించే నేటి సమాజంలో ఉంటూ మీరు ఇట్టి రచన చేయడం నిజంగా గొప్ప సాహసం. మీ ధైర్యానికి నా జోహార్లు. ఈ గ్రంథంలోని ప్రతీ అంశం ఎంతో విలువైనది. నిరాశా నిస్పృహలతో నిండిన నేటి సమాజానికి

మీ భవిష్య రచనలు కూడా ఎంతో ఉపయుక్తంగా ఉండగలవని ఆశిస్తూ

- సాహిత్యశ్రీ, జానపద సాహిత్యరత్న,
ఎ.రామసుబ్బారెడ్డి, హిందీపండితులు, చదిపిరాళ్ళ. (కడప జిల్లా)

43. హైందవ ఆధ్యాత్మికతనూ, విజ్ఞతనూ సైన్స్‌తో నిరూపిస్తూ చెప్పిన తీరు అమోఘం. మహర్షులంటే అడవిలో ముక్కుమూసుకుని కూర్చునే తాపసులు మాత్రమే కారనీ, ప్రాచీన కాలపు శాస్త్రవేత్తలూ, డాక్టర్లూ, ఇంజినీర్లూ వారేనని శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ చక్కగా నిరూపించారు.

- సి.హెచ్. మాధవీలత, యం.బి.ఏ., విశాఖపట్నం.

44. శ్రీశ్రీశ్రీ త్రిదండి రామానుజ చినజీయర్ స్వామి వారి ద్వారా మీ "పురాణాల్లో సైన్స్" పుస్తకం గురించి విని, కొని చదివాను. నేటి యువతరానికి మార్గదర్శకంగా ఉంది పుస్తకం. పుస్తక వెలలో రిబేటు సదుపాయం కల్పిస్తే, మా కాలేజి స్టూడెంట్స్ చాలామంది తీసుకోగలరు.

- డాక్టర్ ఎ. లతాకుమారి, M.Sc., Ph.D., లెక్చరర్, విజయనగరం.

45. ఈ గ్రంథంలోని విషయాల్ని మన పాఠ్యపుస్తకాల్లో అంశాలుగా చేర్చుకుంటే , మన జాతి ఔన్నత్యం - వర్తమాన, భవిష్యతరాలకు తెలియవస్తుంది.

- స్వామి సదానంద, గురుకుటీర్, కలకత్తా.

46. ఇటువంటి పరిశోధనాత్మక గ్రంథం తెలుగులో రావడం హర్షదాయకం. ఇంకా ఇలాంటివి రావలసిన అవసరం ఎంతయినా ఉంది.

- మైనంపాటి భాస్కర్, (ప్రముఖ రచయిత) హైదరాబాద్.

47. ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ఆధునిక సైన్స్‌తో ముడివేసి చెప్పడం ద్వారా ఒక వినూత్న ప్రక్రియకు నాంది పలికింది "పురాణాల్లో సైన్స్".

- డాక్టర్ టి. సుబ్బరామిరెడ్డి, పార్లమెంట్ సభ్యులు, విశాఖపట్టణం.

48. మనదేశ ఔన్నత్యాన్ని విదేశీయుల చేత చెప్పించుకోవడం మనకు అలవాటు. శ్రీ పోలిశెట్టి బ్రదర్స్ ఆ అలవాటును బ్రేక్ చేశారు. ఇంతవరకు మనం ఎరుగని మన ప్రాచీన విజ్ఞానాన్ని, మన తెలుగువారు బయల్పరచడం నిజంగా మన అదృష్టం.

- శ్రీపాద సుబ్రహ్మణ్యం, M.A.LL.B., న్యూఢిల్లీ.

49. మన దేశ చరిత్రను వ్రాసిన వారు ఆంగ్లేయులు. కొన్ని యదార్థాలను మరుగుపరచి చరిత్రను వ్రాశారు వాళ్ళు. "పురాణాల్లో సైన్స్" వంటి పుస్తకం చదివి అయినా, మన జాతి మేల్కోవాలి. యదార్థ ఆధారాలతో మనదైన చరిత్రను సరిగా వ్రాసుకునే ప్రయత్నానికి శ్రీకారం చుట్టాలి.

- జె. వీరప్రతాప్, M.Tech., భోపాల్ .(మధ్యప్రదేశ్)

50. తమ గ్రంథం "పురాణాల్లో సైన్స్ " ను ఇటీవలే చదివాం. మాకు దాని అనుభూతి ఇంతా అంత అని చెప్పలేం. మనం పోగొట్టుకున్న హిందూ సంస్కృతీ ప్రాభవం, వాఙ్మయం అంతా పునః సంపాదించినంత ఆనందం కలిగింది. మీ గ్రంథాన్ని మా మరాఠీ భాషలోకి అనువదించుకోడానికి అనుమతిని మా పబ్లికేషన్‌వారికి ఇప్పించవలసినదిగా కోరుతున్నాం. మా మహారాష్ట్రలోని కుహనా లౌకిక వాదులకూ, నాస్తిక వాదులకూ ఈ గ్రంథం ఒక "సింహస్వప్నం " అవుతుంది.

- దేవీదాస్ అన్నల్‌దాస్, శ్రీ గాయత్రీ పబ్లికేషన్స్, షోలాపూర్.(మహారాష్ట్ర)

